# క్షేత్రయ్య పదములు

ఆంధ్ర గానకళా పరిషత్తు
రాజమహేంద్రవరము

# క్షేత్రయ్య పదములు

## శృంగార రసమంజరి

సంపాదకుడు

శ్రీ విస్సా అప్పారావు

ఆంధ్ర గానకళా పరిషత్తు

రాజమహేంద్రవరము

# ఆంధ్ర గానకళా పరిషత్తు

## మదరాసు కమిటి

ప్రధాన న్యాయమూర్తి

శ్రీ పాకల వేంకట రాజమన్నారు (అధ్యక్షుడు)

శ్రీ కడప కోటిరెడ్డి

శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి

శ్రీ మదిగుబ్బ చాయప్ప

శ్రీ కాంద్రేగుల జగన్నాథరావు గోపాలరావు

శ్రీ వి. నాగయ్య

శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు

సంగీత కళానిధి

శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడు

సంగీత కళానిధి

శ్రీ టి. వి. సుబ్బారావు

శ్రీ విస్సా అప్పారావు (కన్వీనరు)

# విషయ సూచిక



చిత్ర పటములు

# విజ్ఞప్తి

ప్రాచీన భారతీయ విద్యలను వికసింపజేసి వ్యాప్తి నొందించుటకై రాజమహేంద్రవరమున శ్రీ గౌతమీ విద్యాపీఠము స్థాపింపబడినది. ఈ పీఠమునకు సంగీత శాఖగా ఆంధ్రగాన కళాపరిషత్తు ఏర్పడినది. ఈ పరిషత్తువారు సంగీతగ్రంథముల ప్రచురింపదలచి చెన్నపట్టణములో ఒక కమిటీని 14–7–1946 న స్థాపించినారు. మద్రాసుకమిటీవారీ దిగువ తీర్మానములను చేసిరి.

(1) శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు సంపాదించి, పాఠములను శుద్ధపరచి వాటిని విశేషార్థములతో, సవ్యాఖ్యానముగా ప్రకటించవలెను.

(2) ఇదివరకు అచ్చుకానట్టి, అపురూపములైన త్యాగరాజ కీర్తనలను, స్వరయుక్తముగా నున్నవాటిని, సంపాదించి అచ్చు వేయించవలెను.

(3) సంగీత శాస్త్రగ్రంథములను సేకరించి, సరిపరిచి అచ్చువేయించవలెను; జయదేవుడు పురందరదాసు, తీర్థనారాయణుడు, క్షేత్రయ్య, సుబ్రహ్మణ్యకవి, రామదాసు మొదలగు సుప్రసిద్ధ వాగ్గేయకారుల గీత, ప్రబంధ, కీర్తనాదులను స్వరపరపించి అచ్చొత్తించవలెను.

మొదటి తీర్మానానుసారము 'త్యాగరాజకీర్తనలు సవ్యాఖ్యానము' అను గ్రంథమును ఏప్రియల్ 1948 లో ప్రచురించడ మైనది.

మూడవ తీర్మానానుసారముగా క్షేత్రయ్యపదములను ఇప్పుడు ప్రచురించుచున్నాము. ఇదివరలో పూర్వపు అచ్చు గ్రంథములలో 241 పదము లచ్చుపడినవి. ఈ సంపుటములో 330 పదములు కలవు. ఇది ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'శృంగార రసమంజరి' యను వివరణముతో నున్న 'క్షేత్రయ్యపదములు' అను వ్రాతప్రతినుండి ముఖ్యముగా సేకరింప బడినవి. ఇంకను కొన్ని తాళపత్ర ప్రతులు మొదలైనవి ఉపయోగింప బడినవి. వివరములు పీఠికలో నివ్వబడినవి. సుమారు 90 పదములు నూతనముగా ఇందచ్చైనవి. క్షేత్రయ్య పదములు అలంకార శాస్త్రమునకు లక్ష్యములని 'శృంగార రసమంజరి' వివరించుచున్నది. దీనినికూడ చేర్చి అచ్చొత్తించినాము. క్షేత్రయ్య గొప్ప వాగ్గేయకారుడు. పదరచనలో ఇతనిని పోలినవారు లేరు. కాని ఇతనిని గురించిన చరిత్ర ఏమియును తెలియదు. ఏవేవో కథలు మాత్రము కలవు. అట్టి సందర్భములో, పదముల యాధారముగల క్షేత్రయ్య జీవితచరిత్ర ఇందలి పీఠికలో వివరింప బడినది. అతని గోత్రనామములు, అతని నివాసము, కాలము నిర్ణయింప బడినవి. క్షేత్రయ్య పదముల ప్రశస్తిని గురించి బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసియున్నారు. బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారు క్షేత్రయ్య పదసాహిత్యమందలి అలంకార శాస్త్ర విశేష

ములను గురించి వ్రాసియున్నారు. వీటివలన క్షేత్రయ్య పదములు ఆంధ్రసాహిత్యములో ఎట్టి ఉన్నతస్థానమునకు చెందినవో ఆంధ్రలోకమునకు కొంత తెలియగలదు.

ఉపోద్ఘాతములను వ్రాసిన శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి, మాధవరామ శర్మ గార్లకు కృతజ్ఞతాభివందనములు.

శ్రీ మాధవరామ శర్మ గారు క్షేత్రయ్య పదముల ముద్రణలో అనేకవిధముల తోడ్పడి అమూల్యమగు సహాయ మొనర్చినందులకు వారికి ధన్యవాదములు.

ఇందు మూడు త్రివర్ణచిత్రములు కలవు. వాటి కాధారము లివి.

| | |
|---|---|
| ౧. మువ్వగోపాలస్వామి | 78 వ పదము. 105 పదములోని అఖరిభాగము. 178 వ పదములోని రెండవ పాదము |
| ౨. క్షేత్రయ్య | గీరునామము బెట్టి, గిలుకుపావలు మెట్టి; వలపు వెన్నెరిదువ్వి విరుల ముడుతువుగాని; వల్లెవాటువేసి; మీసముదువ్వి. మొదలగు మాటలు. |
| 3. "మగువ తన కేళికా మందిరము వెడలెన్" | ఇది 249 వ పదములోని విషయమునకు సరిగా చిత్రింప బడినది. |

సుప్రసిద్ధ చిత్రకారులగు శ్రీ వరదా వెంకటరత్నముగారి పర్యవేక్షణ క్రింద చి. సూర్యనారాయణ మూర్తిచేత ఈ చిత్రములు వ్రాయబడినవి. శ్రీ వేంకటరత్నము గారికి కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు. చిత్రములను చక్కగా వ్రాసియిచ్చిన చి. సూర్యనారాయణ మూర్తిని కళాసరస్వతి అనుగ్రహించుగాక.

మువ్వగ్రామము వెళ్ళినప్పు డనేకవిధముల తోడ్పడి సాయమొనర్చిన మొవ్వ వీరభద్రరావుగారు, వారి సోదరులు మొదలగువారికిని ఫోటోగ్రాఫరును, కారును ఇచ్చి ఫోటోగ్రాఫులను బాగా తయారుచేయించి పంపించినట్టి బందరులోని ఆంధ్ర సైంటిఫిక్ అధికారులకును శ్రీ ఎ. యస్. రావుగారికిని చేమోడ్పులు.

అభిమానముతో తమ స్వంతపనివలె భావించి కడు రమ్యముగా ఈ గ్రంథమును అచ్చువేసి తయారుచేసిన కైలాస ముద్రణాలయము వారికినీ, ఫోటో బ్లాకులను త్రివర్ణ బ్లాకులను చేయించి అచ్చొత్తించి పంపించిన బి. యస్. కె. ప్రెస్సువారికిని అభివందనములు.

కార్యాంతర నిమగ్నులయ్యును అమూల్యమైన 'తొలిపలుకు'ను వ్రాసియిచ్చి ప్రోత్సహించిన ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకల వేంకటరాజమన్నారు గారికి కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇంకను అనేకవిధముల తోడ్పడిన మిత్రుల కందరకును కృతజ్ఞులము.

ఏడెనిమిది సంవత్సరముల క్రిందట 'ప్రాచ్యలిఖిత పుస్తకాలయములో 'క్షేత్రయ్య పదములు' అనే వ్రాత ప్రతి కలదు. అది చాలా ముఖ్యమైనదని నా యభిప్రాయము. దానిని పరిశీలించి వెలువరించండి' అని ఈ మధ్యనే దివంగతులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాతో చెప్పియుండిరి. వారి ఆదేశ ప్రకారము మా కమిటీ వారు నేటికీ గ్రంథమును వెలువరించ గలిగిరి.

ఈమధ్యనే ప్రభాకరశాస్త్రిగారు చాల జబ్బుగా ఉండగా నేను వెళ్ళియుంటిని. కొంత వారికి తెలివిగా ఉన్న సమయములో ఈ క్షేత్రయ్య పదముల సంపుటమును, పీఠిక వగైరాలు, త్రివర్ణచిత్రములు సహా వారికి చూపించే భాగ్యము గలిగినది. వారు సావకాశముగా వాటిని చదివిచూచి, చాలా పనిచేసియున్నారే, అని అన్నారు. అంతకంటె వారియొక్క పరిశీలనా ఫలితములు పొందు వీలు కలుగలేదు. రక్తాక్షి సం॥ శ్రావణమాసములోని భారతిలో వ్రాసిన కరుణాకము అనే కథలో క్షేత్రయ్య ప్రశంసచేసి అతను ముద్దుకాఫురిస్తు పని వ్రాసినట్లు చెప్పరు వారు నాకు చెప్పియున్నారు. ఆ కథలో కొంత విషయమును ఇందు ముద్రవేయుటకు అనుజ్ఞ ఇచ్చిరి.

మద్రాసు కమిటీవారి రెండవ తీర్మానానుసారముగా, ఇదివరకు త్యాగరాజ కీర్తనలు స్వరయుక్తముగునవి, ప్రాచీన సంప్రదాయము కలవాని స్వరము తెలుగు లోను, సాహిత్యము తెలుగు, అరవము లోను, వ్రాయబడి అచ్చునకు సిద్ధపరుపబడి యున్నవి. త్వరలో వాటిని ప్రచురించగలను. మరియు మూడవ తీర్మానానుసారముగా సంప్రదాయ సిద్ధముగ స్వరయుక్తముగు క్షేత్రయ్య పదములు సుమారు ఎనుబది అచ్చునకు సిద్ధముగా వ్రాయబడి యున్నవి. ఈ రెండు ప్రచురణములు సంగీతకళానిధి శ్రీ టి. వి. సుబ్బారావు గారి సంపాదకత్వమున వెలువడనున్నవని కర్ణాటక సంగీతాభిమానుల కందరికిని మనవిచేయుచున్నాను.

వినాయక చవితి
గుంటూరు

విస్సా అప్పారావు
మద్రాసు కమిటీ కన్వీనరు.

# కరుణకము

## వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

కృష్ణాజిల్లాలో మొవ్వ అని ఒక గ్రామమున్నది. ఆంధ్ర దేశ మందు మువ్వగోపాల పదాలు వినని, విని ఆనందించని, రసికులు అరుదుగా ఉంటారు. ఆపదములను రచించినకవి ఆవూరివాడే నంటారు. సంగీత సాహిత్యములు ఆవూరి నీరు తాగితే పట్టుబడునని పూర్వము పెద్దలు చెప్పుకొనేవారు. ఇప్పుడట్టిదేమీ తెలియరాదు. కృష్ణకాలువ వచ్చి ఆ భూమి మాగాణి కావడముచేత నీటిగుణము మారినదని అక్కడి వా రంటారు కాబోలును! పూర్వకాల మక్కడ సంగీత విద్వాంసు లనేకులు ఉండేవారట!

ఆవూరికి చేరువనే కూచిపూడిఅని ఒక గ్రామమున్నది. ఆవూరి వారందరు భాగవతము లాడుదురు..........................................
ఈ రెండు గ్రామములు చేరువగా ఉండడముచేత ఆవూరివారి విద్య ఈవూరివారికి, ఈవూరివారివిద్య ఆవూరివారికి అంటుతూకూడా ఉండేవట పూర్వకాలమున. నేనిప్పుడు చెప్పబోయే కథలోనివారు హరి రామయ్య గారొక్కరుతప్ప ఈ మధ్యకాలములో మొవ్వలో సంగీత విద్వాంసులు మరెవ్వరూ లేరు.

రామయ్యగారు 1860 ప్రాంతముల జన్మించి యుండును. ఆయన పసితనము నాటికి త్యాగరాజ కృతు లంతగా వ్యాపించలేదట! హరి రామయ్యగారు బాల్యములో బహు ప్రఖ్యాతిగా వీణ వాయించే వారని, పాడేవారని, ఎరిగినవారివల్ల విన్నాను.

మైసూరు వీణ సాంబన్నగారు మువ్వలో హరిరామయ్యగారి వీణాగానమును విని ఆనంద పరవశులై మైసూరుకు పిలుచుకునిపోయి మహారాజు దర్బారులో పాడించి గొప్ప సత్కారము చేయించిరట!



# తొలి పలుకు

'వాక్యం రసాత్మకం కావ్యం' అనే విశ్వనాథుని మతం అనుస రించినా, 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం' అనే దండిలక్షణం ఆమోదించినా, 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' అనే జగ న్నాథుని అభిప్రాయంతో ఏకీభవించినా ఈ సంపుటంలోని క్షేత్రయ్య ప్రతిపదమూ కావ్యమే అవును. ఒక్క క్షేత్రయ్యపదాలే కావు. మన వాగ్గేయకారుల కృతులన్నీ కూడా కావ్యాలే. ఇది మన సంప్రదాయం. పాశ్చాత్యుల సంప్రదాయం వేరు. సంగీతానికి చెందిన కృతులలో సాహిత్యసంపద సాధారణంగా సున్న. మనలో వాగ్గేయ కారుడని పించుకోడానికి కేవలం సంగీతజ్ఞానం మాత్రం ఉంటేచాలదు. భాషా జ్ఞానం ఉండవలెను. వ్యాకరణం, ఛందస్సు, అలంకార శాస్త్రము తెలియవలెను. ఇంతేకాదు. ఉచితజ్ఞత, చిత్తార్ద్రత సహా ఆవశ్య కములు.

శృంగారపద వాఙ్మయంలో క్షేత్రయ్యకే అగ్రస్థానం. తాళ్ల పాకవారు దారిచూపి యుండవచ్చును. పురందరుని పోకడలలో కొన్ని పోలికలు కనిపించవచ్చును. కాని రసపోషణమునసేమి, అర్థపుష్టి యందేమి భాషాసౌందర్యమునసేమి, క్షేత్రయ్యపదాలను మించినవి ఉండనేరవు.

ఈ పదాలలో రసము శృంగారమనే నా అభిప్రాయం. భక్తి ఒక ప్రత్యేకరసమా? కాదా? అనే ఆలంకారికుల వాదనలతో మనకు పనిలేదు. రసమైనా, భావమైనా ఈ పదాలలో వ్యక్తమయ్యేది భక్తి కాదు. రూపగోస్వామి తన "ఉజ్జ్వల నీలమణి"లో భక్తిని వేరే రసముగా నిరూపించడానికి ప్రయత్నించెను కాని అది నిజంగా శృంగారంగానే పరిణమించింది. అయితే ఆశృంగారం శ్రీకృష్ణ గోపికా సంబంధమైనది. అట్టి శృంగారమే మువ్వగోపాల పదాలకు జీవగఱ్ఱ.

భక్తిలో శృంగారం లేదనను. ఒక్క శృంగారమే కాదు. భక్తుడు భగవత్పరంగా అన్నిరసాలనూ అనుభవిస్తాడు. త్యాగయ్య కీర్తనలలో ఈ విషయం విదితం. శృంగారానికి ఉదాహరణం, హిందోళ వసంత లో కృతి.

"రార! సీతారమణీ మనోహర!
నీరజనయన! నీకు ముద్దిర!....
బంగారు వల్వలు నే బాగుగ గట్టెద మరి
శృంగారించి సేవజేసి కౌగిట జేర్చెద
సారకు నుదుటను కస్తూరి తిలకము బెట్టెద
సారమైన ముక్తాహారముల నిక దిద్దెద
యోగము నీపై యనురాగముగాని వే
రేగతి యెవరు? శ్రీత్యాగరాజ వినుత!"

ఇటువంటి అలౌకికమైన భక్తి శృంగారం క్షేత్రయ్య పదాలలో నాకు ఎక్కడా కనబడలేదు. గోపాల మకుటం ఉన్నంత మాత్రాన లౌకికం అలౌకికం అవుతుందా?

శృంగారరసం ఇంత విపులంగా ఏకావ్యాలలోకూడా పోషింపబడలేదు. నాయికా నాయక భేదాలు, వివిధ విభావానుభావ వ్యభి

చారి భేదాలు, వివిధావస్థలు అన్నింటికీ లక్ష్యాలు వీటిలో కలవు. అయితే రసమంజరిగాని మరి యేయొక్క అలంకార శాస్త్రగ్రంథము గాని ముందుంచుకొని వాటిలోని లక్షణాలకు లక్ష్యాలుగా క్షేత్రయ్య తన పదాలను రచించినాడని నమ్మజాలను. నాటక ప్రకరణంలోని లక్షణాలకు కాళిదాసుని నాటకాలలో లక్ష్యాలు ఎన్నో ఉన్నవి. కాని ఆమహాకవి లక్ష్యాలకోసరం నాటకాలు వ్రాశాడంటే సమంజసమా? క్షేత్రయ్య రసప్రకరణ మంతా, కామశాస్త్ర మంతా జీర్ణించుకున్న కవీశ్వరుడు. ఆ కారణంచేత ఆయన పదాలు లక్ష్యాలుగా కనబడక తప్పవు.

ఈకాలంవారు కొందరు ఈపదాలలో పచ్చిశృంగారం చాలా ఉందని ఆక్షేపించవచ్చును. ఆతప్పు (అది తప్పయితే) ఆయనిదికాదు, బలహీనులైన ఈకాలం వారిదే. అజీర్ణవ్యాధిగ్రస్తునకు పనసకూర అపథ్యమైతే తప్పు పనసకూరదా? మన తాతలు తిన్నంత మనం తినగలుగుతున్నామా? మన జీర్ణశక్తి తగ్గిపోయింది. జీర్ణశక్తితో పాటు రసాస్వాదన శక్తికూడా మనకు తగ్గిపోయింది. అంతే!

కొన్నిపదాలు విని కొందరు చెవులు మూసుకోవచ్చును. ఏ పదంగాని రసవంతమైతే అశ్లీలం ఎలాగవుతుంది. ఇదీ నాసమాధానం.

ఈక్షేత్రయ్య పదాలు ఖండ కావ్యాలుగా చదువుకుంటే ఆనందం అనుభవించ వచ్చును. వాటిని రాగతాళ యుక్తంగా శ్రావ్యమైన కంఠంతో ఎవ్వరైనా పాడితే "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము" గలిగినట్లుండును. సంగీతంతోపాటు తగినపాత్ర అభినయిస్తూ ఉంటే చలువ, సౌరభంతో మధురత్వంకూడ కలిసినట్లుండును.

ఈ పదాలను సేకరించి, తెలుగు రసమంజరిని చేర్చి, అద్భుతమైన పీఠిక వ్రాసి శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గార్లచేత ప్రశస్తములైన వ్యాసములను వ్రాయించి, ఆంధ్రలోకానికే కాదు రసిక ప్రపంచానికంతటికీ అందజేసిన శ్రీ విస్సా అప్పారావుగారు వందనీయులు. వారు క్షేత్రయ్య జీవిత రహస్యాలను వారి పదాలనుంచి గ్రహించి వెల్లడిజేసిన చాతుర్యము ప్రశంసనీయము.

'పలుకు పలుకులకు తేనెలొలుకు' మాటలలో పదాలనల్లి మువ్వగోపాలునకు సమర్పించిన క్షేత్రయ్యకు ఈ తొలిపలుకు నా చిన్న కానుక.

12-9-50
మద్రాసు

పా. వెం. రాజమన్నారు

# పీఠిక

కర్ణాటక సంగీత సంప్రదాయములో క్షేత్రయ్య పదములు గొప్ప స్థానమలంకరించి యున్నవి. పదసాహిత్యములో ఇతని ముందు గాని వెనుకగాని ఇతనిని మించిన వారెవరును లేరు. ఇతడు పండితుడు, శాస్త్రవేత్త, ఉభయభాషాకోవిదుడు, రసజ్ఞుడు, ఆత్మతత్వ వేత్త, సంగీత మర్మముల నెరిగిన ఉత్తమ వాగ్గేయకారుడు. ఆ కాలము నాటి రక్తిరాగములకు సర్వాలంకార శోభితములగు స్వరూపములను కల్పించి, పదములను పాడి కర్ణాటక సంగీతములో నూతనాధ్యాయము ప్రారంభించి క్రొత్తమెలుకువలు, వెలుగులు, రంజకత్వమును కల్పించి క్షేత్రయ్య మార్గదర్శియైనాడు.

## నివాసము

'ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు. ఇతని యొక్క మువ్వపురి అని సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో తన, 'యాగు' సుబ్బరామ దీక్షితులవారు వ్రాసిరి. ఈ మువ్వపురి ఎచట నున్నదో వారు చెప్ప లేదు. అటుతరువాత వారికి సమకాలికులైన ... గారు సంకీర్తనాచార్య పి. ఎస్. శ్రీనివాస అయ్యంగారు ఉత్తర ఆర్కాటు జిల్లాలోని మూవపురము (Moovapura) అని వ్రాసి యున్నారు. మరియు పదములకు మువ్వగోపాల, మొవ్వగోపాల మూవగోపాల, అను ముద్రలు గలవని వ్రాసియున్నారు. ఇటీవలి వారు శ్రీ ఆచార్య పి. సాంబమూర్తి మొదలగువారు చిత్తూరుజిల్లా లోని చంద్రగిరితాలూకా మువ్వపురియని వ్రాసినారు. మువ్వపురి చంద్రగిరి తాలూకాలోనిదని ఎట్లు నిర్ణయించియున్నారని పరిశీలించ చగా చెన్నపురి రాజధానిలోని జిల్లాలలోని తాలూకాలలోని గ్రామాల పట్టీలలో చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో (పుట 115) మువ్వలవారిపల్లె (జమీందారీ గ్రామము) కానవచ్చినది. దీనిని గురించి చంద్రగిరి సబ్ కలెక్టరు గారికి ఒక మిత్రునిచేత

వ్రాయించి తెలుసుకోగా, బాగా విచారణ జేసినామని, మువ్వలవారి పల్లియను గ్రామమున్నట్లు దరియాప్తు రాలేదని సబ్ కలక్టరుగారు వ్రాసినారు. మరియు వారిట్లు వ్రాసియున్నారు. కార్వేటినగరము వెళ్ళి అచ్చట ఆస్థాన కవిగారిని అడుగగా వారిట్లన్నారట. "ఇక్కడ దేవుడు వేణుగోపాలస్వామి. ఈ స్వామికి మువ్వల వేణుగోపాలయని కూడ పేరుకలదు. స్వామి విగ్రహము అతి సుందరమైనది. క్షేత్రయ్య పదములు ఈ దేవునకే తప్పక అంకితములై యుండును." దీనినిబట్టి చంద్రగిరి తాలూకాలో మువ్వపురి లేదని, మువ్వలవారి పల్లెకూడా ఇప్పుడు లేదని తేలుచున్నది. ఇంక కార్వేటి నగర మండలి మువ్వల వేణుగోపాల స్వామివారికే క్షేత్రయ్య పదము లంకితములని అన్న మాట ఎంత విశ్వసనీయము అని ఆలోచించవలెను. మువ్వగోపాలుడు మువ్వపురిలోనున్న స్వామియని క్షేత్రయ్యపదములలో నున్నది. 'చూడని కూడని నిందలు జోడించిరమ్మా' యను 175వ పదములో 116వ పుటలో 'సన్నుతాంగి! మువ్వపురిసామి నాదు మనసు దెలిసి' యని, 280వ పదములో 'మువ్వపురి నిలయునితో గలసి' యని, 59వ పదము, 40వ పుటలో 'విటరాయ! మువ్వపురి విభుడైన గోపాల' యని యుండుటచేత కార్వేటి నగరమండలి మువ్వల వేణు గోపాలస్వామివారికి మువ్వగోపాలస్వామికి సంబంధము లేదని చెప్ప వలెను. అదీగాక కార్వేటి నగర వేణుగోపాలునిపై ప్రసిద్ధమగు సారంగపాణి పదము లంకితములై యున్నవి. ఐతే ఈ మువ్వపురి ఎక్కడిది, మువ్వగోపాలు డెవరు? అను విషయమును గురించి విమర్శింతము. కృష్ణాజిల్లా, దివితాలూకాలో కూచిపూడియను గ్రామమున్ను దానికి ఒకటిన్నర మైళ్ళలో మొవ్వ గ్రామమున్ను కలవు. క్షేత్రయ్య ఈ మొవ్వగ్రామమువాడని మొట్టమొదట నాకు తెలిసినంతలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇది సుప్రసిద్ధమైన ఘంటసాలకు దగ్గరగా ఉన్నది. దీని తరువాతనే 1938లో టి. యస్. వాసుదేవన్ గారు, మద్రాసు విశ్వకళా పరిషత్పత్రికలో కర్ణాట వాగ్గేయకారులు (Karnatic Composers) అను శీర్షిక క్రింద

క్షేత్రయ్య నివాసము కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామమని, ఘంటసాల దగ్గరగా అది ఉన్నదని వ్రాసినారు. కాని ఈ విషయమును ఇతరులు గ్రహించలేదు. ఇంకను చంద్రగిరి తాలూకాలోని "మువ్వపురి" వాస్తవ్యుడు క్షేత్రయ్య యని వ్రాయుచున్నారు. ఈ విషయము సరికాదు. దీని కాధారమే లేదు.

ఇంక మువ్వపురి నేడు మొవ్వయని వాడుకలో నున్న గ్రామమని నిర్ణయించవలెను గదా! ఆ ప్రక్కనా మువ్వపురి లేదు. ఇక్కడ మొవ్వ యను గ్రామమున్నది. అక్కడ గోపాలస్వామి ఆలయము చిరకాలము నుంచి యున్నది. దానిదగ్గరనే కూచిపూడి భాగవతుల నిలయమగు కూచిపూడి యున్నది. కూచిపూడి వారందరకు పరంపరగా క్షేత్రయ్య పదములు పాడి, అభినయించుట, అందలి నాయికా నాయక భేదముల గురించిన వివరములు తెలిసి యుండుట కలదు. మరియొకచోట ఇట్టి సందర్భమే కానరాదు. అందుచేత 'మొవ్వ' యే మువ్వయని చెప్పవచ్చును.

మరియు శ్రీనివాసయ్యంగారు వ్రాయుటలో మువ్వయని మొవ్వయని వ్రాసినట్లు చెప్పియున్నారు. అందుచేత మొవ్వయే మువ్వయనవచ్చును.

'నావల్ల దుడుకు లెన్నటికైన గలవా? మోవనాడు కలిగిన మువ్వగోపాల దేవా!' అను 212వ, పదము ప్రారంభమగుచున్నది. మోవనాడు - మువ్వ, అది యధిష్ఠానమందుండుటచేత నిందు సందేహమేమియు లేదు. ఈ ప్రాంతమునకు మోవనాడు అనే పేరున్నట్లు దీనివలన తెలియుచున్నది. మోవ, మువ్వ క్రింద మారుట సహజము. అందుచేత మోవ, మొవ్వ, మువ్వయను ఈ గ్రామము పేరు మార్పులు చెంది యుండవచ్చును. మరియు తంజావూరి సరస్వతీ మహాలు భాండాగారములోని 11618 నెంబరుగల క్షేత్రయ్య పదములను వ్రాతప్రతిలో 'మొవ్వగోపాల పదములు' అని వ్రాసియున్నట్లు కొన్నేండ్ల క్రిందట నేను వ్రాసికొని యున్నాను.

సుమారు షష్ఠ్ ట్ల క్రిందట శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు మువ్వగోపాల పదములు కావు. మువ్వగోపాల పదములని సెలవిచ్చి యున్నారు. కాని యతిస్థానములయందు మువ్వగోపాలయని "ము" ప్రయోగ ముండుట చేత మువ్వ యనే నే ననుకొనుచు వచ్చినాను. 'ముందు నిన్నెరుగనా - మువ్వగోపాల' ముప్పొంగియల - మువ్వగోపాలుని తోడితెచ్చిన' మోవనాడు గలిగిన - మువ్వగోపాల' 'మువ్వగోపాల నాదు - ముచ్చట చెల్లపిక' మొదలైన ప్రయోగములు చాల గలవు. కాని కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తు భాండాగారములోని 3382 నెంబరు గల తాళపత్ర ప్రతికి నకలు ఒకటి (శ్రీ) వేలటూరి వెంకట రమణయ్యగారు నాకిచ్చియున్నారు. అందు క్షేత్రయ్య పదములు మువ్వ గోపాల ముద్రతో వ్రాయబడి యున్నవి. పైన ఉదాహరించిన యతి స్థానములయందు మాత్రము మువ్వగోపాల యని యున్నది. తక్కిన చోట్ల మువ్వగోపాల యని యున్నది. కాని సక్రమముగా మువ్వగోపాల యని యతి లేనిచోటకూడ ఉన్నది. (మొదటి భాగములోని 73 వ పదము చూడుడు) మరియు-

> పల్లవి॥ వలపు నిలుప నాదు వశము గా దేమిసేతు — వనితరో! యీవేళ.
> అనుపల్లవి॥ సొలతిరో! మా మువ్వగోపాల రాయుడు – చలము చేసినాడు.

అని అనుపల్లవిలో మువ్వగోపాలరాయుడు అను ప్రయోగము కలదు. ఈ పదములోనే మూడవ చరణములో మూడవ పంక్తిలో

> 'మరుకేళిలో నన్ను – మువ్వగోపాలుడు'

అని యతిస్థానములో మువ్వ ప్రయోగ మున్నది. దీనిని బట్టి మువ్వయే మువ్వ యనవలెను. కాని ఈ మధ్య నేను మొవ్వగ్రామము వెళ్ళియున్నాను. అక్కడ మొవ్వ ఇంటిపేరు గలవారు ఆర్వేలవారు కరణాలు ఐదారు కుటుంబములవా రున్నారు. వారి పెద్దలు తామందరు క్షేత్రయ్య వంశస్థులమని చెప్పుచుండేవారని, ఈ విషయము తరతరముల నుండి అనుశ్రుతముగా వచ్చుచున్నదనియును చెప్పియున్నారు. నేటి మొవ్వలోని క్షేత్రయ్య వంశీయులగు నైదుగురి



ఉత్సవ విగ్రహము వెనుక "మవ్వ" అని చెక్కబడినది

ఛాయాచిత్రము పటములో చూడనగును. అందు ముందు కూర్చున్న వారిద్దరు పెద్దలు, వారందరు మా కాతిథ్యమిచ్చి మిక్కిలి సహాయము చేసినారు. అక్కడ గోపాలస్వామివారి ఆలయమునకు పోయి ఆలయముయొక్క ఛాయాచిత్రమును తీసినాము. దేవాలయములోని ఉత్సవ విగ్రహముల వెనుకను విగ్రహములు చేసినవారు 'మువ్వ' యని అక్షరములను చెక్కి యున్నారు. మచ్చునకు ఒక ఉత్సవ విగ్రహముయొక్క వెనుక భాగమునకు ఛాయాచిత్రము తీసినాము. అందు మువ్వ యని స్పష్టముగా కనబడుచున్నది. నేటి మొవ్వ గ్రామము పూర్వము మువ్వయని వాడుకలో యుండేదని తేట తెల్లమగుచున్నది. దీని వలన మొవ్వ, మువ్వ ఒకటేయని తెలినది. మొవ్వే, మువ్వ యని పైన నిరూపించబడినది. అందుచే కాలానుక్రమమున మువ్వ, మువ్వ, మొవ్వ యని ఈ గ్రామమునకే పేరని విస్పష్ట మగుచున్నది. ఇంక క్షేత్రయ్య నివాస స్థల మేది యను సందేహమునకు తావు లేదు. ఇంకొక విశేషము. తాళ్ళపాక అన్నమాచార్యులగారి పెద్దభార్యయగు తిమ్మక్క 'సుభద్రాకళ్యాణము' అను గేయ కృతికర్త. ఇది కొద్దిమాసముల క్రిందట తిరుమల తిరుపతి దేవస్థానమువారు అచ్చొత్తించినారు. దీనిని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిరి. ఆ పుస్తకములో 39వ పుటలో రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో విన్నవించు సందర్భములో

"పుండరీకాక్షుడా – పురుషోత్తముడ
మురవైరి వందిత – మువ్వగోపాల
నారద వినుత యా – నంద ముకుంద
మత్స్యావతార నా – మనవి చేకొనుము"

అని ఉన్నది.

ఈ మువ్వగోపాలు డెవ్వరు అని తోచక మానదు. తిమ్మక్కగారు క్షేత్రయ్యకు 150 ఏండ్ల పూర్వీకురాలు. తిరుపతికి అన్ని ప్రదేశములనుంచి వచ్చు యాత్రీకుల కారణముచేత అప్పటికే మువ్వగోపాలస్వామి ప్రసిద్ధిమై యుండెనని, చెప్పవచ్చును. లేదా కార్వేటినగర

వేణు గోపాల స్వామికి మువ్వల వేణుగోపాల యను పేరుకూడ కల దనుటచేత, ఆస్వామి తిరుపతికి దగ్గరగా ఉండి కార్వేటి నగరము సుప్రసిద్ధమగు రాజస్థానమగుట చేత మువ్వగోపాల యని వేణుగోపాల నామాంతరముగా సంబోధనమై యుండవచ్చును. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు పీఠికలో ఇట్లు వ్రాసిరి. (ఇందులో....మువ్వగోపాల అని కలదు గాని అది మువ్వపురి గోపాలుని జెప్పినది యనిగాదు. క్షేత్రయ్య మువ్వపురి గోపాలాయని చెప్పెనుగాన యది యట్లేయనవలెను. ఇక్కడ మువ్వలు దాల్చిన బాల గోపాలుడని యర్థము కావచ్చును.)

ఏది ఎట్లైనను మువ్వగోపాల స్వామి, మువ్వపురివాసి. అదే మువ్వ అదే నేటి మొవ్వ. అదే క్షేత్రయ్య పుట్టినచోటు.

## జీవిత చరిత్ర

క్షేత్రయ్యనుగురించి ఏమియును తెలియదనే చెప్పవలసియున్నది. కొన్ని కథలు వినుచున్నాము. అంతకుమించి చరిత్రాత్మకముగ నిర్ణయించదగిన జీవిత చరిత్ర లేదన్నట్లున్నది. సుబ్బరామ దీక్షితులవారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో 'క్షేత్రజ్ఞుల'ను గురించి ఇట్లు వ్రాసిరి. "ఈతడు బాల్యదశలో నొక మహాయోగి వలన గోపాల మూల మంత్ర ముపదేశింపబడి మువ్వపురిలో వెలయు గోపాలాలయములో నుండి బహుకాలము భక్తితో మంత్రావృత్తి చేసికొని యుండునపుడు శృంగార రసాధి దేవతయైన గోపాలుడు దర్శనమిచ్చి యనుగ్రహించిన తోడనే "శ్రీపతి సుతుబారికి నేనోపలేక నినువేడితె గోపాలా మువ్వ గోపాలా" అని వాగ్గేయ రూపముగా పదములు చెప్ప నారంభించెనట. తరువాత తంజావూరువెళ్ళి విజరాఘవ నాయకుని కొలువున గౌరవింపబడినట్లున్ను, మధుర, గోలుకొండలలో కూడ దర్బారులలో మువ్వ గోపాలునిపై పదములు చెప్పినట్లున్ను, విజయరాఘవునిమీద పంచ రత్నమాలు చెప్పినట్లున్ను, అనేక క్షేత్రములకుపోయి ఆ దేవుళ్ళమీద పదములు చెప్పినట్లున్ను సుబ్బరామ దీక్షితులవారు వ్రాసియున్నారు.



మువ్వ గోపాలస్వామి ఆలయము, పూజారులు



ఇంతకంటె అందమైన కథ మరియొకటి విన్నట్లు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు చిత్రభాను ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో వ్రాసియున్నారు.

క్షేత్రయ్య ప్రథమమున తంజావూరు, మధుర మొదలగు రాజుల యాస్థానములలో గౌరవాతిశయములను పొంది, రాజుల మీదనే పదములు వ్రాసి; శృంగార రసమున మునిగి తేలుచు స్వగ్రామము వచ్చి మువ్వగోపాల స్వామి దర్శనార్థమై వెళ్ళియుండెను. అక్కడ నున్న లావణ్యవతియగు దేవదాసిని చూచి మోహించెను. అప్పుడా గుడి పడుచు 'నీవు రాజు లెందరను గూర్చియో మంచి పదము లనేకములు వ్రాసిన మహాకవివి. ఎన్నడును భగవంతుని మీద నీవు పదములు చెప్పినవాడవుకావు. నాకు గోపాల దేవుడే సర్వమున్నూ ఆయనను గూర్చి పదములు చెప్పి నన్ను మెప్పించుము. అని షరతుపైనను, దాని పైని చాలా కష్టించి, నిష్ఠచేసి, ఉపవసించి తదేక ధ్యానముతో కొన్నాళ్ళచ్చటనే ఉండిపోగా గోపాలమూర్తి అనుగ్రహించి దర్శనమిచ్చెను. అందుపైన కలిగిన, ఇదివర కెన్నడెరుగని అలౌకిక రసానుభూతి, ఆనందాతిశయములతో ధారగా గోపాల స్వామిమీద పదములు చెప్పసాగెను. వైరాగ్యము కలిగి తంబుర చేతబట్టి గోపాల స్వామిమీద పదములు పాడుకొనుచు దేశములోని క్షేత్రములను దర్శింప జనెను; పోయిన చోటనెల్ల పదములను మువ్వ గోపాలాంకితములుగా పాడెను. ఇందువలన ఇతనికి క్షేత్రయ్య అను పేరు కలిగినది. తరువాత అతడేమయ్యెనో తెలియదు.

నేనీమధ్య మువ్వ గ్రామము వెళ్ళినప్పుడు అక్కడనున్న క్షేత్రయ్య సంతతివారు పరంపరగా తమకు తెలిసివచ్చిన క్షేత్రయ్య విషయము ఇట్లు చెప్పిరి. వారి మాటలను యథాతథముగా ఇచ్చట వ్రాయుచున్నాను. "ఇక్కడ గోపాలస్వామి ఆలయమున్నది. పూర్వమున్న ఆలయము నికస్తు పడిపోగా అక్కడనే తరువాత వారు ఏదో మామూలుగా చిన్న ఆలయమును కట్టించిరి. మొవ్వగ్రామము పూర్వము మెరకగా ఉండేది. ఇప్పుడు పాటిదిబ్బలు చాలాకలవు. కొన్నేళ్ల క్రిందటి

వరకు ఇళ్ళు దిబ్బలవిగాడే ఉండేవి. పాటిదిబ్బలు త్రవ్వుచున్నప్పుడు ప్రాత కుండలు దళసరివి దొరకుచుండును. నేటి ఆలయము చుట్టూ ఊరున్నది. దీనికి రెండుమూడు ఫర్లాంగుల దూరములో రాళ్ళచెరువు ప్రక్కన సానెంపాడు ఉండేది. దీనిని సానిపేటయని కూడా అందురు. అక్కడుండే ఇండ్లబాపతు పెద్దపెద్ద రాళ్ళు నేటికిని ఒక గజములోతు త్రవ్విన కనపడును. సానిపేటకు ఒక మైలు దూరమున కూచిపూడి అగ్రహారమున్నది."

మొవ్వ గ్రామములో క్షేత్రయ్య వంశీయులు ఐదుకుటుంబములవా రున్నారు. క్షేత్రయ్య ఇంటిపేరుకూడ మొవ్వ వారే. ఈ కుటుంబములవా రింటిపేరున్ను మొవ్వవారే. వీరిది రథీతరస గోత్రము. ఆపస్తంబ సూత్రము. యజుశ్శాఖ.

౧ మొవ్వ బ్రహ్మయ్యగారు - వారి తమ్ములు వీరభద్రయ్యగారు

౨ మొవ్వ వీరభద్రయ్యగారు - పోస్టుమేష్టరుగారు

౩ " వెంకటేశ్వరరావు

౪ " వెంకట కృష్ణారావు

౫ " వెంకట రామశర్మ Dr. M. V. Rama Sarma M. A. Ph. D. (Wales) ఇందు ౧, ౩ పేరు గలవారు కరణీకము చేయుచున్న కుటుంబములకు చెందినవారు. ఈ గ్రామము చల్లపిల్లి రాజావారి ఎస్టేటు లోనిది.

మొవ్వ వరదయ్య అనే పేరుతో క్షేత్రయ్యగారు మొదట పిలువబడేవారని, అప్పుడు చదువురాని పామరుడై గొడ్లను కాచుకొనుచు కాలక్షేపము చేయుచుండెడి వాడని; ఒక విధమగు భక్తితో తరచు గోపాల దేవుని ఆలయములో కూర్చునే వాడని; ఆ సందర్భములో ఒక దేవదాసీని (గొల్లపడుచునని కొందరు) ప్రేమించినట్లున్ను నిరక్షరాస్యుడగు నీతో పొందేమని ఆమె నిరాకరించినట్లున్ను; అందుపైని గోపాల దేవుని వేడుకొని మూర్ఖముగా ఆలయ మందే కొన్నా



క్షేత్రయ్య కుటుంబము వారు - మొవ్వ.

ళ్ళుండినట్లున్నూ; ఒక సమయమందు గోపాల దేవుని కృపచేత తటాలున కవితా ధోరణి కలిగినదనిన్ని, అది పదరూపమైనదని; ఆ సన్నివేశము వలన వరదయ్య భక్తాగ్రేసరుడైనట్టున్ను; తను వలచిన స్త్రీ యందు కల భావము మారినట్లున్ను; వారిద్దరు గోపాల దేవుని భక్తులై వీధులలో పాడుకొనుచు, ఆలయమున పాడుచు ఉండిరని పెద్దలు చెప్పేవారు.

కొన్నాళ్ళకు తంజావూరు వెళ్ళినారట. అచ్చట నుండి అనేక క్షేత్రములు తిరిగి పదములు పాడినట్లు చెప్పుచూ వచ్చేవారు. అందుచేత క్షేత్రయ్య అను పేరు కలిగినదట. తిరిగి క్షేత్రయ్య మొవ్వ రాలేదు. తరువాతి వృత్తాంతము తెలియదు."

ఈ వృత్తాంతములోని ముఖ్య విషయములను గురించి విమర్శింతము.

(1) "క్షేత్రయ్య పూర్వపు నామము మువ్వ వరదయ్య" ఇది ఇంతవరకు నెరుగని విషయము.

(2) "గ్రామము పురాతనమైనది. గోపాలస్వామి ఆలయము చాల కాలము క్రిందనుంచి ఉండేది. పడిపోగా తిరిగి కట్టించినది నేటిది" ఇది సమంజసముగానే తోచుచున్నది. 298 వ పదములో

వేడుకతో నడచుకొన్న — విటరాయుడే
ఏడుమూడు తరములుగా — నిలచిన్న కాణాచై
గూడుకొని మా మువ్వగోపాలదేవ విభుడు ॥ అని కలదు.

దీనినిబట్టి క్షేత్రయ్యకు పూర్వము 'ఏడుమూడు' తరముల నుండి స్వామివారు అచ్చట వేంచేసి యున్నారని స్పష్టము. 'ఏడుమూడు' తరము లనగా పదికాని, ఇరువది యొకటి కాని తరములు, సుమారు 200 లేక 420 సంవత్సరములు అగును. క్షేత్రయ్య 17 వ శతాబ్ది వాడైతే నేటికి 500లు కాని 720 కాని ఏండ్ల క్రిందటి నుండి గోపాల స్వామివారు మువ్వలో ఉన్నారన్నమాట. అందుచేత దేవాలయము పడిపోవుట, తిరిగి కట్టించుట యనునది సమంజసమే. మరియు ఈ యాల

యుములో కూడ మధ్య మధ్య ఏవో నూతన నిర్మాణము లగుచున్న వనుటకు దేవాలయ మెదుటి భాగమున దూలముమీద ఈ క్రింది విషయము చెక్కబడి యున్నది. (పటములో చూడనగును)

ఆన 1900 సం॥ రం॥ ది. ౨౨ ఫెబ్రవరి॥ వికారి నామ సం-ర-మాఘ బ ౮ గురువారం శ్రీ గోపాల స్వామివారి మంటపం తయారు.

జంత్రీలో చూడగా తేదీ సంవత్సరం, తిథి, వారము సరిపోలు వవి. చూచుటకు అంకె 1700 వందలని భ్రమింప జేయును. కాని ఇంగ్లీషు తేదీ చెప్పుటబట్టి నిర్మాణము నొక్క నూతనత్వమును బట్టి 50 ఏండ్ల క్రిందటిదనే స్పష్టమగుచున్నది.

(3) "నిరక్షరాస్యుడు - ప్రేయసిచే నిరాకరింప బడినాడు. దేవునియందు మూఢభక్తిచేసి దైవానుగ్రహము పడసి పదకవియై, భక్తుడై, విరాగి యైనాడు." ప్రతిభా శాలురకు ఇట్టి కథలు కట్టుట కలదు. ఇది స్వభావ విరుద్ధముగా ఉన్నది. సందర్భములను బట్టి, కొన్ని పదములలోని విషయమునుబట్టి క్షేత్రయ్య కథ ఇట్టిదై యుండవచ్చునని నాకు తోచినట్లు పొందుపరచుచున్నాను. సహృదయులు దీని సమంజసత్వమును పరిశీలింతురుగాక !

మువ్వ గ్రామమున్న ప్రాంతము చాల ప్రాచీన మైనది. ఆంధ్ర విష్ణువు వెలసియున్న శ్రీకాకుళము, ప్రసిద్ధ బౌద్ధస్తూపము గల ఘంటసాల, ఈ గ్రామమునకు 5-6 మైళ్ళలో ఉన్నవి. మరియు చిన ముత్తేవి, పెదముత్తేవి, పెదపూడి, కూచిపూడి గ్రామములున్నూ దీనికి బహుసమీపమునయున్నవి. శ్రీకాకుళాంధ్ర దేవుని ఆలయమునకు చాల ప్రసిద్ధికలదు. శ్రీకృష్ణదేవరాయలు ఈ ఆంధ్రవిష్ణువును సేవించి వసతుల నేర్పరచినాడు. ఈ శాసనములను నేటికిని ఆలయము క్రింది భాగమున నేటికిని చూడవచ్చును. ఆలయములు కేంద్రముగా భారతీయవిజ్ఞానము - వేదములు, శాస్త్రములు, కళలు, సంస్కృతి, వెలయు చుండెననుట సుప్రసిద్ధము. ఈ ప్రాంతముల యందు పండితులు, కళారాధకులు, ఎక్కువగా ఉండియుందురు. అందుచేత మువ్వ మొదలగు గ్రామముల



మువ్వ గోపాలస్వామి విగ్రహము




మంటపం దూలంమీద చెక్కినది

యందు ప్రాచ్య సంస్కృతి నిండియుండేదని నిరాక్షేపణగా చెప్ప వచ్చును. మువ్వ వరదయ్య చిన్నతనమున ప్రాచీన పద్ధతిని విద్యాభ్యాసము చేసియుండును. సంస్కృతమును ఆంధ్రమును బాగుగా చదివి యుండును. మరియు ఇతడు అసాధారణ ప్రజ్ఞావంతుడై యుండి యుండవలె. సాహిత్యమందే గాక సంగీతమందుకూడ అభిరుచి యుండి యుండవలెను. మువ్వకు రెండు మైళ్ళ లోపుననే కూచిపూడియను అగ్రహార మున్నది. అచ్చటివారు సంగీత సాహిత్య నాట్య, అలంకార విద్యలయందు ఆరితేరిన వారని ప్రసిద్ధి కెక్కిన వారు. 1502 క్రీస్తుశకము నాటికే వీరు సుప్రసిద్ధులుగ ఉండిరని మాచుపల్లి కైఫియత్ లో ఉన్నది. విద్యా నగరమును నా డేలుచున్న నరసింహ రాయలును మెప్పించి బహుమానము బడసిరట. కూచిపూడి బ్రాహ్మణులలోని మగవారందరు సంస్కృతము, తెనుగు, భరతుని నాట్య శాస్త్రము, నందికేశ్వరుని అభినయ దర్పణము అలంకార శాస్త్రము, మంత్ర శాస్త్రము మొదలగు విద్యల నేర్చి సత్యభామ వేషమును ధరించి, పారిజాత నాటక మాడుచుండెడివారు. వీరికి కూచిపూడి భాగవతులని పేరు. ఈ సంప్రదాయము నేటికిని కలదు. అందుచేత మువ్వ వరదయ్య ఇవన్నియును బాగుగా అభ్యసించి యుండును. ఇతని మువ్వగోపాల పదములను చదివిన వారికి ఇతని ప్రజ్ఞ, ప్రతిభ, పాండిత్యము, లోకానుభవము, సంగీత, సాహిత్య పటుత్వము, అలంకారశాస్త్ర పరిచయము సుగోచరములు కాకపోవు. ఇతను అభినయ శాస్త్రమును కూడ అభ్యసించి యుండవలెను. లేకుంటే కైశికీ వృత్తి ప్రధానముగు ఈపదములను వ్రాయుట అవి నేటికి లాస్య నాట్యాభినయములకు నిలయములై యుండుట, తటస్థించదేమో! మరియును నాటివరకు సంగీత మప్రధానముగ నున్న గేయరచనలలో, సంగీతమునకు సాహిత్యముతో సమానమగు స్థానమునిచ్చి విశిష్టములగు పదముల నెట్లు పాడియుండగలడు? ఇతను గొప్ప సంగీత వేత్త యని చెప్పక తప్పదు. ప్రతిభావంతుడై, నూనూగుమీసాల నూత్నయౌవన కాలమున, సంగీత, సాహిత్య,

మరియు

నన్నే పెండ్లాడుదుసుమీ! – నాయాన మువ్వగోపాలా
అన్నన మాటాడు వరా – లడుగ కుండ జేసేగాని ||నన్నే||

చన్నులు రాకమునుపే – సరసము లాడుదు నీవు
యెన్నరాని మోహమున నా – కిచ్చిన బాసలు దలచి ||నన్నే||

ఎంతెంతో నను లాలించి – యింటికి తోడుకపోయి
వింతసేయక నామోవి – విందారగించిన సొగసున ||నన్నే||

తెలియనైతి చిన్ననాడే – తేలించి మువ్వగోపాల!
అలరు విల్తుని కేళి న – న్నలవాటు చేసినసామి! ||నన్నే||

కన్నెరికమునాడు కన్నెతరపువారు కన్నెరికపు కట్నము హెచ్చుగా అడుగకుండ జేసెదనని ప్రేయసి వరదయ్యకు బాసచేయుచున్నది. వరాలడుగుట యనగా వరహాలడుగుట. వరహా బంగారు నాణ్యము.

ఈపదములు చదువగానే ఇందు క్షేత్రయ్య ఆత్మచరిత్ర యుండ వచ్చునని తోచెడిది. మొదటి పదములోని రెండవ చరణములో ఆమె అతడు చిన్ననాడే సన్నుతిగా నొకచోట జదువుచుండుట 'పమ్మిన వేడుకతో నీవు ప్రౌఢైతే' మనమిద్దర మేకమవవలెనని అతడనుట; తరువాత మూడవ చరణములో ఆమె ఎలమావితోటలో గౌరిపూజ చేయుచుండుట (మంచి భర్త లభించుగాక యని ఈవ్రతము కన్యలు చేయుట సుప్రసిద్ధము) [ఒకవేళ తనకు చిరకాలమునుండి యున్న అభీష్ట సిద్ధికై వరదయ్యయే తనకు పతికావలెనని పూజ చేయుచుండెనేమో! క్రిందిపదము చూడుడు] అప్పుడతడు వచ్చి తామిద్దరము కలసే మాట నిజమని పల్కుట స్పష్టము. ఈమాటలను, ఈ యభిప్రాయమును పాటించి ప్రస్తుతము పరువమైననాడు గనుక ఆచార ప్రకారము ఇదిగో పైడియని ఉచితముగ వెలపెట్టి, వెనుకటి మాటలు మరువవద్దని, మన కిద్దరకు సాక్షి మనస్సే -మదనుడే- యని కబురు పంపెనని, ఆమెకూడ అట్టి మనసు కలిగినదే గనుక తనహార్దమును చెలితో మొదటి చరణములోను, పల్లవి అను పల్లవిలోను చెప్పుచున్నది. రెండవ పదములో ఆమెకూడ అట్టి భావములనే ప్రియునకు తెలియ పరచు చున్నది.

ఇట్టి సందర్భములో కలసికొన్న ప్రేమికులకు వల పతిశయముగా ఉండి యుండును. వారిద్దరును కలసి విద్యనేర్చినవారు. విద్యా విశేషముల చేతను మనోవృత్తుల సామ్యముచేతను, వీరిద్దరకు ప్రేమాధిక్యము కలిగి యుండుననుట సరి. వీరివలపు బాహ్యమగు దేహసౌష్ఠవాదుల వలననే కలిగినది కాక, మనస్సు లేకములై ఆంతర్యము లోకమై యుండిన వలపేయని ఊహింపవచ్చును. ఈపదమును చూడుడు.

ఇంత మోహమేమిరా! యిందరికంటె - నింతి చక్కనిదేమిరా!
సుంత సేపు దాని - జూడకుండ లేవు
అంతరంగము తెలుప - వదియేల ముద్దుగోపాల! ||ఇంత||

నీకెదురుగ వచ్చునా! నెనరూరగ - నిండు కౌగిట జేర్చునా!
అనుమడుపు లిచ్చునా! తనచెలిమి
కైనవాడని మెచ్చునా! తమి హెచ్చునా!
ఏకచిత్తమున మీరిద్దరు - నింపు సొంపుగ నున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యీరా! యిపు డానతీరా! ||ఇంత||

మోవి పానక మిచ్చునా! కొసరి కొసరి - ముద్దులాడనిచ్చునా!
తావి పువ్వులు తెచ్చునా! తనసొగసుకు
తగిన వాడని మెచ్చునా! మనసిచ్చునా!
దేవరే మొగుడు గావలెనని - భావజుని పూజ లొనరించిన
యా వనిత పేరేమి సెలవీరా! సిగ్గేలరా! ||ఇంత||

సంతోషముగ నాడునా! తంబుర మీటు - సంగీతపాట పాడునా!
వింత రతుల గూడునా! ఆ సమయమున
విడవకు మని వేడునా! కొనియాడునా?
సంతతము నన్నేలుకొని యా - కాంతపై వలచినపుడె యిక
కొంత యున్నదో ముద్దుగోపాలా! గోరడ మేలా? ||ఇంత||

ఇట్లు వారిద్దరు అన్యోన్యము కలవారై అనేకరీతుల వినోదములను పొందుచుండి యుండవలెను. ఇంతేకాదు వారి విద్యా వినోదము లెటువలె నుండెనో, ఈ క్రింది పదములో చూడుడు.

సామాన్యము గాదె! వాని పొందు - సామాన్యము గాదె!
ఏమని నేరని భామలు వాని కాసించి రేమందు
విజయ రాఘవుడే సామి సుమ్మి

భూమియందు వాని గుణములెన్న జనులకు
వీనులవిందు ఓ చెలియరో! ||సా||

పాయపు హంతకారి కావలె, వాని పద పద్య రచన
సేయ నుత్తర మీయవలె, వాని ముద్దు కవిత తా
వ్రాయ చదువ నేరవలె, ఆ వగల యందు
గాయకురాలు కావలె, ఓ చెలియరో! ||సా||

ఆటకు మేటిగావలె, తంబుర
గోటమీట రాగమనవలె, వానిపై సొగసు
పాటలు వినిపించవలె
వాని మనసు దెలసి మాటలాడ నేరవలె. ఓ చెలియరో! ||సా||

కప్పుర బాగా లీయవలె, వా తెరకు తేనె
చిప్పిల్ల సగమా కీయవలె, తమి హెచ్చే వేళ
తప్పక మోవి నొక్కవలె, విజయ రాఘవుని
అప్పుడె పైకొని కూడవలె, ఓ చెలియరో! ||సా||

క్షేత్రయ్య దృష్టిలో సామాన్య స్త్రీ తనకు తగదని, చక్కదనము, యౌవనము మాటలట్లుండ తనను పద పద్యరచన చేయుమని హెచ్చరించుచు తాను చెప్పే ముద్దుకవితను వ్రాయుచు, ఆ సందర్భములలో ఆ పదములను పాడగలుగుచు ఆ కవితా రహస్యముల నెరిగి మెప్పింప గలదిగా ఉండవలెనని తెలియుచున్నది. ఆట, పాటలలో నేర్పరియై యుండవలె. అనగా పదమును పాడుచు అభినయించ గలిగి అందలి భావమును తా నెరిగి ఇతరులకు వ్యక్తము చేయగలిగి యుండవలెను. ఇదంతయు తనతో సహాధ్యాయినియై విద్యలను సమానముగా నేర్చిన ప్రజ్ఞావంతురాలి వలన గదా సాధ్యమగును. పై పదములలో ప్రణయ జీవిత మెట్లుండవలెనో చిత్రింప బడినది. ఇంకొక ఉదాహరణముగా 256వ పదమును చదివి చూడుడు. పురుషు డెట్టి వాడై యుండవలెనన్న విషయము వివరింప బడినది.

'వెన్నెలబైట సంగీతము విననట్టి – వేడుకేమి వేడుకే'
'పన్నుగ దాని (సరసమును) వర్ణింప లేనట్టి – పదము లేటి పదములే'
'చవుసీతి బంధము విధము తెలియనట్టి – చదువులేటి చదువులే'
'కవులకు బహుమాన మియ్యగ లేనట్టి – కలుము లేమి కలుములే'

మరియు

> 'ధనముచేత జవ్వనము చేత జక్క - దనమున నటవే ఘనతలు
> వినయము జాణతనము గలుగుట - వినుతికెక్కరే వనితలు
>
> (11వ పదము, పుట 8)

వీటి వలన వరదయ్య, అతని ప్రేయసి విద్యలయందే గాక వినయ గుణ సంపత్తియందు కూడ మేలు తరమువా రనవచ్చును.

## పద రచన ప్రారంభము

ఇట్టి వారిరువురి జీవితములో పదరచన ప్రారంభ మెట్లై యుండునని ఆలోచింతము. పై నుదాహృత మైన ఒక పదములో "వాని పద పద్య రచన సేయ నుత్తర మీయవలె" యని యున్నది. ప్రారంభమున పద్య కవిత మువ్వ వరదయ్యకు అలవడియే యుండ వచ్చును. "సూనశరుని పాటలు సొంపుమీర పాడుకొంచు" వారిరువురు నుండవచ్చును. కాని అప్పటికి మువ్వగోపాల దేవునిమీద పదములు చెప్పినట్లు తోచదు. వరదయ్య మువ్వగోపాలస్వామివారి ఆలయమునకు బోవుట అలవాటు కలదని చెప్పవచ్చును. అతని ప్రేయసి దేవదాసియై యుండవచ్చును. గోపాల స్వామిమీది భక్తితో వారిద్దరు ఆలయములో చేరుచు నుండవచ్చును, అట్టి సమయములలో ఎన్నడో గోపాల స్వామిమీద పదరచన చేయుమని ఆమె వరదయ్యకు 'ఉత్తర' మిచ్చి యుండవచ్చును. అది కొనసాగుట కృత్యాద్యవస్థ గనుక. ఇతర వ్యవహారము మాని దీక్షతో వ్రతము పూనియుండి వరదయ్య ఆ కార్యమును సాధించి యుండవచ్చును. అందుపైన పరంపరగా చెప్పబడుచున్న కథానుగుణముగా, ఆనంద భైరవి రాగములో, ఆదితాళములో "శ్రీపతి సుతుబారికి నే - నోపలేక నిను వేడితే। గోపాలా మువ్వ - గోపాలా ?" యను పదముతో నూతన రచన ప్రారంభమై యుండును. ఈ పదము శ్రీకారముతో ప్రారంభ మగుటకూడ యుక్తముగా యున్నది. ఆనందభైరవి రాగము ఆదితాళము కూడ సందర్భముగానే తోచుచున్నవి. సాధారణముగా

పదములలో ఉండు పల్లవి, అనుపల్లవి, నాల్గు పాదములు గల మూడు చరణములు ఇందు లేవు. అన్నియు ఏక పాదములనే చెప్పవలెను. అట్టివి యైయున్నవి. అన్నింటను మువ్వగోపాలా యని యమక యుక్తమగు సంబోధన లున్నవి. సాధారణముగా పల్లవిలోనో, అనుపల్లవిలోనో మువ్వగోపాల ముద్ర యుండును. మూడవ చరణ మందుకూడ యుండును. మొదటి పదము గనుక అంత నియమబద్ధము కానిదై యుండవచ్చును.

ఇప్పటి కప్పుడే కొన్నేండ్లు గడచి మువ్వగ్రామములో శృంగార రసాస్వాదన లోలుడై మేలుతరగతికి చెందిన వలపు కత్తెతో తనివితీర ఆనంద మనుభవించి పూర్వజన్మ సంస్కార వశముచేత ఒకరీతి పరిణామమును వరదయ్య పొందియుండునని చెప్పవచ్చును. అట్టితరి మువ్వగోపాలస్వామి కంకితముగా పదములను జెప్పు భాగ్యమబ్బినది. దాని వలన కలుగు అలౌకికానంద పారవశ్యమున అతని ఆంతర్యము క్రమముగా మారియుండవచ్చును. మరియు మువ్వ వరదయ్య సనాతన ధర్మావలంబమగు కుటుంబమున జనించిన వాడయ్యును వివాహము చేసికొనక సాధారణ గృహస్థు మార్గమునవలంబింపక లోకరీతికి విరోధముగా నడవడికలవాడై యుండుట చేత అతని యింటి పెద్దలు, సంఘాధినేతలు ఇతని వర్తనమును గర్హించి యుండవచ్చును. అట్టిస్థితిలో చేయతగిన కార్య మెద్ది యని వరదయ్యకు సమస్య కలిగియుండును. ఆ చుట్టు ప్రక్కల నున్న పండితులు, దూరదేశములకు పోయి సన్మానములను పొంది వచ్చుట సాధారణమగు విషయమై యుండును. అందు విశేషించి కూచిపూడి భాగవతులు రాజస్థానములకు ముఖ్యముగా తంజావూరు సంస్థానమునకు పోయి సన్మానాతిశయ గౌరవములను పొందుట వరదయ్యకు తెలిసి తానుకూడ తంజనగరమునకు పోవలెనని, ఇతర పుణ్యక్షేత్రములను, అందలి దేవుళ్ళను దర్శించ వలెనని కోర్కె గల వాడై మువ్వవిడచి తరలి యుండును.

## తంజావూరి సంస్థాన ప్రవేశము

తంజావూరు నేలిన వారిలో మిక్కిలి ప్రఖ్యాతి గాంచిన రఘునాథ నాయకుని రాజ్యాంతమునకు కొద్ది సంవత్సరముల పూర్వము మువ్వవరదయ్య తంజావూరు వెళ్ళి రఘునాథుని దర్శించి యుండును. అప్పుడు రఘునాథుని మీద ఈ క్రింది పద్యమును చెప్పినట్లు మండ నరసింహాకవి వ్రాసిన 'ఆంధ్రకౌముది' యను వ్రాత పుస్తకమందు దాహృతమై యున్నది. *

మువ్వగోపాల భక్తేన క్షేత్రజ్ఞకవినా ఉక్తత్వాచ్చ
తముదామె వత్తురర్థులు । క్రమమెరిగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి । భ్రమరంబుల యచ్యుతేంద్ర రఘునాథనృపా॥

ఈ సభకెవరు పిలిచిన వచ్చితివని యడుగ రఘునాథునకు క్షేత్రయ్య ఆశువుగా ఈ పద్య రూపమున బదులు చెప్పెను. సాళువ తిమ్మరసుమీద ముక్కు తిమ్మన్న చెప్పిన పద్యమును, ఈ పద్యము జ్ఞప్తికి తెచ్చుచున్నది.

"ఏతెంతురు తము దామే । దాతల సన్నిధికి నర్థితతులుర్వి, పిక
వ్రాతమునకు చూతమహీ । జాత మ్మంపి●ద కమ్మ, సాళువ తిమ్మా"॥

క్షేత్రయ్యయైన మువ్వ వరదయ్య సరస సాహిత్య కవితా చతురుడని రఘునాథుడు తెలిసికొని ఆదరించి యుండును. కాని క్షేత్రయ్య రఘునాథుని కుమారుడగు అచ్యుత విజయరాఘవుని కాలములోనే పదములను చెప్పి మెప్పించినట్లు కనబడు చున్నది. ఈ క్రింది పదములో వివరములు దెలుప బడినవి.

వేడుకతో నడచుకొన్న – విటరాయడే
ఏడు మూడు తరాలనుండి – యెందునా గాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు – కృపగల్గి నావిభుడు ॥వేడుక॥

---

* ఈ విషయమును కొన్నేండ్లక్రింద శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు నాకు చెప్పిరి. ఈమధ్య ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న వ్రాతప్రతిని చూచి శ్రీ తిమ్మావఝుల కోదండరామయ్యగారు సరిచూచి పంపినారు.

మధుర తిరుమలేంద్రుడు — మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని — యెన్నిన యిమ్మనెనే
యిదిగో రెండువేల పదము — లిపు డెంచు కొమ్మనిన
చదురు మీదనే నన్న సామికి — సంతోష మింతింత గాదె ॥వేడుక॥

అళిమీర తంజాపురి నెలకొన్న విజయ రాఘవుని
తెలయ మనుజుల వెంబడి — వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ — చక్కగ వేయి పదముల
పలుకరించు కోగానె — బహుమాన మిచ్చె నావేళ ॥వేడుక॥

బలవంతుడై గోలకొండ — పాదుషా బహుమాన మిచ్చి
తులసిమూర్తితో వాదు దలచె నావేళ
తెలయ మువ్వగోపాలుడు — వెయ్యిన్నూరు పదములు
నలువది దినములలోన — నన్ను గలిసి వినుపించెనే! ॥వేడుక॥

ఇది అచ్చు పుస్తకములో లేదు. సుబ్బరామ దీక్షితులవారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఇచ్చినారు. అందు కొద్దిగా పాఠ భేదమున్నను విషయములో భేదము లేదు. దేవ గాంధారి రాగమని వ్రాసిరి. సంగీత సర్వార్థసార సంగ్రహములో దీనికి 'మేరువపదము' అని పేరు గలదు. యదుకుల కాంభోజి రాగమని యున్నది. వెంకట గిరి సంస్థానమునుండి తెచ్చిన వ్రాత ప్రతిలో ఈ పదము కాంభోజి రాగములో వ్రాసినట్లున్నది. ఆ పాఠమునే ఇందచ్చు వేసి, పాఠాంతరమును చూపియున్నాను. మూడవ చరణములో 'వెయ్యిన్నూరు పదములు' అని సుబ్బరామ దీక్షితులవా రిచ్చిన పాఠము. ఈ పద మును బట్టి మొత్తము 4500 లేక 4100 పదములు చెప్పినట్లున్నది.

క్షేత్రయ్య మధుర, తంజావూరు, గోలకొండ సంస్థానములలో ఆదరింప బడి వేలకొలది పదములు చెప్పినట్లు ఈ పదము చెప్పు చున్నది. రాజులు, నవాబు, బహుమానించిరని యున్నది. కాని వారి మీద పదములు చెప్పినట్లు లేదు. గోలకొండలో పాదుషా క్షేత్ర య్యకు బహుమాన మిచ్చి - "తులసి మూర్తితో వాదు దలచె" నట ఆవేళ. ఇదేమో తెలియుట లేదు. ఇంకొక వాగ్గేయ కారుడు తులసి మూర్తియై యుండవచ్చును. వీ రిద్దరకు పోటీ చేయించినాడేమో

నవాబు. "వెలయు మువ్వ గోపాలుడు - వెయ్యి న్నేనూరు పదములు నలువది దినములలోన - నన్ను గలసి వినిపించెనే!" అనుటచేత ఈ వాములో మువ్వగోపాలస్వామి తనచేత 1500 పదములు 40 దినములలో; ఒక మండల కాలములో చెప్పించెనని, అందు తనకు జయము కలిగెనని భావించవలసియున్నది. 40 దినములలో 1500 కాని, 1000 కాని, పదములు చెప్పుట నిజమైయుంటే క్షేత్రయ్య మహాప్రతిభాశాలి యనియు, మువ్వగోపాల దేవుని యనుగ్రహము సంపూర్ణముగా కలిగి యున్నవాడనియు. చెప్పక తప్పదు. 'వాణి నారాణి' యన్న పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని కథకంటె ఇది దేమియును వింత లేదు. ఇన్ని పదములుకూడ మువ్వగోపాలాంకితములనే చెప్ప వలసి యున్నది. విజయ రాఘవుడు కోరగా పంచరత్నములుగా నైదు పదములు, క్షేత్రయ్య వ్రాసినట్లు సుబ్బరామ దీక్షితులు చెప్పి యున్నారు. కాని ఇప్పటికి దొరికిన పదములలో విజయరాఘవ ముద్ర గలవి 12 వరకు గలవు. మరియు తుపాకుల వేంకట కృష్ణునిమీద చెప్పినవి 3 దొరికినవి. ఇతనెవరో బాగుగా తెలియుటలేదు. ఒక గొప్ప సరదారై యుండవలెను. 'చెంజి' కోటలో నుండినట్లు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు సూచించియున్నారు.

### క్షేత్రయ్య కాలము

| | |
|---|---|
| మధుర తిరుమల నాయకుడు | క్రీ. శ. 1623-59 మధ్యను |
| అచ్యుత విజయ రాఘవుడు | క్రీ. శ. 1633-73 మధ్యను |
| ఆనాటి గోలకొండ నవాబగు అబ్దుల్లా కుతుబ్ షా | క్రీ. శ. 1622-72 మధ్యను |

రాజ్యములు పాలించినారు. మరియు రఘునాథ నాయకుని దర్బారునకే క్షేత్రయ్య ప్రథమమున వచ్చియుండుటచేత 1630 ప్రాంతములలో క్షేత్రయ్య తంజావూరు ప్రవేశించి యుండవలెనని స్పష్టము. దీనినిబట్టి ఇతడు 1600 ప్రాంతమున జనించిన వాడని చెప్పవచ్చును.

తంజావూరు వెళ్ళిన తరువాత క్షేత్రయ్య చరిత్ర యెట్టిదో స్పష్టముగా తెలియదు. కాని అతను సర్వకాలము తంజావూరిలోనే యున్నట్టు చెప్ప వీలులేదు. ఇతని పదములలోని ముద్ర 'మువ్వగోపాల' యే యైనను అనేక క్షేత్రములకు యాత్ర వెళ్ళి అక్కడనున్న దేవుళ్ల పేర పదములు చెప్పియున్నాడు. కాని ఆదేవునితో పాటు మువ్వ గోపాల ముద్రకూడ పదమందు తప్పక క్షేత్రయ్య రచించుచునే వచ్చి యున్నాడు. ఇతను దర్శించిన క్షేత్రములేవో దొరకిన పదముల యందుదాహృతమైనంత వరకు ఇక్కడ పేర్కొనుచున్నాను. మొదట దేవుని పేరు చెప్పి ఆ దేవుడెక్కడివాడో తెలిసినంతవరకు చెప్పెదను. *

| | |
|---|---|
| (3) 1. ఆది వరాహుడు<br>శ్వేతవరాహుడు | మన్నారు గుడివద్దనున్న మహాదేవ పట్టణము; వరహూరు. ఆది వరాహస్వామి దేవుని పేరు. |
| (3) 2. తిల్ల గోవిందరాజా<br>తిల్ల గోవిందుడు<br>తిల్ల గోవిందరాయ | నేటి చిదంబరమునకు తిల్లైయని పేరు. తిల్లమొక్కల అడవిగా ఉండెనట. గోవిందరాజస్వామి దేవుని పేరు. |
| (౧) 3. కడప వెంకటేశుడు | కడపలో వెంకటేశుని ఆలయముకలదు. ఏడుకొండల వెంకటేశుని దర్శనమునకె వెళ్ళ ఈ మార్గమున ఇది మొదటిమెట్టు గనుక కడప-గడప. |
| (౧3)4. కరిగిరివరద<br>కంచివరద | కంచిలో బౌద్ధస్తూపము ఒకటి ఉండెను. అది ఒకదిబ్బ. ఆ ఎత్తైన ప్రదేశమునకు హస్తిగిరి యనిపేరు. అందుచేత 'కరిగిరి' కాని అది 'అస్తిగిరి' కాని హస్తిగిరి కాదేమో. బుద్ధదేవునిఅస్థులేమైన యచట స్థాపితమై యుండెనేమో! వరదరాజ స్వామి దేవుని పేరు . |

* ఈ విషయములను నాకు తెలియపరచిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ శ్రీ నీలకంఠ శాస్త్రిగార్లకు నాకృతజ్ఞత తెలుపుచున్నాను.

| | |
|---|---|
| (౨) 5. వేద నారాయణుడు<br>వేద పురీనిలయుడు | ఇద్దరు ఒకటనే నమ్ముచున్నాను. ఎక్కడిదో తెలియదు. వేదారణ్యమేమో ! |
| (౨) 6. చెవందిలింగా<br>చెవ్వంది లింగడు | బాగా తెలియదుకాని 165 వ, పదమును బట్టి ఈ దేవుడు కంచివరదుడే యని చెప్పవచ్చును. |
| (౧) 7. హేమాద్రిసామి | విజయనగరమువద్ద తుంగభద్రా తీరముననున్న కొండ హేమకూటము. అదే హేమాద్రి. స్వామిపేరు విరూపాక్షస్వామేమో ? |
| (౧) 8. యదుగిరి<br>చెలువరాయడు | మైసూరు సంస్థానమందు యదుగిరి యని యొకరు. (దేవుని పేరు సంపత్కుమారస్వామి చెల్లపిళ్ళరాయడు అనికూడ.) గుల్బర్గావద్ద నున్న యాడ్‌గిరియని మరియొకరు సూచించినారు. |
| (౨) 9. ఇనపురిసామి- | ఇనంబ్రోలని శాసనములలో ఒకపేరు కలదు. అదిబహుశః కడపజిల్లాలోదేమో. |
| (౧) 10 పాలగిరి చెన్నడు | కడపజిల్లా కర్నూలు తాలూకాలోని పాలగిరి. స్వామిపేరు చెన్నకేశవుడు. |
| (౪) 11 శ్రీ వెంకటేశుడు<br>వెంకటేశుడు<br>శ్రీ వెంకటరమణ<br>వెంకటనాథ | తిరుమలమీఁద వెలసియున్న శ్రీవేంకటరమణుడు. |
| (౪) 12 తిరువళ్ళూరి<br>వీరరాఘవుడు<br>వీరరాఘవ | తిరువళ్ళూరిలోని వీరరాఘవస్వామి. |

(౨) 13 శ్రీరంగేశుడు
రంగేశుడు } శ్రీరంగమందలి రంగనాథస్వామి.

(౧) 14 మధురాపురీశుడు —మధురలోనున్న సుందరేశ్వరస్వామి

(౧) 15 సత్యపురివాసుదేవుడు-చిత్తూరు జిల్లాలోని సత్యవీడేమో ?

(౧) 16 శ్రీ నాగశైల
మల్లికార్జునా } శ్రీశైల మల్లికార్జున స్వామి. తిరుపతి నుండి శ్రీశైలము వరకు సర్పాకారముగ ఒక పెద్ద కొండల గుంపు కలదు. దీనినే శేషాద్రి యనికూడ అందురు. ఒక వైపున శ్రీశైలము శ్రీ పర్వతము శైవ క్షేత్రము. ఇంకొక చివరను తిరుమలై (శ్రీపర్వతమునకు అరవము) విష్ణు క్షేత్రము.

౧) 17 చలువ చక్కెర
పురి నిలయుడు } ఊరి పేరు, దేవుని పేరు తెలియదు

(౧) 18 కోవళ్ళూరు
మువ్వగోపాలుడు } కోవళ్ళూరు ఎక్కడిదో అక్కడి దేవుడి పేరేదో తెలియదు. ఇనపురి మువ్వ గోపాలా యన్నట్టు కోవళ్లూరు మువ్వ గోపాలా యనుట కాని అచ్చటి దేవుడు మువ్వ గోపాలుడు కాదు.

ప్రక్క బ్రాకెట్లలో వేసిన తెలుగు అంకెలు ఎన్ని పదములలో ఆ దేవుని గురించి యున్నదో తెల్పును. మొత్తముమీద పదునెనిమిది పుణ్యక్షేత్రములను క్షేత్రయ్య సేవించినట్లు ఈ పదముల నుండి తెలియు చున్నది. ఇంకెన్ని క్షేత్రములు సందర్శించినాడో ఇంకను పదములు దొరికిన గాని తెలియ నేరదు. ఐనను పదు నెనిమిది క్షేత్రములు దర్శించుట సామాన్యము గాదు. అందు సగము క్షేత్రము లొక్కసారె పేర్కొన బడినవి. నాల్గు క్షేత్రములు రెండు సార్లు రెండు మూడుసార్లు, ఇంకో రెండు నాల్గుసార్లు పేర్కొన

బడినవి. ఇందులో ముఖ్యముగా గమనించ వలసిన విషయ మేమనగా కంచివరదుని మీద అతడే చెవంది లింగడు గనుక పదునైదు పదము లున్నవి. అందుచేత క్షేత్రయ్యకు కంచి వరదరాజ స్వామి యంటే పక్షపాత మున్నట్టు కనపడు చున్నది. ఈ విషయమే సి. ఆర్. శ్రీనివాస అయ్యగారు వెనుకనే అన్నారు. కారణమేమో తెలియ లేదు.

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "ముఖ్యముగా కంచి వరదునిమీద పదము లనేకములున్నవి" అని వ్రాసి ఒక కథను చెప్పి యున్నారు.

"ఒకనాడు క్షేత్రయ్య కంచి వరదరాజుల దేవళమందు రాత్రి పూజను దర్శించినాడు. రాత్రి వరదునికి శయ్యాసనమును సమర్పించి అర్చకులు, భక్తులు అమ్మవారి విగ్రహమును ఆమె ఆలయమునుండి వరదరాజు దేవళమునకు తీసికొని వచ్చి విజయం చేయించి, తలుపులు వేసి వెడలిపోయిరి. ఏమూలనో చీకటిలో కంబమునకు చేరగిలబడి కన్నులు మూసికొని యున్న యీ పదాల పిచ్చయ్య నెవ్వరును గమనింపలేదు. ఇతని యాంతరదృష్టి యంతయును కేళీమందిరము లోని అమ్మ అయ్యల అలౌకిక శృంగార రసానుభవ భావనలో లీనమై యున్నది. తెల్లవారుజామున ఇతడు యోగనిద్ర మేల్కొని కన్నులు తెరవగా మెట్లనుండి దిగివచ్చుచున్నట్లు ఒకానొక స్త్రీవ్యక్తి కనిపించెనట" వెంటనే మోహన రాగములో ఝంపతాళములో

మగువ తనకేళికా మందిరము వెడలెన్
వగకాడ మా కంచివరద తెల్లవారెననుచు॥

అను పదమును పాడెనట. ఈపదమును గురించి వేరొక రీతిని నేను వినియున్నాను. తంజావూరులో ఒకనాడు క్షేత్రయ్య తాను రాత్రి వ్రాసిన పదములను వీరరాఘవునికి వినుపించుటకై ఉదయము ననే తొందరగా కోటలోనికి వెళ్ళు సమయమున వీరరాఘవుని పట్టపు దేవి కేళికా మందిరమునుండి తెల్లవారెనను ఆత్రముతో వెడలివచ్చుట

క్షేత్రయ్య చూచెనట. అందుపైని వెంటనే అస్పృశ్యమును వదరూప మున వర్ణించి వీరరాఘవునికి వినిపించెనట. (ఇది 248వ పదము. దీనినే ఒక త్రివర్ణ చిత్రముగా వ్రాయించడమైనది. పుట 162 చూడుడు) ఈకథనుబట్టి క్షేత్రయ్యకు కంచి వరదునిపై మిక్కిలి భక్తియని, అందు చేత ఎక్కువ కాలము కంచిలో వరద రాజస్వామి సన్నిధిని కాలము గడిపేవాడని యూహించ వచ్చునేమో! ఈ విషయమై ఆలోచించగా నాకొకటి తట్టినది. క్షేత్రయ్య యొక్క పేరు మువ్వ వరదయ్యయని మువ్వలోనివారు చెప్పియున్నారే! అతనిపేరున్నూ కంచివరదుని పేరే గనుక వరద రాజస్వామివారి యెడల ఇతనికి అభిమానమా? యని. అందుపైని కంచివరదునిపైని చెప్పిన పదములను పునఃపరిశీలన చేసితిని. అవన్నియును అతని స్వీయ చరిత్రకు; మువ్వలో అతనున్నప్పుడు అతని చరిత్ర ఇట్లూడ వచ్చునని నేను ఇంతవరకు కట్టిన కథకు, సమన్వయ మగుచున్నట్లు నాకు భావన స్థిరపడినది. అదెట్లో తెలుపుచున్నాను. సహృదయులు పరిశీలింతురు గాక!

మువ్వ వరదయ్య, అతని ప్రేయసి ప్రేమమయజీవులై లౌకికా నందములను చూరగొని, మువ్వగోపాలస్వామి భక్తి అంకురించినవారై, ఆ భక్త్యావేశములో ఇద్దరు పెరిగి యుండిరనుట వారి గుణాతిశయము లకు తగియుండును. అట్టి సందర్భములో వరదయ్య మువ్వ విడిచి, ప్రేయసిని విడిచి దూరదేశము వెళ్ళెను. అట్టి స్థితిలో వారిద్దరిమధ్య గల ప్రణయము, ప్రేమ, ఎట్టిపరిణామము చెందినది? ఏమిజరిగినది? అని ప్రశ్నించుకోవలసి యున్నదిగదా. దీనికి సమాధానముగా పైన పేర్కొన్న కంచివరదుని మీది పదములు కానవచ్చుచున్నవి. ఇతర దేవుళ్ళమీద చెప్పిన పదములయందు అట్టి సమాధానము కానరాదు. పదములు వరదయ్య గాథకు సంబంధించి యుండుటచేత కంచివరద! ఓరి వరదా! వరదా! యను సంబోధనలతో నుండుట యుక్తమని తోచెడిని.

౧. ఏమిర వరద నీమోము చిన్నబోయినది

నామనసు నీమనసు - ప్రేమ నిండియుండగ

(d)

అను ముఖారి పదము చూడుడు. ఇది ప్రప్రథమమున మువ్వ విడిచి వెళ్ళిపోదమనే భావము వరదయ్యకు కలిగి, తన ప్రియురాలికి చెప్పనిస్థితిలో వియోగ భారము మదిని కలవర పెట్టగా వరదయ్య భావమెరుగక అతని గురించి ప్రేయసి చెప్పువాక్యము. "నేను మమత లేనిదాననా? వలపులేని దాననా? తలపులేని దాననా? హితవులేని దాననా? నెనరు ప్రియములేని దాననా? ఏమిర, వరద! నీమోము చిన్నబోయినది" అని అమాయక ప్రేమతో ప్రశ్నించుటయని తోచు చున్నది.

౨. ఎంతలేదని యెంచకురా
కంతునిగన్న - కరిగిరి వరదా! నాసామి

నను విడనాడేనను వగమాను

చెలిమిమాని యేచెదవుర చాల
వలచితిరా నిను వరద నాపాల
గలవని నమ్మితి గరుణాలోలా!

మువ్వనుండి తన్ను విడనాడి వెళ్ళెదనని సూచించిన సందర్భములో 'వరదా, నాసామి నను విడనాడేనను వగమాను, వలచితిరా చాలా నిన్నువరదా! చెలిమిమాని చాల యేచుచున్నావురా! నాపాల గలవని నమ్మితిరా! కరుణాలోలుడవు గావటరా!' యని తనయవస్థను చెప్పుట ఇందు కలదని తోచుచున్నది

3. ఆరాత్రి వరదయ్య ప్రయాణము. అప్పుడు అతని మనసు చాలా జాలిబొంది యుండెను. ఆజాలిని చూచి, వరదయ్య ననునయించుచు ప్రేయసి యను మాటలు వినుడు.

చాల యిందుకే నామనసు - జాలిబొందెరా!
తాళగలవా! కంచివరదా! నేనిన్ను నెడబాయ ॥

"నేను నిన్నెంత లాలించినను సొమ్మసిల్లేవు, కన్నీరునించేవు విడె మొల్లకున్నావు, ఎదు రెదురు జూచేవు, తనివి దీర దండువు,

ఏలాగయ్యా కంచి వరద రాజా! ఈ రాతిరే పయన మైతే ఇంక నేలాగయ్యా, నన్నెడబాసి వరదా! తాళగలవా? నా మనసు ఇందుకే చాల జాలి బొందుచున్నదిరా" అను ప్రేమ పూరిత వాక్కుల వరదుని అనునయించు చున్నట్లున్నది.

౮. ప్రేయసిని విడిచి వరదయ్య వెళ్ళినాడు. ఆ వెళ్ళిన సందర్భమందు వీడ్కోలు మాటలుగా తన ప్రియుడైన వరదు డేమే మనెనో, అవి ఎట్లు మరపు రాకున్నవో సఖులతో ప్రేయసి ఏమని చెప్పుచున్నదో చూడుడు.

ఎన్ని తలచు కొందునమ్మా – ఎట్లా మరపు వచ్చునమ్మా!
కన్నెరో! చక్కని నా దేవుడైన కంచి వరదుని గుణములు॥

మన్ననచేసి యెప్పటికి దయ – మరువ వద్దని పాదము లంటుచు
తిన్నగ నూరికి బోవుచు నన్నే – తిరిగి తిరిగి చూచిన వగ॥

నన్ను తప్పక చూచి చూచి – చిన్నబోవుచు
... ... ... ...
కన్నుల నొత్తుకొని మోము – గ్రక్కున నెత్తలేని వగ॥

పల్లవాధరిరో! మిక్కిలి లేత – ప్రాయపు దానవు తాళలేవని
వల్లభుడు మువ్వగోపాలుడగు – కంచి వరదుడు చేసిన మచ్చికలు॥

౯. వరదుడు వెళ్ళిన తరువాత, సమాచారము తెలసి అతనిని చూచి రమ్మని సఖిని పంపియుండవచ్చును. అట్టి సఖి తిరిగి వచ్చిన తోడనే ఆతురతతో ప్రేయసి ఏమని అడుగుచున్నదో చూడుడు.

• కంచి వరదునితో పొందు – కద్దో! లేదో!
వంచన మువ్వగోపాలు – వరదుడైన చక్కని॥

నీవు దాచక తెల్పవే! – నీలవేణి! అల్లవాని
భావము జూచేపట్లు – సతి యైనట్లు మతి తోచీనా

• బాహ్యార్థములో తన్ను వంచించిన సఖిని, నాయిక నిష్ఠురముగా అడుగుట. ఇది అలంకార శాస్త్ర విషయము. కాని ఈసందర్భములో ఇట్లు గూఢార్థ మున్నదేమో యని నాయూహ.

"అతని భావము వలన నీకేమి తోచినది. నాపతియైనట్లుతోచినదా; తిరిగి నీవక్కడకు పోవలెనా? అతడే ఇందు వచ్చునా; నీవు బతిమాలిన వచ్చేనన్నాడా లేక అతనే ఉత్సహించినాడా, నిన్ను నీదిగులును చూచిన నాకు సందేహముగా ఉన్నదే, వరదునితో పొందుకద్దో లేదో దాచక తెల్పవే"

౬. ఈపై ప్రశ్నలకు సఖి యేమని బదులుచెప్పినదో పరికింపుడు.

* వచ్చేమనసో రాని మనసో – వనిత నీవే తెలుసుకోవే
అచ్చట కంచివరదు డాడిన మాట లివిగో

'ఆనవాళ్ళు చెప్పగా, నీవంపిన ముద్దుటుంగరము నీకు వ్రాసిన వలపు వక్కణపు జాబు చూపించగా, కన్నీరు నించి, అసురుసురై ముద్దియను, దయ మఱువ వద్దని మామ్మాటికి నీతో నన్నుమనెను. కనుక అతనిది వచ్చేమనసో రానిమనసో నీవే తెలుసుకోవమ్మా! వరదుడు అచ్చట నాతో ఆడిన మాటలివి' అని జరిగిన మాటలు చతురముగా చెప్పినట్లు తోచుచున్నది.

౭. తరువాత ఏమిజరిగి యుండవచ్చునో ఈపదమున జూడుడు.

ఊరికి పోక నేడిం–దుండేది మేర
వారిజాక్షులార! కంచివరదుడు నాకెదురు చూడగానే.

"వరదుడు కలలో కనిపించినాడు. కంచివెళ్ళి వరదుని చూడవలెను. కూడికన్నదరు చున్నది. నన్ను పలుమారు పలుకరించడేమో, శకునము మళ్ళించవలె, నాసామి నెడబాసి సంతోసములేదు. చిన్ననాటినుండి ఎంతో చెలిమి చేసితిని. నేను ఊరికి పోకుండ ఇందుండ మేరగాదు, నాకై వరదు డెదురు చూడగా" ఇట్లు ప్రేమ ప్రేరితయై యామె కంచికి ప్రయాణ మగుచున్నట్లు ఈపదము తెలుపుచున్నది.

౮. తరువాత కంచివెళ్ళి వరదుని జాగాలో ప్రవేశించి, అతనితో ఆనందముగా మాటాడుట ఎట్టిదో ఈపదమున చూడగలరు.

* అలంకార శాస్త్ర పద్ధతిని ఇది ఒక లక్షణమునకు లక్ష్యమే.

* చక్కని దయ గలదా యిది నీ – జాగా చెవంది లింగా !
యిక్కడికి వచ్చినదేమో – హెచ్చు కంచివరద ! ॥చక్క॥

చెలికాడ నిను చూడవచ్చితి – చెవందిలింగా !
తెలిసె మాయింటికి రాని – దేమో కంచివరద ! ॥చక్క॥

ఇందున్నావని యీడ వచ్చితి – చెవంది లింగ !
అందుకేమి యెవరిల్లిది – యవుర కంచివరద ! ॥చక్క॥

కానీ, వెనుక తార్కాణించే – గాని, చెవందిలింగ !
యీనికతో మనమేకమై – యుందాము, కంచివరద ! ॥చక్క॥

ఎవ్వడో ఈ పడకింటిలో – నవ్వేది చెవందిలింగ
మువ్వ గోపాలుడు గాక మ – రెవ్వరు కంచివరద ! ॥చక్క॥

'వరదా ఇది నీజాగా ? ఇందున్నావని, చెలికాడ ! చూడ వచ్చితిని. మాయింటికి రానిదేమో తెలిసెరా వరద. వచ్చితిని. అందుకేమిలే. ఇంతదూరము యిక్కడికి వచ్చినదే హెచ్చు. ఇదెవరిల్లు? కానీ ఆవిషయము వెనుక తర్కించవచ్చులే; మనమిద్దరము ఏకమై ఇక్కడుందాము కంచివరద. ఈ పడకటింటిలో నవ్వుచున్న వారెవ్వరు ? నీవే, వరదా! మరెవ్వరు?' కంచివెళ్ళి ప్రియుని కలసి అత్యానందముతో ప్రౌఢముగా తనహర్షమును ప్రేయసి చెప్పుకున్నట్లు భావించవచ్చును. వరదయ్య మువ్వవదలిన తరువాత అతనికి ప్రేయసికి మధ్య నడచిన ప్రేమగాధ యొక్క ఉత్తరభాగ మిట్టిదని భావించుచున్నాను.

153, 174, 213, 221, 302 సంఖ్యగల పదములు కంచి వరదుని గురించి చెప్పినవే. కాని అందరు దేవుళ్ళ గురించి చెప్పిన పదములలో ఏమి విషయమున్నదో ఇందున్ను అలంకార శాస్త్ర సమ్మతమగు నాయికా నాయకుల లక్షణములకు లక్ష్యములున్నవి. ఈ విషయము మరియొకచోట విసరింతును.

* పరస్త్రీ యింటనున్న నాయకుని వద్దకు నాయిక వెళ్ళి ఆడిగేమాటలివి. విషయములో.

'మగువ తన కేళికా మందిరము వెడలెన్' అను పదము గురించి ఇదివరలో వ్రాసి యుంటిని. ఇదికూడ అభిసారికా లక్షణమునకు లక్ష్యమే.

ఇంకను రెండు పదములు మాత్రమే పేర్కొన వలసి యున్నవి. ఈరెంటి యందును కంచి వరద యని లేదు. వరదునికి, వరదుడు అని మాత్రమే యున్నది. 'మువ్వగోపాలుడైన వరదుడు' అని యున్నది. ఇవి రెండును వరదయ్య మువ్వలో ఉన్నరోజులకు సంబంధించినట్లు తోచుచున్నది. వరదయ్య అర్ధాంగిగా భావించుకొనుచున్న అతని ప్రేయసి బహిరంగముగా అతనితో ఏకము కాని రోజులలో, కలయిక తామస మగుచుండుటచేత ఉభయులకు కలిగిన మనోవ్యథ ఇందు వర్ణితము. ఒక పదములో పురుషుని విరహమును (వరదయ్య విరహమును) ప్రేయసికి సఖి తెల్పుచున్నది. ఎంత లలితముగా యున్నదో చూడుడు.

ఇంతిరో వరదునికి నీపై - నెంత మోహమే
సంతతంబతని వెతజూడ - జాలక యిందువచ్చితిని ||ఇంతిరో||

చెక్కట చెయిచేర్చుకొనెను - చిఱునవ్వు నవ్వుకొనెను
అక్కట నే దలచినట్లై - నైరాద నెను
మక్కువ మును చేసిన చెలిమి - మఱపు రాదాయ ననెను.
చక్కని యా చెలిని గూడని - జన్మమేటి జన్మమనెను ||ఇంతిరో||

పడతి ! యుండుండి నేనేమి - పాపము జేసితి ! ననెను
తడవు నిన్నెడబాసి - తాళలేననెను
నుడువ నోరాడ దనెను - నొసట చేయుంచుకొనెను
అడిగితె మీరేమైన - నార్చేరో ! తీర్చేరో ! యనెను ||ఇంతిరో||

పలువరింపుచు మా మువ్వ గో - పాలుడైన వరదుడు
నలినాక్షి ! యానాటి వింత - నడుచునో యనెను
తలచి యసురుసురు మనెను - దైవమిట్లు చేసెననెను
వలపనే పాపము పగ - వారికైన గారాదనెను ||ఇంతిరో||

ఇందు పూర్వగాథలేవో కొన్ని యుదాహృతములై యున్నవి. 'యానాటి వింత నడుచునో యనెను.' చిన్ననాటి చెలిమిని స్మరించెను. ఏదో ఆటంకము గలిగినట్లూహించవలసి యున్నది. అందుకే;

"అడిగితే, మీారేమైన ఆశ్చేరో తీర్చేరో యనెను" అనుట ఇది వరదయ్యా విరహము. ఇంక అతని ప్రేయసి విషయము.

తరుణిరో ! నేనంటాక జీవము బట్టుక - తాళియుండేనమ్మా !
వరుడు రాకయుండినంతట వలరాయ డున్నాడు నేనున్నాను ॥త॥

వరదుని పొందు నిరీక్షించుచు వ్యర్థ మనోరథమై పొగులు చున్న ప్రేయసి వాక్కులివి.

'నలదమయంతు లిద్దరు మనః ప్రథవానల దహ్యమానులై
సలిపిరి దీర్ఘ వాసర నిశల్'

అన్నట్లున్న వీరిద్దరి విరహావస్థలు ఈ రెండు పదములు చెప్పు చున్నట్లు తోచుచున్నది. ఈ రెండు పదములును ప్రణయగాథలో పూర్వార్థమునకు చెందినవి. ఇందు వరదుడు అనిమాత్రమే ఉండుట ముఖ్యముగా గమనింప తగినది. వ్యంగ్యముగా, గూఢముగా ఈ పదము లన్నిటి యందును వరదయ్యయొక్క ప్రేయసియొక్క ప్రేమ కథయున్నదని, అది పైన వివరించినట్టున్నదని, తోచుచున్నది.

కంచికి వెళ్ళి వరదుని కలసికొని సంతసించినదని, మన మిద్దరము ఏకమై యుందామని అన్నట్లు చెప్పియున్నాను. దానిపై నేమైనది తెలియుట లేదు. అట్లు కలసియుండి పోవుటకు వరదయ్య ఇయ్యకొని యుండి యుండడు. అతడు విరాగియై ఆమె ననునయించి, బోధచేసి యుండును. ఆమెయు, విషయ గ్రహణ పారీణగాన మనసు త్రిప్పుకుని మువ్వకు వెళ్ళిపోయి మువ్వగోపాలుని ధ్యానించు కొనుచు యుండి యుండవచ్చును. తరువాత వరదయ్య సంపూర్ణముగా క్షేత్రయ్యయై యుండును. ఏచోటనో ఏ క్షేత్రమందో బ్రహ్మ సాక్షాత్కారమును పొందియుండును. దక్షిణాదిని క్షేత్రయ్యకు చాల గౌరవము కలదు. అతనిని వారు క్షేత్రజ్ఞుడు అని వ్యవహరించెదరు. భగవద్గీతలోని పదుమూడవ అధ్యాయమందలి మొదటి రెండు శ్లోకముల ననుసరించి క్షేత్రజ్ఞ డనిపించుకొన గలిగిన వారు మహానుభావులని వేరే చెప్ప నవసరము లేదు. అట్టి స్థితిని క్షేత్రయ్య పొంది యుండెనేమో?

క్షేత్రయ్య చరిత్రను ముగించక ముందు అతనికి తంజావూరిలో విజయ రాఘవ నాయని దర్బారుతో ఉన్న సంబంధమును వివరించ వలసి యున్నది.

"గొప్ప సంగీతవేత్తయు, వాగ్గేయ కారుడగు క్షేత్రజ్ఞుడు విజయ రాఘవ నాయకుని సభకలంకారముగ ఉండి, ఉచ్చస్థితి కెక్కి యుండెను, అని ఒక చరిత్రకారుడు వ్రాసినాడు. ఈ విజయ రాఘవునికి 'మన్నారుదాస' యని పేరుకలదు. ఇతని కాలముననే చతుర్దండి ప్రకాశ కర్తయగు వేంకటమఖి దర్బారులో ఉండెను. మన్నారు దాస విలాసము, ఉషాపరిణయముల కర్త కవయిత్రి యగు రంగాజమ్మకూడ ఆసభలో ఉండెడిది. విజయ రాఘవునికి నాటక కళయందు సంగీతాభి నయములయందు బహుప్రీతి. రాజ భవనములో రంగస్థలమును నిర్మించి అందు నాటకముల నాడించి, స్త్రీ జనసహితుడై ఆ ప్రదర్శనములను చూచేవాడట. అక్కడ యక్ష గానములను తరచు ఆడేవారు. ఈ రాజుపేర ప్రత్యేకించి యక్షగానములు వ్రాసి ఆడిరి; చిన్నతనము నుంచి స్త్రీలకు అంతఃపురములోని వారికి కూడ పాడుట, నటించుట, అభినయించుట నృత్యాదులను భంగిమములను అతి సులువుగా సుందరముగా ప్రదర్శించుట నేర్పుటకు తగు ఏర్పాట్లు చేసినాడట.

విజయ రాఘవుడు సంగీత లోలుడేగాక, విటరాయుడు కూడ. 'ఇతడు బహు జారుడు. ఉన్నతోద్యోగుల భార్యలను, కుమార్తెలను చెరబట్టుచుండెను, అందువలన అతని సేనానాయకులయొక్క ఉద్యోగుల యొక్క విశ్వాసమును కోల్పోయెను, అతని అంతఃపురమందు 700 భార్యలు. 15300 ఉంపుడుకత్తెలు కలరట!" తాను శ్రీకృష్ణుడనని భావించి మొత్తము నీ 16000 స్త్రీలను సమకూర్చుకొని యుండబోలు! పాపము శమించుగాక!

ఇట్టివాని దర్బారులో క్షేత్రయ్య యుండెనే! అతనిమీద కొన్ని పదములను చెప్పెనే! తను వ్రాసిన పదములను వినిపించు చుండెనే అట్టి వాని యోగ్యత యెట్టిదై యుండును? క్షేత్రజ్ఞుడిట్లుండునా? యని

సంశయము కలుగుట సహజము. ఈ సందర్భములో ఒక కధ చెప్పె దరు. ఇది సుబ్బరామ దీక్షితులుగారు వ్రాసిరి. సుబ్బరామ దీక్షితులు గారుకూడ 'క్షేత్రజ్ఞులు' అనియే పేర్కొని యుండిరి.

'రసికాగ్రేసరుడైన విజయరాఘవ భూపాలుడితనికి చేయునట్టి బహుమానాద్యుపచారముల జూచి ప్రబంధ రచనా ధురంధరులైన కవీంద్రులు యీసున "మహారాజా! ఇదేమి? ఏరా! రారా! పోరా! యని జెప్పెడి క్షేత్రయ్యమీద నింత మోహమా? ఇతని కింత గౌరవమా?" అనగా వారి పలుకు లాలించి క్షేత్రయ్యతో చెప్పెనట. పిమ్మట కాంభోజిరాగమున "వదరకపోవే" అను పద ములో పల్లవి, అనుపల్లవి, రెండు చరణములును, మూడవ చరణమున సగము మాత్రము "భామరో! శకునము లడిగితి మువ్వగో-పాలుడు వచ్చుననుచు కామించి నాధుల గలయు చెలులజూచి - కరిగి చింత నొందితి" యన్నంతవరకు జెప్పి ఈ చరణముయొక్క కడపటి ఖండము మాత్రము కవీంద్రులను పూరింపమని రాజుకు జెప్పి సేతుయాత్రకు పోయివచ్చెద నని వెడలెను. కవీంద్రులు సభకు వచ్చినతోడనే రాజు వారికీపదమునిచ్చి పూర్తిచేయుడనెను. ఆ కవీంద్రులందరును జేరి క్షేత్రయ్య తిరిగి వచ్చువరకు యోచించియు ఆ కడపటి ఖండమునకు తగిన వ్యవహారము తోచక చింతిల్లుచుండిరి. క్షేత్రయ్య వచ్చిన తోడనే కవీంద్రు లందరును క్షేత్రయ్య వద్దికి బోయి ప్రార్థించినారట. క్షేత్రయ్య "రామ రామ యీ మేనితో వాని మోము జూడవలెనా మొదటి పొందే చాలు" అని పదమును పూర్తిచేసినది విని కవీంద్రు లందరును నీవు సాక్షాద్గోపాలుడవే యని, కొనియాడి రాజువద్దకి బోయి యీ సంగతి దెలియజేసి పొగడిరట.

దీనినిబట్టి చూడగా క్షేత్రయ్యయొక్క ప్రతిభా విశేషము అలంకార శాస్త్రావలోడనము వ్యక్తమగు చున్నవి. అందుచేతనే అతని పదములు చైతన్యముతో ఊగాడుచుండును. ఈ కారణము చేతనే విజయ రాఘవుడు క్షేత్రయ్యకు సకల గౌరవములను చేయు చుండెను. అంతేగాని రాజుయొక్క దుర్వ్యసనములకు క్షేత్రయ్య

దోహదమును ప్రత్యక్షముగా ఇచ్చి యుండడు. చెప్పిన పదములన్నియును మువ్వగోపాల స్వామికే అంకితము లిచ్చుచుండెను. కాని రాజు ప్రార్థించగా అతని రసికతను, జాణతనమును, ఉగ్గడించుచు క్రిందు మెట్టులో అతనిమీాద కొన్ని పదములను చెప్పెను. ఇది శోచనీయమనే చెప్పవలెను. కాని రాజాదరమును పొందుటయే తప్పు. అట్టి ఆదరము పొందినప్పుడు ఇంతవరకైన ప్రతికృతి చేయకుండుట పాడిగాదు. పై గాథలో పదమును పూర్తిచేయుమని చెప్పి సేతుయాత్ర వెళ్ళినట్లున్నది. దానినిబట్టి క్షేత్రయ్య నిజతత్వము గ్రహించవలసియున్నది: అతడు నిజమైన భక్తుడై కొంత రాజసభా ప్రవేశము కలిగియుండి, క్రమముగా అదికూడ వదిలి అజ్ఞాతముగా ఉండిపోయియుండునని ఏకాంత భక్తి సలిపి తరించి యుండునని నా భావన.

## పదముల సేకరణ.

నాకు 330 క్షేత్రయ్య పదములు దొరికినవి. అవి అచ్చు పుస్తకముల నుండి, వ్రాతపుస్తకముల నుండి, తాళపత్ర గ్రంథముల నుండి సేకరింపబడినవి.

I నాకుదొరకిన అచ్చుపుస్తకముల వివరము, అందలి పదసంఖ్యఇది.

(1) నిశ్చింత "తేవప్పెరుమాళయ్య గారిచే బరిష్కరింపబడి, సూర్యాలోక ముద్రాక్షరశాలయందు అచ్చు గూర్పించబడినది. 1862 అక్టోబరు 9 వ తేది. ఇది పర్వతనేని వీరయ్య చౌదరిగారి వద్దిది. ఇందు 228 పదములున్నవి. పదముల చివర ఇట్లున్నది. "ఇందువల్ల నెల్లరకు తెలియజేయునదేమనిన పరమ భాగవత శిఖామణియగు క్షేత్రయ్య చెప్పిన ౪౦౦౦ పదములలో ముందు ౨౦౦ పదములు ముద్రించి ప్రచురించిరి. తక్కిన పదములను మేము విచారించగా ౨౮ పదములే దొరికినవి. వానిని గూడ జేర్చి ౨౨౮ పదములుగా ప్రస్తుతమున ముద్రించితిమి. యీ ౨౨౮ పదములు గాక మిగిలిన పదము లెవ్వరివద్దనైన నున్నపక్షమున, చాకలపేటలో నున్న సూర్యాలోక

ముద్రాక్షర శాలాధికారియగు ఒగ్గులూరు వేణుగోపాల నాయనివారి వద్దకి బంపిన పత్రమున క్రోడనే ముద్రించి పంపిన వారి నామముతో గూడ బ్రచురింప బడును."

(2) 1862 సమీపకాలమునవే (1864?) అచ్చొత్తించిన పుస్తక మొకటి ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున నున్నది.

(3) 1874 జనవరి 3 తేదీని వివేక చంద్రోదయ ముద్రాక్షరశాల యందు అచ్చు గూర్పించి ప్రచురింపబడినది. ఇందు ౨౨౮ పదములు ముద్రించిన తరువాత 13 క్షేత్రయ్య పదములు, కొన్ని ఇతర ముద్రలు గల పదములు, కొన్ని త్యాగరాజ కీర్తనలు ముద్రించిరి. అనగా క్షేత్రయ్య పదములిందు మొత్తముమీద 241 ఉన్నవి. ఈ పుస్తకము కూచిపూడిలోని శ్రీ వేదాంతము లక్ష్మీనారాయణ శాస్త్రిగారి వద్దిది. వీరు నేటికి మిగిలియున్న భాగవతులలో పెద్దలు.

(4) 1877 జూలై 25 తేదీని భువనగిరి రంగయ్య శెట్టిగారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షరశాలయందు అచ్చు వేయించి ప్రకటింప బడినది. ఇది 1874 లోని పుస్తకమునకు నకలు. ఇది విజయనగర సంస్థానపు కోటలోని ఆనందగజపతి మహారాజా వారి పుస్తకభాండాగారము లోనిది.

(5) 1894 లో వాణీనిలయ ముద్రాక్షరశాలయందు అచ్చు వేయించి చిత్తూరు బాలమ్మచే ప్రచురింపబడినది. అందు శీర్షిక యిట్లున్నది. "క్షేత్రయ యను మహాకవిచే రచియింపబడిన మువ్వగోపాల నామాంకితములగు క్షేత్రయ పదంబులు" కాని, ఇందు విజయరాఘవముద్ర కలవి కూడ చేరియున్నవి. ఇది కూడ 3 వ దాని నకలే. 241 క్షేత్రయ పదములు 20 ఇతర పదములు మొత్తం 261. కొన్ని త్యాగరాజ కీర్తనలు కలవు.

(6) వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అ-డ్ సన్స్‌వారిచే 1916లో ప్రకటితము. ఇందు 200 పదము లున్నవి. ఒకటి రెండు తుపాకుల వేంకటకృష్ణునిమీద విజయ రాఘవునిమీద చెప్పినవి కూడ కలసియున్నవి. దీనిపైన ఇట్లు "క్షేత్రయ పదములు శ్రీ మువ్వగోపాల కృతము"లోపల భాగములో "క్షేత్రయ పదములు-శ్రీ మువ్వగోపాలాంకితములు" అని కలదు.

(7) పైన పేర్కొన్న వన్నియును క్షేత్రయ్య పదముల పుస్తకములే. ఇది అట్టిదికాదు. ఇందన్నియు చేరియున్నవి. 'సంగీత సర్వార్థ సారసంగ్రహము.' ఇది పెక్కండ్రు సంగీత విద్వాంసులచేత పరిష్కరింపబడినది. 1917లో శ్రీ చిదానంద ముద్రాక్షరశాల యందు ముద్రింపబడినది. ఇందచ్చు తప్పులు మెండుగానున్నను, పాఠాంతరములకు ఉపయోగముగా ఉండెను.

II తాళపత్ర గ్రంథములు.

మదరాసు లోని అడయూరు పుస్తక భాండాగారములోనివి.

| | | |
|---|---|---|
| (1) XXXII. W. 3. I shelf No. 32. N. 3 | | ఇందైదారు పద |
| (2) XXXII. ,, ,, shelf No. 32. N. 8 | | ములు దొరకినవి |
| (3) XXXII. ,, ,, ,, ,, N. 9 | | అచ్చులో లేనివి. |

III వ్రాత గ్రంథములు.

(1) తిరుపతి దేవస్థానమువారిది. ఇందొకటి దొరికినది.

(2) ఆంధ్రసాహిత్య పరిషత్తువారిది. కాకినాడ M. S. No. 3382.

(3) ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని క్షేత్రయ్య పదములు రెండు ప్రతులు Nos. 2561/2562 ఇందు ఎనభైపైచిలుకు దొరికినవి.

(4) తంజాపూరి లోని సరస్వతీమహాల్ పుస్తకభాండాగారము లోని క్షేత్రయ్య పదముల పట్టీ (index) లు.

M. S. No. 11618

,, ,, 10868

ఇందు సుమారు పది పదము లున్నట్లున్నవి. వాటి ముద్ర మొదలగు వివరములకై వ్రాసియున్నాను. క్షేత్రయ్య పదములైతే ముద్రణ ముగియకముందే వచ్చినచో, వాటిని ముద్రించెదను.

(5) తంజావూరి భాండాగారము లోని ఈ క్రింది వ్రాతప్రతుల లోని క్షేత్రయ్య పదములు అనువాటినుండి ముద్రలు మొదలగు వివరములతో వ్రాయించి తెప్పించిన పదముల పట్టీ :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| B. | No. | 11522 c. | Telugu | D. | No. | 429 |
| ,, | ,, | 11640 | ,, | ,, | ,, | 452 |
| ,, | ,, | 11646 | ,, | ,, | ,, | 457 |
| ,, | ,, | 11605 | ,, | ,, | ,, | 445 |
| ,, | ,, | 11605 and 11618 | ,, | ,, | ,, | 472 |

ఈ పట్టీలో 429 పదములున్నవి కాని అందు సుమారు నూటికి పైని మాత్రమే క్షేత్రయ్యపదములు. తక్కినవన్నియు ఇతర ముద్రలు గలవి. ఇందు క్షేత్రయ్య పదములు క్రొత్తవేమియు దొరకలేదు.

(6) వాలాజీపేట వెంకటరమణ భాగవతులవారి సంగీత పుస్తకముల వ్రాతప్రతులలో మధురలోని సౌరాష్ట్ర సభవారివద్ద నున్న వానిలో, క్షేత్రయ్య పదములు కొన్ని వ్రాయబడి యున్నవి. అందొక పదము దొరికినది.

తాళపత్ర గ్రంథములలోని ప్రాతకాలపు వ్రాతలెట్లుండునో తెలుపుటకు అందు వ్రాసిన రీతినే క్రిందిపదము నిచ్చుచున్నాను.

### కాంబోది — ఆది

ప|| యింత్తలెదని యెంచ్చకురా ||

అ. ప|| కంత్తుని గన్న చ్చక్కని కరగిరివరద నా సామి ||

చ|| నినుబాశి తాళలెను నీ సొంమ్మున జెశితినా మెను
తనివిదీచ్చక పోనీను తమినిల్పలెను
• నను విడనాడెనను వగమాను నణచను మోహాము నామదిలోను
దనరగ నీవు నా దైవముగాను మనసునఎంచ్చితి మక్కువతోను ||౧||

యిక్కడనుండ మనసాయ యెమో తెలియదు నీ మాయ
సొక్కు బొడి జల్లినట్లు యనుగుణోని ధేయ ।
అక్కట నీవు నన్నరమరశాయ జిక్కితి మదనునిచె విటరాయా
మ్రొక్కిన దిప్పవు మోమిచ్చాయ చక్కని సామిగా చ్చాలనినుబాయ ॥2॥

తెలిసి మువ్వగోపాలా దెవుడవైనం నీ। వ్యాళికలశి యె చెవిమెలా కంటినీలీలా।
సొలపు నను దయజూడ వద్యాల చెలిమితో యెచెవో చ్చాలా
కలికితివో తరుదనాపాలా కలవని నమ్మితి కరుణమోలా ॥3॥

(7) సుబ్బరామ దీక్షితులుగారు తమవద్ద ప్రాచీన పుస్తకములలో ఏ నూరు క్షేత్రయ్య పదములున్నవని వ్రాసినారు. వాటికొరకై ఎంత ప్రయత్నించినను వారి వారసుల వద్దగాని మరియెచ్చట గాని లభ్యముగా లేదు. అవి ఎట్లు అంతరించినవో !

## పదకవిత్వము

తెలుగు భాషలో గేయ రచన యొక్క ప్రారంభ మెట్టిదో తెలియదు. నన్నయ్యకు పూర్వపు పద్యకవిత్వపు స్వరూపమే ఇంకా బాగ తెలియదు. ఆ పద్యముల వలెనే గేయములు వెలువడి యుండును. రాగతాళ బద్ధము లైనచో గేయము లగును. పది పన్నెండవ శతాబ్దము వరకు సంస్కృతమునకే ఎక్కువ ప్రాముఖ్యము గలదు. సంస్కృతమున జయదేవుని అష్టపదులు నేటికి నిలిచిన గేయములలో ప్రాచీనములు. ఇందు పల్లవి - ధ్రువము - రెండు పాదములు కలది, తరువాత ఎనిమిది చరణములు ఉండును. చరణములే పదములు. అందుచేతనే అష్టపదు లనబడుచున్నవి. పద్య కవిత్వమున ద్విపద లున్నట్లే రెండు పాదములు గల పద్యరచన ప్రాచీనము. తాళబంధము, ఛందస్సు లేనివి చూర్ణికలను పేరుగలవి కృష్ణాచార్యులు మొదలగు వారు వ్రాసినవి కలవు. అందుకొన్ని 'తాళప్రమాణము కడు చలువై' యుండి, ఛందస్సు లేకయుండును. వాటిని తాళగంధి వచనము లందురు. తాళముయొక్క గంధము మాత్రము కొంత కలది గనుక తాళగంధి యనుట. తెలుగులో నున్న పూర్వపు గేయ రచనలను ఎత్తి చూపినవాడు పాల్కురికి సోమనాథుడు

తుమ్మెద పదములు ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, శంకర పదములు, నివాళి పదములు, వాలేశు పదములు, గొబ్బిపదములు, వెన్నెల పదములు మొదలైనవి. వీటి లక్షణము మంతగా తెలియదు. అన్నింటికిని లక్ష్యములు లేవు. బసవేశ్వరుడను కాకతీయ రాజ్య మందలి దండ నాథుడు కర్ణాటక భాషలో శివపరముగా పెక్కు గీతములను చెప్పియున్నాడు.

1424-1503 క్రీ. శ. మధ్య నెలసిన గొప్పవైష్ణవుడు, వేంకటేశ్వర స్వామివారి పరమ భక్తుడు యైన తాళ్ళపాక యన్నమాచార్యులు వారు తెలుగులో పదకవిత్వము ధారాళముగా చెప్పిన ప్రథమ వాగ్గేయ కారుడు. ఇతనిని పదకవితా పితామహు డందురు. ఇతడు వేలకొలది పదములు రాగిరేకులమీద వ్రాయించినవి, నేటికిని తిరుమల తిరుపతి దేవస్థానమువారివద్ద గలవు. వాటిని పరిష్కరించి దేవస్థానమువారు పదిసంపుటముల నచ్చువేసి యున్నారు. ఇంకను వేయుచున్నారు. అన్నమాచార్యులవారు ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యులవారు కూడ పదములను విరివిగ వ్రాసినారు. అన్నమాచార్యులవారి పదములు శృంగార పదములని, వైరాగ్య పదములని రెండు విధములు. అన్నమాచార్యులవారు సంకీర్తన లక్షణమను గ్రంథమును రచించిరి. దానికి పెదతిరుమలాచార్యులవారి కుమారుడైన చిన తిరుమలాచార్యులు తెలుగు అనువాదమును వ్రాసెను. ఇది 1540 క్రీ. శ, ప్రాంతములో నై యుండును. అనగా క్షేత్రయ్యకు సుమారు నూరేండ్లకు పూర్వము. ఈ సంకీర్తన లక్షణములో అంతకు పూర్వము వాడుకలోనున్న పదవిశేషములకు లక్షణము వ్రాయబడి యున్నది. వృత్తపదము, నిబంధ పదము అష్టపదము, పదమాలిక యని నైదు. అందు ఇంకను భేదములు. కొన్ని రెండుపాదములు కలవి. కొన్ని నాలుగు పాదములు గలవి. దరువులు, జక్కుల రేకులు, ఏలలు, గొబ్బిళ్ళు, చందమామ పదములు, అర్థచంద్రికలు.

? అన్నమాచార్యుల వారి పదములకు సంకీర్తనము లనిపేరు. పదములే సంకీర్తనములు కూడ. ఈ సంకీర్తనములలో రెండుపాదములు కల పల్లవి, తరువాత నాలుగేసి పాదములుకల మూడు చరణములు ఉండును. పల్లవి లక్షణమిట్లు చెప్పియున్నది.

క॥ పదముల యర్థము బల్లవి । వదలక యన్నిటికి యేక వాక్యత జేయన్।
గుదిగ్రుచ్చినట్లు తగులై । పదము తుదిన్ మరియు మరియు పల్లవి యలరున్॥

? చివర పదములో; అనగా చివర చరణములో, ముద్రఉండును. అంకితముండును. ? ఈ సంకీర్తనలకు పైన రాగము పేరు మాత్ర ముండును. తాళము పేరుండదు.

అధ్యాత్మ సంకీర్తనల - వైరాగ్య సంకీర్తనల - లక్షణ మిట్టిది:-

క॥ వైరాగ్య వృద్ధి కర, గం । భీర పదశ్రేణి పొసగ బెనుపుచు నగ్రా ।
మ్యారమ్య విష్ణు చరితో । దారములై యున్న జాలు ధరణి న్వేలయన్॥

మరియును, దేహ, ఆత్మవివేక ఉత్సాహంబులై, లోక వేద ధర్మాధర్మా ద్యూహాపోహలంగల హరికీర్తనములు అధ్యాత్మంబులు.

ఇందు గంభీర పదశ్రేణి యుండవలెను. విషయము వలెనే మాటలుకూడ అగ్రామ్యములై గంభీరములుగా ఉండవలెను. శృంగార కీర్తనములో గ్రామ్య పదములు ప్రయోగించ వచ్చును.

క॥ పదములు శృంగార వహా । మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రములైనన్।
విదితార్థ గ్రామ్యోక్తులు । పదిలముగా బొంక మెరిగి పలుకగ జెల్లున్॥

క॥ పల్లవ నారీ మ్లేచ్ఛా । ద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై ।
చెల్లును గ్రామ్యము లైనను । హల్లీసక ముఖ్య నాటకాధిక ఫణితిన్॥

క॥ జగతిగల జెల్లుబళ్ళై । నగి నగి భాషించు నట్టి నానుడి పలుకుల్ ।
తగదన రహిచెడు; బుధ్వుల । సొగసుడుగం బిసికి కంపుచూచిన భంగిన్॥

తాళ్ళపాకవారి కీర్తనల యందు అనేక విషయములు లోకోప కారార్థము చెప్పబడినవి.

శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారంబులై
యతి లోకాగమ వీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక యన్నయ వచోనూత్న క్రియల్ చెన్నగున్

## పు రం ద ర దా సు

వీరు కర్ణాటక భాషయందు లెక్కలేనన్ని సంకీర్తనలు చేసిన మహాభక్తులు. కీర్తనలను శ్రీ పాండురంగ విఠ్ఠలుని కంకితముగా పాడినారు. వీరు చిన్నవారై యున్నప్పుడు అన్నమాచార్యుల వారిని దర్శించి వారి కీర్తనలు విని సన్మతించిరి. వీరున్ను అన్నమాచార్యుల వారివలెనే వైరాగ్యమును నీతిని బోధించు నట్టివి శ్రీకృష్ణుని శృంగార లీలలను వర్ణించు నట్టివి కీర్తనలు చెప్పియున్నారు. వీరిద్దరును భజన పద్ధతి కనుకూలములగు కీర్తనలను వ్రాసి భజనకూటములకు ప్రాతిపదిక యేర్పరచిన మహానుభావులు. పురందరదాసు కీర్తనలలో తాళము పేరు చెప్పబడి యుండును. పల్లవి, అనుపల్లవి విడివిడిగా పేర్కొనబడి యుండును. అన్నమాచార్యులు రచించిన పల్లవిలో మొదటి పాదము పల్లవిగాను రెండవ పాదము అనుపల్లవిగాను ఈ సంకీర్తనముల యందుండును.

## క్షే త్ర య్య

అన్నమాచార్యులవారి సంకీర్తనములలోని శృంగార కీర్తనలే క్షేత్రయ్య పదములకు మాతృకలన వచ్చును. క్షేత్రయ్య కాలము నాటికి శృంగార కీర్తనలకు పదములని రూఢియైనట్లు తోచుచున్నది. పదములనగా సంకీర్తనములని మొదటి నుండి వాడుకగా నుండినను ఈ నాటికి కేవల శృంగార రస ప్రధానములగు గేయములకు పదములని పేరు వచ్చినది. మరియును శృంగారమైనను భగవంతుని పరముగా భక్తి ప్రధానముగా నుండక కేవల లౌకికమగు మనుష్య సంబంధమైన శృంగారము రాను రాను పెచ్చు పెరిగి పోయినది. అట్టి గేయములను క్షేత్రయ్యయే మొదట రచించినట్లు కనిపించుచున్నది. ఐనను

ఈ క్షేత్రయ్య పదరచనలో మేటియని అనేక కారణముల చేత చెప్పవలసి యున్నది. ఇతనిభాష రసపుష్టి, కల్పనావిశేషము, శాస్త్రజ్ఞానము, సంగీతవిశేషము మేలుతరగతికి చెందినవి. ఈ విషయములలో ఇతనిని మించినవారు పదకవిత్వములో అతనికి ముందుగాని వెనుకగాని లేరు.

ఇతడు పూర్వపు రచనల నెరిగియున్నట్లు తోచును. అన్నమాచార్యుల ననుకరించి యున్నట్లు తోచును. రెండు మూడుదాహరణముల చూడుడు.

1. అన్నమయ్య:

కట కటా అయ్యో కాంతనింత యేపుదురా
అట మట గాదు నీ యానసుమ్మీ నిజమయ్యా ||కటకటా||

కోరిన నిన్నే గాని కోపించినా నిన్నే గాని
కసరినా నిన్నే గాని కాదన్నా నిన్నే గాని ||కటకటా||

కొనియాడినా నిన్నే గాని గుంపించినా నిన్నే గాని
పనివిన్నా నిన్నే కాని పాడినా నిన్నే కాని ||కటకటా||

మనసిచ్చి యలమేలు మంగపతి వెంకటేశ
యెనసితివి మా చెలినింక నేఁ నేమిటికయ్యా ||కటకటా||

క్షేత్రయ్య:

ఇంత తెలిసియుండి యీ గుణమేలరా
పంతమా మువ్వగోపాల నా సామి ||ఇంత||

అలుకచేసి యింటికి రావైతివి నెనరైన
చెలికత్తెలున్నారా – పిలువవచ్చేరా
చెలికత్తెవైనా నీవే చెలువుడవైనా నీవే
తలచిచూడ నాపాలి దైవము నీవే ||ఇంత||

వింతదానివలె నన్ను – వేరుచేసి రావైతివి
అంతరంగులున్నారా ? నన్నాదరించేరా ?
అంతరంగమైనా నీవే ఆదరించినా నీవే
చింతించిజూడ నా జీవనము నీవే ||ఇంత||

శ్రీనిధి! మువ్వగోపాల! చేపట్టి నన్నేలితివి
నా నేర్పులెవరైనా - నందించేరా?
నా నేర్పులైనా నీవే నమ్మికలిచ్చిన నీవే
యానగా బలికెద నా యానందమైన నీవే ||ఇంత||

## 2. అన్నమయ్య:

ఏటి పొందు యేటిగుణము యేటి సవరందనము మనసు
నాటుకొలపంజేయలేని నటన లేటికే ||ఏటి||

చూపు చూపుతారు కాణ చూపులోని నగవులెల్ల
చూపి పులకరించలేని సొబగు లేటికే
యేపురేగి కోరికలను యెత్తుసేసి మీద మీద
తాపమంద జేయలేని తనువులేటికే ||ఏటి||

కదిసినపుడె మేనుమరచి కౌగలించినటి చేయి
వదలి కన్ను మయ్యలేని వలపు లేటికే
తుదలనైన చెమటగముల తొప్పదోగి మోహరతుల
సదమదముగ దనుపలేని చనువులేటికే ||ఏటి||

దేహధారియైన ఫలము తెలిసి వేంకటాద్రివిభుని
మోహమంద జేయలేని మురిసమేటికే
ఊహదలచి తమకమంది నొకరి కొకరు యిట్లు నేడు
సాహసించి కలయకున్న జన్మమేటికే ||ఏటి||

## క్షేత్రయ్య:

మానినిరో చేరరమ్మని పిలువని - మాలిమేటి మాలిమే
పూని దానిపొందు మనుభవింపగ లేని
పురుషుడేటి పురుషుడే, ఓ చెలియా ||మానిని||

వెన్నెలబైట సంగీతము విననట్టి - వేడుకేమి వేడుకే
చిన్నెలు మెరయించి చిరునవ్వు నవ్వని - చిత్తమేటి చిత్తమే
సన్నుతాంగిరో కనుసైగ సేయని యట్టి - సరసమేటి సరసమే
పన్నుగ దాని వర్ణింపలేనట్టి - పదము లేటి పదములే ఓ చెలియా ||మానిని||

విరిపాన్పుపై సోలి వేగింపలేనట్టి - విరహమేటి విరహమే
తరితీపుతో జాల తమక మెచ్చనియట్టి - తనువు లేటి తనువులే

కరికుంభముల సాటి కుచముపై లేని – కరములేటి కరములే
విరిగొన్న విధమున నధరమానని యట్టి
పెదవులేటి పెదవులే ఓ చెలియా ||మానిని||

నీవే నా ప్రాణనాయకి యని యెంచని – నెనరులేటి నెనరులే
చవుసీతి బంధము విధము తెలియనట్టి – చదువులేటి చదువులే
కవులకు బహుమాన మియ్యగలేనట్టి – కలుములేమి కలుములే
అవునని మువ్వగోపాలుడు మెచ్చని
యందమేటి యందమే ఓ చెలియా ||మానిని||

## 3. అన్నమయ్య:

పలుకు దేనెల తల్లి పవళించెను
కలికి తనమున విభునిగలసినది గాన ||పలుకు||

నిగనిగని మోముపై నెఱులు గెలకుల జెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో దెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనె గాన ||పలుకు||

కొంగుజారిన మెరుగు గుబ్బలొలయగ తరుణి
బంగారు మేడపై బవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
నంగజగురునితోడ నలసినది గాన ||పలుకు||

మురిపెంపు నటనతో ముత్యాల మలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిటగలసి
యరవిరై నను జెమట నంటినదిగాన ||పలుకు||

## క్షేత్రయ్య:

మగువ తనకేళి కామందిరము వెడలెన్
వగకాడ మా కంచివరద తెల్లవారె ననుచు ||మగువ||

విడజారుగొజ్జంగి – విరిదండ జడతోను
కడుచిక్కు – బడిపెనగు – కంటసరితోను
నిడుద కన్నులదేరు – నిదురమబ్బుతోను
తొడరి పదయుగము – దడబడెడు నడతోను ||మగువ||

సొగసి సొగయని వలపు – సొలపు జూపులతోను
వగవగల ఘనసార – వాసనలతోను
జిగిమించు కెమ్మోవి – చిగురు కెంపులతోను
నగముకుచముల విదియ – చందురులతోను ||మగువ||

తరితీపు సేయు సమ – సురతి బడలికతోను
జరుత పావడ చెరగు – జార్పైటతోను
యిరుగడలకై దండ – లిమ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగో – పాల తెల్లవారెననుచు ||మగువ||

క్షేత్రయ్య పల్లవిని అనుపల్లవిని పురందరదాసు వలెనే భేదముగా రచించెను. క్షేత్రయ్య, మువ్వగోపాల ముద్రను నియతముగా మూడవచరణమందే గాక పల్లవిలోనో అనుపల్లవిలోనో, కూడ రచించుచు వచ్చెను. క్షేత్రయ్య అన్నమయ్య వలెనే అనేక దేవుళ్ళ దర్శించి వారికి మువ్వగోపాలునితో అభేదమును కల్పించి, మువ్వగోపాలుని ముద్రతోనే వ్రాసినాడు.

క్షేత్రయ్య, పురందరదాసుల, కీర్తనల పోలికలను నేనంత తరచజాలనైతిని. ఐనను మచ్చునకొకటి ఇచ్చుచున్నాను.

## పు రం ద ర దా సు

ప|| బుద్ధిహేళే నిన్న ముద్దు కందగె ||
అ|| ప|| సద్దుమాడదె బందు – ముద్దనిట్టు పోదనమ్మ ||బుద్ధి||

చ|| గంధకస్తూరి పునుగు – అందదంద పూసికొండు
మందహాసదింద బందు – ఇందిరేశను
సింధుశయన తా బందు – మందిరదొళగె హొక్కు–
సందుగొందు గళెహుడికి – సరసనాడి పోదనమ్మ ||బుద్ధి||

.... ... ... ... ... ... ....

అనువాదము:

ప|| బుద్ధిచెప్పు గోపి నీ ముద్దు బిడ్డకు ||
అ|| ప|| సద్దుచేయక వచ్చి ముద్దుపెట్టి పోయెనమ్మ ||బుద్ధి||

చ|| ౧|| గంధము కస్తూరి పునుగు అందముగా పూసికొని
మందహాసముతో వచ్చి ఇందిరేశుడు

సింధుశయనుడు వచ్చి మందిరములో జొచ్చి
సందుగొందులు వెదకి సరసమాడి పోయెనమ్మ ||బుద్ధి||

౨|| చప్పర మంచముపైనే తప్పి పరుండియుండ
చప్పుడు లేకనె వచ్చి అప్పికొనెనే
కుప్పాసములో చేయినుంచి కర్కశ కుచములనుబట్టి
తప్పుకార్యము జేసి మోవిచప్పరించి పోయెనమ్మ ||బుద్ధి||

3|| కల్లగాదు నా మాట వల్లభే! విను గోప్యమ్మ
మెల్ల మెల్లగాను వచ్చి తా గల్లగె ముద్దు పెట్టి
నల్లదాన రమ్మనుచును చల్ల చల్ల మాటలాడి
వల్లభుడు పురందర విఠలు పారిపోయె నమ్మ ||బుద్ధి||

## క్షేత్రయ్య:

ఎవ్వడే! ఎవ్వడే! ఓ భామ! వీ - డెవ్వడే?
ఎవ్వడే నేను పవ్వళించిన వేళ
పువ్వుబాణము వేసి రవ్వచేసి పోయె ||ఎవ్వడే||

పట్టపగలు వాడువచ్చి బలు। దిట్టడై నాయిల్లు జొచ్చి నా
డట్టె నన్ను చెట్టబట్టి కౌగిలించి
గట్టిగా నా మోవి గంటుచేసి పోయె ||ఎవ్వడే||

గరిత వానికి నేను సతమా నన్ను। గద్దించి పలుకు టుచితమా నా
పురుషు డూరలేని ప్రొద్దు మాపటి వేళ
సుద్దుల దేలించి ముద్దుబెట్టుక పోయె ||ఎవ్వడే||

వెన్న తిన్న పిన్నతనమా! అల్ల। ప్రేతల గూడిన గుణమా! నన్ను
కొన్న మగని వలె కొంగు బట్టి తీసి
చన్ను లొడిసిపట్టి చలమేటి కనిపోయె ||ఎవ్వడే||

పేద సాదల కిది యూరా! - యిందు పిన్న పెద్ద లెవరు లేరా! యీ
వీధి వారలెల్ల - వింత చూడనె కాక
దాదు ఫిర్యాదేది - ధరణిలో లేదాయె ||ఎవ్వడే||

నీలమేఘ శ్యామలాంగుడు మంచి - మేలు పీతాంబర ధరుడు వాడు
లీలతో పది యారువేల గోప
స్త్రీల నేలిన మువ్వ గోపాలు డనిపోయె ||ఎవ్వడే||

ఇందు ఐదు చరణము లున్నవి. దీనిని పదమాలిక యని చెప్ప వలెను.

క్షేత్రయ్య భాష.

పదము లన్నియును చక్కని జాను తెనుగులో వ్రాయ బడినవి. ఆనాటి తెనుగు భాషా స్వరూపము దీని నుండి చాలవరకు తెలిసికొన వచ్చును. సంకీర్తన లక్షణములో చెప్పిన రీతిని అన్నమాచార్యుల వారవలంబించిన రీతిని వాడుక భాష నుపయోగించి యున్నాడు. ఈ పదములలో నున్న ముఖ్యమగు పలుకుబళ్ళు, సామెతలు ఎత్తివ్రాసియున్నాను. వాటి ని పీఠిక చివరను ఇచ్చు చున్నాను. వీటిని గురించి ఎంతైన కృషిచేసి భాషా విశేషములను బైకి తీయ వచ్చునేమో యని తోచుచున్నది. సమర్థులగు వారట్టి పనిని చేయుదురు గాక.

ఈ పద రచనలోని కొన్ని విశేషములను గూర్చి బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు దయతో వ్రాసిన విషయ మిందు వేరే ముద్రితమై యున్నది.

క్షేత్రయ్య సంస్కృతాంధ్రముల బాగుగ నేర్చినవాడని అతని కవిత్వము వలన స్పష్ట మగుచున్నది. క్షేత్రయ్య పదకవిత్వములో దేశీయ కవిత మూర్తిభవించి యున్నది భాషా మర్మమును ఇతడు బాగుగా నెరిగిన వాడు. ఇతని ధోరణి, కల్పనలు, వర్ణనములు బహు ప్రశంస నీయములు. కడు చిత్రములు. కొన్ని ఉదాహరణముల నిచ్చు చున్నాను.

## యదుకుల కాంభోజి - ఆది

ప॥ 5 ఎంత చక్కనివాడే – నాసామి వీ – డెంత చక్కనివాడే

అ॥ ప॥ ఇంతి మువ్వగోపాలుడు సంతతము నామదికి సంతోసము చేసెనే ॥ఎంత॥

చ॥ ౧. 4 మొలక నవ్వులవాడె – ముద్దు మాటలవాడె
తళుకారు చెక్కు – టద్దముల వాడే
తలిరాకు జిగిదెగడ – దగుమోవి గలవాడె
3 తెలిదమ్మి రేకు క – న్నుల నమరువాడే ॥ఎంత॥

౨. చిరుత ప్రాయము వాడె – చెలువొందు విదియ చం
దురు గేరు నొసలుచే – మెరయువాడే
చెరుకు విల్తునిగన్న – దొరవలె నున్నాడె
2 మెరుగు చామన చాయ – మే నమరు వాడే ||ఎంత||

3. పొదలు కెందామరల పెం – పొదవు పదములవాడె
1 కొదమ సింగపు నడుము – కొమ రమరువాడే
మదకరి కరముల – మరపు చేతుల వాడె
సుదతి మువ్వగోపాలు 5 డెంత – సొగసు గలవాడే ||ఎంత||

ఇది చేమకూర వేంకట కవి రచితమగు విజయ విలాసమందు సుప్రసిద్ధమగు ఈ క్రింది పద్యమునకు ప్రతిగా మువ్వగోపాల స్వామిని వర్ణించిన పదము.

ఎగు భుజంబులవాడు 1 మృగరాజ మధ్యంబు
బుడికిపుచ్చు కొను నెన్నడుమువాడు
నెఱి వెండ్రుకలవాడు 2 నీలంపు నికరంపు
మెఱుగు జామన చాయ మేనివాడు
3 గొప్ప కన్నులవాడు కోదండ గుణ కిణాం
కములైన ముంజేతు లమరువాడు
బవిరి గడ్డమువాడు పన్నిదంబిడి డాగ
వచ్చునందపు వెన్ను మచ్చవాడు
గరగరని వాడు 4 నవ్వు మొగంబువాడు
5 చూడ గలవాడు మేలైన సొబగువాడు
వావి మేనత్తకొడుకు కావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు ||

సామ్యముగలచోట్ల సమాన సంఖ్యలను రెండిటి యందును చూపితిని. రెంటిలో ఏదిమేలో, ఎందు యమకము, విషయము, అందము ఎక్కువగా నున్నదో చదువరులే నిర్ణయింతురుగాక. ఏమైనను చేమకూర పాకముకంటె క్షేత్రయ్య పద పాకము తక్కువగ లేదనియే తోచెడిని. పదములోని చరణము లందలి మొదటి రెండు పాదములు మిగిలిన రెండు పాదములు, చేర్చి చదివిన సీసపద్యపు పాదములు నగుచు చున్నవి.

క్షేత్రయ్య పదములయొక్క ఛందస్సును గురించి వివరముగా పరిశీలించి అందలి వివిధ ఛందస్సులను వేరు పరచి నిర్ణయించ వలసి యున్నది.

పై నుదాహరించిన విజయవిలాస పద్యమునకు దానిని పోలిన క్షేత్రయ్య పదమునకు సంబంధించిన ఒక సారస్వత విషయము వ్రాయతగి యున్నది. కొలది మాసముల క్రిందట తిరుమల తిరుపతి దేవస్థానమువారిచేత సుభద్రా పరిణయమను గేయ కావ్యము తాళ్ళపాక తిమ్మక్కచే రచింప బడినది ప్రకటిత మైనదని వేరుచోట చెప్పియున్నాను. అందు, పై సీస పద్యములో వలెనే సుభద్ర కపట సన్యాసికి అర్జునుని గురించి చెప్పు వాక్యము లివి.

ఎగు భుజమ్ముల వాడు — మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నె — న్నడుము గలవాడు
గరగరని వాడు — క్కని వాడు నతడు
గొప్ప కన్నుల వాడు — కోదండ గుణ కి
ణాంకంబులౌ బాహు — లమరిన వాడు
వెన్నెన మచ్చగల — విభవంబు వాడు
బవిరి గడ్డమువాడు — పన్నిదం బిడిన
వెన్ను పగడసాల — పెసనాడవచ్చు
చిగురొత్తు చంద్రిక — చెలగు పాదములు
నని విధం బెరిగింప — నంతట నరుడు.

ఇందులోని పలుకుబళ్లు ఎన్ని పై సీసపద్యమందున్నవో చూడుడు.

వర్ణనలు, రీతులు.

౧. ఇన్ని విధముల బూజించేర సామి — యింతి నను గూర్చుమీ
నిన్నెంతోగా వేడు కొన్నందుకు నాకు
నెంజిలి దీర్చు సుమీ నా సామి ॥ఇన్ని॥

| | |
|---|---|
| కన్నె మోము నేను కనుగొన గలిగిన<br>పున్న మొక్క పొద్దుండేర సామి | మోము పున్నమ చంద్రుని వంటిది. |
| కన్నులు ముద్దాడ గలిగిన నే జంట<br>కలువ పువ్వుల బూజించేర సామి | కన్నులు జంట కలువలు |

| | |
|---|---|
| సన్న నూగారంట గలిగిన నాగుల<br>చౌతి వ్రతము లుండేర సామి | నాగుపాము వంటిది నూగారు |
| చన్ను లంట గలిగిన బంగరు కలశము<br>శిఖరముపై నుంచేర సామి | కుచములు బంగరు కలశములు |

॥ఇన్ని॥

తియ్యని మోవాన గలిగిన జుంటి – తేనె లారగింపించేర సామి
శయ్యపై దాని నన్నెనయ జేసిన వసంత – చతుర్దశి చెల్లించేర సామి
వొయ్యారి జిగి జూపుల నన్ను జూచిన
నొప్పుగ నారతు లెత్తేర సామి
నెయ్యంపు బొందున జెమటల దడిపిన
నిత్యాభిషేకము చేసేర సామి ॥ఇన్ని॥

బాల నన్ను బిలిచిన నిన్ను మువ్వగో – పాల రాయడని పిలిచేర సామి
చాల ప్రొద్దు వేడుక నుండగలిగిన – జాగరముల గావించేర సామి
మేలుగ రతులను మెలగిన నీకు ల – క్ష్మికి గళ్యాణము చేసేరసామి
వాలుగంటి యెదనుండ గలిగిన నే
వేళ నిన్ను నే దలచేర సామి! ॥ఇన్ని॥

ఇందుగల స్త్రీ వర్ణన, మొదలగు విషయములు చిత్రరీతిని వర్ణింపబడినవి. మూడు చరణముల యందును సొగసైన పోకడలు పోయినాడు క్షేత్రయ్య.

౨. ఏమి సేయుదు ? మోహ – మెటువలె దీరును ?
భామినీమణి యె – వ్వరు తోడి తెచ్చేరు ? ॥ఏమి॥

చెలియ నీదు ముఖార – విందంబు లిఖియించి
యలరు వాసనలు వ్రా – యగ నేరనైతి
కళలొల్కు నీమోవి – గదసి వ్రాసితిగాని
చెలత! తేనియలుంచ – నే నేరనైతి ॥నేమి॥

కలికి! సొగసైన నీ – కనులు వ్రాసితిగాని
బెళుకు జూపులు వ్రాయు – విత మెరుగనైతి
గళము రేఖలు తెలియ – గాను వ్రాసితిగాని
తెలుగు కోకిల వంటి – పలుకు వ్రాయగనైతి ॥నేమి॥

తరుణిరో! నాగ బం – ధము రీతి గలయుటలు
గరిమ వ్రాశితి గాని – పరవశము చేత
పరగ మామువ్వగో – పాల, రారాయని
తిరుగ రతులకు బిలుచు – తెలివి వ్రాయగనైతి ॥నేమి॥

ఇది పురుష విరహవర్ణన. నాయిక నెడబాసి యుండుటచేత మన శ్శాంతికై నాయికయొక్క చిత్రమును పటమున లిఖియించుకున్నాడు గాని ఆచిత్రమందు ప్రత్యక్ష దర్శనములోని అనుభవములు కొన్ని లేకుండుటచేత తృప్తిచెందక నిజమూర్తి నభిలషించుచున్నాడు.

3. ఈ పదములో మదనునితో సవాలు చేయుట వర్ణింపబడినది. (స్త్రీ) వర్ణన.

ఏతీరున రమణిని గెలిచి, నీ - వెట్లు గూపోదువో !
చూతము రారా! మదన! నీ చేతి బలిమి, మా చెలియ బలిమి ॥ఏతీరున॥

రాతిరనే యేనుగనెక్కి - రాకాచంద్రుడు గొడుగుగాను
లేత తెమ్మెర మొదలైన బలముల - చేత గెలిచెద నంటివా!
పోతుటేనుగుల కుంభములే - పొలతి గుబ్బలు మోము చంద్రుండు
నాతి ప్రాణములై చలువ తెమ్మెర, జాతి వారిలో పగలు గలదా! ॥ఏతీరున॥

జంట విరిదమ్మి యెద - నంటు గుమ్మెద నంటివా!
దంటవే చెలి కేలుదమ్మి - తమ్మి యొక్కటె సుమ్మి!
తుంట విల్లొక్కటి నీది - తునియని విండ్లు చెలియ కన్బొమలు
యింటగెలిచి రచ్చగెలువ వలెను - నెన్నికలేక బూనితివి ॥ఏతీరున॥

అంచలు మాచెలిని జూచి - యడుగబెట్ట వెంచిమాని
పంచవన్నెల చిలుక - పలుకులే చాన పలుకులు
పంచబాణములు నీదు - పడతి చూపులే తూపులనగ
నెంచ శక్యము గాదా మీద - నేలుకొన్నాడు మువ్వగోపాలుడు ॥ఏతీరున॥

ప్రక్షిప్తములు.

ఈ పదములలో కొన్ని క్షేత్రయ్య కవిత్వమువలె కనుపించుట లేదు. యతిప్రాసలు పూర్తిగా పదమంతయు లేనివికొన్ని. అర్థమేమియు కాకున్నవి కొన్నికలవు. అచ్చటచ్చట ఫుట్ నోటులలో ఈ విషయము వ్రాయబడినది. పదము 271 లోని రచన క్షేత్రయ్యదికాక నవీనముగా ఉన్నట్లు తోచుచున్నది.

## క్షేత్రయ్య పదములు - అలంకార శాస్త్ర లక్ష్యములు

ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున లభ్యమైన వ్రాతప్రతి క్షేత్రయ్య పదములు అనుదానిలో సుమారు ఎనుబదికి పైగా పదములు క్రొత్తగా లభ్యమైనవని చెప్పియున్నాను. అట్టి పుస్తక మొకటి ఉన్నదని ప్రప్రథమమున నాకు చెప్పి, దానిని పరిశీలించమని ప్రోత్సహించినవారు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. అది వెంకటగిరి సంస్థానమున దొరికిన వ్రాత గ్రంథములలోనిదట. అందు క్షేత్రయ్య పదములకు అలంకార శాస్త్రమునకు గల సంబంధము వివరింపబడినది. అందు సుమారు 150 నాయికా నాయకాది భేదములు చెప్పబడినవి. ఒక్కొక్కదాని క్రింద లక్షణమునకు సరిపోవు క్షేత్రయ్య పదములు లక్ష్యములుగా ఉదాహరింపబడినవి. ఉదాహరణగా నివ్వబడిన పదములు 200కు పైగా ఉండును. అవి చాలవరకు క్షేత్రయ్య పదములే, కాని కొద్దిగా ఇతర ముద్రలుగల పదములుకూడ నున్నవి. అచ్చైయున్న పదములైతే వాటి పల్లవి మాత్ర మివ్వ బడినది. అచ్చుకానిచో పద మంతయును వ్రాయబడినది. ఈ వివరణము తరువాత అచ్చుకురాని క్షేత్రయ్యపదములు వరుసగా వ్రాయబడినవి. వివరణము చివరభాగ మందలి నూతన పదములను, అచ్చైన వానితో చేర్చి, అకారాదిగా ఇందు ప్రచురించితిమి.

ఈ వివరణమునకు 'శృంగార రసమంజరి' అని పేరు. దీని కర్త ఎవరో తెలియదు. ఆ మహానుభావుడు తన పేరు మరగు పరచి కొనియున్నాడు. ఐనను అతని పేరు వివరణ నామకముగా శాశ్వతముగా ఆంధ్రసారస్వతమున స్వర్ణాక్షరములతో లిఖియింపబడియే యుండ గలదు. ఆంధ్ర సారస్వతములో క్షేత్రయ్య పదముల స్థానమును విలువను నిర్ణయించుచు ఈ గ్రంథకర్త చేసిన సేవ చిరస్మరణీయము.

శృంగార రసమంజరి ప్రారంభ మిట్లున్నది. "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన శృంగార రసమంజరి లక్షణ గ్రంథమందు శృంగార రస సాధనములగుట తొలుత నాయికా లక్ష

ణంబు లుదాహరించితి నాదు నాయికలు" ఈ గ్రంథమునకు మూలము తెలిసి కొనుటకు కొంత శ్రమజెంద వలసి వచ్చినది. క్రీ. శ. 1550 ప్రాంతమందు కవిరత్న భాను దత్తమిశ్ర యను నాతడు "రసమంజరి" యను అలంకార గ్రంథమును సంస్కృతమున వ్రాసి యున్నాడు. అందు నాయికా నాయకాది ప్రకరణములు లక్షణ లక్ష్య యుక్తముగా ఉన్నవి. ఈ రసమంజరి లోని మూలమునకు శృంగార రసమంజరి అనువాదము. రసమంజరిలో లక్షణముల క్రింద నిచ్చిన లక్ష్యములు శ్లోక రూపములు. మొదటి మూడు శ్లోక లక్ష్యములకు మాత్రము తెలుగు అనువాదములు పద్యరూపమున శృంగారరసమంజరి కర్త యిచ్చియున్నాడు.

శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు సుమారు నలుబది యేండ్ల క్రిందట రసమంజరికి తెనుగు టీక వ్రాసియున్నారు. ఐదేండ్ల క్రిందట శ్రీ అమరవాది నీలకంఠ సోమయాజిగారు రసమంజరిలోని ప్రతి లక్ష్య శ్లోకమునకును తెనుగున పద్యము వ్రాసి లక్షణమునకు అర్థమును వ్రాసినారు. శృంగార రసమంజరిలో విషయము యథా మాతృకముగా వ్రాయబడినది. ఉన్నట్టి ఈషద్భేదములు ఫుట్‌నోట్లలో చూపబడినవి. ఈ పనిని అలంకార శాస్త్రవేత్తలగు బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామ శర్మగారు దయతో చేసిపెట్టినారు. వారే యీ శృంగార రసమంజరి విషయమై ఉపోద్ఘాతమును వ్రాసి యున్నారు. అది వేరుచోట ముద్రిత మైనది.

ఈ శృంగార రసమంజరి ఇప్పుడుగదా వెలువడుచున్నది! ఇంత దనుక క్షేత్రయ్య పదములలో అలంకారశాస్త్ర విషయ మున్నదని పెద్దలకు తెలుసును. అమరుకుడనురాజుచే వ్రాయబడిన అమరుశతకము సంస్కృతమున కలదు. దానిలో అలంకార శాస్త్ర విషయ మున్నది. నాయికా భేదములు కొన్ని వివరింప బడినవి. రసమంజరిలో వివరింప బడినంత విపులముగా లేదు. అమరు శతకము రసమంజరికంటె ప్రాచీనము. దానిని శృంగారామరు కావ్యమను పేర తాళ్ళపాక తిరువెంగళప్ప తెలుగులో పద్యములలో వ్రాసినాడు. ఇది ఈమధ్యనే తిరుమల

తిరుపతి దేవస్థానము వారిచే ప్రచురింపబడినది. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించిరి. దానిని చూచినచో క్షేత్రయ్య పదముల విశేషమందు లేదని తెలియ గలదు. రసమంజరి ననుసరించియే ప్రతి లక్షణమునకు సరిపోవు రసయుక్తములగు లక్ష్యములు పద రూపములో క్షేత్రయ్య వ్రాసి యుండెనని ఈ శృంగార రసమంజరి స్పష్టపరచుచున్నది.

రసమంజరి వెలసినతోడనే కాశీ ప్రాంతముల నిది పఠన పాఠము లలోనికి వచ్చియుండును. అందుచేత కృష్ణా, గోదావరీ తీరస్థులగు విద్వాంసులకు, కాశీపోయి చదువుకొనివచ్చినవారికి నూతనముగా ఇది పాఠ్యమైయుండును. ఇది కూచిపూడిలోని భాగవతులకుకూడ పాఠ్య గ్రంథమైయుండును. ఈ కూచిపూడి సంప్రదాయమే తంజావూరులోని మెరటూరు, సూలమంగళం, ఊత్తుకాడు ప్రాంతములనున్న భాగవతుల యొక్క సంప్రదాయము కూడ. వారున్ను కూచిపూడివారి వలెనే నేటికిని రసమంజరినే అలంకార శాస్త్రమునకు ముఖ్యమైన పఠనగ్రంథ ముగా నేర్చుచున్నారు. రసమంజరిలోని కొన్ని శ్లోకములను, కృష్ణ కర్ణామృత శ్లోకముల కొన్నిటిని ఎత్తి వాటి నభినయమున కుపయో గించుట రెండుచోట్లను సంప్రదాయముగా వచ్చుచున్నది. ఈ కార ణము చేతనే కూచిపూడిలో సంగీత-అలంకార శాస్త్రముల నభ్యసించి యుండిన మువ్వ వరదయ్య రసమంజరి యను నూతన గ్రంథమును చదివి యుండును. అందు లక్ష్యములుగా నివ్వబడిన శ్లోకముల కంటె హృద్యములగు లక్ష్యములను తాను రచించ వలెనను కుతూహలము కలిగి రసమంజరి యందలి నాయికా నాయక, సఖీ, దూతికా లక్షణములకు లక్ష్యములు పదములుగా వ్రాసియుండునని యూహించ వలసి యున్నది. లేనిచో అన్ని లక్షణములకును లక్ష్యములు ఇతని పదములలో దొరకుట తటస్థించదు.

క్షేత్రయ్య పదములలోని లక్ష్యములు రసమంజరి కర్త ఇచ్చిన శ్లోక లక్ష్యములకంటె ఎంత వన్నెయు వాసియు కలవో ఒక ఉదా హరణ చూతుడు.

## స్వీయ, ముగ్ధ, నవోఢ.

### రసమంజరి.

హస్తే ధృతాపి శయనే వినివేశితాపి
క్రోడీకృతాపి యతతే బహిరేవ గన్తుమ్
జానీమహే నవవధూ రథతస్య వశ్యా
యః పారదం స్థిరయితుం క్షమతే కరేణ॥

### శృంగార రసమంజరి.

చ॥ కరమున గట్టినం గుసుమ కల్పిత తల్పమునందు జేర్చినం
దరముగ గౌగిలించినను దత్తర మందును బైలుదేరగా
నిరవు కొనంగ బాసరస మొస్వడు చేతను నిల్పు వానికిం
దరముగుగా నవోఢ నెద దార్పగ జిందులు ద్రొక్కుచుండగన్॥

### క్షేత్రయ్య పదము.

నన్నేటికి బొమ్మనేరే – వాని వద్దికి!
మిన్నక వాని వద్దికిని – మీరే పోరే చెలులార! ॥నన్నేటికి॥

పడతి! నేనందుబోను – పలుమారు దననోటి
మడుపందు నయముచేసి – చేపట్టి నన్ను
పడకింటికి రమ్మనెనే – నే రానంటె
కడు వెరపించి హుమ్మనెనే – అమ్మ! నేవెరతు ॥నన్నేటికి॥

మచ్చకంటి యిపు డిపుడు – వచ్చిన లేతనన్నులను
నొచ్చెననగా బట్టెనే! – వద్దంటే వినక
మచ్చరాన గోరుబెట్టెనె – వచ్చెదనంటె
ముచ్చువగల దోవగట్టెనె – అమ్మ! నేవెరతు ॥నన్నేటికి॥

నెలత నమ్మికలిచ్చి – యల మువ్వగోపాలుడు
చెలిమితో నను దీసెనే – కుయ్యకుమని
బలిమి నోరు మూసెనె – పరవశనై
తెలియనైతి నేమేమో చేసెనే - అమ్మ! నేవెరతు ॥నన్నేటికి॥

ఇట్లే అన్ని లక్ష్యములును రసమంజరిలోని ఉదాహరణల కంటె ఎంతో రసవంతముగ నున్నవి.

మరియు క్షేత్రయ్య పద లక్ష్యములోని భావగాంభీర్య మెంత రసవంతమైనదో తెలుపుట కొక్క ఉదాహరణము.

స్వీయ - మధ్య - ధీర - లక్షణము

"స్వీయ - పతివ్రత; మధ్య - లజ్జయు, మన్మథోత్సాహంబును సమానముగా గలది; ధీర - ప్రియుడు నేరము చేసిన యెడల ధైర్యము కలిగి వక్రోక్తిగా మాట్లాడు నది."

లక్ష్యము

చక్కనయ్య యేమి యుపచారములే చేయింతును
నిక్కముగ శ్రీకర దోషాహారతుల నిప్పింతునో ||చక్కనయ్య||

మల్లెపూల పాన్పుపైని చల్లని మొల్లలే పరతునో
చల్లని వాసనగాలికి చామరలే వేయింతునో ||చక్కనయ్య||

మంచి గంధంబలదనే అకు మడుపు లందిత్తునో
అంచితమైన మోవి నొక్కితే నందుకే రవలు చెక్కింతునో ||చక్కనయ్య||

చక్కని మా యినపురి సామి మువ్వగోపాల యిం
కొక్కసారి నేనే యోల లాడింతునో ||చక్కనయ్య||

"నాయకుడు అన్యకాంతను సంసర్గ చేసి వచ్చినందువల్లనున్న, శరీరం చమర్చి నందు వల్లను, పూలసురటి చేత గాలివేసేనని నాయకునితో నాయిక తెలియజేసి నందువల్లనున్న మధ్య. ధీర" అని శృంగార రసమంజరి వివరణయు, పైన చెప్పిన లక్షణములోని ప్రతివిష యము ఇందు ఎంత అందముగా చెప్పియున్నదో చూడుడు. 'ఏమి యుపచారము చేయింతును' అనుటచేత ఇదివరకే అన్యనాయిక వలన సమస్తోపచారములు పొందినాడవు, నేనేమి యుపచారములు చేయ దగిన వున్నవని కాకూక్తి. "శ్రీకర దోషాహారతు లిప్పింతునో" దోషాహారతులను చోట ద్వర్థియున్నది. ప్రదోషహారతులని, చేసిన దోషమునకు హారతులు అని. ఇందున్ను వక్రోక్తి కలదు. 'ఇంకొక్క సారి నేనే యోలలాడింతునో' అనుటలో ఇదివర కోల లాడివచ్చిన విషయము సూచితమేగాక — నిన్నింకొక సారి నేనే యోలలాడింతు ననుటలో ఎత్తిపొడుపుతో బాటు మన్మథోత్సాహముకూడ వ్యక్తమగు

చున్నది. తక్కిన ఉపచారములను గురించి చెప్పుటలోకూడ దెప్పుడు మాటలటుండగా నాయిక యొక్క ఉత్సాహము కూడ వ్యంగ్యముగా దోచుచున్నది.

ఇట్లే క్షేత్రయ్య యొక్క ప్రతి పదలక్ష్యమును జాగ్రత్తగా చదివి చూచినచో లక్షణమునకు తగిన అర్థపుష్టిని గుర్తింప వచ్చును.

వీటినిబట్టి పదములను వ్రాయటలో అలంకార శాస్త్రము లోని రసమంజరిలోని శృంగార ప్రధానములగు సర్వలక్షణములకును లక్ష్యములను వ్రాయుట క్షేత్రయ్య యొక్క యభిప్రాయ మని తోచక తప్పదు.

క్షేత్రయ్య కాలములోనే, గోదావరీ తీరస్థుడును, గొప్ప ప్రతిభావంతుడు నగు జగన్నాథ పండిత రాయలు ఢిల్లీ దర్బారులో క్రీ శ. 1620-1660 మధ్యకాలమందు ఆస్థానకవిగానుండి 'రసగంగాధర' మను గొప్ప అలంకార గ్రంథమును వ్రాసి యున్నాడు. జగన్నాథ పండితుడు గొప్ప లక్షణకర్త. క్షేత్రయ్య గొప్ప లక్ష్యకర్త. క్షేత్రయ్య, పండిత రాయలు వీరిద్దరు కూడ అచ్చ తెలుగువారై పండితులై, ప్రతిభావంతులై, రసజ్ఞులై, అలంకార శాస్త్రమున కమూల్యమగు సేవ చేసి దేశమునకు కీర్తి తెచ్చిన మహనీయులు.

ఇట్లు రసవంతమగు పదలక్ష్యములు వ్రాయగలుగుట సామాన్యము గాదు. ఈ లక్ష్యముల యందలి విషయములు నానావిధములు. స్వీయ పరకీయ, సామాన్యల యొక్క అవాంతర భేదములను వారి వారి మనోవృత్తులను బట్టి, వారివారి యవస్థలను బట్టి, సందర్భము లను బట్టి, స్వభావములను బట్టి, లోకములో నున్న వివిధానుభవ ములకు తగినట్లు ఎన్నో సంగతు లిందు వ్యక్తము చేయబడినవి. ఎంతో ప్రతిభావంతుడగుటచేత, మువ్వలో నున్నపుడు అక్కడనున్న సానెంపాడులో నడిచే వివిధ విషయములను, తంజావూరిలోను, రాజాంతఃపురములోను జరుగుచున్న శృంగార విశేషములను కని, విని ఇంక నెన్నో మనోవీధిని, భావించి క్షేత్రయ్య ఈ పదములను

వ్రాసి యుండవలెను. సానిపేటలోని వింతలు, విశేషాలు, సాగసులు, చోద్యాలు, మోసాలు, వంచనలు, ఆటలు, పాటలు, వినోదాలు, ముఖ్యముగా రాజులచేత, అధికారుల చేత వారి వారి అంతఃపురముల నుంపబడి స్వేచ్ఛారహితులైన నానావిధ యౌవన స్త్రీజనముయొక్క మనోవ్యధలు, దురవస్థలు, భావములు, ఎంతో సహృదయత్వముతో క్షేత్రయ్య గ్రహించి ఈ లక్ష్యములయందు ప్రతిఫలింపచేసి యున్నాడు. అందుచేతనే ఇతని లక్ష్యములు కళ్ళకు గట్టినట్టుండును. అందలి పాత్రలు సజీవములై తళుక్కు మనుచుండును. మనము వాటితో పాటు హర్షము, అనుతాపము మొదలగు భావములు గలిగి ఆ పాత్రలతో సానుభూతి పొందు చుందుము. ఇందలి విషయములను చూడగా క్షేత్రయ్య మహాకవి యని 'రవిగాననిచో కవిగాంచునే కదా?' యన్నట్లు అతనికి తెలియని విషయ మింకేదైన కలదా? యని తోచును.

అలంకార శాస్త్రములో నాయికలకు కల్పింపబడిన భేదములు ఎన్నో కలవు. నాయకుల కన్ని లేవు. వీరికన్ని యవస్థాభేదములు లేవు, వీరికి వలపుకంటె తలపు హెచ్చు. వీరు అవసల కతీతులు, స్వతంత్రులు, భర్తలు. ఇట్టి మగవారే గదా శాస్త్రములను వ్రాసి నిర్ణయించినవారు! 'మగవారిని కట్టిబెట్ట ఎవరి తరము' అనునట్టి భావము లెన్నో రూఢియై పోయినవి. ఆడవారిని కట్టిబెట్టవచ్చు. కట్టిబెట్టవలెను! ఈ అలంకార శాస్త్ర విషయములను, తల్లక్ష్యములను జదువగా ఇట్టివెన్నో గోచరించును. ఆచారమనండి, మగవారి స్వార్థమనండి సంఘముయొక్క దురవస్థ యనండి ముఖ్యముగా ఆరోజులలో స్త్రీలను ఆటవస్తువుల క్రింద భోగములను అనుభవించుటకై ఏర్పాటైన వ్యక్తులక్రింద పురుషు లూహించుకొని విజృంభించినట్లు తోచక మానదు. అందుచేత ఈ పదములను చదివి మన సంఘములో వాటి నివారణకై సహృదయులు ప్రయత్నించవలసియున్నది. కొంత పరిణతి గన్నవారు, మనః పరిపాకము కన్నవారు ఈపదములను చదివి తెలిసికొనవలసి యున్నది. ఇతరులు చదివినచో నష్టము కలుగవచ్చును. లాభముండనేరదు,

## మ ధు ర ప ద్ధ తి

ప్రతి జీవాత్మయు స్త్రీయని (రాధయని, గోపియని, నాయిక యని) జీవాత్మ లన్నియు పరమాత్మను పొందుటకై యోగమార్గము నవలంబించు వారని, ఈ నాయికల కందరకు పరమ పురుషుడు, ఏకైక నాయకుడు అగు భగవానుడు(శ్రీకృష్ణుడు)భర్తయని ఈ మధుర పద్ధతి రహస్యము. ఈ రాధాకృష్ణ తత్వము మధురభావ మిళితము. అలౌకిక శృంగార సంవేద్యము, చైతన్య మత జీవము. ఈ పద్ధతిని వ్రాసిన పదములలో ప్రేమ యొక్క అధ్యాత్మిక తత్వము పూర్తిగా నిండి యుండును. పదమును చదివిన, పాడిన మిగులు భావము భక్తియై యుండిన అందు శృంగార మున్నను అది శృంగారభక్తి, మధురభక్తి కలదని చెప్పవచ్చును. లేదా శృంగారమందలి అధ్యాత్మ తత్వము గురించి, ఆత్మతత్వము గురించి యున్నను అదియు మధుర మనవలెను. ఇట్టి మధుర భక్తిగల పదములను అన్నమయ్య, శృంగార పదములను పేర వ్రాసియున్నాడు. పురందరదాసున్ను వ్రాసియున్నాడు. "పలుకు దేనెలతల్లి పవళించెను కలికి తనముల విభుని గలసినది గాన" యని పైనొకచోట నుదహరించిన అన్నమయ్య పదము అట్టిదే. దానికి పోలికగా క్షేత్రయ్య వ్రాసిన "మరువ తన కేళికామందిరము వెడలెన్, వగకాడ మా కంచివరద తెల్లవారె ననుచు" యను పదమును అలౌకిక శృంగార వర్ణనమే. ప్రేమయొక్క ఆర్ద్రతను చూపించు ఈ క్రింది పదమును మధురపద్ధతిలోనిదే.

ఏమని తెలుపుదు – నేలాగు తాళుదు !
నేమి సేతునే ! చెలియ ! ||ఏమని||

భామరో ! యూరికి – బయలు దేరెడు వేళ
ప్రేమమీర నాసామి – పలిచి చెప్పినమాట ||ఏమని||

అన్నమిందక – అతివేత నొందకు
కన్నీరు నింపకు – కలువరింపకు మని
యెన్నెన్నో విధముల – ఓదార్పులు పలుకుచు
కన్నీరు నించుచు – గాంతుడు చెప్పినమాట ||ఏమని||

నిడివి కన్నులనీరు — నింపుచు దలయూచి
తడలేక వేగమె — తానె వచ్చెదనని
అడుగడుగున కుసు — రుసురని మదిలోన
గడు మోహమున — ప్రాణేశుడు పలికిన మాట ||ఏమని||

ఏనోము నోచితినో — యెంతని వేడితినో!
తానేమి వ్రాసెనో! — తలమీద విధియని
పూనికతో నే మా — మువ్వగోపాలుడు
సూనశరుని కేళి — సుఖయింత మనుమాట ||ఏమని||

ప్రేమ యొక్క నిర్మలత్వము ఇందు వ్యక్తమగుచున్నది. ఇట్లే ప్రేమభావము యొక్క లోతు నాయకుని తప్పులు తప్పులుగా ఎన్న లేనంతటి హృదయ వైశాల్యము మొదలగు విషయముల గురించి కొన్ని పదములు క్షేత్రయ్య చెప్పియున్నాడు. ఈ విప్రలంభ శృంగారమును చూడుడు.

అట్లే వుండేవు సుమీ! నా ప్రాణనాథ!
అట్లే అంగుంచి కిటు వచ్చెదనని ! యానబెట్టితివి సుమీ నా ప్రాణనాథ ||అట్లే||

ఇంతలో నీవిటరాకుంటే కన్నీరు కావేటి కాలువ సుమీ!
ఇంతింత నీకెమ్మోవి తేనె లానకుంటే
యిటుగో నోరెండేని సుమీ! నా ప్రాణనాథ ||అట్లే||

వినరా నీవు కౌగిట లేకుంటే పున్నమ వెన్నెల వేడిసుమీ!
వనజాక్ష! నీవిడకు వచ్చేదాక తల
వాకిలె యిల్లు సుమీ! నా ప్రాణనాథ! ||అట్లే||

మరచి యువతితో నైన మాటలాడేవు గనుక మనసు విరిచెదరు సుమీ!
శరణు మువ్వగోపాల! యీ రేయిగూడ
జాగుసేయక రమ్మీ నా ప్రాణనాథ! ||అట్లే||

ప్రహ్లాద భక్తి విజయములో ప్రహ్లాదునకు భగవత్సాక్షాత్కారమైన తరువాత వెళ్ళి వచ్చెదనని ప్రహ్లాదునితో మహావిష్ణువు చెప్పిన సందర్భములో భగవంతుని యెడల ప్రహ్లాదుడు చూపు విప్రలంభ శృంగారమును త్యాగరాజు వర్ణించు కీర్తన పై పదమున కనుకరణ మన్నట్లున్నది. చూడుడు.

ఎంత పాపినైతి, నేమిసేయుదు ; హా, ఏలాగు తాళుదునే ఓ రామ
అంత దుఃఖములను దీర్చి హరిని జూచి యెంతవారైన బాయ సహింతురే

కనవలెనన్న వేళ లేకున్న కన్నీరు కాలువగా బారునే
ఇనకులాధిప నీవు రాకుండ తాపసమైతే యిల్లువాకిలి యానే ఓ రాఘవ!

నిరుపమానానంద శయ్యపై లేకుండే నిముషము యుగమానే
పరమాత్మ నీవు గానక భ్రమసిన వేళ పలువురు నవ్వుట కానే ఓ రాఘవ!

పరమభక్తియు నా ప్రాయములెల్ల దనుజుల పాలుగా బోనానే
వరద శ్రీ త్యాగరాజార్చిత పదయుట, వారధ ముందరనే
నాపై ఆన బెట్టిపోరా! || ఓ రాఘవా!

ఒకటి రెండు భావములలో భేదము తప్ప రెంటను ఒక భావమునే వెలిబుచ్చుచున్నవి. ఇట్టివే మధురకవితలు.

ఇట్టివి క్షేత్రయ్య పదములలో కొన్ని కలవు. కాని మధురపద్ధతికి కేవలము వ్యతిరేకములగు కేవల లౌకికశృంగారమునే వర్ణించునవి మరియును పచ్చిపచ్చిగా నున్నవి చాలా కలవు. కొన్ని చదువుటకు కూడ బాధకలిగించు నను నుద్దేశముతో కొన్నిచోట్ల మాటలను అచ్చువేయక చుక్కలు మాత్రమే ఉంచడమైనది. ఇట్టివి క్షేత్రయ్య ఏల వ్రాసెననుట కొకటే బలీయమగు కారణము. అలంకారశాస్త్రములో వివిధ లక్షణములకు లక్ష్యములు యథాతథముగా లోకానుగుణముగా వ్రాయవలసి యుండుటచేత ఆ సందర్భముల కుచితములగు విషయములను వ్రాసినాడని చెప్పవలె. ఇది కేవల శాస్త్ర దృష్టితో చేసిన పని యని భావించవలెను. క్షేత్రయ్య భాగవతతత్వమెరిగిన జ్ఞాని యనుటలో సందేహము లేదు. రెండు పదముల నుదాహరణగా నిచ్చుచున్నాను.

ఇద్దరికి సరి వలపులాయ — యెవరికైన తెలుపవశమా!
ముద్దుతిల్ల గోవిందునికి మా — మోహనాంగికి ||ఇ||

విభుడు పాంచాల దేశాధిపతి — చెలది పద్మిని వంశజాతి
ఉభయవాదుల మనసులు మమతలు యువిదలార! తెలిసి తెలియలేరు ||ఇ||

• కంటిరా! వింటిరా! సిరి యూసముకంటె — కంటకంటకుని కన్నవారలు
యొంటియొంట ములచే నెడసేయ — ఓభామ నీచేత నాచేతనౌన ||ఇ||

నాలుగు జాతులు వేళలు దెలిసి – నాతివిభుడు కలిసి మెలసి
తేలించ మా మువ్వగోపాలుడే – తిల్ల గోవిందరాయడైనాడే ॥౩॥

శ్రీమద్భాగవతములో చతుర్థస్కంధములో నారద మహర్షి ప్రాచీన బర్హికి జ్ఞానమార్గం బుపదేశించుచు ఆత్మతత్వ రూపకమగు పురంజనోపాఖ్యానమను నితిహాసమును బోధించును. అందు పురంజనుడను పేర పురుషుడు * దేహధారియగును. శబ్ద, స్పర్శ, రూప రస గంధములను పంచ విషయముల కధిపతి యగు నాతడే పాంచాల దేశాధిపతి యని, ప్రకృతియను కామినియే బుద్ధియని, ఆమె పేరు ప్రమదోత్తమ యని (పద్మిని) చెప్పబడియున్నది. అట్టి ప్రకృతి పురుషుల దాంపత్య విశేషము ఈ పదమున వర్ణింతము. 'ఉభయుల మనసులు మమతలు తెలసి తెలియలేరు' జ్ఞాతము, అజ్ఞాతముకూడా. ఇటువంటి దాంపత్యము 'కంటిరా వింటిరా' యని, వీరి యన్యోన్యము అనన్య సామాన్యమని, అభేద్యమని 'నెడసేయ నీచేత నాచేతనౌనా' వీరిద్దరు నిరంతరము కలసి మెలసి యుందురని నాలుగు జాతుల వేళలు తెలిసి నాతి విభుడు కలసి మెలసి అని నిగూఢముగా క్షేత్రయ్య చెప్పియున్నాడు.

ఇద్దరన్నప్పుడు పరమాత్మ జీవాత్మలని కూడ చెప్పవచ్చును. అట్టి ఈ ఇద్దరూ 'మానసనివాసులగు హంసలు. సహస్ర వత్సరంబులు సఖులై వర్తించిరి' అందు జీవాత్మ భామభోగరతుడై మహిని దిరిగి నష్టస్మృతియై పురంజనుడై, విషయోపభోగలాలసుడై, ఆ భోగములు సత్యమని భ్రమసి కొంత కాలము గడపిన పిదప పరమాత్మ అతనిని కరుణించి తన్నెరుగ దెలిపి, తన సఖునిగా తిరిగి జేసికొనెనని యితిహాసము.

ఇద్దరిసందున బవ్వళించియున్న – యింతిపేరేమిరా
గద్దరి వగల మా మువ్వగోపాల! గాజుల చప్పుడునే వింటిగదరా! ॥౩॥

అనుపదములో, జీవాత్మ పరమాత్మలమధ్య మాయాదేవి ప్రవేశించినదని, అది చప్పుడు (గడబిడలు చేయుచున్నదని) పరమా

* ఈ సూచన శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు నాకు చేసిరి.

త్మను పొందకుండ అడ్డముగా ఉన్నదని, ఆమాయాదేవినే పరమాత్మ యని జీవాత్మ భావించినదని, తరచిచూడగా అందు సారమేమియు కనపడలేదని 'చప్పరించి నములిన చెఱకు పిప్పివలె చప్పనై యుండె' నని; మాయను పరమాత్మ యనుకొని భ్రమచెంది కౌగిలించు కొనగా అనగా అనుభవముమీద పరమాత్మచే నిర్మింపబడిన అసత్య సృష్టి యని గ్రహించి, 'మావలి మోసమైతి' నని, రెండు చరణములలో చెప్పబడినది. మూడవ చరణములో జీవాత్మకు ఒకసారి పరమాత్మ సాక్షాత్కారమైనదని, కాని తిరుగ మాయ క్రమ్ముట చేత సాక్షాత్కారము కాలేదని ఈ ప్రమాదము 'అనుదినమును' జాగరూకతతో కలుగకుండ చేసికోవలెనని, సత్యమును పొందుటకు నిరంతరకృషి చేయవలెనని చెప్పబడియున్నది.

ఇట్టి విషయములను పదములయందు జొప్పించిన క్షేత్రయ్య అధ్యాత్మ తత్వవేత్తయని ధృవపడుచున్నది.

## క్షేత్రయ్య పదములు - సంగీతశాస్త్రము

క్షేత్రయ్య పదములను సంగీతశాస్త్రదృష్టిలో విమర్శించవచ్చును. ఇది అగాధమగు విషయము. నాకు అందినంతవరకు కొన్ని విషయములను గురించి వ్రాసెదను. భారతీయ సంగీతమునకు కర్ణాటక సంగీతమునకు ముఖ్యముగా రాగము జీవము. రాగము యొక్క ఉత్కృష్టత, వృద్ధి ఒకనాటిది కాదు. క్రమాభివృద్ధి పొందినది. రాగస్వరూపమును, లక్షణమును క్షేత్రయ్య ఏర్పరచి తీర్చిదిద్దినాడనుటలో అతిశయోక్తి యెంతమాత్రమును లేదు.

అన్నమాచార్యులు వాడిన రాగములకు క్షేత్రయ్య వాడిన రాగములకు చాల భేదము కలదు. పాడి, సామంతము, శ్రీరాగము, ఆబాలి, అమరసింధు, కొండమలహరి, హిజ్జిజి, గుజ్జరి, తెలుగు కాంభోజి, సాళంగం, మెంచభౌళి మేసభౌళి, ముఖారిపంతు, మొదలగు అనేకరాగములు అన్నమాచార్యులు వాడినారు. అవన్నియును క్షేత్రయ్య కాలమునాటికి కంతరించినవి. అన్నమాచార్యులవారు వాడిన

ఆహిరి, కాంభోజి, కేదారగౌళ, ధన్యాసి, భైరవి, మధ్యమావతి, ముఖారి, రామక్రియ, (పంతువరాళి), శంకరాభరణము, సావేరి, సౌరాష్ట్రము రాగములు క్షేత్రయ్యకూడ వాడినాడు. ఈ రాగముల యొక్క స్వరూప మా దినములలో ఎట్లుండెనో తెలియదు. అన్నమాచార్యులవారి నాటి పాట సంప్రదాయము కనపడుటలేదు. ఆ కీర్తనలను పరంపరగా పాడువారు లేరు. క్రొత్తగా మెట్లేర్పవలసిన దురవస్థ యేర్పడినది. కాని తిరుమలపైని ఒక పెద్దరాతిపలకపైని అన్నమాచార్యులవారి కీర్తనలు స్వరపరచి వ్రాయబడి యున్నవి. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు చెప్పియున్నారు. ఆ రాతిపైనున్నవానికి ఇంకను ప్రతి తీయలేదు. తీసి వానిని పరిక్షించినచో నాటి రాగస్వరూపము కొంత స్పష్టము కాగలదు. ఇది చాలాముఖ్యమగు కార్యము. త్వరలో అది పరిష్కృతమైనచో మహోపకారముగా నుండును. అన్నమాచార్యులవారి రాగ సంప్రదాయము విశిష్టమైనది. ఆకాలమున ఆప్రాంతమున విరివిగా ఉండేదైయుండవచ్చును.

క్షేత్రయ్య వాడిన రాగముల వివరము ముద్రించిన పదముల నుండి సేకరించినది ఈ క్రింద నిచ్చుచున్నాను.

| రాగము | పదముల సంఖ్య | రాగము | పదముల సంఖ్య |
|---|---|---|---|
| 1 కాంభోజి | 37 | 12 బిళహరి | 11 |
| 2 ముఖారి | 22 | 13 ఆనందభైరవి | 10 |
| 3 భైరవి | 22 | 14 మధ్యమావతి | 10 |
| 4 కళ్యాణి | 22 | 15 శంకరాభరణము | 9 |
| 5 సావేరి | 16 | 16 ఆహిరి | 9 |
| 6 తోడి | 15 | 17 ఉసేని | 8 |
| 7 కేదారగౌళ | 13 | 18 పున్నాగవరాళి | 8 |
| 8 పంతువరాళి | 13 | 19 సౌరాష్ట్ర | 8 |
| 9 ఘంటారవము | 13 | 20 బేగడ | 5 |
| 10 మోహన | 12 | 21 నవరోజు | 5 |
| 11 యదుకుల కాంభోజి | 12 | 22 సైంధవి | 5 |

| | | | |
|---|---|---|---|
| 23 నీలాంబరి | 4 | 31 శ్రీరాగము | 2 |
| 24 కన్నడ | 4 | 32 మారువ | 2 |
| 25 ధన్యాసి | 4 | 33 నాదనామక్రియ | 2 |
| 26 సురటి | 4 | 34 వసంత భైరవి | 1 |
| 27 అఠాణా | 4 | 35 వరాళి | 1 |
| 28 కాపీ | 3 | 36 ఖండె | 1 |
| 29 అసావేరి | 3 | 37 గౌళీపంతు | 1 |
| 30 సారంగ | 3 | 38 కేదార | 1 |
| | | 39 గౌరి | 1 |

పై వివరమునుబట్టి కాంభోజిరాగము ఎక్కువగా వాడబడినట్లు స్పష్టము. ఇది శృంగారరసమునకు పెట్టినదిపేరు. ఇందా రసము బాగా ఒప్పును. ముఖారి, కళ్యాణి భైరవి రాగములు కూడ బాగా వాడబడినవి.

పై రాగములు 39. అందు 6 రాగములలో ఒక్కొక్క పదము మాత్రమే యున్నది గనుక నాడు వాడుకలో ఉన్నరాగములు సుమారు 32 అని చెప్పవచ్చును. శాస్త్ర గ్రంథములలో చెప్పబడిన 32 రాగములు ఇవేయన వీలులేదు. అన్నమయ్యగారు భౌళి రాగములో "పాడేము నేము పరమాత్మ నిన్నును వేడుక ముప్పదిరెండు వేళల రాగాలను" అని పాడినారు. ఆముప్పదిరెండు వేళల పాడు రాగములకు ఈరాగములకు సంబంధము లేదని తోచుచున్నది. క్షేత్రయ్య కాలములో దేశమందు మిక్కిలి విరివిగా వాడుకలో ఉన్న రక్తిరాగములివియని చెప్పవలెను. కూచిపూడి ప్రాంతమందేమి తంజావూరు ప్రాంతమందేమి ఇవి ఎక్కువగా వాడుకలో నున్నట్లు చెప్పవచ్చును.

క్షేత్రయ్య పదములు కూచిపూడి ప్రాంతమందు, ముఖ్యముగా తంజావూరి ప్రాంతములలోను ఎక్కువగా ప్రచారములో నుండినవి. మూవనల్లూరు (మన్నారుగుడి వద్ద) సభాపతి అయ్య అను తెలుగు నాట్యాచార్యుడు ఈ మువ్వగోపాల పదములను అతిరసవంతముగా పాడేవాడట. ఈతడు 1860 ప్రాంతములలోనివాడు. ఈతడు కూడ క్షేత్రయ్య పదములను పోలు పదములను ఆయూరి దేవుడగు రాజ

గోపాలస్వామిమీద చెప్పియున్నాడు అవికూడ కొన్ని నేటికి ప్రచారమున గలవు. మరియు వారితరువాత పి. ఆర్ స్వామినాథ అయ్యరు, వీణధనము-ఆమె సంతతివారు-తత్సంబంధులు ఈపదములను సంప్రదాయముగా పాడుచు వచ్చిరి. ఈ కారణములచేత క్షేత్రయ్య పద స్వరూపము పరంపరగా నిలబడ గలిగినది, అందుచేత పదములలోని సంగీత విశేషములను తెలిసికొన వీలైనది.

రాగలక్షణములు శాస్త్రమందివ్వ బడినవి. ఆరోహణ, అవరోహణ ఇవ్వబడినవి. కొన్ని రాగములకు గ్రహ, న్యాస, జీవ స్వరములుకూడ ఇవ్వబడినవి. ఇంత మాత్రముచేత రాగ మెట్లు ఎత్తుగడ చేయవలెనో ఏస్వర సంచారముల చేత క్రమముగా దేనితరువాత ఏదో తెలిసికొని, రాగవృద్ధి ఎట్లు చేయవలెనో బాలా ముఖ్యమైన విషయము.

క్షేత్రయ్య పదములలోని పల్లవి, అనుపల్లవి, చరణములలో క్రమముగా రాగవృద్ధి ఎట్లు చేయబడినదో, ఒకే రాగమందలి వివిధ పదములలోని స్వర సంచారములు, గమక భేదములు, అలంకారములు, పదముయొక్క భావానుగుణముగా, రసమునుపోషించుచు ఎట్లుండునో, ఎన్ని భావ భేదములకు, ఒక రాగమే, ఎన్ని విధముల వాడబడినదో, బాగుగా పరిశీలించినచో క్షేత్రయ్య సంగీతానుభవము ఎంత ప్రతిభా వంతమైనదో వ్యక్తము కాగలదు. ఎత్తుగడ, తరువాతి నడక, స్వరసంచారములు, కూడికలు. పోకడలు రాగముయొక్క జీవకళను పద గమనములో చిప్పిల జేయుచుండును. క్షేత్రయ్య రాగస్వరూప చిత్ర మతిసుందరము, మనోహరము. అదివర కెవ్వరును రాగమున కిట్టి యందమును తీర్చి దిద్దినవారు లేరు. ఇట్టి రాగరచన చేసి రాగమునకు రససిద్ధిని కల్పించి రాగముయొక్క సంపూర్ణ స్వరూపమును నిరూపించి సంగీతములో రాగమునకుగల ఉన్నత స్థానమును క్షేత్రయ్య నిర్ణయించి తరువాతి వాగ్గేయకారులకు, సంగీతవేత్తలకు మార్గదర్శియైనాడు. ఈ పోకడలనేబట్టి త్యాగరాజస్వామి ఎన్నోనూతన రాగ

ములకు ప్రథమమున స్వరూపము చిత్రించి యున్నారు. సైంధవి, ఘంటారవము, ఆహిరి, ముఖారి, బేగడ, సౌరాష్ట్రి మొదలగు రాగములకు నేటికిని క్షేత్రయ్య పదములే మాత్రికలు, ప్రమాణములు. అందలి రాగముల జాడలనే ఇతర వాగ్గేయకారులు నడచియున్నారు. రాగములయందు రసవంతములగు స్వరప్రయోగములను సకృతుగా ఎట్టిచోట్ల ప్రయోగించవలెనో ఈ పదములలో వ్యక్తమగును. అట్టి చోట్ల వినునప్పుడు ఆనందము పొంగి పొరలుచుండును.

మరియు ఇతని పదములు విలంబకాలములో పాడవలసినవి. ఈ విషయమును గురించి సుబ్బరామ దీక్షితులుగా రిట్లన్నారు. "ఈతని పదములు, శబ్దార్థముల చక్కగా నెరిగి రసానుభవముతో నెవడు విళంబముగా పాడుచున్నాడో ఆపదములు దారుఢించును. ధాతువులను వ్రాసి జూచితే నచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పద సాహిత్యముల శయ్య. ధాతువులు వచ్చినది రాకయుండుట కీర్తనముల-కృతుల-శయ్య" క్షేత్రయ్య పదములలో స్వర సంచారము రెండు స్థాయిలకు తక్కువగా ఉండదు. సాహిత్యమును తాళము కొరకు అడ్డదిడ్డముగా విరువ నవసర ముండదు. సాహిత్య శుద్ధికలిగి, భావమును తెలిసి కాలప్రమాణము నెరిగి పదములను పాడినచో పల్లవినుండి అనుపల్లవి లోనికి, అందుండి చరణము లోనికి రాగ భావములు పెరిగి చరణము పూర్తి కాగానే పల్లవిలోని రాగ భావములకు తిరిగి ఎట్లు చేరునో స్పష్టము కాగలదు.

సాధారణముగా గీతము వాద్యము చేరినపుడు దానిని సంగీతమని వాడుచున్నాము. కాని ప్రాచీన మతాను సారమున నృత్యము, గీతము, వాద్యము చేరినగాని సంగీతముకాదు. అట్టి పూర్ణత గల సంగీతమునకు క్షేత్రయ్య పదములు ఉపకరిపట్లు. భారతి, సాత్వతి, కైశికి, ఆరభటి యను నాల్గు వృత్తులలో కైశికీవృత్తి మృదువై శృంగార కరుణ రసములను పోషించును. కోమల కరణాంగ విక్షేపము కల మృదు మధురమైన నాట్యమును లాస్యమందురు. శాస్త్రోచిత అంగ సౌష్ట

నముగల బాల బాలికలు యువతులు ఈ పదములను పాడి లాస్య పద్ధతిని ఆడి అభినయించినచో సంగీతముయొక్క రక్తి, రసానుభూతి కళ్ళకు కట్టినట్లుండి ఆనంద జనకమై యుండును, అట్టి రసానుభూతి కావలెనన్న పాడి అభినయించువారు, చూచి వినువారు కూడ రసజ్ఞులై సానుభూతి కలవారై యుండవలెను. ఇట్టి రసజ్ఞత క్షేత్రయ్యకు సంపూర్ణముగా కలదని పాడను, ఆడను అభినయించను కలిగియుండి యుండవలెనని నా భావము.

ఇట్టి సంగీత మూలములగు క్షేత్రయ్య పదములు సంప్రదాయముగా పాడగలిగిన విద్వాంసులు, ఆడి అభినయించగల వారు క్రమముగా తగ్గిపోయినారు. వీటిని తిరిగి ప్రచారములోనికి తేవలసి యున్నది. వాటిని పునరుద్ధరించ వలసి యున్నది. క్షేత్రయ్య పదములు సంప్రదాయ పద్ధతిని స్వర పరచినవి అచ్చులో లేవు. ఈ మధ్యనే శ్రీ రంగరామానుజముగారు నలువది పదములను స్వరముతో అచ్చు వేసినారు. ఇంకను సేకరించి దొరకిన వాటినన్నిటిని స్వరయుక్తముగా అచ్చు వేయించ వలసి యున్నది. పదములు సంప్రదాయముగా పాడుట అభినయించుట నేర్చుకున్నగాని సంగీతవిద్య సంపూర్ణమైనదని చెప్పవీలు లేదు. కర్ణాటక సంగీత కళావేత్తలు, అభిమానులు ఈ కార్యమునకు తోడ్పడి, క్షేత్రయ్య పదములను తిరిగి వాటి గొప్పస్థానమున ప్రతిష్ఠించి సంగీత కళాస్వరూపిణియొక్క అనుగ్రహమునకు పాత్రులౌదురుగాక !

గుంటూరు,<br>
వికృతి, వ్యాసపూర్ణిమ. } విస్సా అప్పారావు.

## క్షేత్రయ్య పదములను అభినయించు పద్ధతి

కూచిపూడిలోని బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఒక పదమునకు ఈ క్రింది అభినయ వివరణ వ్రాసి దయతో పంపినారు.

### మోహన - ఆది.

I శ్రమ హేళన వితర్కం ఔత్సుక్యం రతులు
ఒక సారికే యీలాగైతే - నోహో! యిదేమిటి రతిరా!

II ఔత్సుక్యం III
మక్కువ దీర్చరా! మాముద్దుగోపాల!

గ్లాని, దైన్యం, చపలత IV వితర్కం దైన్యం
సాక్షియున్న నీసొగ సది యేమిర! ||ఒక్క||

దైన్యం శ్రమ వితర్కం సొగసు శ్రమ వితర్కం
నెమ్మొగమున నీబడలిక లేమిర - నీటు కాడ రొమ్మదరే దేమిర!

ధృతి వితర్కం
కమ్మని వాతెర కందిన దేమిర

దైన్యం శ్రమ వితర్కం
కాళ్ళును చేతులు తడబడు టేమిర! ||ఒక్క||

సుప్తి వితర్కం శ్రమ వితర్కం
కన్నుల నిద్దుర గమ్మే దేమిర - గళమున జెమటలు గారే దేమిర!

గద్గద శ్రమ వితర్కం
తిన్నని పలుకులు బలుక వదేమిర!

జడత వితర్కం
తెలిసి తెలియ కున్నా వదేమిర!

ఔత్సుక్యం III హర్షం మోహం

ఇనపురి ముద్దుల మువ్వగోపాల! – యేపున నను గలసితి వీవేళ

ఔత్సుక్యం

మనమున నిన్నే నమ్మితి జాల

విషాదము గ్లాని వితర్కం

మారుబల్క కున్నా వదియేల ?

నాయిక సామాన్య, అతృప్త, సురతాసక్తిగల ప్రౌఢ. హాస్యరసము.

శ్రమ, ఔత్సుక్యము, చాపల్యము, గ్లాని, సుప్తి, జడత దైన్యము, విషాదము, వితర్కము ఈ తొమ్మిది భావములు పద మంతటా అభినయించవలెను. హర్షము, ధృతి, హేళన, రతులు, మోహము అనునవిగాక, విభావ అనుభావ సాత్వికాభావములు సంద ర్భముగా ప్రదర్శించ వలెనని భరతాచార్య మతము. ఇంకను సమ యోచితము.

## సంభోగ శృంగారము

### I 'ఒక్కసారికే' అనుచోట

1 గజ
2 ధేనువు
3 కుక్కుటము
4 వృశ్చికము
5 హంస
6 నాగపాశము
7 గండభేరుండము
8 చక్రవాకము
9 ధనువు
10 పద్మాసనం

### II 'మక్కువ' దగ్గర

1 ఉపచారము
2 పాలు
3 ఫలహారము
4 గంధము
5 తాంబూలము
6 అత్తరు
7 పన్నీరు
8 పుష్పము
9 శయ్య
10 అలంకార

### III 'మువ్వగోపాల' అనుచోట

1 గోవర్ధనధారి
2 వనమాలాధారి
3 కాళింగమర్దన
4 కంసమర్దన
5 వటపత్రశాయి
6 శేషశాయి
7 లక్ష్మీవల్లభుడు
8 వేణునాదము
9 కుచేల రక్షణ
10 గజరక్షణ

### IV 'సొగసు' అనుచోట

1 ఆలింగనములు (౭)
2 చుంబనములు (౮)
3 కళలు (౮)
4 కచాకర్షణ
5 కుచాకర్షణ
6 పంచముష్ట్య

· వీటిని సమయోచితముగ కనపర్చవలెను.

# క్షేత్రయ్య పదములలోని పలుకుబళ్ళు, నానుడులు, సామెతలు.

ఆడితప్పకు దోసము
అక్కఱలేని కాపురమాయె
ఇంటిదోవ తొంగిచూడడాయె
నడగించని గొప్ప ముత్తైమాయె
కన్నీరు కావేరి కాలువసుమీ
తలవాకిలె ఇల్లుసుమీ
నాలిముచ్చు
పామాడి జోగివలెపోయె నా బ్రతుకు
అరటాకు ముల్లుసామ్యము
అమ్మ! నే జెల్ల
చంటిపనులు తీరిన జాళువా రవిక
అరసొంపు మాటలు
పదరి వానికి నీకు బోయుపగలవలెనే
యుండెనే
పుల్లాడి యెందుకయ్యేనమ్మా
వాదించి నీ పొందువద్దని గట్టిగ వక్క
లాకులిచ్చెను
ఆసించిన ఫలించే దరుదు గాదటవే
ఇంత మేలుదానవా
సంచు పాటపాడునా
కాళ్ళ వేళ్ళ బెనుగుదు
కనుగొన దిటవులేక
కాలమెప్పటివలె వానితోనె గూడి కాపు
జెందగ జేసెగా
మీరేమైన నార్చేరో తీర్చేరో
వలపనేపాపముపగవారికైన గారాదనెనె
మంటమారి తనమున
కంటిరెప్పగాచిన క్రమమున బోషించితివి
ఈనిన పులివంటి కోపము
దృష్టితాకె నమ్మలార
నే నొకటితలచితే దైవమొకటి తలచి
నందుకు
వలపు సిగ్గెరుగదు
విని వినములు చేసితి
ఒకవేళ నవనీత మొకవేళ పాషాణ
మకట నీచిత్తము
చాలుచాలు పదివేలు
నవ్వులంట యున్నావేమోనా
పద్దుచూడు మీసారి
ఈ రాయబార మెందాక నడిపెదవే
ఆ చెలిచేతిలో దారపోసితివి గదవే
చిటుకుమన్న కోపము సేయు
మనసు పాషాణ గంటినేడు
ఇన్నాళ్ళు మల్లాడిన దిందుకోసమా
అసురుసు రనేరని
పెల్లివగల మాటల
చనువులేనిచోట చలమెట్ల ఈడేరు
నిలివెడు ధనము
హాసుకైన దానమురా
అతడిందులేక లోకాస్తమానమైనట్లు
చొక్కపొడి చల్లినట్లాయె
మనసురాని పొందువాను
పంచెమాడు కొన్నారట
బలిమిని నాచేతనింతలో నిద్రైన బంచుక
బోసేతురే
రెండు దలచరనియుంటి
ఇంటికి రావద్దని పలుకరింతురటవే
పదింటిలో సగమొనరించితి నమ్మా
ఎవ్వతె నిన్ను బోధించెనో
ముదుగు నడిపించుమని
మోడిజేసుకొన్నాడు మొన్నటాలనుండి
నీరూపు కనుల గట్టినట్లుండునే
జాతివారిలో పగలు గలదా
ఇంటగెలిచి రచ్చగెలువవలెను
గుట్టుబయలు దేరనియ్య
కంచు పదనువంటి మనసు

పుందులెన్నో మాకులెన్నో
కందువ తెలిసి
కుంటెనగత్తె
నల్లిబిల్లియై యుండగ
నచ్చిక బుచ్చికలచే
ఐరాదే నేస్తమమ్మలార
ఏమేమొ విభునితో నెగబోసేరే
మేకవన్నె పులివంటి చెలులే
నుడువ నోరాడదమ్మ
నూగింజైన నాననీయరు
మునిముచ్చులు కాయజుని తలిరు పదను
కత్తెలమ్మ యీ చెలులు
ముంచేవో దరిజేర్చేవో
ఏరుగడిచితే పుట్టివానికి పొమ్మన్న
మాటనిజమాయె
ఈ కలికాలమున కుపకారము గలదా
యెవరికైనా
పైడిచేతికి వచ్చినదే చాలునటవే
చేత కాసులేదుగాని చే సైగలే
చిటిపొటిపదములు
తనకైన యీమేను తానేమైన చేయనీవె
గుత్తపు వన్నెల కీల్జడవేటు
దక్కితినంటే దయసేయవు
దినములెటువలె వచ్చెను
అడుగులకు మడుగులొత్తిన మగువ
దేవుని మనసున మ్రొక్కితే కనుల
దీవించినట్లు
వద్దనుంటే నొకమాట వాకిటనొకమాట
ఊడిగంపు బడుచనై
లక్కవంటి మనసు రాయై లాలించ
నైతిగా
తోటకూర దొంగవలె తొలగిపొయ్యే
వాడవు
తొయ్యలిపై దుమ్మురులిపి పోయేవాడవు
చుక్కపొడువ లేచి జుణికిపొయ్యేవాడవు
కలిబోసిన నుట్టివంకలు చూచేవయ్యయ్యో
పూచిన తంగేడువలె
దగ్గరలేని కాంతాళాన నైనట్లు
దయాలు బట్ట బయలాయెన్
సతులనమ్మ పాపజాతి మగవారికి
గతులులేవు
మగవాని కట్టుబెట్ట మనతరముగాదె
నేను మగనాల గాదటవే
పట్టుపటాని పూలపావడ
సరిగల బుటాల రవసెల్లా
దక్కితినీకు దయవాడ వనుకొని
చాళీతి రతుల
చాళీతి బంధముల
సముఖాన రాయబారము లేలే
సరిప్రొద్దు వేళ విరిబోణులెవ్వరో వేళ
గాదనిరట
తరుణిరో మేమంత దొరలమా
బావిలోనీరు వెల్లువ బొయ్యీనటవే,
ఎంతటి దిటవే
వెన్నెల చీకటి ఎవరికైన లేదా
ఏ సీమాటి బోధించెనో
వచ్చేమనసో రానిమనసో తెలిసికోవే
వక్కణజాబు
అతడెవ్వరో నే నెవ్వరో
ఈ మేనితో వానిమోము జూడవలెనా
కన్నీరు చెలులకు పానకము కాబోలు
విందుబూచి తిరిగేనే ఇంటిముందర
కులుకుమను పాలకుడిగి తిరిగెనె
కలకలమనుచు పైడిగంట పలికెనె
పక్కన తోరణగాళిపలుకు మాయబలికెనె
నీ వామభుజ మిపుడిదిగో యదరీనె
చిన్ననాటి నేస్తము చెరిచితివిగదా
వ్రతము చెడిన సుఖము లేదాయెగదా
ఊరికిపోయిన మగడు ఉట్టిపడ్డట్టువచ్చి
చలియించని నిందుకుండవలె

చెలియబెట్టిన మందు తలకెక్కెనో
పలుకవు నే నీకు పగదాన నటరా
దోషహారతుల నిప్పింతునో
అలదానికి జీనా సరిపెనెలా
బేసరాలు
నాగసరాలు
ముద్దులేనివానితోను ముచ్చటలేలే
నిద్దురలేప రాకవే
నీవు నాతో కనికరము సేయవచ్చేవు
ఆముకొన్న ప్రేమవాడు అకడ
జారుకొన్నాడు
నామీద దయవాడంటే నవ్వేరా చెలులు
పద్దుమీరి
నాయింటనే వద్ద
పద్దులేని మువ్వగోపాలునితో పలుకలేలనే
కొన్నమగనివలె కొంగుబట్టితీసి
పేదసాదలకిది యూర
యిందు చిన్నపెద్ద లెవరులేర
దాసుపిర్యాదు ఓ తరుణిరో లేదాయె
మాటలచేత దీరునా
వంతకాడైన బావ
గుత్తకానివలె నిత్యనిత్యము వచ్చేవు
అత్తకంటె మోసము
అంగడి బేటకము
చిత్తాన నెనరుంటే చేరియుండగవచ్చు
చూడని గూడని నిందలు గోడించిరమ్మా
నమ్మనినవారి కన్ను బొడిచినట్లైతేను
చెన్నుగా మాదేవునికి చేసే నేప్రాలంగిసేవ
చాలురా యీ జాజమెల్ల
మటువారాయడాడి
ముచ్చు కనికరమెల్ల తెలిసెను
కుయ్యుకుమని కూడరాదు
మాయదారి మువ్వగోపాలుని నాలుకపై
ఘండు నమృతము
మేటి పైఠాణికొంగు జారగదీసి

(j)

సిస్తుగ వీణమీటి, కస్తుపరచినన్ను
కవుగిలించినందుకు
జుంటితేనె లిచ్చేగాని
బూరుగమాను కాసించి పొంచి చిలుక
చందమాయె
నీళ్ళలోని హోమమాయె
మసియూద
నీసొమ్ములెల్ల నాయెదను కొంగాడ
తళుక్కుమని చెక్కిలి బెళుక
అల్లెప్పటివలె నేను
ఏమనంటినమ్మ
ఏనుగనెక్కి దిడ్డి ఈగదూరనేలె
సదమదమై యుండినసామి యితడేమి
తుదమొదలైననేమి
దొడ్డ కొంచమైనా యేమి
చనవకు వేయింటి జవ్వాజి మాకేమి
అరుగెమీద బిరుసైతే అపుడే నే
గూడియుందు
సరస రతులగూడి సోకమీరినది
నెఱజాణవే అరమరలేలనే పలుకవేపల్లగ
యాపకు బోదువో
కపటుడు నమ్మికలిచ్చునే
మనసువిరిచి
చాడిమాటలు విన్నాడు
కానిపోని మాటలచేత
చందురుతో సాటి తారలయ్యేనా
కోవిలకు సరి కాకియ్యేన
కసికాయ మధురమౌన
పదివేల చుక్కలాయన చంద్రునికి
సరివచ్చునా
యిత్తడిసొమ్ములు హెచ్చైన బంగారమౌన
చల్ల వడిగండ్లు ముత్యమౌన
మందుమచ్చులమారి
అంతరాంతర మెంతునా
యీడుకు కొంచాన పోనిత్తునా

బుద్ధిచెప్పకుందునా
రచ్చలు చేసితినా
తన నడతలు తెలియగా
చిటుకున వచ్చెనే
యితరము కామింపనొల్లను కన్న
    లయ్యయ్యో
యెన్నిక యిమ్మననే
చదురుమీద నే నున్న సామికి
అళిమీర తంజాపురి నెలకొన్న
చలువచప్పరమున
వేయిపదములు పలుకరించుకోగానె
చిక్కితి ముమ్మాటికి
సుంతసేపు
నమ్మిక లిచ్చెనే
వెదజల్లియున్నది వింతవాసన లెంతో
మరుకేళి నెనసిన మందమేలముచేత
బాగాలిచ్చి మడుపాసంగెవో
యీతరి మువ్వగోపాలు డింతిగో వట్టి
    యమ్మెలే
వానకాలము నాటి గరిక వలెను
శకునము మళ్ళించవలెను.

# కృతి ప్రశంస

నాయకవంశ రాజులును తొండమాన్ వంశ రాజులును దక్షిణదేశమునందు పాండ్యాదిమండలములు పరిపాలించు కాలమున నందు స్థిరపడినయాంధ్రకవులను వారివంశములవారును క్రొత్తపోకడలతో వివిధము లైనదృశ్యశ్రవ్యపాఠ్యగేయ కావ్యములు నిర్మించి యాంధ్రసారస్వతమున కపూర్వ మైనపుష్టి కలిగించినారనుట విదితము. విలక్షణమును విశిష్టము నైన గుణవిశేషము కల యా దక్షిణదేశాంధ్రవాఙ్మయమునకు చెందిన దీ క్షేత్రయ్యపదమంజరి.

## క్షేత్రయ్య

ఈ కవి సంగీత సాహిత్యసారజ్ఞుడు రసికుడు కృష్ణభక్తుడు లోకజ్ఞుడు. దేశీయులకు కర్ణరసాయనముగా హృదయరంజకముగా దేశిసంగీతమును దేశికవితను జోడించిన చతురుడు. వివిధరాగభేదములకును బహువిధ నాయికానాయకభేదములకు నేకైక లక్ష్యగ్రంథముగా కృతులు నిర్మించిన లాక్షణికుడు భావస్వతంత్రుడు భాషాస్వతంత్రుడు. ఈ యెల్లవిషయముల కీపదములే ప్రమాణము.

## విషయ ప్రయోజనములు

మోహపరవశు లగు కామినీకాముకుల చిత్తవృత్తులకు నవస్థలకు చేష్టలకు వేషభాషలకు నాదర్శ మయిన యీ కావ్యమందలి ముఖ్యవిషయము కామపురుషార్థము. ఇందలి యొక్కొక్కపదమున నొక్కొక్కవిధముగా ప్రతిఫలించిన దాని వివిధగతులు పరిశీలించి లోకమందలి కామప్రవృత్తిలోని మంచిచెడ్డలు తెలుసుకొని ప్రాజ్ఞత కలిగి పాఠకులు కామవిషయమున ధర్మమార్గ మవలంబించుట దీనిప్రయోజనము.

## నాయికా నాయకులు

క్షేత్రయ్య భక్తియుక్తముగా భక్తాభీష్ట ప్రదాయకుడైన యే పరమాత్మునికి తనకృతి నంకితము గావించి, దానితో తాను సుకృతి యయ్యెనో, అమువ్వగోపాలుడిందలినాయకుడు! ఆయా నాయికలకు తగిన ట్లన్నివిధముల వర్తించినా, నాయకుడతం డొక్కడే కాని, నాయికలుమాత్రము పెక్కుమంది. ఇం దొక్క స్వీయ నాయికాభేదములు సుమారు రఱువది(!) లెక్కకు వచ్చుచుండ, తక్కినపరకీయసామాన్య నాయికలభేదము లిన్ని యన్ని యని గణింప నేల! ఆలంకారికులు కావించిన బహువిధ నాయికాభేదనిర్వచనములు చాల వన్నట్లుగా నిం దొక్కొక్కపదమున నొక్కకనాయిక విలక్షణ హావభావములతో ప్రత్యక్ష మగుచున్నది. ఇంతమంది

నాయికల కిన్నిరూపములై వారి నలయించియు నలరించియు ననురాగరసమున నోల లార్చునేర్పు గలదక్షిణనాయకుఁడా గోపికావల్లభుఁడు గాక మఱొక్కఁడేడీ? అట్టిపురుషోత్తముఁడు నాయకుఁడగుటచేత నే యీకృతి సత్కావ్య మైనది. ఇందలి రసము సముచిత మైనది.

## రసము

ఇందలిరసము శృంగార మనుట పునరుక్తము. అయోగ విప్రయోగ సంభోగ భేదమున ముత్తెఱఁగు లయ్యెనిది "శృంగార ఏక ఏవ రసః" అనుభోజరాజోక్తిని సార్థకపఱచుచు నిందు పలు తెఱఁగుల విజృంభించినది. ఆనాఁటిరుచికి తగినట్లు కాఁబోలు, నక్కడక్కడ యిది కొంచెము పచ్చిగా నున్నమాట నిజమే. కాని, మనపూర్వప్రబంధాలలోనికొన్నిశృంగారవర్ణనలతో పోల్చి చూచినచో నిం దంతగా మితి మీఱలే దని తోఁచకపోదు. అయినా, శృంగారము ప్రధానరసముగా నుద యించినయీజాతిపాట లన్నియు నుత్సవములలోను కొన్ని సభలలోను వారాంగ నలు పాడుచు భావ మభినయించి రసికులను రజింపఁజేయుట కేర్పడియుండ నిందలి శృంగార మెట్లున్న దని పరామర్శింపఁబూనుట మొదటికి మోసము తెచ్చుట కాదా! అట్లని యిం దీరసము హద్దు మీఱిన దని తలంప రాదు. ఇందలి పదము లనేకములు మృదుమధుర భావ మొలుక సర్వవిధముల సహృదయరంజకముగా నున్న వనియు,

"ఏతీరున రమణిని గెలిచి – నీ వెట్లు యీ పొదువో,
చూతము రారా మదన! నీ — చేతిబలిమి మా చెలియబలిమి"

ఇత్యాది కృతులు కొన్ని రూపకాద్యలంకారశోభితములై ప్రబంధములలోని మన్మథోపాలంభాదివర్ణనలను ధిక్కరించునంతటిసరసఘటితిని విలసిల్లుచున్న వనియు పాఠకులు తెలియకపోరు.

## భాష

భాషాసంప్రదాయవేత్త యగుక్షేత్రయకవి తన దేశిసంగీతమునకు దేశికవితను తగినట్లు దేశీయు లందఱికిని సులభ మగుమృదుమధురభాష నిందు వాడియున్నాఁడు. అది శిష్టుల వాడుకలో నున్నది. ఆనాఁటికవు లాదరించినది. ఇట్టిభాషనే పూర్వకవులు కొందఱు 'జాను తెనుఁ' గని పేర్కొని యున్నారు. జాను తెనుఁగనఁగా, అచ్చతెలుఁ గని కొందఱు తలంచిరి గాని, యది సరికాదు. 'జానుఁదెనుఁగునఁ గృతి రచియించు చున్నా" మని ప్రతిజ్ఞ చేసిన నన్నెచోడుఁడును, సోమనాథుఁడును కుమారసంభవమం దును, బసవపురాణమందును తత్సమపదములు విరివిగా వాడుటయే యిందుకు ప్రమా ణము. దీర్ఘము లైనసంస్కృతసమాసములను క్లిష్టము లైన తత్సమపదములను కలియరా దనియు, ఎక్కువగా వాడుకలో నున్నతత్సమపదములు కలిసినను, ఏది సర్వజనసామా

న్యముగా నర్థ మగునో, అది జానుఁదెనుఁగనియు, వారియభిప్రాయములనుబట్టియు వారిరచనలనుబట్టియు విదిత మగుచున్నది. దీనినిబట్టి మనక్షేత్రయపదములు జానుతెనుఁగున విలసిల్లుచున్నవనుట నిరాక్షేపము. ఇందు విభిన్నార్థకము లైనతత్సమపదములు బహుళముగానున్నవి. అవి యైనా వాడుకలో చేరినవే. అందుచే నీకృతి జానుతెనుఁగుతోడి దేశిరచన కుదాహరణము కాఁదగియున్నదని విశ్వసింపవచ్చును.

## ప్రయోగ విశేషములు

క్షేత్రయ లక్షణసమ్మత మైనభాష నెఱుఁగనివాఁడు కాఁడు, దాని నిందు వాడనివాఁడు కాఁడు. అయినా, చెవి కింపైనవాడుకపదములు, అందును విశేషించి క్రియాపదములు వాడుటకు వెనుకాడక భావస్ఫూర్తియు సందర్భశుద్ధియు, కలుగునట్లు వాటిని ప్రయోగించి తనభాషాస్వాతంత్ర్యమును ప్రకటించియున్నాఁడు. మఱియు పూర్వగ్రంథములందును, కోశములందును కనరాని కొన్నిశబ్దములను వాడుకలో నర్థాంతరద్యోతకము లైనకొన్నిపదములను స్వేచ్ఛగా ప్రయోగించి మాతృభాషాభిమానమును వెల్లడించియున్నాఁడు. ఇందు కుదాహరణముగా కొన్నింటిని పరిశీలింతము.

౧ అయ్యెడును, ఇచ్చెదను, వంటితద్ధర్మార్థక్రియలు, అయ్యేను అయ్యీని; ఇచ్చేను ఇచ్చీని, అనువిధముగా మాఱినవి, దశావతారచరిత హంసవింశతి పార్వతీపరిణయము మొదలయినయర్వాచీనకావ్యముల కెక్కినవి. ఇట్టిరూపము లీకృతిలో "ఎందుకయ్యీ నమ్మా! నే నిఁక లంచ మిచ్చేనమ్మా!" అనురీతిని తఱుచుగా ప్రయోగింపఁబడినవి.

౨ కేవలము వాడుకలోమాత్ర మున్న "చెప్పచాలాను, మొన్నటాలనుండి" వంటి ప్రయోగములు నందందు కలవు.

౩ అని, అనుచు, అనెడిలాక్షణికావ్యయములకు బదులుగా 'అంట' యనెడి భావార్థకరూపము ప్రయోగింపఁబడుట యపురూపమే. ఉదా:-

"దక్కితి నం టనలేద – దండముపెట్టినదిలేద"

"నవ్వు లంట యున్నా వేమో – నా పద్దుచూడు మీసారి"

"సోమవదన? రేపు మా పంట కపకు జూజుచేసితివి

'అల్లాఅంటూవుండు' అనుచు క్రిందిజాతులవారు పలుకుట కలదు.

౪ "అంతరంగు లున్నారా నన్నాదరించేరా!"

. అని ప్రాణసఖి యనునర్థమున నంతరంగి యనువింతప్రయోగ మిందు కనవచ్చెను.

"నేయము కాదు వద్దంటే నిలిచేది మేర గాదు"

స్నేహశబ్దభవ మైన 'నేయ' శబ్ద మిచ్చట పొసంగదు. న్యాయశబ్దభవ మైన 'నాయము' యతికి సరిపడదు. 'నేయ' మనుశబ్దముకూడా పుట్టిన దనుట కిదే ప్రథమోదాహరణము. ఇది దాక్షిణాత్యాంధ్రులవాడుకలో నున్నదేమో!

ఆరుదూరు. ఇది యపూర్వ మైనసమస్తపదము. 'ఆరు' తద్ధర్మార్థకక్రియాజన్య విశేషణము. ఇది చేరుటచే దూరుశబ్దమునకు నిందునట్టియపవాద మనునర్థము వచ్చును. ఇందేకాక వ్యర్థము, అల్లరి, యను నర్థమునందుకూడా యిది ప్రయుక్త మైనది.

"నావల పెల్ల నారుదూఱుచేసెనే"
"ఆరుదూఱుచేసి నన్నలయించినా మంచిదే"
"అన్నదమ్ము లెడఁబాయనీ – ఆరు దూఱైతే కానీ"
పూర్వకావ్యములం దెందు నీ సమస్తపదము కనఁబడదు.

క్షేత్రయమాత్రము వాడినవిగా కొన్నిశబ్దములు శబ్దరత్నాకరమున నున్నవి. అవి సీతారామాచార్యులు కూర్చినవో! తరువాత నితరులు చేర్చినవో! దానితొలి ముద్రణము నాకులభింపలేదు. అట్టివానిలో నపూర్వమైనది 'ముప్పొంగు' ధాతువు. అప్రయోగ మిది:–

"అప్పటికి నిన్నెంచెదనే – అతివ!
ముప్పొంగి యుల – మువ్వగోపాలుని తోడి తెచ్చిన"

దీనికి "మూడు + పొంగు. మూడుపొంగులు పొంగు = ముప్పొంగు" అని శ. ర. చూపినవివరణము విచారణీయము. ఇది "ముక్కోను" వంటిది. "మును + పొంగు– ముప్పొంగు = ముందుగా నుత్సహించు" అని చెప్పుట సముచిత మని తోఁచెడిని.

క్షేత్రయ యుద్దేశించినయర్థములం దీక్రిందిశబ్దముల నితరు లెవ్వరు వాడినట్లు కనబడదు.

చేపట్లు = చేయిచేయి పట్టుకొని గుంజులాడుట; ఎన్నిక = తలంపు, కోరిక; చందురు పిల్లలు, విదియచందురులు = నఖక్షతములు; తాళ్ళపాకవారి ప్రయోగములు కలవు; అందము = చూచుకము మొద–

"చేపట్లు కావచ్చునా! మీలో మీకు–"
"ఎంచినయన్నిక లెల్ల నీడేర వాయె"
"సందిట నున్న యీ చందురుపిల్లలు"
"సగముకుచముల విదియచందురులతోను"
"అంచులఁజేత నప్పళించి"

౯ ఇందు చక్కని లోకోక్తు లెన్నో కలవు. కొన్ని:—

"అనుకోప నేమున్నది? — అరటాకుముల్లుసామ్య మైనందు కిప్పుడు—
"కలి పోసిన నుట్టివం — కలు చూచే వయ్యయో!"
"తోటకూరదాంగవలె — తొలఁగి పోయేవాఁడవు"
"పామాడిజోగి — వలె పోయె నా బ్రతుకు"
"బావిలోనినీరు వెల్లువపొయ్యినటవే"

'పామాడి' గ్రామనామమైయుండును. ఇది వేఁగినాటిసన్యాసి యనుటవంటిది.

౧౦ క్షేత్రయ్యభాషయు భావములు స్వతంత్రములే యనుట నిరాక్షేపమే కాని, శ్రీనాథ చేమకూరకవులయందు గౌరవము చూపినాఁడనుటకు చిన్నయనుకరణములు రెండు కనవచ్చినవి.

"కంచి యఱవత లసమాస్త్రిఖడ్గలతలు" కాశీఖం
"కాయజుని తళిరు పదను — కత్తు లమ్మ యీ చెలులు" 102
"ఎగుభుజంబులవాఁడు మృగరాజమధ్యంబు,
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాఁడు......
...మెఱుఁగుచామనచాయ మేనివాఁడు విజయ
"ఎంతచక్కనివాఁడే నాసామి వీఁ — డెంత చక్కనివాఁడే!
...మెఱుఁగుచామనచాయమే నమరువాఁడే...
కొదమసింగపునడుము కొమ రమరువాఁడే... 56
ఈపదమంతయు, పైసీసపద్యము ననుకరించినట్లు తోఁచకపోదు.

౧౧ ఇంక, కవితా చమత్కృతి కొక్క యుదాహరణము.

ఈ క్రిందిపదములలోని నాయకుఁడు మువ్వగోపాలుఁడు కాఁడు. ఈపురుష విరహవర్ణన మెంతయు మనోహరమై క్షేత్రయభావస్వాతంత్ర్యమును ప్రకటించుచున్నదో చిత్తగింపుఁడు.

"ఇన్నివిధములఁ బూజించేర సామి — ఇంతిని ననుఁగూర్చుమీ!...
కన్నెమోము నేను గనుఁగొనఁగలిగిన పున్న మొక్క ప్రొద్దుండేరసామి!...
కన్నులు ముద్దాడఁగలిగిన నే జంట కలువపూవులఁ బూజించేర సామి!
సన్ననూగా రంటఁగలిగిన నాగులచౌతివ్రతము లుండేరసామి!
శయ్యపై దాని నన్నెయఁజేసిన ననంతచతుర్దశి చెల్లించేర సామి!
మేలుగ రతులను మెలఁగిన నీకు లక్ష్మికిఁ గల్యాణము చేసేర సామి!

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

# క్షేత్రయ్య సాహిత్యము

**సాహిత్య శ్రీ సమున్మేష సంప్రాప్తాద్వైత భావనః**
**క్షేత్రజ్ఞో జయతి శ్రీమాన్ మువ్వగోపాల నాయకః**

ఒకప్పుడు రసజ్ఞభక్తుల గోష్ఠిలో నొక రమణీయరమణి స్వరసానుభూతి కలిగి రసభావ యుతముగ నృత్యగీతవాద్యముల మేళనముతో నొక మధురాలాపము చేయుట క్షేత్రయ్య సాహితీ భావనములో స్మృతికి వచ్చుచున్నది. ఆ నాదస్పష్టమయిన యొక సమన్వయ మీనాడు చిత్తములో స్పందించు చున్నది. అన్నిటి సామరస్యముతో నుండ వలసిన సాహిత్య మటు నిటు దూరమై పోగా స్వభావసిద్ధమయిన రూపము సరిగా వెచటను గోచరించుట లేదు. నేడును సంగీతగోష్ఠి యున్నది. నృత్తనృత్య నాట్య విన్యాసములు లేక పోలేదు. శిల్ప చిత్ర కౌశలము గోచరించు చున్నది. వేష భూషలున్నవి. రసభావ సంపదల సముల్లాసము కలిగిన కవితయు లుప్తము కాలేదు. కాని వీని పరస్పర సంబంధ సమన్వయము సహృదయుల హృదయములలో గూడ స్పష్టగోచర మగుట లేదు. కవితాగోష్ఠి యున్నది, అందితరములు లేవు. సంగీత సభలు కలవు. అందు గీత వాద్యములే యున్నవి. నృత్య మచటికి వచ్చుటయే లేదు. అచటి కవితాసంపదయు వెను వెనుక దూర దూరమున దాగుడు మూతలలో నున్నది. ఇట్లే యన్నిటిలో నన్నియు లేవు. విశిష్టమగు సాహిత్యరుచి వీనిలో నెట్లు కలుగును!

క్షేత్రయ్యపదము లిట్టి విధమున సుప్రకాశము పొందినవి. ఇప్పుడు స్మృతిలో గోచరించునది యిందలి క్షేత్రయ్య పదమే యని నాకు హృదయములోని ప్రత్యక్షము. ఇందన్నియు నున్నవి. వలసినవానిలో నిందు లేనిది లేదు. ఇది క్షేత్రయ్య సాహిత్యములో నాకు ప్రతిభాత మయిన యంశము. ఈ గ్రంథమున 330 పదములు ముద్రితము లయినవి. ఇంక నెన్నియో కలవని గణకులు లెక్కించుతురు. ఉండిన నుండ వచ్చును. వానిలో నేమి యుండును? ఈ త్రిశతీ భావనమున నది మనకు గొంత గోచరము కా గలదు. ఇందున్న పరిపాక మందు నుండును.

సామాన్యముగా నీ పదములలో నేదేని యొక పదము చతురశ్రముగా భావించినచో, కలకల నవ్వినట్లుగా కాని, చురచుర చూచినట్లుగా కాని, రుసరుసలు కలిగి గాని, మిసమిసలాడుచు గాని, యుసురుసురనుచు కాని, యేమో చెప్పదలచినట్లుగా కాని, యనేకవిధముల యుపరంజితమగు, హావభావములు కల యొక సచేతన వ్యక్తి సచేతసుల కవశ్యముగా గోచర మగును. సాధారణముగా శిల్పమున, చిత్రమున కన్పడు రూప మొక్కొక్క భంగిమతో కన్పడును. ఇందలి భావనా రూప మజడమై, నడుగుట వివిధ భంగీ భూషితముగ గోచరించును. రసోద్దీపనము చేయు నొకా నొక రాగము తాళలయాది రంజితమై విన్పడును. ఎన్నియో భావముల గుంపులు

ఒకటొకటిగా సంచలనము పొంది వరుస వరుసగా ఉదయించుటచే వానిని సూచించు కవితాగతులు లలితమధురములై అవభాసించును. వీటి యన్నిటి బల మొక రూప భాగ్యము నందింపగా మధురలాస్య మొకటి సుమధురమై హృదయమున ముద్రిత మగును. క్షేత్రయ్య యీ త్రిశతిలో నేయొక్క పదమేని భావనావివేకము సంపా దించుటకు సమర్థమై యున్నది. ప్రతిభా సహితుడైన సహృదయుడు దినమున కొక టిగా భావించి భావించి ఒకవత్సర మీ పదమునందే లగ్నమనస్కుడైనచో అస్మృ తము విస్మృతమో యయిన ఒక సాహిత్య సర్వస్వము చక్కగా సంస్మృత మగును. ఇక లోకమున సాహితీ చైతన్య మునకు మృతి ఉండనే యుండదు.

మువ్వగోపాల పదములకు లోకమున నొక గౌరవము కలదు. వాని నాదరిం చిన వారికి ఆ గౌరవ మందినను లేకున్నను విశేష మేదియో కలదని వినికిడి యైన నుండక తప్పదు. నాలుగు విషయములు తెలిసినవారికి సరియైన పరిచయ సంబంధములు చక్కగా లేక పోవుట హేతువుగా ఒకరి విశేషము మరియొకరు అందుకొనుట కాని మెచ్చుకొనుట కాని లేనే లేక పోయినది. అందువలన దీని విశిష్టత లీనాలీన మైనది. ఏమిచేయుదము? కవితాప్రియులు సంగీతమునకు దూర మేగిరి. సంగీతరసికులు కవిత్వము దరి చేర రైరి. మువ్వగోపాల పదములు వారు గానము చేయు నవిలే? మన కేల? అని కులకన్యలు కాటుక కన్నుతో చూడనే లేదు. ఇవి సంగీతసంబద్ధములులే! అందుండు సాహిత్య మేమి? అని కవితాదీక్షులు వీనిపై మాగన్ను వేసిరి. వాస్తవ మైన వైశిష్ట్యము గుర్తింప గల వారి చిత్త మెదటి కిపి రాలేదు. వీనిపని ఇట్లయినది. ఎట్లయిననేమి? కాలగతము లైన కొన్ని శక్తియుక్తులు అవశ్యముగా కావలసిన వానిని చవి చూపును. ఇందలి గుప్త గూఢార్థములను సూచనగా తెలియ జేయుటకు శృంగార రసమంజరివచ్చినది. అదియొక లక్షణవాణి. ఈ పదసముదాయము లక్ష్యము. ఈ లక్ష్య లక్షణసమన్వయము దీనిలోముద్రిత మైనది. ఈ ఉభయవివేకము క్షేత్రయ్య పదముల స్వరసతను భావుక లోకమునకు కొంత అవగాహము చేయ గలదు.

మహోమహోపాధ్యాయులు గురుపాదులు శ్రీ "రాయుడుశాస్త్రి" రసగంగా ధర మధ్యాపనము చేయు నప్పుడు అనుకూల ప్రసక్తిలో ఒకొక్కపదమును మంజుల కంఠముతో పలికెడు వారు. వారి భావదృష్టికిని ఇంకందిన దేమి! అనుకొంటిని. అవును! విశిష్టమగు సాహితీ వివేకము గలవారు ఇట్లు దృష్టినుంచుటలో ఆశ్చర్యము లేదు. నేడు శ్రీయుతులు విస్సా అప్పారావు విజ్ఞానితకు సహృదయతకు, సుహృద యతకు వివిధవిషయాభిజ్ఞతకు సముచిత మగునట్లు దీని నిట్లు వెలయించినారు. నా నానాభావ స్పందములకు ఇది యొకనిదానమై "కిమపి కిమపి" పలికించును.

అనుభవ రసికుడైన భోజదేవుడు స్త్రీ స్వభావానురాగ రీతులను నానావిధ ముల నిరూపించి నాడు. ఆలంకారికులు లక్షణములు చెప్పిరి. కవులు లక్ష్యముల నిరూపించిరి. హాల గాథాసప్తశతి, ఆర్యాసప్తశతి, గీతగోవిందము, అమరుకము మొదలగు కొన్ని నానా శృంగార లక్ష్యముల మధురతను నిరూపించు కొన్నవి.

భోజుడు శృంగార మొక్కటియే రసమనును. ఇతరము లాతనికి రసములు కావు. మానవునకు స్వభావ సిద్ధమైన హృదయ స్పందము రాగ మయము. ఆ రాగము స్పష్టము కానపుడు రూపాంతరములలో గోచరించును. స్పష్టము కాగా రాగము రాగమై యై శృంగారములో పర్యవసించును. ఇది సామాన్యముగా భోజభావము. శారదాతనయుడు భావప్రకాశనములో నాయికల భేదములను బాగుగా గుర్తించి వారి వారి ఆయా అవస్థలలోని దృష్టి, గతి, చేష్టాది విశేషములను విపులముగా ప్రతిపాదించినాడు. నృత్య నాట్యములలో ఎన్ని యెన్ని విశేషములు భావించుటకు తగి యుండునో అవి శారదాతనయునకు పరిచితములు. క్షేత్రయ్య పదములలో అవి యన్నియు సాధారణముగా ఓతప్రోతము లయి యున్నవి. ఈ యంశము కేవలము పఠనములో తెలియక పోవచ్చును గాని భావనములో అజ్ఞేయము కాదు. సింగభూపాలుని రసార్ణవ సుధాకరము లక్ష్య లక్షణ సమన్వయములో కొంతగా సంభావనా యోగ్యము. అందు లక్ష్యము లక్షణము ఒకచో నిరూపిత మైనందు వలన భావకులకు ఒక సౌలభ్య మేర్పడినది. క్షేత్రయ్య లక్ష్యప్రపంచమునకు లక్షణపరిజ్ఞానము బహుళముగ అపేక్షితము. క్షేత్రయ్య నాటి నుండి తన వఱకు గల సాహిత్య మాధుర్యమును సుకుమారముగా భావించి ఈ ఆవిష్కారము చేసి యుండును. అనేక లక్షణముల విజ్ఞానము అతని సాహిత్యహృదయమును వాసితము చేసి యుండును. ఆ సంస్కారముతో క్షేత్రయ్య యీ సృష్టి యొనర్చినాడు. అతనిలక్ష్య మార్గము ప్రవేశించుటకు మనకు సమగ్రమయిన లక్షణ మపేక్షితము. అదిఏది?

ఇప్పటికి ఉ వందల వత్సరముల క్రిందట రసతరంగిణి రసమంజరి మొదలగు గ్రంథములు రచించిన భానుదత్తుడు తగిన నిర్వచనములతో లక్ష్య సౌందర్యమును కొంత ప్రదర్శించినాడు. అతడందించిన నాయికాగతులు కొందరాలంకారికులకు సమ్మతము కాకపోవుట కేమి కాని అతని కొన్ని క్రొత్తలు ప్రేమమార్గములో సంభావింప తగినవి. సాత్త్వికభావములను ఆలంకారికు లందఱు ఎనిమిదిగ భావించిరి. ఇతడు ఆవలింత కూడ నవమ సాత్త్విక మనును. స్వాధీనపతికాద్యష్టభేదములను నాయికల కందఱంగీకరించిరి. ఇతడు ప్రవత్స్యత్పతికయు నవమ నాయిక అనును. ఆ యాస్థలము లందీతడు ఉపపత్తిని చూపక పోలేదు. ప్రవత్స్యత్పతిక నవమ అయినచో సమాగచ్ఛత్పతిక దశమ యేల కారాదు! అను అర్వాచీనుల ఊహకు భానుదత్తుడే సూచన మిచ్చెను. భానుదత్తుని రసతరంగిణి రసమంజరి ఆలంకారిక దృష్టిలో నెట్టి దయినను లక్ష్యదృష్టిలో సహృదయుల కది చక్కగా సంభావ్యము. అతడన్ని లక్ష్యములను లలితపదబంధముతో కృష్ణపరముగా రచించినాడు. అదియే రీతి క్షేత్రయ్యన కభీష్ట మైనది. క్షేత్రయ్య పదాలు సర్వాలక్ష్యములు. ఆ లక్ష్యము లన్నియు మువ్వగోపాలాంకితములు. రసమంజరీకర్త భానుదత్తునిలో గోచరించని ఒక విశేషము తెలుగు క్షేత్రయ్యలో గోచరించును. ఆలంకారికుల లక్ష్యములు శృంగారమును సూచించునవియే యయినను అందలి కామతంత్రము అస్పష్టము, అజ్ఞేయము నై దూరదూర మైనది. ఇందు అది అమూర మైన తంత్రము. అమరుక శతకములోని గూఢ

సూచనలు కామినీ కాముకుల గాఢప్రణయమును భావింపచేయును. అందఱకు అమరక దేవు డొక్కడే నాయకుడు. నాయిక లనేకలు. నానా నాయికల తృప్తిసంతృప్తులు బాధావ్యథలు ఎడమోము పెడమోములు అందున్నవి. కాని క్షేత్రయ్య నిరూపించిన రమ్యత కలవై లేవు. క్షేత్రయ్య పండించు కొన్న సొత్తు క్షేత్రయ్యది. ఆయన విత్తనముల నేరి తెచ్చు కొన్నాడు. అనుకూలముగా విత్తినాడు. అది యాయనదే! అది యితరులది యేల యగును? క్షేత్రయ్య పదసమీక్షకు నానాదృష్టు లావశ్యకములు. వానిని మనవి చేయుదును.

ఒక అజ్ఞాత భావుకుడు క్షేత్రయ్య మువ్వగోపాల పదములను రసమంజరీకర్త భానుదత్తు డందించిన దృష్టి నందు కొని భావించినాడు. వివిధ నాయకల అనుభవములను నిరూపించు మువ్వ పదావళి నాయికా ప్రధానకము. నాయకు డొక్కడు మువ్వగోపాలుడు. అతడే వరదుడు అతడే వెంకటేశుడు. అతడే అన్నియును. ఒకడైనను అనంతుడు అనంతరూపచక్రవర్తి. మువ్వకాముకుని ప్రేమవిపశ లయిన నానా నాయిక లిందున్నారు. వారి అనుభవ భావభవ భావ విలాసముల లిందున్నవి. ఆ భావదృష్టిలో గోపాలనాయకు డొక్కడే అయినను అనంతుడై వివిధ నాయికల భావ పరీవృతుడై గోచరించెను. కావుననే యిందలి లక్ష్యము లన్నియు నాయికా నాయక భేదముల కుదాహరణము లయినవి. ఈ యంశమునే శృంగారరసమంజరీకర్త అస్పష్టజ్ఞాతుడైన వ్యాఖ్యాత నిరూపించుటకు యత్నించెను.

భానుదత్తుని రసమంజరి యంతయు నిందు సంగృహీతమైనది. ఐదారు స్థలములందు లక్ష్యశ్లోకముల భావమును లక్షణముగా నీతడు నిరూపించెను. ఆయా విభాగముల విమర్శనము లోని భానుదత్తుని చర్చను ఈ వ్యాఖ్యాత నిరూపించ లేదు. ఆ చర్చ యీ లలిత పదముల మాధుర్యాస్వాదనములో అడ్డు పుడక యని భావించె నేమో? కొన్ని వాక్యములు యథామూలముగ లేవు. ఏలనో వ్యత్యస్తము లయినవి. ఉండవలసినరీతి దిగువ సూచితము. అట్టే యుత్తర గ్రంథమున సవరించుకొన దగును. కొన్నిట కొన్నిట రసమంజరీ లక్షణములనే గాక యితర లక్షణముల గూడ స్వీకరించినాడు. ఆ యా స్థలములందవి అపేక్షితములని యతని భావము. ఇందలి భాష అసంస్కృతమైన ప్రాచీన వ్యావహారిక భాష. కొన్నిట లక్ష్యణసమన్వయము కలదు. ఆయా పదములకు అవతారికలుగా కొన్ని వాక్యములు కొన్ని చోట్ల కలవు. అవియే యచటి సమన్వయమును సూచించునవియైనవి. చాలవానికి అవతారికలు లేవు. సమన్వయమును లేదు. అది ఉభయ విజ్ఞానమున నూహింప తగినది. కొన్ని లక్షణములకు శృంగార రసమంజరి ఒకే లక్ష్యమును చూపినది. కొన్నిటి కనేకములను చూపినది ఒకటి చూపినను అది యొకటియే లక్ష్యమని కాదు. కతిపయములను చూపినను అవియే లక్ష్యములనియు కాదు. ఇది కేవలము దిఙ్మాత్రప్రదర్శనము. ఇంతటి సమన్వయ విజ్ఞానము గల భావుకులు అన్యమును సరిచూచుకొన వచ్చును. ఆయా పదములందు ఆయా లక్షణమే యున్నదనియు కాదు. అనేక లక్షణముల కది లక్ష్యము కా వచ్చును.

అట్లు చేసికొన వచ్చును. గాథాసప్తశతి గోవర్ధన, ఆర్యాసప్తశతి గ్రంథములలో భావప్రకటన మునకు యత్నించిన వ్యాఖ్యాతలు ముందుగా నవతారిక వ్రాసి సమన్వయము చూపినారు ఆ రీతి యీ శృంగార రసమంజరిలో నున్నది. శృంగార రస మంజరి యొక్క రీతిలో క్షేత్రయ్య సాహిత్య గౌరవమును స్వరూపమును సమీక్షించినది. ఆ సాహిత్యవిశేషమును సూచించుట కంత మాత్రము చాలదు. ఇంకను వివిధరీతులలో సాహిత్యవివేకము సంపాదింపవలసి యున్నది. భానుదత్తుడు రసమంజరిలో నాయికా లక్షణములను ప్రస్తరించి నిరూపించి నాడు. కేవల మంత మాత్రముననే యిందలి నాయిక లున్నారని నిశ్చయింప నక్కర లేదు. భోజదేవుడు శృంగారప్రకాశములో శారదాతనయుడు భావప్రకాశనములో నాయికల విశేషములను ఇంకను చూపినారు. ఆ యా భేదములు కూడ వీనిలో గోచరించును. కాని శృంగారరసమంజరి భానుదత్తమార్గమునే యవలంబించిన దగుట తావదంశమునే నిరూపించినది. అతని నిర్ణయానుసారముగా చూచి నపుడు కూడ దీనిలో నొక యాకార మున్నది. ఆ యాకారము ననుసరించి యీ పదముల కొక విధ మగు వర్గీకరణము సంపాదింప వచ్చును. సామాన్యముగా నిట్టివానిలో వర్గీకరణ మవసరము కాదు. దీనిలోని పదములు వేనికవి స్వతంత్రములు. ఎచ్చటికి కచ్చట తగిన పరిపుష్టి కలిగి యున్నవి. ఇవి యన్నియు ముక్తకరచనలు. ఈ ముద్రిత విధానములో నొక యనుక్రమము కూడ లేదు. మువ్వ వరదయ్య చరిత్రము నూహించుటకు ఒక క్రమమును అప్పారావు యనుసంధించి నారు. ఇట్లే సంఘటించు అను పూర్వోని వర్గీకరణమును మనము కాదన నక్కర లేదు. దాదాపు పదశతము స్వీయ నాయికలకు లక్ష్యముగా నున్నది. ౫౦ పదములకుపైగా పరకీయా లక్ష్యము లున్నవి. ౬౦పదముల కధికముగా సామాన్యా లక్ష్యము లున్నవి. అగోచరములైన పదములలో ఏ నాయికల కెన్ని యున్నవో యెవరేమి చెప్ప గలరు! ఈ కనబడు పదావళి పట్టి చూడ స్వీయావిశేషములే అధికములు, వీనినన్నిటిని ఒకచో చేర్చి అనుకూలాన్వేషణము చేసి సమీక్షించి నపుడు ఒక యాకార విశేషము లభింపక పోదు. అదియట్లుండగా స్వీయావిశేషములు బహుళముగా నున్నందు వలన క్షేత్రయ్య స్వీయా రతివిశేష వివేకమును ఇందు గోచరింప జేయుచున్నాడనియు అభ్యూహించ వచ్చును. శ్రీకృష్ణుడు దశసహస్రాధిక స్త్రీపరివేష్టిత మోహనాకారుడు. అతని యనంతలీలా విశేషములు స్వీయలలో నున్నవి. స్వీయానురాగము ప్రధానముగా నిర్దేశించి పరకీయానురాగము సామాన్యానురాగము వేరు విధమున నిరూపించెనని భావించుట కవకాశ ముండదో! 'అస్తు'. ఇది యిచట సంభావనీయము. స్వీయ నాయిక యందు నాయకుని భావమనేకవిధముల నుండవచ్చును. నియతమయిన యొక దాంపత్య ధర్మము అతని నట్లు భావింపచేయునది కావచ్చును. స్వీయావిషయమున తృప్తివిశేషమును సంపాదింప దలచిన నాయకు డొకప్పుడు పరకీయా భావనమును మరియొకప్పుడు సామాన్యా భావనమును ఇవి కానిపక్షమున స్వీయాభావనమును చేయుట కలదని ఆలంకారిక మూర్ధన్యు లంగీకరింతురు. ఇట్టిదృష్టితో స్వీయ యందీ పరకీయా సామాన్యావిశేషములు కూడ సమన్వయము పొంద గలవని భావుకులు భావించినచో ఒక యాకార

లాభము దుష్ప్రాపము కాదు. ఎట్లని యగుగాత ! ఇందలి నాయికోదాహరణములు చక్కని లక్షణ సమన్వయము పొంది సుందర లక్ష్యము లగుచున్నవి. ఇదివీని యొక విశిష్టత. ఇదియే రసమంజరిలో అనూత్రితము.

ఈపదములు ముక్తక రూపములంటిని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో అమరుక కవి పద్యములను ప్రబంధశతాయమానముగా మెచ్చినాడు. ఇప్పు డాతడు భౌతిక దేహముతో నున్నచో నీపదము చూచి మెచ్చెడి వాడు. అతడే యన నేల ? మనము మెచ్చలేమేమి ? అస్మద్గురుపాదులు సశిరఃకంపముగా వీని నట్లు మెచ్చిరి. మా రాయడు మెప్పు అది యొక రాతి గీత. ఈనాడు మనలో ఆనందవర్ధనుడున్నాడు. రాయడు నున్నాడు. మనము నట్లే యభినందింప చేయుదము. అభినందితము.

ఈ పదములు శృంగార పదములు. ఇది లోకప్రసిద్ధి. ఈ కావ్యము శృంగార ధ్వని కావ్య మన్న మాట. శృంగారము నందు భేదములు కలవు. సంయోగశృంగారము వియోగశృంగారము నని. అదియు నిదియు యనంతభేద భిన్నము. కాని కవులు వియోగ శృంగారమునే ముఖ్యముగా వర్ణింతురు. అదియుక్తము. వియోగమునందే యెంతయో ప్రతిపాద్య మున్నది. అందుననే యిందు ప్రతిపాద్య మింతిగా నయినది. విప్రలంభము లేక సంయోగమునకు పుష్టి లేదు. వియోగభేదములు అభిలాషాదు లన్నియు నిందు తారుణ్యముతో నున్నవి. ఈ పదములలో కొన్నిటి యందు నాయక కథనము, మఱి కొన్నిట దూతీకథనము, అధిక సంఖ్యాకము లందు నాయికా కథనము కలదు. ఏ కథనములో కాని పరిపూర్ణ శృంగార సామగ్రి యున్నది. "విభావానుభావవ్యభిచార సంయోగాత్ రసనిష్పత్తిః" అనికదా ! భరతుని సూత్రము. ఆ సంపద యిందున్నది. ఇటుచూడుడు !

స్త్రీ పురుషుల యన్యోన్యానుభవ కాంక్ష రతి. అది సుస్థిర మగుచో స్థాయి. నాయకు డిందు శ్రీకృష్ణుడు. ఆతని విషయమై ఆ యా నాయికకు ననురాగ మున్నది. ఆ యా నాయిక యందును మువ్వగోపాలుడు రతిచిత్తము కలవాడు. ఈ నాయికా నాయకుల రతి స్థిరము. ఏ పదమున కా పదము ఒక విశిష్ట కావ్య మగుటచే గ్రంథము మొత్తముపై సమన్వయము సంపాదింప వలసిన మహాకావ్యముల పరిపాటి నిందు చూడ నక్కర లేదు. ఆ యా పదములోని నాయిక గోపాలరతి కలిగి యున్నది. ఆ సమయము నందు ఆ నాయికా మనసులో అన్యరాగము లేదు. ఆమె కప్పట విరుద్ధ భావావేశమును లేదు. అందుచే ఆ యా నాయికా రతి స్థాయీకృత మగును. అట్టి స్థాయిభావరతి విభావాదుల సముల్లాసము పొంది పదములందు రసీకృత మగుచున్నది. పదము లెందెచట చూచిన నచట భావము లుద్దీపింప జేయు సామగ్రి పుష్కలముగ కనబడును. బాహ్యము లైన యనంత విశేషములు రమ్యసుందరములై కూర్పు పొందినవి. ఆ యా నాయికల రూపవిలాసాది సంపదలుకూడ సుశ్లిష్టములైయున్నవి. మువ్వగోపాలు డాలంబన ముండనే యున్నాడు.

అటు నిటు నొదుగు లేదు. వీలైన ఆ లలిత నాయికల హావ భావాది శృంగార విలాసములు నానా మధుర చేష్టలు అనుభావీకృతములై మన యనుభవమున ముద్రితములే యగును. ఆమె స్థాయి రతి సాగరములో అసూయాదులు, శంకాదులు, ఉత్సాహాదులు అలీనములై అనితరశోభ నిచ్చుచునే యున్నవి. నానా విధముల వివశీకృత చిత్తలయిన వారి సాత్వికముల స్థితి వేరుగా పరిగణింప నక్కర లేదు. వీని వలన కలిగిన స్థాయి సమున్మేషము శృంగారరసమై అన్ని పదము లందును సహృదయులకు చర్వ్యమాణ మగుచునే యున్నది. ఇట్టి రసభావసిద్ధి యీ ముక్తకము లందంతటను సులభగ్రాహ్యము. ఇట్లు సమీకరించి భావించిననే అందలి యాస్వాదసుందరత క్షేత్రజ్ఞునకు సాహిత్యజ్ఞతను సుస్థిరము చేయును. ఇంక నిట్టి విశేషములు కలవు.

వియోగ పరితప్తమైన నాయికా హృదయము విలక్షణ శోభామధురము. అది యిందున్నది. పురుష విరహము నిరూపించునవి కొన్ని కలవు. నాయికా విరహ నిరూపకములె యధికములు. పురుషవిరహము రమ్యమా? స్త్రీవిరహము రమ్యమా? అది వారికి నిది వీరి కనుట తత్వము కాదు. యక్షవిరహము కల మేఘసందేశము స్త్రీల మెప్పుదల పొందనే పొందినది. నానా పురుషు లేక స్త్రీ విషయమై విరహపడుట దృష్టము కాదు. శ్రుతమును గాదు. ద్రౌపది విషయము నిట ప్రసక్తము కానీయను. ఇందలి నాయికలు, కన్యలు, ముగ్ధలు, మధ్యలు, ప్రౌఢలు, ధీరలు, అధీరలు, ధీరాధీరలు, జ్యేష్ఠలు, కనిష్ఠలు, స్వాధీనపతికాది విశేషము కలవారు, బాలింతలు పరకీయలు సామాన్యలు సర్వరూపలు. ఇట్లు రసమంజరీకర్త చూపెను. వారంతట నాగు నట్లు లేదు. వార వారి యనురాగ విశేషము ననుసరించి వారును విశిష్టలు కాగలరు.

౧ నిత్యానురాగము ౨ నైమిత్తికానురాగము.
౩ ప్రకాశము ౪ ప్రచ్ఛన్నము.
౫ అకృత్రిమము. ౬ కృత్రిమము.
౭ సామాన్యము ౮ విశేషము.

ఇట్టి రాగ భరితలును గలరు. పురుషుడు తన నాయిక యన్యగామిని యని తలంచిన సహింపడు. స్త్రీ సహింపక పోదు. ఇది సంఘనియతి యని నే నననుు. స్త్రీ పుంస స్వభావ నియతియే యిట్టిది. పురుషుడు స్వీయ యన్యగామిని కాదని నిశ్చయించి యాదరము వహించును. పరకీయ భర్తృగామిని కాదని సంతుష్టి పడును. సామాన్య యన్యగామిని యని తెలియగా ఆ పురుషుని యందు కోపము వహించును. స్త్రీస్వభావ మిట్లేయుండును. క్షేత్రయ్య పదములోని మువ్వగోపాలుని నాయిక మువ్వగోపాలు డేమయిన నయినా డని తలచిన నాతని నాలు గనగలదు. అతని నాకర్షించిన యామె నసూయింప గలదు. ఇట్టి సర్వవిశేషముల నిబంధనము నానా లోకజ్ఞతను గాని గలుగదు. క్షేత్రయ కన్నియును తెలియును. నాయికా విలాసము లెంతగనో నిరూపించిన వారి సర్వభేదములకు క్షేత్రశ్రీ పదావళి లక్ష్యస్థానము.

ఇది అసాధారణమైన తెలుగు పంట. శృంగార పరిపూర్ణత ఇందుమాత్రమే కాన నగు ననుట కేవలము క్షేత్రస్తుతి కాదు. స్త్రీకర్తృక పురుషకర్తృకము లయిన శృంగార భేదము లిందు సూక్ష్మముగా భావింప తగి యున్నవి. "మోము మోమున జేర్చుకొని కన్నుల నొత్తుక ముద్దు పెట్టు కొన్నాడే" ఇట్టి వనేకములు. నానా కథన మేల? "అనుకూలు డైనట్టి మగవాడు కలిగితే" కాంభోజి చూడుడు! స్త్రీకర్తృకములు బహుళముగా నున్నవి. విరహావస్థలో పురుష కర్తృకములను వారు భావించి, భావించి యూరట పొందుదురు. అప్పటిలో వారి కది యాశ్వాసము. భావ్యమాన శృంగారము సమకాలములో విరహదీపన మిచ్చినను అదియొక యోదార్పుగా తత్కాలమున స్త్రీలు సంతుష్ట లగుదురు. "అడపగత్తె వాని వంటి దైతే చాల" ఈ పదములో తన చెలియతో చెప్పు నాయికా భావనము ప్రేమయోగ పరిపాకమును సూచించును. ఇట్టి దొక సూచన. దీనిని బట్టి అన్యముల కూడ ఇట్లే సమన్వయము సంపాదింప వచ్చును. నాయకుడగు మువ్వగోపాలుడు అటు తిరగనీ! యిటుతిరగనీ! అతనిపై నాయికల వలపు లక్ష్యశుద్ధి కలిగి చిలవలు పలవలు వేయును. అందుననే నాయకుడు సర్వవిధ శృంగార నాయక స్వభావము కలిగి యున్నట్లు వర్ణిత మయినది. విశేషించి జ్ఞాతాజ్ఞాతములుగా నున్న నిత్యనైమిత్తికాదిరాగములు శ్రీక్షేత్ర పద దర్పణములో బింబించి యున్నవి. ఈ విధానమున గూడ మువ్వగోపాలుని మువ్వలను ప్రోగించి ధ్వని తేజము గుర్తించుట అవశ్యకము.

క్షేత్రయ్య పద సమీక్షకు నీ దృష్టియు నావశ్యకము. బాహ్యాభ్యంతర రతులు బాహ్యభేదములైన, ఆలింగన చుంబన దశనక్షత ఘట్టనాద్యనంత భేదములు క్షేత్రయ నిరూపణములో రూపము పొందినవి. అభ్యంతర రతుల లోని బంధగతులు పురుషాయితములు సమనీచాదిరతులు అన్నియు నిందున్నవి. క్షేత్రయ్య నాయికల యాసక్తిని భావనేత్రముతో చూచినాడు.

వేశ్యలు విద్యా విజ్ఞాన రూప సంపదుపేతలు దేవదాసీత్వము పొంది మధుర భక్తలై దేవళమున అభినయించి నారు. వారు సర్వవిధ నాయిక లయినారు. సర్వవిధ శృంగారానుభావములను ప్రకటించినారు. అవి వారికి శాస్త్ర విజ్ఞానమున నైన తెలియుట కవకాశము లున్నవి. ఇక నవి క్రొత్తలు కావు గదా! మువ్వగోపాలుడే స్వానుభవిత యని అభినయమున వారు నిరూపించినారు. తమ అనుభవితకు ఎట్టి తృప్తి యెట్టి ఆనందము వలయునో వారలకు తెలియక పోదు. సర్వానుభవ కాముడైన కృష్ణగోపాలునకు ఆనందము కలుగ జేయుటయే తమకు సంతోషము. ఇట్టి దేవదాసీ చిరకన్యలను క్షేత్రేశుడు సర్వనేత్రములతో చూచి వారలను గోపికలుగ చిత్రించినాడు. సర్వావయవ సుందర లయిన దేవదాసీల చతుర చతురభినయములు చూచి భావించి నాట్యరసజ్ఞుడైన సాహిత్యక క్షేత్రయ్య తనయందే నాయికాత్వ మాపాదించుకొనినాడు. అబలాయితమైన పురుషచిత్తవృత్తి యిట్లేయుండును. కేవలము నాయికాత్వము భావించుటతో తృప్తిపడక దేవదాసీత్వ మాపాదించుకొని కృష్ణ

ప్రియాత్వము భావించుకొని ఆత్మనివేదనాత్మక మయిన తుది భక్తిని పదాలలో సరూపము చేసిన క్షేత్రయ్య క్షేత్రజ్ఞుడగును. ప్రతిపదము నందు క్షేత్రస్వామి భక్తి పరత్వము చూపును. ఒక్కొక్క దిన మొక్కొక్క పదము నాతడు రచించుటకు మానసముగా సామగ్రిని సంపాదించి యుండునో! భావనలో పూర్ణ సాక్షాత్కారము పొంది క్షేత్రయ్య పదరచన చేసి యుండునని నేను భావింతును. క్షేత్రయ్య పదముల రచన మొత్తము కొన్ని వత్సరముల భావనా బలమై యుండవలయును. ఆత్మయోగ సాధకుల కంతటి భావన యపేక్షితము. సమున్నతమైన ప్రేమభక్తికి ఆ పద సముదాయము నిదర్శనము.

మఱి యొకటి. ఈ మువ్వపదాలలో చతుర్విధాభినయాత్మక మైన నాట్యము స్పష్ట సమన్వయము పొందును. ఈ యంశము మొదట మనవి చేసితిని. కొన్ని పదముల అర్థమును భావించితి మేని ఆహార్యాభినయ భూషిత మయిన రూపము సాక్షాత్కరించును. "మగువ తన కేళీకామందిరము వెడలె" నపుడు భావింపుడు. ఆ యా పదమునకు తగిన రూపమును చిత్రపటము నందు విన్యసించి దర్శించిన భావనా వైశద్యము అలవడును. అదే విధమున లాస్య తాండవ రంజిత మయిన అంగ ప్రత్యంగ స్పందములతో కూడిన ఆంగికాభినయము నిండుగున్నది. ఒక్కొక్క పద మభినయము జేసి చూపు వారున్నప్పుడు ఆడగలవారు చూడగలరు. వాచిక సంపద ఇందు సంపూర్ణమనుట వేరుగా ప్రతిపాద్యమే కాదు. ఈ పదావళి యుక్త లలిత పద బంధము కల పదకవిత్వ రచన. అందలి గేయసంపద స్వరశ్రుతి సుభగ మైన భాషలో పొందికగా కుదిరినది. ప్రసన్న గంభీర మయిన ఈ రచన యెన్నడును రచనా మర్యాదను విడనాడదు. ఈ అంశము నా "నవరసగంగాధరమున" స్పష్టము. ఈ అభినయ త్రయమునకు సారసంపదను సౌభాగ్యమును ఇచ్చిన సాత్వికాభినయము అసలీ పదావళికాత్మ. రసబంధురమైన కవితా పరిపాకము కలిగి భావ కోమలత పొనుపు కొని క్షేత్రయ్య క్షేత్రయ్య అయినాడు. ఇట్టి పదకవితా సంపదతిశయము ఇతర భాషలందు శక్యప్రతిపాదనమా? అనిపించును. సాభినయముగా వీనిని గానము చేసి నప్పుడు వీని అసాధారణత సహృదయులకు భాసించును. దేవాయతనములందు వీని నీనాడు ఎవరు గానము చేసెదరు? గానసభలు కూర్చుకొని కచేరి సాగించుట, ఆడకీర్తనలు నుగ్గ పాడుట, ఇంకను రక్తికట్టునని తోచదు. వారి వేషముతో వీరు, వీరి వేషముతో వారు ఆ యా పద ప్రయోగ సమయములలో మధురోద్ధతముగా లాస్యతాండవముల నట్టి యీ పద పెట్టుకొన్నచో నెంతేని సాహితీవిలాసము కలదు.

ఇతర భాషలలో నిట్టి సంపద నేను వినలేదు. ఇది యితర భాషలలో అనూదిత మయిన నెట్లుండునో! అయితే యీ సౌష్ఠవము వచ్చునా? రాకపోనీ! ఏతత్కవితా సౌభాగ్య మేని యితరు లనుకొందురు గావుత! సంస్కృతములో నెవ రనువదింతురు? పద్మావతీ చరణచారణ చక్రవర్తి! జయదేవా! రమ్ము! యిది నీ పని.

తెనుగులో శృంగార సంకీర్తనము లున్నవి. తాళ్ళపాక తిమ్మక్క నాథుడు అన్నమయ్య శృంగారపదాల విశిష్టత క్షేత్రయ్యకు తెలియక పోలేదు. అన్నమాచార్య పదములు వైష్ణవ తత్త్వ శృంగార ప్రతిపాదకము లయినవి. కర్నాటక పురందరదాస పదములు మాధ్వమత ప్రచారకము లయినవి. ఈ వైష్ణవమును మాధ్వమును మ్రింగి త్యాగయ్య రామభక్తి త్యాగయ్యనే మ్రింగివేసినది. త్యాగయ్య ఆర్తభక్తి కరుణభక్తి అద్వైతభక్తి రామభక్తి ధారలో విలీనమై యదియొక రాగరసధుని అయినది.

క్షేత్రయ్య తెలుగు భక్తుల భక్తి పంట పొలము. తనహృదయ కేదారమునందు మధురభక్తి సస్యము లన్నిటిని పండించినాడు. వైష్ణవాలంకారికుల మధుర శృంగారభక్తిలో ప్రసారము పొందిన గతిప్రగతు లన్నియు క్షేత్రస్వామి పదాలలో గోచరించును.

గోపీవిరహములో కృష్ణవేదనల కన్న కృష్ణవిరహములో గోపీవేదన లత్యంతము సుకుమారములు స్వభావరమ్యములు. ఇది గీతగోవిందములో విశదము. అచట నాయికల శృంగార లీలలు ప్రముఖ మధురము లయినవి. అది వారి ప్రేమ విలాసము. ప్రేమభక్తి గతి రమ్యత. ఆ ప్రేమరసము సరించి సరించి భక్తిలో పర్యవసానము పొందును. వైష్ణవభక్తుల రీతు లందంతట నీ విధానమే యున్నది. శ్రీరూపగోపస్వామి మొదలగు మధురభక్తులు ఉజ్జ్వలనీలమణి మొదలగు తమ గ్రంథములలో నీ విధానమునె విశదము చేసినారు. భక్తిప్రస్తార మంతగా నిచట ప్రతిపాదింప నక్కర లేదు. మువ్వగోపాల దేవు నాత్మీయముగ జేసికొనిన నాయికలకు దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అన్న ఆత్మికభక్తులు సంపూర్ణములై యున్నవి. అందును ఆత్మనివేదనమందు పరాకాష్ఠ యున్నది. ఎన్ని దేవుల చూచినను క్షేత్రయ్య నాయికకు మువ్వగోపాలదృష్టి మారలేదు. గోపాలదేవుడు వీరపురుషుడు. క్షేత్రయ్య నాయిక వీరనారి. లోకము నందలి స్త్రీ పురుషులలో వీరనారీత్వము గాని వీరపురుషత్వము గాని యుండదు. కేవల స్త్రీత్వము కేవల పుంస్త్వమున్న నే వీరభావ మంటు కొనును. లోకమానవులు స్త్రీపుంస ధర్మములతో మిశ్రితులై యుందురు. అలౌకిక మయిన ప్రేమభక్తి పరిపాక ముదయించి నపుడు ధ్యేయము దేవి యయినచో వీరనారి యగును. దేవు డయినచో వీరపురుషు డగును. క్షేత్రయ్య వీరనాయికయై పదము పాడెను. మానవ శృంగారము భక్తిశృంగారము రెండును పదములం దిమిడి యున్నవి. మానవ శృంగార రచన వలన ప్రేమభావము లోని విభిన్నరూపముల వర్ణనకు, నూతన సౌందర్య సృష్టికి, నవకాశము కలిగినది. హృదయహారి యయిన కావ్యకలా నైపుణ్యమమూర్తము లయిన భావములను ప్రత్యక్షముగ జేసినది. భక్తిశృంగారములో భక్తుని యాత్మ భగవానునిలో పతిభావము ననుసరించి భక్తి ప్రదర్శించును. భగవానుడు భోక్త. చరాచరము భోగ్యము. తన యందు భోగ్యదృష్టి యున్న నే భగవంతుని యందు భోక్తృత్వము సిద్ధ మగును. ఈ భక్తిలో జీవాత్మకు సంభోగమె ధ్యేయము.

చిరసంభోగమునకై ప్రేమమార్గము సహకరించును. క్షణకాల మేని విరహ సహన ముండదు. ఆ వైష్ణత మసహ్యము. క్షేత్రయ్య విరహము సహింపజాలని నాయిక యయినాడు.

వేశ్యారాగము వర్ణించిన కుట్టనీమతము కలావిలాసము వంటి గ్రంథములు సంస్కృతమున గలవు. కాని యవి వేశ్యారాగ దోషముల నిరూపించును. ఈ మువ్వపదములు కొన్ని వేశ్యారాగ నిరూపకములుగ నున్నను అనిర్దిష్ట బహునాయక ములు కావు. మువ్వగోపాలైక నాయకములు. కొన్ని పరకీయారాగ నిరూపణ పరము లయినను కృష్ణప్రేమ పరవశలయిన గోపీభావన తత్త్వము కలవి. స్వీయా రక్తిభక్తులు నిరూపితమయిన ప్రభాగములలో నుత్తమ దాంపత్యమున కేమిలోటు! కావుననే యంతట నాత్మనివేదనము గోచర మగునని యందును. అందే దాస్య సఖ్యములే కాక, శాంత వాత్సల్యములు, మాధుర్యము ననుగతము. నా దృష్టిలో నిచట క్షేత్రయ్య మువ్వగోపాల పదసముదాయము నందు మాధుర్య ముఖ్య మయిన యాత్మనివేదన ప్రేమభక్తి పర్యవసానాస్వాద్య మయిన తత్త్వము. ఇట్లే క్షేత్రయ్యను చూడవలయును.

ఇంతగా నున్న శృంగార మేమి! ఇది మధురభక్తి యగుట యేమి! భక్తులగు వారు గోపీభక్తి భావించి వివశు లగుట కలదు కదా?

"గోవింద ఏవ పురుషో బ్రహ్మాద్యాః స్త్రియ ఏవ చ"
"వాసుదేవః పుమానేకః నార్యశ్చ సకలం జగత్"
"యువతీనాం యథా యూని యూనాం చ యువతౌ యథా
మనోభిరమతే తద్వత్ మనోభిరమతాం త్వయి"

అని భావించు వారి కిది యుక్తమే. అందుననె యిట్టి వాని యం దశ్లీలమును లేదు. వంగీయుడు సుశీల కుమార చక్రవర్తి యిట్టి వాని విషయమున నిట్లనుచున్నారు.

"ఏఈ సకలపదే యూహా ఇహా సర్వస్వ అంతర్దృష్టిశూన్య భోసా భక్షణ కారీర నికటరూపవర్ణనా ఓ నాయికె నాయికార శారీరక సంబంధేర చిత్రాంకణ తాహా. తాహార సాధనపథ వలంబిదిగేర నికటమధురర సేర ప్రేమసాధనార భజన గీతి ఓ పరమప్రియతమేర నికట ఆత్మనివేదనేర మధురపుంకార"......... "అనేక భక్తవైష్ణవ ఏఈ శ్లీలతాదోషదుష్టపదగులి గాహితే గాహితే పులకాశ్రు పూర్ణ లోచనే భావే విహ్వాల హఇయా యాన, అనేక వృద్ధవైష్ణవ నితాంత అంతరంగ సంగే ఏఈ సకలపదేర ఆలోచనా కరియా అవిరల అశ్రుమోచన కరియా థాకేన. సాధారణసాహిత్యేర నికట యాహా నిందనీయ భోగవిలాసేర సంభోగేర విస్తృత నిపుణ వర్ణనా సేఇ పదఇ భక్తేర నికట యే మధురతత్త్వేర ద్వారోద్ఘాటన కరియా దేయ తాహా బుఝిబార సాధ్య ఆమాదేర నాఈ"

దీని భావము నిరూపించిన యర్థసంవాదము కలిగి యున్నది.

సాహిత్యమున కితరముల కన్న నొక విశిష్టత కలదు. హితములు హితకారులు నయిన నాట్యాభినయనముల సామరస్యము నాట్యము. నాట్యమె సాహిత్యము. శబ్దము శక్తి. అర్థము శివుడు. శివశక్తి యోగము శబ్దార్థసాహిత్యము. ఆది దంపతుల నిత్యశృంగారము సాహిత్యములో నవతరించినది. శృంగార కవితా విలాస సంపద శైవకవుల సొత్తు అయినది. వారు భక్తిశృంగారము చూప గలరు. అందు ప్రారంభమున శృంగార ముండదు. భక్తి యుండును. పర్యవసానమున శృంగార ముండును. త్రిపురసుందరీ శ్రీదేవి వారి యుపాస్య దేవి శృంగారదేవత. అందు శృంగారము పరమావధి. ఈ రీతి శంకరాచార్యుని దేవీస్తుతు లందు స్పష్టము. స్వాత్మోపభోగ దృష్టి లేని యా కవుల దేవీశృంగారము లోని సుందరత దివ్యము. పురుషుని తృప్తి యంతట నేకవిధ మగుట స్త్రీతృప్తు లనేక విధము లగుట సర్వానుభవసిద్ధము. దేవీసౌందర్యములో పరశివుని యొక్క తృప్తిని అనుసంధానము చేసిన కవుల మధుర వాఙ్మాధుర్యములు సంస్కృత వాఙ్మయములో గోచరించును. మూకపంచశతి, సౌందర్యలహరి దివ్యశృంగారము మూస పోసి కొన్న కవితలు, కాళిదాసుని దివ్యశృంగారము మానవ శృంగారమున కొకింత చేటుచేసినది. దివ్యు లయిన పార్వతీ పరమేశ్వరుల నిత్యలీలా శృంగారమును కూడ కవి మానవులకు సంబంధించిన యుత్తమ రతిగా నిబంధించినాడు. అతడట్లు చేయుటకు గాయత్రీ దీక్షితుడు వాల్మీకి నిరూపించిన సీతారామ దాంపత్య శృంగార మూహ నిచ్చినది.

సీత మొదటి నుండియు కష్టచరిత. తన రాముని జూచి తన కష్ట మంతయు మరచినది. పురుషుని సుందరత యిందు ముఖ్యమయినది. రాముడు దివ్యసుందర విగ్రహుడు. "పుంసాం మోహనరూపాయ నమః" ఇది వైష్ణవ శృంగారములోని లీల. అది శ్రీకృష్ణునిలో పరమావధి పొందినది. కృష్ణుడు మన్మథ మన్మథుడట! ఆ మన్మథ మన్మథుడు అనంతుడై నానా నాయికలను సమకాల సంతృప్తి నిచ్చె నట! కృష్ణ విషయ మయిన గోపీరాగము భాగవత రాసలీలలో మధుర భావ మయినది. అది శృంగార ప్రారంభము భక్త్యంతము నయిన భావన.

ఇది వంగదేశమున మధురమధురమై వ్యాపించినది. శాక్త శైవవిధానము లందున్న శృంగారరతి వైష్ణవ శృంగారమునకు పుష్టి నిచ్చినది. శాక్తములో సువాసినీ పూజ యున్నది. శైవములో గణారాధన మన్న పేరిట పురుష పూజ యున్నది. ఈ రెండువిధానములు నొక బౌద్ధములో వెలసినవి. అందు స్త్రీని పురుషు డారాధించును. పురుషుని స్త్రీ యారాధించును. ఆ యారాధనము ప్రేమారాధనముగా మారినది. ప్రేమారాధనము వైష్ణవ భక్తి ప్రాణము. ఇందు ప్రేమ పవిత్ర మయినది. పురుషశృంగారము ముఖ్యమయినది. పరమపురుషుడే పురుషుడు. ఇతర వ్యక్తులు స్త్రీలు.

శైవశృంగార గతులు నిత్యసంయోగ శృంగారరమ్యతనె నిరూపించుట కుద్యమించినవి. విరహ విధానము నంతగా నవి చూప లేదు. శివుని విరహములో దేవీవేద

నలు చెపుట ఆ భక్తుల కిష్టము కాదు. దేవీ విరహములో సమాధ పట్టిన శివుని వేదన చెప్పుటెట్లు? అట్లే చెప్పుద మన్నను శివవేదనలు రమ్యములా? క్షేత్రయ్య పురుష సౌందర్యము ముఖ్యముచేసి స్త్రీ విరహము నిట్లు నిరూపించెను. మువ్వగోపాల కృష్ణ సంయోగమునకు కాంక్షపడు క్షేత్రజ్ఞుడు విరహ పరితప్తాత్ముడై యిట్లు మంజుల మధుర భావము కలవా డగుట సాహిత్య ప్రేమయోగుల కందఱకు లలిత మృదుల మార్గము లభించినది. శ్రీ విస్సా అప్పారావు గారి సహానుభూతి హేతువుగా నా కిది లభించినది.

నమః క్షేత్రయ్య సాహిత్యసంక్లృప్త స్పష్టమూర్తయే
మువ్వగోపాల రూపాయ స్వాత్మనే రసరూపిణే

జమ్ములమడక మాధవరామశర్మ,
నవ్య సాహిత్య పరిషత్తు: గుంటూరు.

# క్షేత్రయ్య పదములు

## 1. శంకరాభరణము - ఆది

అందగాడ వౌదువు లేరా - ఆదివరాహా !
అందుకైతే జాణవు - అల్లందుకైతే జాణవు - ఆదివరాహా ! ॥అంద॥

ముప్పొవగలు జాలించు - మొగవారు లేరో సీమలోన
న్నప్పుగా బిలువ మనేవు - ఆదివరాహా !
తప్పు సుద్దుల కొల్ల నే - తాళే దానను గాను
అప్పుడే విన్నవించి నాను - ఆదివరాహా ! ॥అంద॥

విటరాయ ! నీతో జేరి - వేగించిన నా సొమ్ము
అటమరించేది న్యాయమా ? - ఆదివరాహా !
మటుమాయలు చాలించు - మా కియ్యవలసిన పైడి
అటుబెట్టి మాటలాడు - ఆదివరాహా ! ॥అంద॥

కోడెకాడవై మువ్వ - గోపాలుని వలె నాతో నో
రాడ జూచే వదేమయ్యా - ఆదివరాహా !
ఈడు లేని రతుల నేలి - యియ్యరాని బాస లిచ్చి
ఆషి తప్పకు దోసము - ఆదివరాహా ! ॥అంద॥

## 2. ముఖారి - చాపు

అక్కరో! నను బాసి నందు - కాడితి సింతే
చక్కని మా మువ్వగోపాలు - డెక్కడ నుండితే నేమి ॥అక్కరో॥

ఉప్పతిల్ల వాని మోవి - చప్పరించీ నింతే గాని
యెప్పుడు గల్గిన రసము - చప్పనయ్యీనా ?
అప్పిచ్చిన దొరల - కతివరో! తక్కీ నటవే?
తప్పదుగా విధికృతము - తరుణి! అల్లది కొన్నాళ్లు ॥అక్కరో॥

చాన యెంత ప్రౌఢైనాను - చౌశీతి బంధముల తోను
పూని పెనగీ నింతే వాని - మేను దాచీనా ?
ఆ నాతికే సతమానా! - నేను వలచి నటుల గాదా ?
కానీ యందుల కేమాయ - కలవే కలిమి లేములు ॥అక్కరో॥

మానినీమణులకు మంచి - మగని గంటె మనసు రాదా ?
తాను వలచి నటుల గాదా? - ఆ తరుణి ననవేలే
ఆసిన ప్రేమ మువ్వగోపాలరా - యడు మునుపటి వలెనే
తానే రాడా బావిలో నీరు - తరుణి! వెల్లువ బోవు నటవే ॥అక్కరో॥

## 3. కాంభోజి - త్రిపుట

అక్కరో! మగవాని - కెక్కడి వలపులే
ఇక్కడికి రాడు చెవ్వంది లింగ - డెంత జెప్పిన గాని తెలియ! ॥అ॥

రామరో! దానింట రాతిరి పగలు - రచ్చలు జేసినాడే
నా మనసు నొవ్వ నేమేమో దానికి - నమ్మిక లిచ్చినాడే
మోము జేర్చుకొని కన్నుల నొత్తుక - ముద్దు బెట్టు కొన్నాడే
యేమి సేతు నీ మాటలెల్ల విని - యేలాగు తాళుదు నే చెలియ ॥అ॥

నిన్న నేడు వచ్చెద నని రాకుంటే - సెలత! యూరకుందునా?
కన్నెరో! నవ్వుల కైన వానిపై - కాక చేసు కొందునా?

వెన్నవంటి మనసు వానికి నాపై - వెగటాయ నని విందునా ?
అన్నె కాడై వాడు నా వలపెల్ల-నారు దూరు చేసెనే చెలియ ! ||అ||

మువ్వగోపాలుని ముద్దు సఖుడని - మ్రొక్కి వేడు కొందునే
జవ్వన మెల్లను వాని పాలు జేసి - సంతోషించు కొందునే
యెవ్వతె యింటికి పోయినా వద్దని - యిది బుద్ధి కాదందునే
చెవ్వంది లింగ డింత రట్టు జేసి-చేపట్టె నను గూడనే చెలియ! ||అ||

## 4. * కాంభోజి - ఆది

అక్కరో ! వానికి నాపై హరషము లేదుగ
చక్కనాయె రా రమ్మని - సారెకు వేడిన గాని ||అక్కరో||

సిన్న వాని బిలువ బోతె - నీరజాక్షియును తాను
నన్ను జూచి తలుపు మూసి - నవ్వు కొంచును
సన్నుతాంగిరో ! యింతైన - సడ్డ సేయక యుండితే
నన్ను నే దూరుకొని - న్యాయము గాదని వచ్చితి ||అక్కరో||

చక్కగ జూడడు నన్ను - సరసాన మాటాడడు
వొక్క పూనైన మనసు - యువిద ! వానికి
మక్కువ యేమియు లేక - మగువరో ! నా చెలిమి
వెక్కస మాయెనో గాక - వెలది ! యేమి బోధించినదో ||అక్కరో||

## 5. అఠాణా - [1] త్రిపుట

అక్కరో! [2] యొర్వని వారు సరసుడుగాడని-యాడుకొంటె ఆడుకొనేరు
మ్రొక్కదగిన వాని ముద్దు మాటల వాని
మువ్వగోపాల సామిని యెవరైన గాని ||అక్కరో||

---

* ముద్ర లేదు, మూడవ చరణము లేదు.

1 ఆది 2 యోర్వలేని.

రామ వాని దలచి నపుడే - రవిక క్రిక్కిఱిసి గుబ్బ
లేమో రొమ్మెల్ల నిండునే - వాని మాటంటే
నా మనసు పై పై నుండునే - వాని జూచితే
నవనిధు లబ్బి నట్లుండునే - యెవరైన గాని ॥అక్కరో॥

ఇంతిరో వాడిందు వచ్చి - యెలమి కౌగిలించితే
యెంతో బడలిక దీరునే - వశము గాని
కంతు తాపము చల్లారునే - యింతే కాదు నా
సంతస మెల్ల జేకూరునే - యెవరైన గాని ॥అక్కరో॥

పూని మువ్వగోపాలుడు - పైని చెయి వేసితే, నా
మేన బులక లుప్పతిల్లునే - నా తమి రేచ
వానికే బిరుదు జెల్లునే - వాని గూడిన
మానస మెంతో రంజిల్లునే - యెవరైన గాని ॥అక్కరో॥

## ౬. ముఖారి - ఆది

అక్కర లేని కాపుర మాయె - నతని మనసు లేదాయె
యెక్కడి దిక దాని పాలాయె - నెవరాడిన రోసము లేదాయె ॥అ॥

మగువ! నా పేరు దలపడాయె - మమతలు మరపాయె
పగలు రేయి నందే యునికాయె - బాళి యెక్కువాయె
సొగసు లీ వెనుక మెండాయె - వగలు సేనాయె
యిగురు బోణులకు నవ్వు లాయె-నేమమ్మ వలపు మందమాయె ॥అ॥

ఇంటి దోవ తొంగి చూడడాయె - పొంటు వెదకుటాయె
వొంటిగా జెప్పి చాలాయె - నోర్పు లేదాయె
తుంట పడుచు సహవాస మాయె - మంటి ముక్కాయె
నంట ననుచు నీసు నిండాయె - [1] నడగించని గొప్ప ముత్తైమాయె ॥అ॥

1 నడకించని

దాని పొందు సంతోస మాయె - దైవము తోడాయె
చానరో! నా పొందు కల్లాయె - సడ్డ లేక పోయె
తాను మువ్వగోపాలుడాయె - దయలు దూరమాయె
కాని వారి కిది వేడుక లాయె - గయ్యాళే వానికి సత మాయె ॥అ॥

## 7. ఘంటారవము - ఆది

అట్టె యుండేవు సుమీ! - నా ప్రాణనాథ!
అట్టె యందుండ కిందు వచ్చెద నని
యాన బెట్టితివి సుమీ! నా ప్రాణనాథ! ॥అట్టె॥

ఇంతలో నీ వీడకు రాకుంటే కన్నీరు [1] కా - వేరి కాలువ సుమీ!
ఇంతింత నీ కెమ్మోవి తేనె లాన కుంటె - యిదిగో నో రెండేసి
సుమీ! - నా ప్రాణనాథ! ॥అట్టె॥

వినరా నీవు కౌగిట లేకుంటే పున్నమ - వెన్నెల వేడి సుమీ!
వనజాక్ష! నీ వీడకు వచ్చేదాక తల - వాకిలె యిల్లు సుమీ!
నా ప్రాణనాథ! ॥అట్టె॥

మరచి యెవ తెతో నైన మాట లాడేవుగనుక-మనసు విరిచెదరుసుమీ!
శరణు మువ్వగోపాల! యీ రేయి గూడ - జాగు సేయకనె
రమ్మీ! నా ప్రాణనాథ! ॥అట్టె॥

## 8. పంతువరాళి - త్రిపుట

అడవ గత్తె వాని వంటిదైతే చాలా - అరుదూరు గాదు గదా!
పడతిరో! మా మువ్వగోపాలు డిటువలె
బాడి దప్పినందుకు, ఓ చెలియా! ॥అడవ॥

---

1 కావేటి.

కలికి నేను లేనప్పుడు దానికి - గన్నుల మొక్కునట
ములుచదైయె తనకొక్క ముద్దు బెట్టుమని - మూతి చాచునట
కులుకుచు మడు పందుకొనుచు దాని చెయ్యి - గోరు దాకించు నట
తొలగి నాతో నవ్వు దోస మని యది - తోదోపుల వచ్చెను,
ఓ చెలియా ! ॥అడవ॥

వీరు వారిచ్చట సిండేరు వాకిలి - వేసి రమ్మను నట
సారెకు దానితో బచ్చి దేర మిగుల - సరసము లాడునట
చేర రావద్దు వద్దనగానే పైటలో - జేయి వేయ వచ్చునట
మేరు మాసిసి కాగా నందుకు లో గాక - మించ నాడి వచ్చెను,
ఓ చెలియా ! ॥అడవ॥

కోమలి ! నే నీడ నుండు కెల్ల నీ - కోస మని పలుకునట
వేమరు దానిపై పండ్లు గోరికి చాల - వెరపించి చూచునట
ప్రేమతో నిను గూడ కున్న నన్ను నీ - పేర బిలువ మనునట
భామరో ! యిటువంటి మువ్వగోపాలుని - పదరి పొందు జేసిత,
ఓ చెలియా ! ॥అడవ॥

## 9. ముఖారి — చాపు

అడుగరమ్మా ! 1 యతనిపై నూరక - అలగి నానటరే ?
పడుచుదనము మాని మువ్వగో-
పాలరాయని నానబెట్టి మీా ॥రడుగరమ్మా॥

పూని దానింటికి పోగాను మా - పొలతి చూచి బెదరించిన
దానికి లంచ మిచ్చెద నన్నది - తానో ? నేనో ?
వానిపై లేనివి కల్పింపరాదు - వాడ వనిత లెల్ల వినగ
దాని నే జూడక తాళ లే నన్నది - తానో ? నేనో ? - ఆన బెట్టిమీా
॥రడుగ॥

1 వానితో ఊరక అలిగినానటవే

అలుకు దీరి దాని వాకిట - పిలిచి వీధిలో నన్ను జూచి
తలుపు మూల దాగి యున్నది - తానో? నేనో?
అలసి వచ్చి ననుచు జక్కి - రానవా లిచ్చిన నారగించి
తలిరుబోణి మోవి రుచికి రా దన్నది - తానో? నేనో? ఆన బెట్టిమీ॥
॥రదుగ॥

పొలపు మీర దాని రూపు - పలక మీద వ్రాసి పాణి
తలమున నుంచి కనుగొను చున్నది - తానో? నేనో?
కలసి మా మువ్వగోపాలరాయని - గౌగలించితే అల్ల దాని
తలచి యసురసు రన్నది - తానో? నేనో? ఆన బెట్టి మీ॥ ॥రదుగ॥

## 10. కాపీ — చాపు

అదరీనె మోవి తనకు దానె - వదలీనె నీవి
మదిలోన వా డేమొ - మంత్రించె గాబోలు
సుదతి మువ్వ గోపాలు - జూచిన మొదలు ॥అదరీనె॥

ఇది యేమో మాయో - చిలుక వచ్చి - బెదరించి పోయో
నిదుర కంటికి రాక - పిన్నటాల నుండి
చెదరీనె చిత్తము - చెలియ యేమి సేతు ॥ అదరీనె॥

అప్పుడే కొమ్మా! నన్ను వా - డడిగించె నమ్మా!
చొప్పక మా వార - లూర కుండుట జూచి
1 యుప్పతించి వా - డుసురసు రనె నేమో ॥అదరీనె॥

లీలతో పిండు వచ్చి తగి - లించెనే మందు
బాలరో! మువ్వగో - పాలుడు నను గూడ
నీ లాగు నేమేమో - జాలము జేసేను ॥అదరీనె॥

1 యుప్పరించి.

## 11. [1] బేగడ - త్రిపుట

అది నోము ఫలమే - ఓ చెలియా !
పదరవే, మువ్వ గో - పాలుని తోను ॥అది॥

ధనము చేత జ - వ్వనము చేత జక్కదనమున నటవే - ఘనతలు
వినయము జాణ - తనము గలుగుట - వినుతి కెక్కరే వనితలు ॥అది॥

మించి వయ్యెద - నుంచి చాల లా - లించి వేరనీ యెంచక
మంచి వాని ర - మించ [2] గలుగుట - చంచలాక్షిరో ! కొంచెమా
॥అది॥

మేలువాడు ని - న్నేలిన మువ్వగో - పాలు నేచు టది [3] మేలటవే
నాలిముచ్చు గ - య్యాళి వైన నీ - కేల కల్గునే తాలిమి ? ॥అది॥

## 12. * కాంభోజి — జంపె

అనుకూలు డైనట్టి మగవాడు గలిగితే - అంత కన్నను సంభ్రమ
మున్నదా !
వినవమ్మ ! అలిగి యుండినను కూటమి సేయు వేడ్కలకు
వెలయుచున్నదా - ఓ చెలియ ! ॥అను॥

పడతి నేటికి తప్పు గావు మని నను - గదియ కౌగిట జేరుచు
బట్టి అడుగు కొని
చెలిమి జెక్కిలి నులిమి తొడల పై నిడి -? తనదు వలకేలను
పెడ మరల బొరలించి
సడలి యున్న ముంగురులు - కడకొత్తి నెమ్మొమున యెడసి
పొడలిన వగల
తొడిబడీ నను గనుక - యిట్లు సంభ్రమముచే మురియగవచ్చు ॥అను॥

1 పంతువరాళి. 2 గడగుట. 3 మేలటే.

* అన్వయ కాఠిన్యము; యతిప్రాసలు సరిగా లేవు; చరణములు పెద్దవి.

చలమేల నా తోడ బలుకవే! యని పేర - బిలిచి నను చెక్కునొక్కి-
మొలకట్టు సవరించు గతి నాభి నిమిరి - పులకలు మేన బొడమ జేసి
సొలపు చూపుల తనదు జాలి దీర్పవె! యనుచు
మొలక చను మొన నలుపుచు
అలివేణిరో! యెంత కలసి మెలసిన గాని
ఆదు కొమ్మని వేడునే ఓ చెలియ! ||అను||

కులుకుచును మోము గళమున నప్పళించి జిలిబిలి గళరవము చెలగగ
కళల నెలవె ఆగి అగ్గలపు తమి కొసరి - పలుకుల కేరి ముద్దుబెట్టి
కులుకుచు కిలకిల నగుచును - కలసే మువ్వగోపాలు లాలించగా
వలరాజు కేళి బరవశముచే నానంద - జలధి తేలన వచ్చుగా ఓ చెలియ!
||అను||

## 13. మధ్యమావతి — త్రిపుట

అనుకో వనే మున్నది? - అక్కర లే నందుకు
ఎనసి గూడిన న - న్నెడ బాసి నందుకు ||అనుకో||

మోము మోమున జేర్చి - మో వీయ నైతినో?
ఆముకొనిముచ్చట లాడ నైతినో!
నోము ఫల మింతే - నో మోహనాంగిరో!
పామాడి జోగివలె బోయె నా బ్రతుకు, ||అనుకో||

అలమి కౌగట జేర్చి - యందుకో నైతినో?
కులుకు గుబ్బల రొమ్ము గుమ్మ నైతినో?
తలిరు,బోణిరో! వినవె! - తనకు గాని భూమి
ఫలమై యేమి, యెవరి పా లైతే నేమి? ||అనుకో||

మరు కేళి నెనసి నా - మనసీయ నైతినో
కర మెంచి యుపరతి గలయ నైతినో
తరుణి ! మువ్వపురి - ధాముడు నను గూడి
అరటాకు ముల్లు సామ్య మైనందు కిప్పు ||డను||

## 14. అసావేరి — త్రిపుట

అనుసరించిన రాడు - అలిగితినో రాడు - వనితా ! యీ నెన రేమొ
తన కేమైనాను మునుపటి వలె నేను-మనసిచ్చి కలియ నైతినా?||అను||

వద్దికి రమ్మని మువ్వసామిని బిలువగా - సద్దు సేయక మానెనే !
గద్దరించి నా పైని - మదిలో మర్మ మెంచక
పొద్దు మాటలు మాని వద్దికి రమ్మనే ||అను||

మగవారి మాటలు - జగమందు నే గాన - నగరా? సరివార లోన
మగువరో ! చిగురాకు - మడుపు లీయగ బోతే
వెగటాయె నతనికి యే మంటినో సామి ||అను||

తెలియ జెప్పెద వినవె ! అల్ల నా సామిని తోటి
మొలక నవ్వు లాడి రటే !
బలిమి చేసిన రాడు, తొలివోము లాయె నేడు
కలసితి ఫల మని తెలిసి మువ్వగోపాలు ||నను||

## 15. శంకరాభరణము — ఆది

అప్పటికి నిన్నెంచెదనే - అతివ !
ముప్పొంగి యల - మువ్వగోపాలుని దోడి తెచ్చిన ||అప్పటికి||

పసి బూని నా కొఱకై - నెనరు బుట్ట మాటాడి
ఘనమైన విరహ వేదన దీరను
వనితరో ! నా ప్రాణ - వల్లభు నోన గూర్చి
కనికరముల మనసు లొక్కటిగ నుండ జేసిన ||అప్పటికి||

ఇదివరకు విభు గౌగి - లెడ బాసి 1 యెరుగ గనుక
తుద మొద లిది యని - తోచక మది
చెదరి దిగులు చేత - జిక్కిన నను జేర్చి యిందు
వదనరో! నను గా - వలసి నడుచు కొన్న ॥అప్పటికి॥

మునుపటి వలె మాలి - మిసి మువ్వగోపాలుడు
కనుక దీర నన్ను మరు - కేళి నేలగా
అనుదినము నీ లాగే - మెససి యుండుడను
కనకాంగిరో! మాటవాసి - గట్టిగా గై కొన్న ॥ ॥అప్పటికి॥

16. కేదారగౌళ — త్రిపుట

అమ్మ! నే జెల్ల చాలు నీ వెక్కడి - యాడదానవే!
సమ్మతితో మువ్వగోపాలుని పొందు - సతమని యుంటివి ॥అమ్మ॥

ఎంత వల పైనను మొగవాని కస - మిచ్చి మాట లాడుదురా?
యింత లోనే వాడు రాకుంటే - చింతల జిక్కుదురా?
సంతస మెన్నడు లేదాయనో! వాని - సద్దు సేతురా? బుద్ధి
మంతురాల వని వద్దంటే మున్ను నా - మాట విన వైతివి! ॥అమ్మ॥

కలికి! ప్రాణేశ! రమ్మని బయలుగా - గౌగిలించేవు
పలుకరించి యదేమన్న నా తోడ - భ్రమసి మాటాడేవు
పలుమారు వాని పేర జెలికత్తెల - బిలిచేవు యెందు
వలచే వారు కద్దు, సీమలో నీ వలె - వలచే వారు లేరు ॥అమ్మ॥

ఇది యేమో యన్నము వాని పొత్తునే గాని - హితవు గా దనేవు
మదిరాక్షి! మువ్వగోపాలు నొద్దనే గాని - నిదుర రా దనేవు
బెదిరేవు వానిపై మనసు నిలుపలేక - మొదలె కూడి నావు
మొదలోని వెత దీరదు నీ మోహ - మింతకు వెచ్చెగా! ॥అమ్మ॥

---

1 యెరుగక.

## 17. మారువ – ఆది

అమ్మమ్మ ! నీ వెంత నెఱజాణ వైనావె ?
ఎమ్మెలాడి ! మువ్వగోపాలు నిటు తోడి తేవే ! ॥అమ్మ॥

చిరునవ్వు నవ్వు తా వచ్చి చే పట్టినదే కాని
మెరుగు పయ్యెద దీసే దెరుగవే నెత్తి
కురులు నెరుల దీర్చి విరులు జుట్టినదే కాని
చురుకు కెంపు మోవిపై నుంచంగ నేమి దెలియ నైతి ॥అమ్మ॥

చెలియ ! యేకాంత మునకు చెవి చూచినదె కాని
వెలయు ముద్దు మాటలు విననేర నైతి
గళము ముద్దిడి నన్ను గారవించినది గాని
తళుకు జెక్కుట గోరు తగిలి నొగిలేమొ దెలియ నైతి ॥అమ్మ॥

గరిమ మువ్వగోపాలుడు కౌగిలించినదె కాని
యిరువరిమేనులొరసే దెరుగ లే నైతి
విరిబోణి ! పోక ముడి విడచి అంతరంగమున
మరి యేమో చేసెనో మగువ ! యేమి దెలియ నైతి ॥అమ్మ॥

## 18. కల్యాణి – చాపు

అమ్మా ! యిటువంటి వాని కేమి సేయుదునే ?
కొమ్మ ! మువ్వగోపాలుని గుణము జెప్పెద విన వమ్మ ! ॥అమ్మా॥

పయ్యెద జే బట్టు కొని – బాయ జాల నని వాడు
సయ్యాట లాడుచు నన్ను – చాల వలపించు నమ్మ ॥అమ్మా॥

దబ్బున పడకింటిలో – దాగి యుండుకొని నాడు
గబ్బి గుబ్బలను బట్టి – కన్నుల నొత్తు కొను నమ్మ ! ॥అమ్మా॥

సమ్మతించక నే నుంటే – సారెకు నదలించి చూచి
కమ్మవిల్తు కేళి లోన – కౌగలించి కూడు నన్ను ! ॥అమ్మా॥

## 19. పున్నాగవరాళి — త్రిపుట

అయ్యయ్యో ! నా వంటి తొయ్యలి నేచేది
అయ్యలూ ! తగునటరా ?
నెయ్యముతో నిన్ను - నెరనమ్మ లేదా
గయ్యాళి బోధన కాదనరాదా ? ॥అయ్య॥

ఇచ్చిన నమ్మిక లే మాయ నలనాటి - మచ్చిక లన్నియు మరచితివా!
ముచ్చు మందుల మారి - ముదిత ననవలె గాని
యచ్చోట నిన్నన నగునా నా సామి ! ॥అయ్య॥

1 కలనైన నా యిల్లు - కదలని వానికి
చెలియ పెట్టిన మందు తల కెక్కెనో
వలరాజు బారికి వశము గాదు రా రా !
పలుకవు నే నీకు పగదాన నటర ? ॥అయ్య॥

మాలిమి మును న - న్నేలిన మువ్వగో
పాల ! యీ చలమేల ? లాలించరా !
తాళజాల విరహ - తాప మగ్గలమాయ
జాలిబెట్టకు మిక సరసకు రారా ! ॥అయ్య॥

## 20. 2 నాదనామక్రియ — త్రిపుట

అయ్యయ్యో ! వెగటాయెనే !
పయ్యెద మీద జేరి - పవ్వళించి యుండే సామికి ॥అయ్యయ్యో॥

వెలది నా మోము రెప్ప - వేయక కనుగొన
కలయ నిండు సంజ చీ - కటి గమ్మితే

---

1 కలనైన నీ మాట కాదన లేక చెలిమికే హితముగా - మెలగుచును
వలచి నట్టి నన్ను - వద్దికి రమ్మని పలుకరించవు నీకు పగదాన నటరా ? ॥అయ్య॥
2 లలిత - త్రిపుట.

కలికి నీ ముద్దు మోము - గానరాక యుండునని
తెలిపి ప్రొద్దుండగానే - దీపము దెమ్మనే సామికి ||అయ్యయ్యో||
ననబోడి! విను మమ్మ! - నా పై చాల ప్రేమచే
తన దంతమున నా యు - ధరము నొక్క
మొనసి మాటాడితే - మోవి విడువ వలె ననుచు
యనువ చే సైగ - లాడు చున్న సామికి ||అయ్యయ్యో||
మదిరాక్షి! వినుమమ్మ! - మా మువ్వగోపాలుడు
పొదురించిన గౌగిలి - వదలీ నని
పదరి శయ్య మీాది దు - ప్పటి కొంగులు నాలుగు
ముదముతో గట్టిగా - ముడిగొను మనుసామికి ||అయ్యయ్యో||

## 21. భైరవి — ఆది

అయ్యలూ! నీ విట్ల - అలగి యుందుర!
తియ్య విల్తుని గన్న - దేవా! మువ్వగోపాల! ||అయ్యలూ||
కలికిరో! రమ్మని - కస్తూరి మకరికల్
వలచు చెక్కిళ్ళ పై - వ్రాయు నపుడు
* చెలగి మాటాడక - చేరిక నొందక
చలమున నవ్వులకు - జడగొని బెదరించితే ||అయ్యలూ||
జంటి పనుల దీరిన - జాఖువా రవికయు
తొంటి కైవడి మించి - తొడిగి చూడు మనుచు
జంటవై నీవు నా - చను మొన లంటగ
కంటి నీ వగ యని - కన్నుల బెదరించితే ||అయ్యలూ||
విందుకు రమ్మని - వెలలేని నా మోవి
విందారగించిన - వింత గనుంగొని
అందుకు బదులుగా - నలమి నే పైకొని
పొందు వేళలో నిన్ను - బొమముడిసి బెదరించితే ||అయ్యలూ||

---

* చెలువుడా! నీ గోటి చెనకులు మించగ

## 22. భైరవి — త్రిపుట

అలిగితి వెందుకు ? అల మువ్వ గోపాలునితో - ఆయాయ పోవే !
నెలతరో ! నీ వంటి నిర్దయురాలను
యిల నెందు గాన యిదియేమి వానిపై ||అ||

భామరో ! నీ మది కేమని దెలుపుదు
కోమలాంగుడు నిన్నే కోరియుండగను
వే మారు నీ వేమొ అడిగి నావని వాడు
నోముఫల మని నొచ్చు కొన్నాడట ||అ||

దలువ చక్కెర పురి నిలయు డని మదిలో
వలవేసి నిను వలపించ లేద
కళలూర రతి కేళి కలసిన పిమ్మట
చెలువుడ ! నీ పొందు చాలు పొమ్మని ||అ||

ఎనసిన వానిపై కినుక సేయుట నీకు
మనసు యెటువలె వచ్చెనె మానవతిరో !
నెనరు గల దానవని విభుడు యిందు రాగానె
వనజాక్షిరో! వాని వలపు లారడి జేసి ||అ||

## 23. ఉసేని — త్రిపుట

అలిగితే భాగ్య మాయె - మరేమి వా - డలిగితే భాగ్య మాయె
తలిరుబోణిరో ! వాని - దండించ గలన ? వా ||డలిగితే||

అరసొంపు మాట - లాడే వానికి నే
తరుణిరో ! మంచి - దాన నయ్యేనా ?
సరసకు రాడాయె సకియరో ! నా మోము
తిరిగి చూడడేమో - దేవు డున్నాడు, వా ||డలిగితే||

బాళి లేదిక - నేల నాతో బొందు
చాలు గాబోలు - సంతోషమాయ
నీ లాగు నే వాని - కితవు గాదేమో
నీలవేణిరో ! నాటి నెనరించుక లేక వా ||దలగితే||

బాల ప్రాయము నాడె - భ్రమయించి నన్ను వా
డేలిన సుద్దు లెన్నెన్నో గలవు
చాల నాతో బా - సలు చేసి నాడే, యో
బాలరో! మువ్వ గోపాలు డిప్పుడు వా ||దలగితే||

## 24. ఘంటారవం — రూపకం (పంచఘాత మట్టెం)

అలిగి యేల నిందు వచ్చితి ?
నయ్యయ్యో ! యింక నేనేమి సేయుదు
చిలుకల కొలికి ! చింతలో నెంత - చిన్న బోయెనో ? ||అ||

జలజాక్షి ! నా యురమున నే కాని - శయ్యపై నెన్నడు పవ్వళించదు
అలరు నా మోవి పానకమే గాని - యన్నము ముట్టదు
పలుమారు నా తోనే గాని
ప్రాణపద మైన చెలులతో ముచ్చట లాడదు
చెలియ నా పాదములకే గాని - చెయ్యెత్తి దేవర కైన మ్రొక్కదు
యొలనాగ మదన వేదన చేత నెంత బడలెనో ||అ||

కలికి నన్నే గాని యొరుల గలనైన - గన్నెత్తి జూడ నొల్లదు
ఎలమి నన్నే గాని మనసులో - నేమియు నొల్లదు
కలకంఠి నను బాసి నందు వలన - కన్నీరు నించెనో
ఎలమి బాసి నందువలన - ఎంత నొగిలెనో ||అ||

కూరిమి నా సామి యను గాని మువ్వ
గోపాల! యని పేర పిలువ నెన్నడు
ఆరూఢి రతికేళి తానే గాని - నన్నలయ నీయడు
వారిజముఖి నే నలిగితే తానే వచ్చి వేడు గాని - పరుల నంపడు
యే రీతి తాళెనో యెటువలె నున్నదో - యెంత బడలెనో ||అ||

## 25. సారంగ — చాపు

అలుక దీరెనా? నేడైన మీ - యలుక దీరెనా?
పలుకు లాడు కుంటిరా? మువ్వ గో
పాలుడు నీవు ముద్దుల గుమ్మ! మీ ||యలుక||

చక్కెర బొమ్మ! మీ యిద్దరి మనసు - చల్ల నాయెనా?
నిక్క మానతీయవే! నేడు మీ - నెంజిలి దీరెనా?
మక్కువతో నేడైన మీకు - మంచి దిన మాయెనా?
అక్కడిక్కడ విభుడు నీవు - నసు రసురసి యుంటిరే? చెలియ! మీ
||యలుక||

సుదతిరో! యొకరి కొకరు మోములు - జూచు కొంటిరా?
పెదవు లాని తియ్యని ముద్దులు - బెట్టు కొంటిరా?
అదుము కొని కౌగిళ్ల నిద్దలు - గదసి యుంటిరా?
పదరి వానికి నీకు బోయి - పగల వలెనే యుండెనే? చెలియ! మీ
||యలుక||

బాలరో! నేడైన నేకశయ్య మీద - ఒవ్వళించిరా?
మేలుమేలని యిద్దఱి వలపులు - మెచ్చు కొంటిరా?
చాలవేడుకతో మువ్వగో - పాలుడు నీవు గూడితిరా?
వేళవేళల చాడి మాటలు - వింటి మనుకొంటిరి 1 గదవే; మీ ||యలుక||

## 26. సావేరి — ఆది

అలుకో ! పొలయలుకో ! - తెలియ దమ్మలార !
తలపులు తెలియ వలెను - దాళరే మీరు చెలులార ! ||అలుకో||

కన్నె చిన్నతన మేమంటే - కన్నులు తేల వేసెను
చిన్నెలు జూచి యాపె విభుడు - చిరు నవ్వు నవ్వెను
ఉన్న రీతిదే మంటే - యువిద ! యెంతే నుసుర నెను
వెన్నుని నే నదలించితే - విని విన నట్లుండెను ||అలుకో||

చెలియ విభుని భుజముపై - జేరుక పోతే వలదని
సొలపున జెంగట గూ - ర్చుండు మనెను
అలివేణి ! యతని కెమ్మోవి - యానెద నని యందుకో బోతే
చెలువు డావలి మోమై తన - చెక్కిలి గదియించెను ||అలుకో||

రమ్మని తిల్లగోవింద - రాజా ! యని పిలిచితె
కొమ్మరో ! తన పేరు మువ్వ - గోపాలు డనెను
యెమ్మెతో మీ యిద్దరు - నెనసి యుంటిరా ? యంటె
నెమ్మితో నాపె కద్దనెను - నెలత, యతడు తల యూచెను ||అలుకో||

## 27. భైరవి—త్రిపుట

అవునమ్మ ! మీ కేమి - అందరు బోధింతేరు
నవు గాదు వాని గుణము - నాటి వలెనే లేదు ||అవు||

ఎదురుగా తలవాకిట నే నెంత సేపై నాను
యిదే వచ్చునో యనుచు హితవుతో నేను
పదముల మీాద కడుగ - పన్నీరు చే బూని
సుదతి నంపినా రాక - చులకనగా జూచే గాని ||అవు||

సరిప్రొద్దు దాక ఆ - సఖియ యిల్లే మరుసి ద
ర్శనమున జోడు బాయక యుండగను
వరుస పడకింట తా నేకాంతమున నుండ
మరుకాక కుందిన - మన సెరుగ డింతే గాని ||అవు||

చక్కని మువ్వగోపాల - సామి ! రమ్మని పిలిచితే
యిక్కువ లంటె నా ప్రేమ - యెనసి యున్నాను
చక్కెర కెమ్మోవాని - చయ్యనగా నన్ను జూచి
మక్కువతో వాడుండే - మనసు దెలియదు గాని ||అవు||

28. మధ్యమావతి — ఆది

ఆడ బుట్టువు బుట్టు న - న్నలయింతుర !
వేడుకొన్న రాడే యిపుడు - విభుడు మువ్వగోపాలుడు ||ఆడ||

మ్రొక్కి వేడిన వినక - మోడి జేసేది న్యాయమా ?
అక్కరో ! నా మోహా మి - ట్లారడయ్యె గా
దక్కి దక్కించు కొనే నంటే - దయ యెంతైన దెలియ నీడు
సక్కము వానికి గాని - నెమ్మని చెలువ మేమి సేయ ||ఆడ||

పండు వెన్నెల కాకాయ - భావజు డమ్ముల నేయ
గండు గోయిల రవళి - మెండాయె నిపుడు
కండ చక్కెర మోవిచ్చి - కౌగలించ డాయె
సిండు వేడుకల వాని - నెనయని తనువేమి సేయ ||ఆడ||

ఏపు మీర చిన్ననా - డెనసి నన్నేలిన వాడు
రాపు చేసి రా కున్నాడు - రమణిరో ! నేడు
పాపజాతి నా వలపు - పడతి యెటుల గూడు
కోపగించి రాడు మువ్వ - గోపాలు డైన విభుడు ||ఆడ||

## 29. ముఖారి - ఆది

ఆలాగే మంచిది కాని - మ్మనవో యమ్మా!
బాల మువ్వ గోపాలుడు - పంతమె సాధించె నమ్మా! ||ఆలాగే||

వినవే! వానికి నా చేతి - విడె మైనను గారాదట
తన యెదురు కట్ల నిలి - చిన కాదట!
నను జూచిన పాపమట! - నా మాటుంటె సైచడట!
తనకు గాని యీ మేను - దాచి యెవరి కియ్యా నమ్మా! ||ఆలాగే||

విరిబోణి! నే నున్న యింటి - పొరుగిల్లైన జేరడట!
అరసి నే వచ్చిన దోవ - నైన రాడట!
మరి నా వలె నున్న ప్రతి - మలనైన గనుగొనడట!
సరసిజాక్షి! యీ పాపపు - జన్మ మెవరి కియ్యా నమ్మా! ||ఆలాగే||

వనిత! మువ్వగోపాలుడు - తను దా నొచ్చుకొన్నాడట!
తనతో నేమి పని యున్నది పొ - మ్మని నాడట!
యెనసి నది కల్లలట! - యిచ్చిన బాస లేదట
మనసు లేసి వానితో నే - మల్లాడి యెందు కియ్యా నమ్మా! ||ఆలాగే||

## 30. ఆహిరి - చాపు

తాళరాదమ్మ! ఆ - వేళ జూచి యింత - వెత జెంద జేసెనే
.... .... .... .... .... .... .... (?) ||తా||

పన్నె సామిని బాసి పగడము వంటి - వాని పాదముల నా
కన్నుల నొత్తు కొందునో - కలికిరో! యిపుడు ||తా||

మరులైన వాని ముద్దు మోము కన్నుల జూడగ
పరితాప మెల్ల దీరు మరు బారి చేతను ||తా||

అతివరో! మువ్వగోపాలుడైన శ్వేత వరాహుడు
రతికేళి దేల్పడో గతదేసతి మింటి వలె నీక? మరుబారి చేతనే ||తా||

## 31. సురట- 1 త్రిపుట

ఇంటికి రా నిచ్చేనా? యీ మేనితో - నింతి వాని దలచేనా ?
గొంటు కాడు మువ్వ గోపాలరాయుడు
తంటలు చేసితే దండించక విడిచేనా? ||ఇంటికి||

ఇతనికి వెరచి నే - నిక లంచ మిచ్చేనా?
ఇన్నాళ్ళ వలె ననుస-రించేనా ?
బతిమాలి నే రాయ - భార మంపించేనా?
పతి యని మునుపటి భక్తి దయ లుంచేనా? ||ఇంటికి||

ప్రేమ దలచి తన - మోమైన జూచేనా?
ఏమి చెప్పిన నిజ - మెంచేనా
రామ అయినదె గాని - రచ్చకు వెలిచేనా?
ఆ మాట సభలో నే-ననక విడిచేనా? ||ఇంటికి||

ఎనసిన మొకమాట - మెంతైన జూచేనా?
యెంతో వేడిన మన - సిచ్చేనా?
వనిత ! పట్టిన పట్టు - వట్టి దనిపించేనా?
పసి బూని మువ్వగో - పాల ! యని పిలిచేనా? ||ఇంటికి||

## 32. కళ్యాణి - ఆది

ఇంటి కేల రాడే ! ముద్దుల బాల ! - నే తాళ జాల
ఇంతిరో ! విరహ మెచ్చెనే చాల
కంటకుడై యున్నాడు - కందర్పుడు మదిని
బంటు వంత మిదే మేలా - పడతితో ! వరదు డీ వేళ ||ఇంటి||

చిన్ననాడే వలపించినాడు నా మేలువాడు
అన్నెకారి చాడి విన్నాడు
నన్ను కలలోనైన జో - డెన్న డెడ బాయని వాడు ॥ఇంటి॥

భాసురాంగ సేయు మాయవల్ల - నలగి నాడల్ల
భావ మేమో తెలియదు మెల్ల మెల్ల
నా సరి వారిలో నెల్ల - నగు బాటు చేసెనే, జెల్ల! ॥ఇంటి॥

కూరిమితో మరు కేళిలో నన్నేలు మువ్వ
గోపాలు డెంతో సంతోసాన
నారీమణి నేలి నేడైన - మీరిన మోహముతో నా ॥ఇంటి॥

## 33. [1] పంతువరాళి - చాపు

[2] ఇంతకంటె దా నన్నేమి చేసీని - యింక గొంత యున్నదో
పంతముతో మువ్వగోపాలరాయ డా - పడతి యింట నుండి ॥ఇంత॥

ఆసతో నే గౌగిలించుకో బోతేను - అక్కడ యుండు మనెను
యీసు లేక మోవి దేనె లీరా! యంటె - నెంగి లయ్యా ననెను
కాసంత యెంచక నోటి విడమిమ్మంటె - కసరి లే దనెను
నా సరివారిలో నీ యుదాసీనము - నలినాక్షిరో! చాలదా ॥ఇంత॥

ఇందుండి యాకు జుట్టిచ్చేద నంటే - హితవు గా దనెను
అందుండి మోహమైన గనుల జూచెద నంటే - నందుకు వద్దనెను
పొందుగ బాదము లొత్తెద నంటే వచ్చి - ప్రొద్దాయె బొమ్మనెను
మందయానరో! నీ మీది మమత - మఱచితి ననెను ॥ఇంత॥

పేది వారి తోడ నా మీది మనసు - విరిగిన దనెను
ఆదరించి నాతో మాటలాడ నంట - నాన లిదు కొనెను

1 ఆహిరి. 2 ఇంతంత.

వాదించి నీ పొందు వద్దని గట్టిగ - వక్కలాకు లిచ్చెను
మోదముతో నన్నేలిన చక్కని - మువ్వ గోపాలుడు ॥ఇంత॥

## 34. కాంభోజి – ఝంప

ఇంత దయగల వాని నేల రావద్దంటి? - వెంత నిర్దయురాలవే
సంతసము మా మువ్వగోపాలసామి నీ
సరసత్వములె యెంచునే - ఓ చెలియరో! ॥ఇంత॥

వెలది! నీ గుణ మమృత మని సందు కొలువులో
వేనోళ్ళ గొనియాడునే!
పలుమారు నీకు సరి రూపవతి లే దనుచు - బాస జేసెద ననియెనే
తెలిసి పదివేల జన్మములకు నీ ఋణము - దీర్చుకో జాల ననెనే!
చెలియ తనమీద నీ వలుక జెందినది తా
చేసిన పాప మనెనే! ఓ చెలియరో! ॥ఇంత॥

మును నీదు కెమ్మోవి తేనె లానగ బ్రాణ
ములు నిలిచి యున్న వనెనే!
ఘనమైన విరహ వేదన కోర్వ జాల నిక - కాచి రక్షించు మనెనే!
తనువు తనసొమ్మొ, యిచ్చకము గా దీ మాట
తన చిత్త మెరుగు ననెనే!
వనజాక్షి! నవగ బని లేదు నా పాలి దైవము
కరుణ దప్పె ననెనే! - ఓ చెలియరో! ॥ఇంత॥

ముందు మా మువ్వగోపాల రా రా! యనిన
ముద్దు తా మరువ ననెనే!
కందర్పు డిక నేమి చేసునో యెరుగ మా - కలికితో దెలుపు మనెనే!
మందె మేలమున నే నాడిన మాట తన - మది నుంచ వలువ దనెనే!
యిందుముఖి నను గూడి లాలించిన సొగ
సెంతనుచు దలతు ననెనే! ఓ చెలియరో! ॥ఇంత॥

## 35. బిలహరి - త్రిపుట

ఇంత తెలిసి యుండి - యీ గుణ మేలరా?
పంతమా మువ్వగో - పాల ! నా సామి ! ||ఇంత||

అలుక చేసి యింటికి రా - వైతివి నెనరైన
చెలికత్తె లున్నారా! - పిలువ వచ్చేరా ?
చెలికత్తె లైన నీవె - చెలువుడవైన నీవె
తలచి చూడ నా పాలి - దైవము నీవే ||ఇంత||

వింత దాని వలె నన్ను - వేరుచేసి రా వైతివి
అంతరంగులున్నారా ? నన్నాదరించేరా ?
అంతరంగ మైన నీవె - యాదరించిన నీవె
చింతించి చూడనా - జీవనము నీవే ||ఇంత||

శ్రీనిధి ! మువ్వగోపాల ! చేపట్టి నన్నేలితివి
నా నేర్పులెవరైన నా - నందించేరా ?
నా నేర్పులైన నీవే - నమ్మిక లిచ్చిన నీవె
యానగా బలికెద నా - యానంద మైన నీవే ||ఇంత||

## 36. [1] యదుకులకాంభోజి — ఆది

ఇంత నిరాకరింతురే ఓ చెలియ ! నీ - వింత నిరాకరింతురే
పంతగించి నీ వీలాగు - పాపమున కొడిగట్టె ||ఇంత||

తనువు నీ సొమ్మనె నట - దయవాడ ననెనట !
మనసు నిలుపగా జాల - నని మ్రొక్కెనట !
నిను దూర నోరు రాక - తను దా దిట్టుకొనె నట !
వనబోడి నీ వెంత రాతి - మనసు దానవే ||ఇంత||

---

1 ఘంట.

జిగిమోవి యాన నిచ్చి - జీవము నిలుపు మనెనట!
వగల బెట్టి న న్నేచ - వద్దనె నట!
మగువ! నే నుసురంట - మంచిది కా దనెనట!
దిగనాడితే గట్టిగ - దెగువ సేతు ననె నట! ॥ఇంత॥

కలికి! విరహవేదనచే - కన్నీరు నించె నట
చెలియ! నీ కూడిగము - సేతు ననెనట
కలసి యెప్పటి వలె - గరుణించు మనె నట!
యెలగి మువ్వగోపాలు - నాదరించక యీ వేళ ॥ఇంత॥

37. పంతువరాళి - [1] త్రిపుట

ఇంత ప్రొద్దాయె - నింక వాడేమి వచ్చేని?
చింతింప బనిలేదు - చెలియ! మువ్వ గోపాలు ॥ఇంత॥

చేరి నా తో నే స్తము - చేసిన పాప మా
కీరవాణిరో! యేల వే - గించేవే నీవు?
నూరిన గంధకస్తూరి - పారవేసి పవ్వళించు
యే రమణి యింట నున్నాడో? - యీ రెల్ల మాటు మడగె ॥ఇంత॥

భాసురాంగిరో! వినవే - పక్షులు మొదలు గాను
వాసములు జేరి తమ - వనితల గూడె
నాసించిన ఫలించే - దరుదు గా దటవే, నే
జేసిన పాప మెవ్వరు - చేసినారే ఓ చెలియా! ॥ఇంత॥

పమ్మిన వేడుక తోను - పడకిల్లు శృంగారించి
యెమ్మె కాడు వచ్చునని - యెదురు జూచితి
సొమ్ము లేలే? విరు లేలే? - సొగసెవ్వరు జూచెదరే?
కొమ్మ! నన్నేలిన మువ్వ - గోపాలుని నమ్మరాదే ॥ఇంత॥

---

1 ఆది.

## 38. కల్యాణి – [1] త్రిపుట

ఇంత మేలు దానవా ! – ఓ చెలియ నీ – వింత మేలు దానవా ?
ఇంతి మువ్వగోపాలు – నింటి కేల పొమ్మంటివే ? ||ఇంత||

చెలు లొక్కరును లేరు – చిలుక పంజరమున
బలుక కున్నది యల్ల – భావ మేమో
తెలుసు కొందామని – తెరచాటున నుండిన
కలికిరో ! వాడే చ – క్కని వాడంటివి ||ఇంత||

మరి యేమందువో ! యని – మాటాడక నీ గుట్టు
నరసె నన గేల – నద్దము బూని
మురిపముతో నీదు – మోవి విరిచి చూచుకొని
నెరజాణ మైన వా – నికి నీదు లే దంటివి ||ఇంత||

వాని బంగారు దుప్పటి – వాసన జూచి గుబ్బల
పై నొత్తుకొని మువ్వ – గోపాల రాయని
పూని యింకొక సారి – పొంద కేల ? పొమ్మంటి, నాడ
దాని బుద్ధి యెంత మాత్ర – మని దూరు కొంటివి ||ఇంత||

## 39. శంకరాభరణము – త్రిపుట

ఇంత మోహ మేమిరా ? – యిందరి కంటె – నింతి చక్కని దేమిరా ?
సుంత సేపు దాని – జూడకుండగ లేవు
అంతరంగము దెలుప – వది యేల మువ్వ గోపాల ! ||ఇంత||

నీ కెదురుగ వచ్చునా ? – నెన రూరగ – నిండు కౌగిట జేర్చునా ?
ఆకుమడుపు లిచ్చునా ? – తన చెలిమి
కైనవా డని మెచ్చునా ? – తమి హెచ్చునా ?

1 అట.

ఏకచిత్తమున మీ రిద్దరు - నింపు సొంపుగ నున్న ముచ్చట
నాకు విన విన వేడుకయ్యీరా! - యిపు డానతీరా! ||ఇంత||

మోవి పానక మిచ్చునా? కొసరి కొసరి - ముద్దు లాడ నిచ్చునా?
తావి పువ్వులు దెచ్చునా? - తన సొగసుకు
తగిన వాడని మెచ్చునా? మన సిచ్చునా?
దేవరే మొగడు గావలె నని - భావజుని పూజ లొనరించిన
యీ వనిత పేరేమి సెలవీరా? - [1] సిగ్గేలరా? ||ఇంత||

సంతోషముగ నాడు నా తంబురమీటు - సంచు పాట పాడునా?
వింతరతుల గూడునా? ఆ సమయమున
విడువకు మని వేడునా? కొసి యాడునా?
సంతతము సన్నేలుకొని యీ - కాంతపై వలచినపుడె యిక
కొంత యున్నదో మువ్వ గోపాలా? - గోరడమేలా? ||ఇంత||

## 40. వసంతభైరవి - ఆది

ఇంత రాపు చేసితే - నే నెటు లోర్తునే?
ఇంతి మువ్వ గోపాలుడు - వింత దాని వలె నన్ను ||ఇంత||

మొదల వా డీడకు వచ్చి - మ్రొక్కి పొందవలె నన్న
సదయుడ వద్దు నేస్తమే - చాలు నంటినే!
కడసి నా మాట వినక - కాళ్ళ వేళ్ళ బెనగుచు
వదిపేల బాసలు చేసి - బొంకజాల ననె, వా ||ఇంత||

మనసు దెలియ వలసి - మా యింటికి రా వద్దన్న
కనుగొన దిటవు లేక - కన్నీరు నించెనే!
పెనగొన్న తమకాన - పెదవులె దడపుచు
నిను బాయలేనని - నెలత బతిమాలిన, వా ||ఇంత||

1 సిగ్గేల రేరా.

నీమాట నమ్మరాదోయి ! - నే చాల కోప గత్తెను
యేమన్న నేమి వచ్చునో - యెందు కంటినే !
మోము జూచి వాడు తన - మోహామే పూటకాపసి
కోమలిరో ! మువ్వ - గోపాలుడు నను గూడి ॥ఇంత॥

## 41. యదుకుల కాంభోజి — [1] ఝంప

ఇంతలోనే అల్ల వాని నన్ను గూర్చి - యెడబాయు జేసెగా దైవము
చింతింప బని లేదు - నేయు పూజాఫలము ॥ఇంతలోనే॥

ఆరు నెల లైనను అతడు నే నొకచోట - హాయిగా గూడి యుంటిమా?
మారు కేళికి నెంతో వెత జెందితి గాని
మనసు మనసొక్కటై యుంటిమా ?
దూరుకు లో నైతి గాని గడె నే పైనను
తొడ తొడ సోకి యుంటిమా ?
పేరు చెప్పి మాటల కొక్క నాడైనను
ప్రేమతో బిలుచు కొంటిమా ? ఓ చెలియరో ! ॥ఇంతలోనె॥

చక్కగా విభుడు నే నొక్క నా డైనను - సరసము లాడు కొంటిమా?
చక్కెర కెమ్మోవి యూని యెుకరి కొకరు
చవి జూచికొని యుంటిమా ?
అక్కఱలు దీరగా కౌగిటిలో నడగి - యల్లిబిల్లిగ నుంటిమా ?
పక్క లోపల జేరి యాటల కైన సతి
పతు లనుకొని యుంటిమా ? ఓ చెలియరో ! ॥ఇంతలోనే॥

బాళితో మువ్వగోపాలునిపై వేడ్క - పదమైన బాడు కొంటిమా ?
బాల నెనరున ముచ్చట లాడుచు విరుల - పానుపుపై నుంటిమా ?
చాల ప్రొద్దుగ్రుంకి యొక నాడైనను - జాగరమై యుంటిమా ?
కాల మెప్పటి వలె వానితోనే గూడి
కాపు జెందగ జేసెగా - ఓ చెలియరో ! ॥ఇంతలోనే॥

---

1 త్రిపుట.

## 42. భైరవి - ఆది

ఇంత విరహము - పలుక వెరపగు - యింతి దాయెటు సైచెనో ?
కంతుడు ధూర్తుడనగ విన్నన - కారణమేమి ? శ్రీ వీర రాఘవ! ॥ఇంత॥

గంధ మెండిన గంధవతి కుచకలశమున - కన్నీటి వెల్లువ చింది
కళపిళ లుడుకు చెలిపై - చిందె మీనై - మిట్టి పడినది
కందే హారము నీలసరమై - కర్పూరము నీరాజనమై
యుండె ననుచు నా చిలుక వెలి బడి
హారము దెస మరలి చూడదు ॥ఇంత॥

*చంచలేక్షణ పెంచి - సంపయు కాంచనమ్మున
చలన తామర కొంచ రాగ నూర్పు సెగలను
మించు సారిగను - కంతు నివిరి - మంచు నీరు కషాయ మాయెను
మించ సతి వేలుంచ చుయ్యనె ॥ఇంత॥

ధ్యానమున నిను జేరి - అమృత - పానమున కళ లూరి కలయుచు
మేను మరచిన దేమొ తెలియదు - చాన పరవశ గతిని యున్నది
నేను కావలసినదే కాక - మానించి కరుణించి
అభిమానమున మా చెలికి
ప్రాణదాన మొసగు శ్రీ మువ్వగోపాల ! ॥ఇంత॥

## 43. ధన్యాసి — చాపు

ఇంతిరో! వరదునికి నీ పై - నెంత మోహమే
సంతతం బతని వెత జూడ - జాలక యిందు వచ్చితిని ॥ఇంతిరో॥

చెక్కిట చే జేర్చు కొనెను - చిఱునవ్వు నవ్వు కొనెను
అక్కట నే దలచి నట్టె - నై రా దనెను

* అర్థమగుట లేదు.

మక్కువమును జేసిన చెలిమి - మఱపు రాదాయె ననెను
చక్కని యా చెలిని గూడక - జన్మ మేటికి జన్మ మనెను ॥ఇంతిరో॥
పడతి యుండుండి నే నేమి - పాపము చేసితి? ననెను
తడవు నిన్నెడ బాసి - తాళ లే ననెను
నుదుట నో రాడ దనెను - నొసట చే యుంచు కొనెను
అడిగితె మీా కేమైన - నార్చేరో! తీర్చేరో! యనెను ॥ఇంతిరో॥
పలువరింపుచు మా మువ్వగో - పాలుడైన వరదుడు
నలినాక్షీ! యానాటి వింత - నడుచునో యనెను
తలచి యసురుసురు మనెను - దైవ మిట్లు చేసె ననెను
వలపనే పాపము పగ - వారికైన గా రా ననెను ॥ఇంతిరో॥

## 44. [1] పంతువరాళి — ఆది

ఇంతే చాలునే [2] యెవరేమి ముట్టు కొన్నారు?
వంతుగ నీకు నే వలచి నందుకు ఫలము ॥ఇంతే॥

కోరి వేడి యెంతో దూరాన నుండి
వారిజాక్షి! యింటి కిపుడు వచ్చితే
సారెకు రమ్మని చొక్కళించే ముద్దు
గారాపు ప్రేమతో కౌగిలించిన ఫల ॥మింతే॥

పట్టరాని తమి చేత - బహువిధముల నుండి
నెట్టు కొన్నందుకు నే వచ్చితే
అట్టట్టు సేయక - యలుగక నే ముద్దు
బెట్టి నా వెత దీర్చి ప్రేమ లాలించితివి ॥ఇంతే॥

నాటి పొందు వెలది - నాటి యున్నందుకు
బోటిరో! నీ యింటి కిపుడు వచ్చితే నటుల సేయ
మాటల బెట్టక ముట్టెడి గోపాలల యా
చాటుకు రమ్మని కూట మిచ్చిన ఫల ॥మింతే॥

1 మధ్యమా: - త్రిపుట. 2 ఓలలన.

## 45. మధ్యమావతి — త్రిపుట

ఇంతే మోహము లేని - దిపుడు దెలిసె గదరా!
వంతగించి మువ్వగో - పాల! రా వైతివి ॥ఇంతే॥

నీవు వచ్చిన మొదలు - నిమిషమే యుగముగా
మా వనిత నెంటిగా - మది గుందుచు
భావమున దను దానె - పలు మాఱు నొచ్చుచు
యీ వేళ దాక భుజి - యించకనె యున్నది ॥ఇంతే॥

నెనరైన మము వంటి - నెలతలతో బలుకక
కనుమూసి తా నొక - గడియ నిద్రింపక
గొనబు సొమ్ము బెట్టక - కొప్పు చక్క నుదువక
మనసిజుని కాకచే - గనలుచు నున్నది ॥ఇంతే॥

వలచిన చెలి నెడ - బాసి యీ రీతిగా
జలము చేసెదవు న - వ్వుల కైన దొలుత
గలసిన వాడ విట్టు - లలగిన దెల్ల మా
నెలత చేసిన పాప - ఫలమేమో యకట! ॥ఇంతే॥

## 46. [1] కేదార గౌళ - ఆది

ఇందుకు పగ జేసెనా - యీ దైవము
సుందరదన! వినవే మువ్వ - గోపాలు నెడ బాసినది గాక ॥ఇందు॥

నా పుణ్య మిట్లనందుకు - నాతిరో నీ వుండి గదా
యీ ప్రాణములు గాపాడితి - వింత కాలము
దాపున నెవ్వరు దృష్టి - దాకించిరో యోర్వ జాలక
బాపురే! నీకు నేడూరి - పైనము వచ్చెనా? చెల్ల ॥ఇందుకు॥

---

1 తోడి.

దంట చెలులు నొద్దికైనా - జంట నీ వుండ గాను
నొంటి నున్న దిగులు దీరి - యుంటినే నేను
మంట మారి తనమున నే - మాదునో యని నీ వెంచి
కంటికి రెప్ప గాచిన - క్రమమున బోషించితివి ॥ఇందుకు॥

వడతిరో మా మువ్వగో - పాలుడు నను గూడి చాల
తడ వాయె నేమో గాసి - తడ జేసె ననుచు
నుడుకుచున్న నా మనసున - కొక్కింతైన భయము
వొడమ నీక, నా కుచితపు - బుద్ధులు బోధించితివి ॥ఇందుకు॥

## 47. బిలహరి - ఆది

ఇందుకు నే నేమి సేతునే? - యే మందునే!
మందమైన మనసు సిగ్గు - మాలిన దయ్యె నయ్యయ్యో! ॥ఇందుకు॥

దా నింటికి బోయె నని - తరుణుల చేత విని
యానబెట్టి రా వద్దనే - నని యుంటినే
వాని మోము జూచి నపుడె - వలపు రెట్టించి చాల
యీనినపులి వంటి కోప - మెందు బోయెనో? యీ వేళ ॥ఇందుకు॥

అతివరో! దానికి సొమ్ము - లంపించె నన విని
యతని మోము జూడ - నని యుంటినే
కత వింటే తను వచ్చి - కౌగిట జేర్చి నపుడె
యతిశయమైన రోష - మపుడేమో తోచదాయె ॥ఇందుకు॥

సుదతిరో! దానింట వాని - జూచితి నన విని
యది మొదలట్టెట్టు జేసే - నని యుంటినే
ముదము తోడుత వచ్చి - మువ్వగోపాలుడు
మదనకేళి గూడి నపుడె - మాటలన్నియు మరపాయె ॥నిందుకు॥

## 48. పున్నాగవరాళి - చాపు

ఇందుకేమి సేతు నమ్మా! - యెవరు తోడి తెచ్చేద రమ్మా!
ఇందువదన! కడప వేంకటేశు - డెంత దూరాన నున్నాడో ||ఇందు||

ఎక్కువ మోహమున నన్ను - నేవేళ గౌగిట జేర్చు వా
డొక్కడే పవ్వళించి యుండ - నోపు నటవే?
పక్కలోన వెదకి కానక - ప్రాణేశు డెంత కలువరించెనో
మిక్కిలి విరహావేదన చేత
జక్కని సామికి మే నెంత చిక్కెనో ||ఇందు||

నెలతరో! నా కెమ్మోవి వానక - నిమిషమైన దాళ లేడు
యెలమి నా పొత్తునే గాని భుజి - యింప నొల్లడు
తెలియ నైతి మా యిద్దఱి పలపు - దృష్టిదాకె నమ్మలార!
వలరాజు నన్ను బాధించి నట్ల నా
చెలువుని నేడెంత వెతల బెట్టెనో ||ఇందు||

పడతిరో! మువ్వగోపాలుడైన - కడప వేంకటేశుని గూడి
యెడ బాయక యుందు నని - యెంచు కొంటి
తడయ కే నొకటి తలచితే - దైవ మొకటి దలచి నందుకు
తొడబడి నే తెగువ జేసెద నంటె
తొయ్యలి! వా డేమి చేసు కొనునో ||ఇందు||

## 49. ఘంట - త్రిపుట

ఇందు రా దగదు నే - నేల వచ్చితి నమ్మ!
అందరిలో జాల మోస - మాయె వా డిందు లేడాయె ||ఇందు||

మునుమున్నె శృంగారించు - కొని తమకమున రాగ
నను జూచి నీ వైన వ - ద్దన వైతివే
వనజాక్షి! గట్టిగ - వంచన లే జేసితివి
ఘనము గట్టు దీరె నయ్యో! - కన్నవా రెల్ల నవ్వగ ||ఇందు||

పిలువక నందు బోయేది - తెలిసి వీధిలో జెలులు
కిలకిల నవ్వేరు గుం - పులు గూడుక
వలపు సిగ్గెఱుగదని - పలికే రా మాట లెల్ల
చెలి! విని వినములు - చేసితి వివేకము లేక ||ఇందు||

కలికి! మువ్వగోపాలుని - గలసిన దానవై
మెలమి సఖుల గూడి మా - యింట నుండక
పలికి బొంకక దనుచు - పడుచు తనము చేసి
నిలువక వచ్చిన - ఫలము గలిగెను ||ఇందు||

## 50. సౌరాష్ట్రి - త్రిపుట

ఇక నిన్ను నమ్మ రాదే * ఓ - యింతిరో! మాట లేటికే
ఒక వేళ నవనీత - మొక వేళ పాషాణ
మకట నీ చిత్త - మయ్యయ్యో! చెలి ||ఇక||

సరసు డని మెచ్చు కొందువు - ఏ వేళ నీ
చక్కెర కెమ్మోవి యాన మందువు
తిరుగ లేసి కోపము దెచ్చు కొందువు - నాదు
సరసకు రావు మెంచ నన్ను దూరేవు ||ఇక||

చెలువుడని భక్తిసేతువు తమి - దెలిసి ప్రేమచే జేరదీతువు
కలికిరో! తిరుగ కాక సేతువు
చలమేల జేసేవు? చాలు చాలు పదివేలు ||ఇక||

కూరిమి నీవె నే నంటివి మువ్వ - గోపాల! యని కూడి యుంటివి
వేరే యింతుల చాడి వింటి విదిమేలా?
వారిజముఖి! యేల నాడాడ వచ్చేవు? ||ఇక||

* జాణ నే ఓ - యింతిరో...

## 51. మోహన – చాపు

ఇక నిన్ను బో నిత్తునా – యిభరాజ వరదా !
శుకవాణి చేత నీ – సుద్దులెల్ల విన్నట్లాయె ||నిక||

నవ్వులంట యున్నావేమో – నా వద్దు చూడు మీసారి ?
పువ్వుబోడుల చేత – రవ్వ సేయించక మాన ||ఇక||

జవ్వన మెల్ల నీ పాలు జేసి – చాల నమ్మి యున్నందు
కెవ్వతె తోనో గూడివచ్చి – యిపుడు లే దని బొంకేవు ||ఇక||

పన్నగ మువ్వగోపాల ! – బాస లిచ్చి నన్ను గూడి
వన్నెలాడికే లోనైన – వగ లెల్ల విన్నార నేడు ||ఇక||

## 52. యదుకుల కాంభోజి – ఆది

ఇక నేలనే వాని గొడవ ?
అకట మువ్వగోపాలు – డనుకూలు డటవే ? ||ఇక||

వినవే మతిలేక యీ రీతి – వాని మనసు దెలియక మోస పోతి
కనుగొంటి వాని జాతి – నే జెల్ల
మునుపే యింటువంటి వా – డని తెలియ నైతి ||ఇక||

పొమ్మనవే యందు కే మాయ వాని
నమ్మెదురే పో పో యిది వట్టి మాయ
అమ్మ నా మాట వెగటాయ నల
యెమ్మెలాడే వాని కెంతో హితవాయ ||ఇక||

వలదేల రచ్చ బెట్టెదవే యీ రాయ – భార మెందాక నడిపెదవే
తొలిపొందు చాలు చాలు నవే యీ
చెలి చేతిలో దార వోసితి గదవే ||ఇక||

## 53. భైరవి - ఆది

ఇక్కడ లేదే మనసు - ఇంతిరో! వానికి
దిక్కు మాలిన మోహము - తెలియ నీ దయ్యో! నయ్యయ్యో! ||ఇక్కడ||

వచ్చినప్పుడు ప్రేమచే - వాని నెమ్మేని నిండ
పచ్చి కస్తూరి యలది యే - పాటి దంటేను
మచ్చకంటి కొంతసేపు - మాటాడక యూరకుండి
హెచ్చు తావి బూసిన వా - రెవ్వ రనెను ||ఇక్కడ||

కోమలి! యా మాట విని - కోప మడప లేక వాని
మోము జూచి పంటి కొద్ది - మోవి నొక్కితే
తామరసాక్షిరో! నన్ను - దాని పేర బల్కరించి
వేమరు నొచ్చీసి మ్రొక్కె - విడువు మనెను ||ఇక్కడ||

దానిపై వాని బాళి - తప్పింప వలెనని
పూని మువ్వగోపాలుని - బొందు చూడగా
మానుమని యనక మంచి - మాటైన నాడక
మానినీ! యున్న రనెను - మరినే జాలించితి ||ఇక్కడ||

## 54. ఘంట - అట

ఇక నేలనే వట్టి వలపు యిసు మంతైన తెలియ దాయె
మగువా! యిది నా నోము ఫలము-మరినే నంటే మరువ దాయె ||ఇక||

అనుభవమే క్రొత్తలాయె - అసలేమి లేక పోయె
మనసిజుని మాయ లాయె - మమత లంటే నిలిచి పోయె ||ఇక||

విడువ రా నిచ్చేనా యీ చాయ - వేడుక లీడేర దాయ
నుడువ నోరాడ దాయె - నొసటి వ్రాత తప్పదాయ ||ఇక||

కలకాలము నాకు దక్కె - కలికిరో! మువ్వగోపాలు
డలుక జేసి ఆపె తాను కలయు - అతి తమి నే జెందనాయ ||ఇక||

## 55. కాంభోజి - త్రిపుట

ఇచ్చోటను చాల ప్రొద్దుండ చెల్లదు - యింటికి పోవలెర !
ముచ్చటల కెల్ల యిది సమయము గాదు
రచ్చల బెట్టకురా ! ఓరోరి జాణ ! ||ఇ||

మగని కౌగిలి బాసి వచ్చితి నేడు నీ - మాట తప్పక నేను
బిగువైన గుబ్బల గొనగోరు లుంచ జూచేవు - వెల జాతి దాన గాను
తగవు లేటికిరా ! నీ యక్కర దీర్చుకో - నను బంపు దురుసు గాను
వగకాడా ! నిదుర మేల్కొంటే దోసము కాదా ?
వాదు లేలరా ! నాతోను ఓరోరి జాణ ! ||ఇ||

చురుకు చురుక్కని మోవి - పంట నొక్కితి అల
గురుతు లెక్కడ దాతుర !
చెరుకు తీవని వేరుతో పెకలించేవు - చెలువుడా ! నెటు సైతుర
మోహాంబు గొని తగిలి యుండుట యిటువంటి
మాయపు వల వేతుర ఓరోరి జాణ ! ||ఇ||

వే సట్టె కలిసితివి నన్ను పలువరారు
విడువరా ! యికనైన నా సామి మువ్వగోపాల !
పూని చలము జేసేది నురియాదనా
ఆసకు మితి యేమి - గూడ గూడ
మోహా మధికమై యేదేగాని
నీ సొమ్ము యీ మేను, కోరినప్పుడే వత్తు
నెవరు నాపై నుంచరా, ఓరోరి జాణ ! ||ఇ||

## 56. [1] కన్నడ - త్రిపుట

ఇటువంటి నా వల - పేమిగా బొయ్యీ నమ్మా !
చిటుకు మన్న కోపము - మువ్వగోపాలునిపై ||ఇటువంటి||

---

1 నీలాంబరి - జంపె, చాపు.

వచ్చి నప్పుడు నేనే - వద్దికి బోయేదే గాని
ఇచ్చటికి రా రమ్మనే - దెన్న డైనను లేదుగా !
నిచ్చ నిచ్చలు లాలించి - నే నలము కొనేదే గాని
గ్రుచ్చి వాడు కౌగలించు - కొనే దెన్నడు లేదుగా ? ॥ఇటువంటి॥

ముందుగాను నేనే వచ్చి - ముద్దిడు కొనేదే గాని
ఇంద మని కెమ్మో విచ్చి న - దెన్న డైనను లేదుగా!
అందంపు మోమున కోప - మమరి యుండేదే గాని
మందయాన ! నవ్వనేది - మనసున నైనను లేదుగా ! ॥ఇటువంటి॥

బలవంతమున నేనే - పలుకరించేదే గాని
యెలమి నాతో మాటాడే - దెన్న డైనను లేదుగా !
అలసి యుండిన నేనే - కలసి కూడేదే గాని
చెలియ ! మువ్వగోపాలుడు - చేరి కూడినది లేదుగా ! ॥ఇంటువంటి॥

## 57. కాంభోజి — ఝంప

ఇటువంటి మోహ సాగరమున
ఓకొమ్మ ! - యేలాగు గడతు నమ్మ !
బటువైన యీ వయసు - బాధించు నవి యిపుడె
కటకట ! విభు నూరి - కరుగ వద్దన నైతి ॥ఇ॥

నిచ్చ నిచ్చ లే మేమొ - నిరతము దిగులొంది నిదుర కంటికి రాదె !
వచ్చె వచ్చె నన్నట్లు వాని రూపమె మదిలో - వారక మై యుండునే
వాడు నన్ను కౌగిట నుంచె నన్న - కలువరము హెచ్చునే
మచ్చరించి విభుడేమొ - మచ్చు జల్లెనే గాన
మనసు నిలుపరాదే ఓ చెలియ ! ॥ఇ॥

పతి రమ్మని పిలిచి చాలా లాలించిన - హితవు మతిని బాయదే
అతని యెడ బాసినది మొదలుకొని యేమొ - ఆహారమే సెచ లేదే

సతతము యిటువంటి జాలి నొందితి గాని - సంతోష మింత లేదే
అతను (?) వుష్పాంగి తే - అదనైన పగజాతి
వెత చేతనే ప్రియుని - వేగరమ్మన నైతి ॥ఇ॥

అది మే లౌ నని పిలిచి రేయి పగలు
సుదతిరో! వినవమ్మ! - సొంపు తోనే నన్ను
ముద మలరగను మా - మువ్వ గోపాలుని
కదిసి కూడి నట్లుండునే! - మదిరాక్షి! వా డెంతో
వొదిగి చేసిన వినయమూట మరపు రాదె!
పదిగిట ననవిల్తు (?) కలమున కే లాడు
అదరీనె యే మందునే? ఓలలన! ॥ఇ॥

## 58. యదుకుల కాంభోజి - త్రిపుట

ఇటువంటి వాడని నే దెలియ నైతిని - యింతిరో! బాగాయెనే
విటరాయ డంతలో - వెలది యింటికి బోయి
చిటుకున వచ్చెనె - చెలియ! మువ్వగోపాలుడు ॥ఇ॥

ముదిత! మీ చక్కని - మోహనాంగుని పైని
వెద చల్లి యున్నది - వింత వాసన లెంతో
కదసి యా వణతిని - కౌగిట జేర్చె నేమో!
ఉదుటు గుబ్బల పోటు - ఒరసి రొమ్మున మెరసె ॥ఇ॥

తెలిసె యీ సొగసు - తేలించి యీ లలన
కులుకుచు ముద్దాడి - కొనగోట మీటె నేమొ?
నెలవంక లుంచిన - సిద్దంపు గళముతో
పలుచని మోవాని - పలు కెంపు వరుసలే ॥ఇ॥

మరు కేళి నెనసిన - మందె మేలము చేత
తరళాక్షి! ముత్యాల - సరులు తా ధరియించి
విరుల హారమని - విడువక యిచ్చట
మరపున వచ్చెనే - మగువ మువ్వగోపాలుడు ॥ఇ॥

## 59. నవరోజు — 1 త్రిపుట

ఇటువంటి వాడనుచు – నిపుడు తెలిసెనుర !
విటరాయ ! మువ్వపురి – విభు డైన గోపాల ! ||ఇ||

చెలిమి చేసే దందు చలము చేసే దిందు
2 వలచి యుండే దందు – 3 వచ్చి యుండే దిందు
సెలకొన్న మరులందు – సిట్టూర్పు 4 లిక నిందు
వెలలేని పా టందు - వింత కయ్యము లిందు ||ఇ||

వగలు గులికే దందు – 5 వట్టి సుద్దూ లిందు
మగువతో లీయ మందు – 6 మచ్చు గప్పే దిందు
సొగసు నవ్వులందు – సోలించే దిందు
తగు సొమ్ము లిచ్చే దందు – తగవులు చేసేదిందు ||ఇ||

వడి గొన్న మోహ మందు - వల్లభు డని పే రిందు
7 విడె మొసగి మెచ్చే దందు – విడనాడే దిందు
పడకటింటి హాయి లందు – పాన్పు శృంగార మిందు
నడవడిక గూడే దందు - న న్నేలి దూరే దిందు ||ఇ||

## 60. సౌరాష్ట్రము - చాపు

ఇద్దరి వలెనే గూడి – యెవరున్నారు? తెల్పరా !
ఒద్దికతో మనవలె – నున్నా రా? మువ్వగోపాలా ! ||ఇద్దరి||

మున్ను నలరాజు నీవే – ముదిత దమయంతి నేనే
చెన్నుగ శ్రీకృష్ణుడు నీవే – శ్రీరుక్మిణీ దేవి నేనే ||ఇద్దరి||

---

1 ఝంప. 2 వలపులుంచే. 3 వట్టు సుద్దూ లిందు. 4 లేయిందు
5 వచ్చిపొయ్యేదిందు. 6 మత్సరములిందు. 7 విడెము లిచ్చే దందు

అల రఘురాముడు నీవే - అయిన సీతాదేవి నేనే
ఇలను రంగేశుడు నీవే - యేలిన రంగనాయకి నేనే ॥ఇద్దరి॥

సత్యహరిశ్చంద్రుడు నీవే - సామి చంద్రమతి నేనే
నిత్యము మదనుడు నీవే - నీకు రతీదేవి నేనే ॥ఇద్దరి॥

## ౬1. కల్యాణి — చాపు

ఇద్దరి సందున బవ్వళించి యున్న - యింతి పే రేమిరా?
గద్దరి వగల మా మువ్వగోపాల! - గాజుల చప్పుడు నేవింటి గదరా!॥ఇ॥

అప్పు టప్పటికి నీదు కెమ్మోవి - యానిన యలవాటు చేత
గప్పుర గంధి మోవి నా పంట - గలయ నొక్కితిరా!
అప్పళించి దాని మోవి తేనె - యనుభవించితి వేమో? కాని
చప్పరించ బోతే నమలిన చెఱకు
పిప్పి వలెనె చప్పనై యుండె గదరా! ॥ఇ॥

కదసి నీ వంట దాని మేను - గ్రక్కున గాగిట నదిమి పట్టిన
నుదుటు గుబ్బలు నా గుబ్బలపై - నొరసి క్రిక్కిటిసె
ఇదియేమో? వింతయై యున్న దనుచు
నిందుకు నా మది చోద్య మంది
పదరితే నీ మనసు నొచ్చినని - ప్రాణేశ! యూవలి మోమైతిగదరా ॥ఇ॥

మునుపు నన్ను నీ వనుభవించి యా - ముద్దులగుమ్మను గూడితివేమో?
యనుదినమును నీ రీతిగా - నది యీడకు వచ్చునా?
మనసు పోహణ గంటి నేడు - మదన జనకు డైన సామి!
నిను నమ్మ రాదుర మువ్వగోపాల!
నీ వగ లెల్లను దెలిసెను గదరా! ॥ఇ॥

## 62. మోహన - అట

ఇద్దరికి సరి వలపు లాయ - యెవరికైన దెలుప వశమ ?
ముద్దు తిల్లగోవిందునికి మా - మోహనాంగికి ॥ఇ॥

విభుడు పాంచాల దేశాధిపతి - వెలది పద్మిని వంశజాతి
ఉభయ వాదుల మనసులు మమతలు
యువిదలార ! తెలిసి తెలియ లేరు ॥ఇ॥

కంటిరా ! వింటిరా! వీరి రూపము కం టె(?)-కంటకంటకుని గన్నవారలు
యొంటి యొంటములచే నెడసేయ - ఓభామ ! నీ చేత నాచేత నౌన ॥ఇ॥
నాలుగు జాతుల వేళలు దెలిసి - నాతి విభుడు కలసి మెలసి
తేలించ మా మువ్వగోపాలుడే - తిల్లగోవిందరాయుడై నాడే ॥ఇ॥

## 63. 1 తోడి - త్రిపుట

ఇన్నాళ్లు వలె గా దమ్మా ! - మువ్వగోపాలు - డెన్ని నేర్చినా డమ్మా
నన్ను కన్నులు మూసి - నా చెంత నుండిన
సన్ను తాంగి మోవి - చాల చప్పరించెనే! ॥ఇన్నాళ్ళ॥

చలువ చప్పరములో - సవతి నే నుండగ
బలిమి నాదు కొంగు - బట్టుక చాటున
వలుమాఱు.... .... ....- గిలిగింత లిడగానే
తెలిసి నే నడిగితే - కిలకిల నవ్వెనే! ॥ఇన్నాళ్ళ॥

మిసమిస లాడు నా - నొసలిపై తిలకము
పొసగ దిద్దుచు వాడు - బొందుగ నల దాని
.... .... .... .... ....పై - గొసరి చే వేయ గానే
కసరి నే నడిగితే - గారడ మాడెనే! ॥ఇన్నాళ్ళ

1 బేగడ.

పదరక మువ్వ గో - పాలుడు నను గూడి
మదిరాక్షిరో! దాని - మమత దెచ్చు కొనెనే!
కొదమ గుబ్బల పైని - కోకటు దొలగింప
కదసి నే నడిగితే - తుద నన్ను గూడెనే! ॥ఇన్నాళ్ళ॥

## 64. కాపి — త్రిపుట

ఇన్నాళ్ళు తెలియగ నైతి యీ చెలిమి - యెంతటి నెరజాణవే!
వన్నెకాడు మువ్వగోపాలుడే నిన్ను
వలచెనో? నీవే పిలిచితివో? లేక ॥ఇ॥

పొరు గిరుగున నొక్క సరసుడు యుండే
చిరుత ప్రాయము నీవు పూర కుందు వటే?
మరులు యెచ్చి వాడు - మమతతో వేడెనో?
పరవశమై నీవే - బతిమాలినావో? ॥ఇ॥

అదిమి వా తెర యిచ్చి ఆముకొనెనో?
ముదముతో చెక్కిలి నొక్కి - ముద్దిడు కొనెనో?
కదసి నీవే వాని కౌగిట జేర్చితివో? ॥ఇ॥

మరు కేళిలో తానే పై కొనెనో? లేక
మా మువ్వగోపాలుని నీవే పై కొంటివో?
అరమరలేలనే? పలుకవే! చల్లగ
సరసముగ నన్నేలనట్టి యుండును ॥ఇ॥

## 65. మోహన — ఆది

ఇన్నాళ్ళు మల్లాడిన - దిందు కోసమా?
మన్నించి నాపై దయ - మరువ వద్దమ్మలార! ॥ఇన్నాళ్ళు॥

మనసు గట్టి జేసుక - మగువలార! వాని మీరు
కనుగొన వద్దనగానె - కననోరుట

తనువు కాళించి కాదు - తగిన 1 చవి లేదాయె
నని మీరు వెత చెంది - యసురుసు రనే రసి ॥ఇన్నాళ్లు॥

వాని మాయల బెల్లి - వగల మాటల మీరు
వీనుల విన వద్ద నగానే - విన గోరుట
మానవతులార! నాదు - మనసు దెలిసిన సఖిసి
గాన మైతి మని మిగుల - గన్నీరు నించేరసి ॥ఇన్నాళ్ళు॥

పలుమారు మా మువ్వగో - పాల రాయసి మీరు
కలయ వద్దనగానే - గలయ గోరుట
కలనైన నా మాట - గడువ వద్దసి మీరు
దలచి జాలిచే జాల - తల్లడ మందేరసి ॥ఇన్నాళ్ళు॥

## 66. ముఖారి — చాపు

ఇన్ని విధముల బూజించేర సామి! - యింతి నను గూర్చుమీ!
నిన్నెంతోగా వేడు కొన్నందుకు నాకు
నొంజిలి దీర్చు సుమీ! నా సామి! ॥ఇన్ని॥

కన్నె మోము నేను గనుగొన గలిగిన
పున్న మొక్క ప్రొద్దుండేర! సామి!
కన్నులు ముద్దాడ గలిగిన నే జంట
కలువపువ్వుల బూజించేర! సామి!
సన్న నూగా రంట గలిగిన నాగుల
చౌతి వ్రతము లుండేర సామి!
చన్ను లంట గలిగిన బంగరు కలశము
శిఖరముపై నుంచేర! సామి! ॥ఇన్ని॥

తియ్యని మోవాన గలిగిన నన జుంటి - తేనె లార గింపించేర! సామి!
శయ్యపై దాని స న్నెనయ జేసిన వసంత - చతుర్దశి చెల్లించేర! సామి!

---

1 చలి.

వొయ్యారి జిగి చూపుల నన్ను జూచిన
నొప్పుగ నారతు లెత్తేర ! సామి !
నెయ్యంపు బొందున జెమటల దడిసిన
నిత్యాభిషేకము చేసేర ! సామి ॥ఇన్ని॥

బాల నన్ను బిలిచిన నిన్ను మువ్వగో - పాలరాయడని పిలిచేర! సామి!
చాలప్రొద్దు వేడుక నుండ గలిగిన - జాగరములు గావించేర ! సామి !
మేలుగ రతులను మెలగిన నీకు ల - క్ష్మికి గల్యాణము చేసేర! సామి !
వాలుగంటి యెద నుండ గలిగిన నే
వేళ నిన్ను నే దలచేర ! సామి ! ॥ఇన్ని॥

## 67. కన్నడ - ఝంప

ఇప్పటి కీ లాగు నున్నాను
ఇప్పటి కీ లాగున నున్న - యిటువంటి నా వలపు
ముప్పాంగ నిచ్చేవో ? లేదో ? - మువ్వగోపాల ! ॥ఇప్పటి॥

ఎప్పు డంటప్పుడు నా - యిచ్చకు వచ్చినట్ల
ముప్పిరి గొన్న తమక - మున బెనగుచు
జొప్పిలు తేనె లూర నీ - కప్పురంపు తావిమోవి
తెప్పలుగా నాని తనివి - దీర నుప్పొంగుచు ॥ఇప్పటి॥

ఇది సమయ మవును నే - డిది వేళ కా దనక
కొదవ యింతయు లేదు - కోరినట్ల
గుదిగొన్న తమకమున - గుబ్బల కసి దీఱ న
న్నదుము కొని కౌగిలించి - ముదముచే బొదవి ॥ఇప్పటి॥

కంతుకేళి గూడిన - యంతలోనె తమి రేగి
సంతసమున బంధ విశే - షములచే బెనగి
వంతముతో మువ్వగో - పాల ! నా సామ్మొ్మతి వసి
చింతేమియు లేక నీ - సేవే జీవనమై ॥ఇప్పటి॥

## 68. ఘంటారవము — ఆది

ఈ మాట వలన ఫల - మిక నేమి కద్దు ?
భామరో చాలు మువ్వగో - పాలు పొందే మనకు వద్దు ॥ఈమాట॥

వామాక్షిరో ! వా డీడకు వచ్చే మనసు లేదు
రామ ! వాడు రా దలచితే - రానిచ్చేది కాదు
యేమో నాటి కాయూ ! ఫల - మింక బని లేదు
నా మేలు వానిపై నింక - నాటి యుండగ బోదు ॥ఈమాట॥

వనజాక్షిరో ! వాని కొఱకై - దిన దిన మీ పోరు
కని విని మీ రెందఱైన - గా దనగ లేరు
చెనకి వానితో నను మోడి - చేసు కొమ్మనేరు
చనువు లేని చోట యింత - చల మెట్ల యీడేరు ? ॥ఈమాట॥

ఎంత లాలించి కూడిన - హితవు మాట నున్న
వింత మువ్వగోపాలుని - విధములు నే విన్న
నంతరంగము శోధించి - యలసితినే ! చిన్న
రంతు సేయక చిత్తము - రాయి చేసుకున్న ॥ఈమాట॥

## 69. ఘంటారవము — ఝంప

ఈ మేను జీవునకు - నెంత ప్రియ మాయెన్
భామ ! మా మువ్వగో - పాలు కౌగిట లేని ॥ఈమేను॥

పడతి ! నే నొకచోట - ప్రాణేశు డొక చోట
నెడబాసి మరునిచే - నిడుములకు లోనై
కడలేని విరహాగ్ని - గ్రాగి [1] వేగితి చాల
పుడమిలో వేఱె జ - న్మము లేదె సుదతి ! ॥ఈమేను॥

1 యున్నది.

మోము జూడ మనసై - మోవి యాన నో రూరి
యాము కొన్న ప్రేమచే - నసురుసు రనుచు
సోము కాకల జిక్కి - సొమ్మ [1] సిల్లగ మేను
కామినిరో! మెడ తెగసి - కన్నీట నిటు లున్న ॥ఈ మేను॥

కంతు కేళి మువ్వగోపాలు - గలసి యున్నది తలచి
వింతతోచి నా మనసు - వే విధము లాయన్
యింతిరో! విభు సేమ మిా వరకు విన నైతి
యెంత వ్రాత వ్రాసి యున్నదో? - యింతకు దాళి యున్న ॥ఈ మేను॥

## 70. కాంభోజి - ఝంప

ఈ రీతి మదన సామ్రాజ్య - మిచ్చిన చెలి
నేరీతి మది [2] నెడసి యుందు?
చేరుకొని రతి కేళి యందు - చెక్కులను
జీరె దన గొన గోరు లందు పోక ముడి
జార నోరకు దీసి - కేరి పై కొన్న వగ
మిారి మనసెడ బాయదో చెలియా! ॥ఈరీతి॥

విడిచి పో లేక నడ - వడి గొన్న సరులతో
ముడిగొన్న చన్ను గవ సొరు - కొప్పునను
సడిలి యూడెడు విరుల చేరు - నుదటిపై
నిడిన కస్తురి చెమట జారు - కన్నులను
ఎడవాలు పైట కడ - తొడల జీరెడు తీరు
పొడగట్టి నట్లున్నదో చెలియా! ॥ఈరీతి॥

అదనైన మోవిపై - గొదమ కెంపులతోను
పదరి నవ్విన తేనె జిల్కు ముంగురులు

---

1 సిల్లియా వేళ. 2 నెడబాసి.

చెదరి బొమలును సొంపు గుల్క - ఎడనెడను
బొదలు నడుమున ముద్దులొల్క - పెదవులును
అదిరి పల్కిన పల్క - వదలకను నేడు నా
మది నిలిచి నట్టున్నదో - చెలియా! ॥ఈరీతి॥

ఎడలేసి పిరుదులను - దడబాటు నడుగులను
నడురేయి నా కడకు వచ్చి - కూర్చుండి
విడె మడిగి మడుపు లందిచ్చి - రవిక ముడి
విడిచినపుడే తమక మెచ్చి - కూటముల
గడిదేరి మువ్వగోపాల! యని కలసినది
ఎడబాయ కెద నున్నదే చెలియా! ॥ఈరీతి॥

## 71. సావేరి - త్రిపుట

ఈ లాగటవే! బుద్ధి యిందు బింబాననా!
నాలో నీలో భేద మేమే - నాతో నానతీవె! యీ
వేళ మువ్వగోపాలు నీ - మేలు వాసి చేయనా ॥ఈ॥

విద్దెలు చదువక - పెంచిన చిలుకకు
బుద్ధులు తెలుపక - సుదతిరో! నీవు
అద్దమ రాతిరి - యసురుసు రనుకొంట
ముద్దు మోమువాడ - నిద్దుర లేకున్నాను ॥ఈ॥

కోడె గుబ్బల పైని - కొంగు బచరింపక
తోడి వారిజాక్షుల - తో మాట లాడక
ఆడికలకు లోనై - యలమట నొందుచు
చేడియ యేల చెక్కిట - జెయ్యి జేర్చుకొన్నావు ॥ఈ॥

కూడి మువ్వ గోపాలు - గుణములు దెలియక
కోడిగపు మాట లాడి - కోమలిరో! వాసి బాసి
వాడలో నీ సరి వనితలు నవ్వగ
నాడాడ భ్రమజెంది - నట్ల దిరుగ విధి యేమో ॥ఈ॥

## 72. బిలహరి — చాపు

ఈ లాగయ్యేది యెరుగ లేక వాని - కేల మరులైతినే?
వాలాయమై నాతో లేని - వట్టి వాదె ప్రొద్దాయెనే చెలియ! ॥ఈ॥

నాటి నుంచి యీ వరకు వానికి నేను - నడచు కొన్నదే మొదలు
బోటిరో! వినవే భూతిలో సహోమము - సాటాయెను జూడను
మాటి మాటికి యెంతో మనవి జేసుకో బోతే
మదిలో మచ్చర మెచ్చెనే!
నేటికి దెలిసెను నాపై గల ప్రేమ
నీటిపై వ్రాలాయ నేమో చెలియ! ॥ఈ॥

తాను నే నను భేదము లేక యిన్నాళ్ళు - తన సొమ్మై నే నుంటినే!
దాని మీద గల దయ విశ్వాసము - తనకు నా యెడల గలుగునా?
వాన కాలము నాటి గరిక వలెను యీ - వనిత లందరు కలిగిరే
కాని కాని వగవారిలో జేరేది
కాల మిట్లనే యుండునా? ఓ చెలియ! ॥ఈ॥

కలువ బాణుని చేతి కరముల కోర్వను - కల మువ్వగోపాలుని
తొలుతటి వలెనే గూడి యుందామని - పిలువకనే బోతినే
కలవి లేనివి కొన్ని నామీద కల్పించి - కడకంటను జూచెనే
చిలుక బూరుగ మాను ఫలముల కాసించి
చింతించి నట్లాయెనే ఓ చెలియ! ॥ఈ॥

## 73. కన్నడ — ఆది

ఈ లాగు సేతురా?
బాలరో! మగవాడు - పాలు మారిన గాసి ॥ఈలాగు॥

మెచ్చివాడు నిలివెడు ధనము నీ - కిచ్చెద ననగ నేమి ఫలము?
మెచ్చుట యీ పాపము వినము కాన
వచ్చెను నీ చెలికత్తె తనము ॥ఈలాగు॥

ఎనయు లేదని నాతో నంటివి వా - డేమి కావలెనో మచ్చకంటి!
వినవే! యింత సేపేల యుంటివో
వెలది నీ మాయ నెల్ల గంటి ॥ ఈలాగు॥

తోడి తెచ్చెద నని యాదు జేరి వాని - గూడుదు రటే దోసకారి!
మోడితో నీ విపు డున్న దారి తెలిసె
మువ్వగోపాలు పొందు గోరి ॥ ఈలాగు॥

## 74. ధన్యాసి - చాపు

ఈ లో నున్న దతనిపై నా మోహ - మింతింతైన రాదమ్మ!
బాలరో! మువ్వగోపాలరాయని - భావ మెట్లున్నదో ॥ ఈ॥

ఎన్నగల సొమ్ములు వదలింతును గాని
యెదుటనే నిలువ వచ్చుటకు వెరతు నమ్మా!
తిన్నగా చెలువుని చూచితే - దృష్టి తాకునో యని
కన్నెరో! తమి నణచు కొందు గాని
కౌగిట బిగియింపుటకు వెరతు నమ్మా!
ఉన్నత మైనట్టి సిబ్బెంపు గుబ్బలు - యురమున నొత్తునో యని ॥ ఈ॥

ఎలమితో నేమి సేయు మన్నాను గాని
యెంతైనా కా దనుటకు వెరతు నమ్మా!
జలజాక్షిరో! నా విభుని చిత్తమున చంచల మందునో యని
చెలియ లెటువలె నాడు కొన్నాను గాని
చిన్న బోయి యుండుటకు వెరతునమ్మా!
మలయజగంధిరో! నా ప్రాణేశ్వరుని - మనసెటు వచ్చునో యని ॥ ఈ॥

కోరిక కెమ్మోవి చవి జూతును గాని
గుబ్బలు కొన నొక్కుటకు వెరతు నమ్మా!
సారెకు జొబ్బిల్లు తేనె లూరక - జాళిగ విందునో యని

కూరిమి నుపరతి సలుపుదు గాని
కూడ సమ్మతించుటకు వెరతు నమ్మ!
గారవ మగు మువ్వగోపాలుని పదముల
కంటె మూల బెట్టునో యని ॥ఈ॥

## 75. అసావేరి – ఆది

1 ఉన్నబోటి చెలులైతే – ఓర్చుకొందురా ?
కన్నులాన శాంతురాల – గాన నే దాళితి గాని ॥ఉన్న॥

కలువరించి నీ వల్ల – చెలిపేర బిలువగ నా
నెలతగాను భ్రమయకు – నే నంటిగా యిందు కెల్ల ॥ఉన్న॥

అనుదినము కౌగి – లలది నే నదలించగ
మనను నిలువ లే నని – వనిత తోడి తెమ్మన్నందుకు ॥ఉన్న॥

కోపము దీరి మా మువ్వ – గోపాల నిను గూడితె
నా పె వలె హితవరి కా – దంటి నీ మాటల కెల్ల ॥ఉన్న॥

## 76. ఆనందభైరవి – త్రిపుట

ఊరకే చలము చేసే – వేరా మ్రొక్కేరా!
ఔరా మువ్వగోపాలా! – గారవించి చూడరా! ॥ఊరకే॥

సద్దు సేయక వేగ – వద్దికి రారా వట్టి
సుద్దులనే తేలించి – ప్రొద్దు బుచ్చకురా!
ముద్దులయ్య! నీ మోము – ముద్దు గులుకు చున్నది రా
ముద్దు బెట్ట 2 మనస య్యారా
'మోము మోమున జేర్చరా' ॥ఊరకే॥

1 ఉన్నపాటి. 2 మనిపించేరా.

అరమరలు సేయకురా – హావుసు కైన దానసురా
తరుణులవలె వలపు – దాచ నేరను రా!
నెర నమ్మిన దానసురా – నిమిష మిక దాళ లేరా
.... చెమ్మగిలి మై – మరువ సాగెనురా! ॥ఊర కే॥

అక్కర దెలిసి వేగ – పక్క నుంచు కోరా
చక్కని మా మువ్వగోపాల – చొక్కి యున్నాను రా!
నిక్కు నా గుబ్బల గోట – నొక్కి యెద జేర్చు కోరా
యెక్కువైన రతులచే – గ్రక్కున నన్నేలు కోరా! ॥ఊర కే॥

## 77. తోడి - త్రిపుట

*ఊరికి పోక నేడిం – దుండేది మేర
వారిజాక్షులార! కంచి – వరదుడు నా కెదురు చూడగానే ॥ఊరికి॥

తొలుత నే నొచ్చే టప్పుడు – తోచీని మనసు కెంతైనా
యెలనాగ! నా కన్నదరె – యేమి సేతునే?
పలుమారు నన్ను పేరను పలుకరించ దేమో తెలియదే
చలమేల నన్నంపరే – శకునము మళ్ళించ వలెను ॥ఊరికి॥

ఎంత మీరు లాలించిన – యెన్ని సొమ్ములు బెట్టిన
సంతోసమై యుండదే నా – సామి నెడబాసి
యింతులార! నా మోహము – యింతింతని తెలుప వశమా?
కంతు జనకుడు నేడు నా - కలలో వచ్చి నాడమ్మ! ॥ఊరికి॥

చిన్ననాట నుండి నేను – చెలిమి జేసితి యెంతైన
యెన్నికతో మరు కేళి నెనసి – యున్నదాన నయ్యయ్యో!
.... .... .... ....
.... .... .... .... ॥ఊరికి॥

* చివర చరణములో మువ్వగోపాల ముద్ర యుండవచ్చును.

## 78. యదుకుల కాంభోజి - ఆది

ఎంత చక్కని వాడే నా సామి వీ - డెంత చక్కని వాడే
ఇంతి మువ్వ గోపాలుడు సంతతము నా మదికి
సంతోషము చేసినే ||ఎంత||

మొలక నవ్వుల వాడె - ముద్దు మాటల వాడె
తళుకారు చెక్కు - టద్దముల వాడే
తలిరాకు జిగి దెగడ - దగు మోవి గలవాడె
తెలిదమ్మి రేకు క - న్నుల నమరు వాడే ||ఎంత||

చిరుత ప్రాయము వాడె - చెలువొందు విదియ చం
దురు గేరు నొసలచే - మెరయు వాడే
చెరకు విల్తుని గన్న - దొరవలె నున్నాడే
మెరుగు చామన చాయ - మే నమరు వాడే ||ఎంత||

పొదలు కెందామరల పెం - పొదవు పదముల వాడే
కొదమ సింగపు నడుము - కొమ రమరు వాడే
మదకరి కరముల - మరువు చేతుల వాడే
సుదతి ! మువ్వగోపాలుడెంత - సొగసు గలవాడే ||ఎంత||

## 79. సురటి - త్రిపుట

ఎంత చెలిమి చేసితివే - యింతిరో ! నీవు
ఇంతింతని దెలుప వశమా ? యిపుడు నీ దిగులు ||ఎంత||

నిన్ను కౌగిలి జేర్చి - నీ చెక్కిలి ముద్దు బెట్టి
కన్నుల నీరునించి - కడు దైన్యమున
వన్నెలాడి నిన్ను బాసి - వచ్చిన నాట నుండి
వెన్నవలె కరిగి కరిగి - వేసటకే లోనైతి ||ఎంత||

నా వలెనే నీవు - నా భావ మంత దెలిసి
చేవు నాన మై మఱచి - తెలివి నోడితివి
నా వంటి పాప జాతికి - నాతి యీ విత మైతి
నీ వంటి దానికి - నీతిగాదే ఓ చెలియ ! ॥ఎంత॥

పొంకముగా వద్ద జేరి - పూ విల్తుని కేళి
కొంకక గుబ్బల గుమ్మి - గూరిమి మీరగ
యింక నైన గౌగిలించి - యింతి వేడుక మీర
పంక జాక్షీ ! మువ్వగో - పాలా ! యని నన్నేలక నే ॥ఎంత॥

## 80. ఆహిరి - త్రిపుట

ఎంతట తెల్ల వార దెంతట ప్రొద్దు గ్రుంక - దే మందు నమ్మలార !
కంతు జనకుడైన మువ్వగోపాలుడు
కౌగిట లేనందుకు అమ్మ నే జెల్ల ! ॥ఎంతట॥

పతియు నేను గూడిన - విత మెల్ల దలచుక
వెతల గొంతసేపు - వెన్నెల కాకకు
సతులు సేయు శైత్యోప - చారముల గొంత సేపు
నత డిందు లేక లో - కా స్తమాన మైనట్లు ॥ఎంతట॥

గతము కొంద రింతులు - పతుల బాసి కూడిన
కతల గొంత సేపు గరి - గమనలు పుణ్య
పతి నీ పతి రేపే నచ్చు ననెడి
నుతుల గొం[illegible] సేపు నోరు నిండినట్లు ॥ఎంతట॥

కోరినట్ల మా మువ్వ - గోపాలు డిందు వచ్చి
యూరడించి కొంత సేపు - నొక నిమిష మొక యేడై
యా రమణితో నన్ను - యది దెలుప గొంతసేపు
మారు కేళి గూడి నా - మనసు [1] దీర్చుకో లేక ॥ఎంతట॥

---

1 తేర్చుకో.

## 81. మారువ – చాపు

ఎంత మాట లాడె నమ్మ – యింతిరో! నా విభుడు నన్ను
చెంత జేరి మోవి తేనె – చప్పనని మో మటు ద్రిప్పెనేమొ? ॥ఎంత॥

రమ్మని చే బట్టి నేను మా యింటికి – రా రమ్మంటి
నీ వెవరో? నే నెవరో? నేను – నీ వాడు గాదు పొమ్మనెను ॥ఎంత॥

కులుకు గుబ్బల రొమ్ము గుమ్మ – కౌగి లీయను నే బోతె
ఉలికి లేచి కసరు కొని వనిత! నీతో
పొందు చాలు పొ మ్మనెను ॥ఎంత॥

చెలియ మా మువ్వగోపాలుని – చిత్తము రంజిల్ల జేసి
యొలమి పైకొని ఉపరతి సేయగ బోతే
ఈ పొందు వద్దు పొమ్మనెను ॥ఎంత॥

## 82. ముఖారి – అట తాళ చాపు

ఎంత రాతి మనసు దానవే! – యొలనాగ నీవు
కొంత సేపు అలిగి యుంటే – కూడుకునే వారు లేర ॥ఎంత॥

అలివేణిరో! నీవు – అలిగి యున్నది మొదలు
పలుమారు విధిని దూరేది – పని యేమో గాని
వలకాకకు డస్సి – వాతెరలు తడుపుచు
బలువేదనతో బొరలీనా – పడతి యీ పాప మయ్యయ్యో! ॥ఎంత॥

కొసరి కొసరి వేడితే – కొమ్మ వెలిగా బోయీ్యన!
యిసుమంతైన దయ లేక – యింత యిది దోప మయ్యయ్యో!
బిసరుహాక్షిరో! నీవు – కసరిన నాట నుంచి
పస లేని తప్పు లెంచే వీ – పని యేమో గాని అయ్యయ్యో! ॥ఎంత॥

మున్ను నీ విభుని జేరి – ముద్దు ముద్దుగా గూడిన
చిన్నెల మది దలచి దలచి – చింత జేసేవు
మొన్న నాతో కోవళ్ళూరు మువ్వగోపాలుడు
కన్నుల నీరు దుడిచి – గారవించి తేనే దోసమా ? అయ్యయ్యో ॥ఎంత॥

83. కాంభోజి - ఆది

ఎంత లేదని యెంచకురా !
కంతుని గన్న చక్కని - కరిగిరి వరదా ! నా సామి ! ॥ఎంత॥

నిను బాసి తాళ లేను – నీ సొమ్ము జేసితి నా మేను
తనివి దీర్చక పోనీకు – దక్కితి నేను
నను విడనాడే – నను వగ మాను
1 మునిచితి మోహము నా మది లోను
తనరగ నీవు నా దైవము గాను
మనసున నెంచితి మక్కువ తోను ॥ఎంత॥

ఇక్కడ నుండ మనసాయె – నిది యేమో తెలియ నీ మాయ
చొక్కుపాడి చల్లి నట్లాయ – సుగుణవిధేయ !
అక్కడ నీవు న న్నరమర సేయ - జిక్కితి మదనునిచే విటరాయ !
[ మొక్కిన ద్రిప్పవు మోమిా చాయ
చక్కని సామి 2 చాల నిను బాయ ॥ఎంత॥

తెలిసె మువ్వగోపాల – దేవుడ వైతి వీ వేళ
కలసి యేచుట మేల ? కంటి నీలీల – సొలపున నను దయ జూడ వదేల?
చెలిమి మాని యేచెదవుర చాల - వలచితిరా నిను వరద నా పాల
గలవని నమ్మితి గరుణాలోలా ! ॥ఎంత॥

1 ననిచెను, 2 నీ చల మిట్లాయ.

## 84. మధ్యమావతి - అట తాళ చాపు

ఎంత లేదు నాతో - నీడు సేతుర !
వింతలాయు కసుకాయ మధురమౌన
వినరా ! మువ్వగోపాల సామి ! ||ఎంత||

నీ మనోభావము దెలియ నేర్చునా
నెనరుగా ని న్ననుసరించ నేర్చున ?
వేమారు మోడి చేసినా ? నావలె - వేడి పిలువ నేర్చునా ?
ప్రేమ మీర నీ ఖాళి రంజిల్ల - పెదవి తేనె లాని ముద్దాడ నేర్చున ?
సామిగా పదివేల చుక్కలాయును
చంద్రునికి సరి వచ్చునా సామి ! ||ఎంత||

అతిశయ లీలలు సేయ నేర్చునా - అణుకువై ముచ్చట లాడ నేర్చున
రతి వేళను నిన్ను తమి రేపించ నేర్చున - .................... (?)
సతతము నీ తమి యుప్పొంగ జేసి - చౌసీతి బంధాల బెనగ నేర్చున
మితి లేని యుత్తళి సొమ్ములు పెంచ్చెన
బంగార మౌన సామి (?) ||ఎంత||

కోకోకశాస్త్రము జదువ నేర్చున
కుచముల నీ రొమ్ము గుమ్మ నేర్చున
అక్కర దీర నిన్నలయించక రతి కేళి - ననుభవింప నేర్చున
చక్కెర విల్తుని గన్న మువ్వగోపాల
చల్ల వడిగండ్లు ముత్యమౌనా సామి ! ||ఎంత||

## 85. [1] ముఖారి - ఆది

[2] ఎంతవింతరా ? చక్కని సామి !
కంతుజనక ! నాదు - కన్నులాన కల్లగాదు ||ఎంత||

1 ఉసేని. 2 ఎంతో వింతాయెరా చక్కని సామి ! కంతు జనక నా రెండు కన్నులాన నీతో పొందు.

ఆనబాలు చక్కెర పానకము జుంటి తేనె
లారగించి వచ్చితో ? అది చెప్పరా !
పూసి నీ చెక్కిలి నొక్కి పుక్కిటి కొలది గానే
యానగా నానగా దియ్యనై యున్నది కెమ్మోవి ॥ఎంత॥

కలపము బన్నీరు కదంబము నీ మేన
నలదు కొన్నావేమో అందముతోను
కులుకు గుబ్బల నిన్ను గ్రుచ్చి కౌగిలించు కొన్న
చలువ వాసనలు వెదచల్లీరా ! సామి ! నీ మేన ॥ఎంత॥

ఎన్ని మందు లిడితివో యేమి మంతరించితివో ?
చిన్నదాన గాగా మాయ చేసితివో ?
నిన్ను రతి గూడ గూడ నేడు నా తమి యగ్గలమై
తిన్నగా నెంతైన దనివి దీరదు మువ్వ గోపాల ! ॥ఎంత॥

## 86. ఆనందభైరవి – ఆది

ఎందుకు నా పై బాళి ?
ఇందువదన ! విని యుండు తాళి ॥ఎందు॥

దినదినములు దాని యింట నీవు - మెనసి తిరిగితివి వగలాడి వెంట
మనసు వచ్చెనా నేడు నన్నంట
కనకాంగి వింటె తాళునె మాట ॥ఎందు॥

మందయాన మాటలేల - మందుబెట్టి నిన్ను వల వేసెనో చాల
ముందటి నెనరు నీవే వేళ చాలా
అందరు నవ్వేరు అది నీ కొక్క మేల ॥ఎందు॥

భావము దెలిసెను నేడు - దైవము యెడజేసె యిక నేనే మందు తిల్ల
గోవింద మునుపటి పొందె చాలు యిక మువ్వ
గోపాల సరసము లేల ॥ఎందు॥

## 87. అసావేరి - త్రిపుట

ఎందుకు పగ జేసెనో ? కమలజు - డిక నైన లెస్స వ్రాయడో ?
అందుకందుకు చెలు - లమరికతో నున్నారు
చందమామ యీ రేయి - చల్ల నుండే దైవమా ! ॥ఎందుకు॥

బలిమి నే మంటినో ? నా సామిని - తెలియక పొమ్మంటినో ?
కలకంఠిరో ! వినవే - కలలోన వాని గంటి
చెలిమి చెలువు డేల - చేరదీయడు దైవమా ! ॥ఎందుకు॥

పగవారితో జేరెనో ? నా సామి మనసు - బాళి లే నట్లాయెనో ?
చిగురు బోడిరో ! వినవె - చిన్ననాటి నా పైని
తగుల మెల్ల నేడు - దిగ దీసెనో దైవమా ! ॥ఎందుకు॥

మ్రొక్కు మంటే మ్రొక్క నైతినా ?
నే నిటుల - మోము చిన్న జేసుకొంటినా ?
చక్కెరకెమ్మోవిచ్చి - చాల దయతో రాగ
పక్కకు మువ్వగో - పాలుడు రాడో దైవమా ! ॥ఎందుకు॥

## 88 [1] కాంభోజి — చాపు

ఎందుకు యీ మాట లేల ?
ముందు నిన్నెరుగనా ? - మువ్వగోపాల ! ॥ఎందుకు॥

నిలుపు నా పై దయ యీక ఆ - చెలియతో నలగి వచ్చితివో లేక
తలపు దెలిసె నిందాక న
న్నలయించు దైవము నసవలె గాక ॥ఎందుకు॥

మనసు రాసి పొందు మాను ఆ - కనకాంగి వలె జక్కని దాన గాను
నిను మెప్పించ నేర్తునే నేను ఓ
వనజాక్షి ! సరసము వద్దు నాతోను ॥ఎందుకు॥

---

1 యదుకుల కాంభోజి - అట.

రంతు సేయక మున్ను రావా? నే
నెంతో కోపించిన నెదురాడి నావా?
(?) ఎంత లేదని యుండ నీవా అది
కొంత కాలము మువ్వగోపాల దేవా! ॥ఎందుకు॥

## 89. [1] బేగడ — ఏక

ఎందుకు వచ్చెనో కోప - మెవ రేమన్నారు?
అందు కిందుకు సరి - యాయరా! మువ్వగోపాల! ॥ఎందుకు॥

ఎక్కడైన నవ్వుకోమో! - యెదురు మాటాడుకోమో?
మొన్నరాతి రలిగి - ముచ్చట లాడుకోమో?
చిన్ని ముద్దు వచ్చెనని - చెక్కిలి నొక్కి సందుకు
నన్ను నీ వొకటంటె - నిన్ను నే నొకటంటి ॥ఎందుకు॥

ప్రేమ రెట్టించు కోమో? _ బిగి కౌగిళ్ళ నుండమో?
యేమైన ననుకోమో? - మెచ్చు కొద్దు లాడుకోమో?
ఆ మాట కా మాట - కప్పుడే నే జాణ నంటి
నా మాట నీవు కాదంటే - నీ మాట నేను కా దంటి ॥ఎందుకు॥

అతనుని కేళి గూడి - అంత మాయ ననుకోమో?
మితము లేనట్టి తమి - మే లనుకోమో?
హితవై మువ్వగోపాల! - యించుక నే నలగితే
నలిక మలగితి - వప్పుడే కూడి యిప్పుడు ॥ఎందుకు॥

## 90. [2] కళ్యాణి — ఝంప

ఎందు దాచు కొందు నిన్ను - నేమి సేతు నేను?
అందమైన నీ మోము - అయ్యలూ! ముద్దు గుల్కుచున్నది ॥ఎందు॥

1 శహాన. 2 కాపీ.

అందిందు దిరుగకుర ! - అతివలు నీ తోడి
పొందు గోరి యే వేళ - పొగరు చున్నారు
యెంద రెంద రసికాతు - యెంతని నే విన్నవింతు ?
పందె మాడు కొన్నారట ! - పట్టుక పోయెద మనుచు ॥ఎందు॥

పలుమారు నా సామి - బయలు వెళ్ళకు మ్రొక్కె
నిలువరాని మోహమున - నిను జూచి చెలులు
అలరు నీమోవి తేనె - యాసి చప్పరించ వలసి
కులుకు గుబ్బల రొమ్ము - గుమ్మి పొయ్యెద రనుచు ॥ఎందు॥

ముదముతో మా ముద్దు - మువ్వగోపాల నా సామి
గుదిగొన్న తమకమున - గూడి యిద్దరము
నిదుర పరవశమున - వదలునో కౌగిళ్ళు
పదిలముగా నా జడను - బట్టి కట్టుకొందునా ! ॥ఎందు॥

## 91. సావేరి - చాపు

ఎక్కడ తాళుదునే ? - నేమని దూరుదునే ?
మ్రొక్కిన రాడు కౌగిలీడు - మువ్వగోపాలు డో చెలియా ! ॥ఎక్కడ॥

దయ గోరంతైన లేదాయ వట్టి - తచ్చనలే ఘన మాయె
ప్రియముతో నను జూడడాయ
ప్రేమతో చే పట్టడాయ నో చెలియ ! ॥ఎక్కడ॥

బతిమాలిన రాడాయ నన్ను - పగవాడై యుల కంతు జేయ
హితవని నన్నేల డాయ - యెంతటి మాయ యో చెలియ ! ॥ఎక్కడ॥

కూడి యున్నదే వెగటాయ నేను - వీడె మిచ్చిన నొల్లడాయ
మోడి చేసి మువ్వగోపాలుడు నా
మోహ మెన్నడాయ - నో చెలియ ! ॥ఎక్కడ॥

## 92. [1] సారంగ – త్రిపుట

ఎక్కడి నేస్తము - లెక్కడి నెనరు [2] లెవ్వరి కెవ్వరే
మొక్కిన వినక మా మువ్వ గోపాలు నా
ముదిత ! యింటికి ద్రోసిరే ఓ చెలియ ! ॥ఎక్కడి॥

ఇదిగో మొన్నడు నిరుగు పొరుగు లెరుగని వాని
కెన్నెన్నో బోధించిరే !
అది చక్కని జాణ యని వాని దా నిల్లు
కదల కుండగ జేసిరె ఓ చెలియ ! ॥ఎక్కడి॥

బలిమిని నా చేత నింతో నింతైన - బంచుక బో సేతురే !
చెలులు గాదా రెండు దలచ రని యింటి
చెలువుని మొడ జేసిరే ఓ చెలియ ! ॥ఎక్కడి॥

మొలక ప్రాయము నాడె మువ్వగోపాలుని – కలయుట దెలియరకొ
లలనరో ! వాని చే లంచాని కాసించి
చలపెట్టి పగ జేసిరె ఓ చెలియ ! ॥ఎక్కడి॥

## 93. తోడి – ఆది

ఎచ్చోట నున్నాడో చెలియ వా – డే మనుచున్నాడో ?
విచ్చల విడిగాను – వెర పింతైన లేక
ముచ్చట లాడుచు - మువ్వగోపాలుడు ॥ఎచ్చోట॥

వారిజాక్షి ! యనుచు దన - వద్దకి రమ్మని
తీరుగ నుదుట - తిలకము దిద్దుచు
జారు కొప్పున సన్న – జాజులు ముడుచుచు
గారవమున పక్క – జేరి ముద్దు బెట్టుచు ॥ఎచ్చోట॥

---

1 కల్యాణి – చాపు. 2 లెవరిని నమ్మేది.

చాల నను దూరుచు దన - సాటి లే రనుచు
పాలుగారు చెక్కిలి - బాగుగా జీరుచు
వాలాయము గాను - వా తెర యానుచు
వల పదము బాడుచు - నెలమి సొక్కించుచు ॥ఎచ్చోట॥

బాలరో ! మువ్వగోపాలు డైన వరదుడు
కోలాహలముగ - గొసరి కొసరి వేడుచు
సీలవేణిని రతి - లీల శయ్య నను
కూలముగ మరుకేళి - గూడి లాలింపుచు ॥ఎచ్చోట॥

## 94. పున్నాగవరాళి - త్రిపుట

ఎటుల మరచి యుందునే ఓ చెలియ ! నే నేమి సేయుదునే ?
కటకట రేయి పగలు కన్నుల గట్టి నట్లు తే ॥ఎటుల॥

వెలది వూరి దాక పోయి - వేగ వత్తుననగ
బలువెతలు నే గొన్న - పలుక వల దనగ
మొలక నవ్వుల ముద్దు - మొగ మింత చేసుకుని
తలవంచు కొని యెంతో - తల్లడించిన వగ ॥ఎటుల॥

తడవు నిన్నెడబాసి - తాళగలనా యిక
జడియకు మనసు నుడి నుడి యింపగ
యెడలేని కన్నీరు అపుడు దుడుచుచు
ఉడుకుచు నటు మోమై యుసురనుకొన్నది ॥ఎటుల॥

చెలిమిని చేరదీసి - చిత్తంబు కేళిని కలయుచు
వగవగల కరిగింపగ
యెలమి మువ్వగోపాలు డింపు మీర హా ! యని
పలుకుచు నటు మోమై పరవశమై యున్నది ॥ఎటుల॥

## 95. కాంభోజి – ఝంప

ఎటువంటి మోహమో గాని ఓమెలనాగ! యింతంత యనగ రాదే
మటు మాయ దైవ మీ మనసు దెలియగ లేక
మనల నెడబాపె నయ్యో! ఓ మగువ! ||ఎటు||

కలికి నిన్నెడ బాసినది మొదలు నీ రూపు - కనుల గట్టి నట్లుండునే
చెలియ నే నొకటి దలచెద నన్న నీ సేయు
చెలిమి తలపై యుండునే
సొలసి నే నేమైన వ్రాయ నీ యాకార – శోభనమె కనుపించునే
పిలిచి పేరున నొకటి బిలువ బోయిన నీదు
పేరు ముందుగ దోచునే ఓ మగువ! ||ఎటు||

అతివ! నీ యధరామృతము దలచి నంతనే – యాహార మింపు గాదే
సతి నీదు కౌగిటను ప్రతిదినము నెనసిన – గతి దెలుప నిదుర రాదే
మతిలోన నిన్నెగా నిరతంబు గోరుగ రతి – పతి యాన కల్ల గాదే
సతతమును నిను దలప కుండెద నన్న
క్షణమైన మరపు రాదే ఓమగువ! ||ఎటు||

ఘనత మా మువ్వగోపాల! రా! రా! యని – కలిసినది మరపు గాదే
దిన మొక్క యేడుగా గడుప నెవ్వరి తరము – వనబోణి యేమి సేతు?
మనసిజుని బాణవేదనల నే సైరింప – మగువరో! వశము గాదే
మనము చేసిన పాప మెట్టిదో వారలతో
మాటాడనే సైచదే - ఓమగువ! ||ఎటు||

## 96. నీలాంబరి – త్రిపుట

ఎటువంటి వాడే? వాడూ – ఓయమ్మ – వాడెన్నడు నీ వీధిని రాడూ!
కుటిలకుంతలి మువ్వ – గోపాలు డట పేరు ||ఎటువంటి||

నల్లని మేని వాడట ఓయమ్మ! వాడు – నయము లెన్నో చేసునట!
చల్లగా మాటాడు నట! - సరసము వాని సొమ్మట!
కల్లగాదట వాడు – కళలంట నేర్చు నట! ||ఎటువంటి||

బంగారు దుప్పటి వాడట వా డేమేమో
పంతము లాడు కొన్నాడట!
అంగన లెందరనైన నలయక గూడునట
సంగీత లోలుడట - చాలా యీవి గాడట ॥ఎటువంటి॥

నన్నే లే మన్నాడట అంతలో నాదు - చిన్నెలు దెలిసి నాడట
మొన్న యిందు వచ్చె నట - మువ్వగోపాలు డట
చిన్నవయసు వా డట - చెలియ! యందగాడట ॥ఎటువంటి॥

97. బిలహరి — ఆది

ఎటువంటి స్త్రీల పొందైన - హితవై యుండునా?
కుటిలకుంతలి నా మదిలో - కూరిమితో నుండగ ॥ఎటువంటి॥

మనసు మర్మము దెలియ పలసి - మగువల గొందర దెచ్చి
కినిసి పక్క పడ ద్రోసి - కేరి నవ్వేరు
కనకాంగి! నను బంపు నప్పుడు - కన్నుల నీరు నించుక
వినయోక్తులుగా విన్నవించిన - వితము మరువ నీయదు ॥ఎటువంటి॥

చెలి ముద్దు పాదము లాదిగ - శిరము దనుక చక్కదనము
నలినసంభవునకు వ - ర్ణన సేయ దరమా?
అలివేణి! దూరమైన న - ల్లైతే మనసు దూరమా?
వలపున నా తను వా రమణికి - వారకమై యుండగను ॥ఎటువంటి॥

చెలువ! మువ్వగోపాలు డైన - శ్రీవేంకటరమణా! యని
కిలకిల నగవుల నా యెద గు - బ్బల గుమ్మ్రుచు
కళలంటి పరవశము జేసి - కంతు కేళి న న్నేలిన
మెలతను దలప నిపుడు నా - మే నెల్ల బులకరించెగా! ॥ఎటువంటి॥

## 98. పంతువరాళి - ఆది

ఎన్నటికి నిటువంటి గుణ - మింక వలదె
నిన్ను నన్ను గన్న విన్న - కన్నెలు నవ్వేరే! ॥ఎన్నటికి॥

వామాక్షిరో! మాట - వచ్చి నపుడే నీవు నేను
నేమైన నాడుకోమో - యెపు డైనను
నా మోము నీవు జూడవో! - నీ మోము నేను జూడనో?
భామ యింటికి రా వద్దని - పలుకరింతు రటవే! ॥ఎన్నటికి॥

మెలతరో! నీ మీది - మిక్కిలి దయ వాడ
కలికి! నా పై మనసు - గల దానవు
అలగి కొంకరి కొంకరు మో - ములు జూడ వద్దనుచు
బెలుచ దనమున నొట్టు - బెట్టు కొందు రటవే! ॥ఎన్నటికి॥

నీరజాక్షిరో! యించుక - నిన్ను నే నాడు కొన్న
నేరక రెండు మాటలు నన్ను - నీ వాడు కొన్న
ఆరసి మువ్వ గోపాలు - డని కలయు వేమో?
సారెకు నీ పొందు లేక - క్షణమైన నుందునో? ॥ఎన్నటికి॥

## 99. ముఖారి - ఆది

ఎన్ని టికని నే మెత్తు? - నెంతని వినుతింతు?
కన్నె నీవు జేయు నుప - కారములు పదివేలు ॥ఎన్ని టికని॥

విరహ సాగరములో - దరిదాపు లే నపుడు నీ
యురమను దెప్పపై నుంచి - వెరపు దీర్చి నందుకా?
మరుని వాడి తూపుల - మనసు వేగు నప్పుడు
సరగున వచ్చి మది - చల్ల జేసి నందుకా? ॥ఎన్ని టికని॥

మగువ నిన్నెడ బాసి - పగలు రేయి జీకాకై
వగల బొరలు నప్పుడు నా - దిగులు దీర్చి నందుకా?

నెగడు కార్చిచ్చు వంటి వె - న్నెల చేత వేగు నప్పుడు
జిగ మోవి పానక మిచ్చి - సేద దేర్చి నందుకా ? ॥ఎన్నిటికని॥

మొలక నవ్వు మోముతో - మువ్వగోపాల ! రమ్మని
కలసి చెమట లూర - గౌగిలించి నందుకా ?
అలగి నే నూర కుండిన - యంతలోనే తెలుసు కొని
నలినాక్ష ! కోపము వద్దు - నమ్మితి నన్నందుకా ? ॥ఎన్నిటికని॥

## 100. ఘంటారవము - [1] చాపు

ఎన్ని తలచు కొందు నమ్మా ! - యెట్లా మరపు వచ్చు నమ్మా !
కన్నెరో ! చక్కని నా చేవ్రు వైన
కంచి వరదుని మంచిగుణము ॥ఎన్ని॥

మన్నన జేసి యెప్పటికి దయ - మరువ వద్దని పాదము లంటుచు
నన్నింత జేసితి వనుచు దేగువ - నవ్వు నవ్వుచు
కన్నుల వీనుల జెక్కుల మోవి - గళము ముద్దు పెట్టుకొని
తిన్నగ నూరికి బోవుచు నన్నే - తిరిగి తిరిగి చూచిన వగ ॥ఎన్ని॥

వెన్న వలెనే కరిగి కరిగి - విడనాడని మనసు తోడ
నన్ను దప్పక చూచి చూచి - దిన్న బోవుచు
వన్నె బంగారు బంతుల వంటి నా - చిన్ని చన్నులు రెండు దన
కన్నుల నొత్తుకొని మోము - గ్రక్కున నెత్తి లేకున్న వగ ॥ఎన్ని॥

పల్లవాధరిరో ! మిక్కిలి లేత - పాయపు దానవు తాళ లే వని
మెల్లగా దమి రేచి నన్ను - జల్లగా గలయుచు
నుల్ల మలరగ దన యెదపై నన్ను - మల్లె పూ వలె నుంచు కొన్న
వల్లభుడు మువ్వగోపాలుడగు - కంచి వరదుడు జేసిన మచ్చిక ॥ఎన్ని॥

---

1 మఠ్య.

## 101. కేదారగౌళ –(?)

ఎన్ని పోకిళ్ళ బోయేవే? యింతిరో! నీవు
ఎన్నడు మువ్వగోపాలు - డెనసెనో విర్రవీగేవు ॥ఎన్ని॥

సతతముగ నొకనాడైన - చక్కగా నిను జూచీన?
హితవు మీరను తమక - మెప్పుడైనను రేచీ?
పిత లెంత రాక కులికెదవు - పేరు విన్న మాత్రాన నేవుబ్బే?
అతిశయంబేమి? నీదు మెరువడి - "అల్పం పటా భిక్షం" (?) ॥ఎన్ని॥

* సరివారు గై కొన్నట్లు మెచ్చైన - సరిగ కోకల సరసము గాను
యింటి వెచ్చాసికై పదిరూక లమర్చినావా? - యిక యేమో యొక
మంచి వలువ తోనే అల్పునికి ధర నైశ్వర్యము వచ్చితే
అర్ధరాత్రి గోడను బట్టు కొన్నట్లు ॥ఎన్ని॥

నిన్ను నీవే మెచ్చు కొనుచు - నిలువు టద్దమె చూచు కొనుచు
చెన్నుగ నీ రతుల మెప్పించి - చెలగితి వనేవు
కన్నవారితో సాటి యె - క్కడ లే దనేవు
యెన్న డెక్కని వాడు గుర్ర - మెక్కితే ముందు వెనకైనట్లు ॥ఎన్ని॥

## 102. పంతువరాళి - చాపు

ఎవతె గూడిన నేమి చాలు - నిది నాతో ననకురే!
కువలయాక్షిరో! యెప్పటి మా మువ్వ
గోపాలరాయడు వీడె గదా! ॥ఎవతె॥

మంచితన మైన నాడె - మక్కువతోనే చెక్కు నొక్కి
కొంచక మోహావేశమునను - గోరనే జీరి
అంచుల చేత నప్పళించి - యూని యూని తనివి దీర
చంచలాక్షిరో! నే చాల - చప్పరించిన వాని మోవె గదా! ॥ఎవతె॥

* యతిప్రాసలు అర్థము కుదర లేదు.

ప్రేమతో దన రెండు చేతుల - బిగియించి తమి కొద్ది
వేమరు గబ్బి గుబ్బల గుమ్మ - వేడుక మీర
మోము వాని చక్కని మో - మున జేర్చి చేర్చి
లేమరో! నే గాగి - లించిన వాని కొమ్మ కదా! ॥ఎవ తె॥

హితవై యున్న మువ్వగోపాలు - డిందు వచ్చే దినము లెల్ల
సతమని నే నుపరతుల - సమరతుల
నతని నలయించి తా - నలసి మరియు వింత వింత
వితముల నే ననుభ - వించిన వాని మేనే గదా! ॥ఎవ తె॥

## 103. అఠాణ — 1 చాపు

ఎవతె తాళు నమ్మా! యీ నడతల? - నే మందునె కొమ్మా!
సవతి మువ్వగోపాలు కెక్కు- వేమొ?
యువిద నా వలె నది - యొక్క తేనా? కలకాలము ॥ఎవ తె॥

అక్కరో! నే వాని కాకు మదుపు లియ్య
గ్రక్కున వాడు నా కన్ను లడ్డము చేసి
పుక్కిటి విడె మా బోటి కొసగి మోవి
నొక్కితె యల దాని నోరు జూచి చూచి ॥ఎ॥

పసి దానను నా పానుపు పై వాడు
ముసుగు బెట్టుక నొక్క మూలను పవళించి
నిశివేళలో నల నీరజనేత్రితో
గుసగుస మని చాల కొసరి ముద్దాడితె ॥ఎ॥

శే షగ లివి యని లేక వా రిద్దరు
నా పడకింటిలో కాపురమై యుండి
యా పణతికి సుంత కోపము గలనాడు
గోపాలుడు నను గూడ వచ్చు చుంటే

1 అట తాళ చాపు.

## 103. [1] సురట — త్రిపుట

ఎవరి వల్ల దుడుకు మా - యిద్దరిలో సఖియా !
వివరింపు మమ్మా ! మా- విధము దెలిసి యిపుడు ||ఎవరి||

రమణి ! బంగారు మంచముపై నిద్దరు చాల
మమతలో పరసంపు మాటలాడే వేళ
కమలాక్షి పేర నన్ను ఘనుడు బిల్వగా కోప
శమనము లేక నాదు జడకొద్ది గొంటి నమ్మా ! ||ఎవరి||

ఘనుడని వానిపై కొని నేను నెనరున
మొన గుబ్బ లెదను గుమ్మచు నుండే వేళ
కనకాంగి రతి కిట్టి వనుల జాణ యనగ
విని పదింటిలో సగ మొనరించితి నమ్మా ! ||ఎవరి||

కలికి ! మువ్వగోపాలు గలసి మునుపటి నలెని
తలిరాకు వంటి పాదము లొత్తే వేళ
చెలియ పెట్టిన మందు తలకెక్కి నా పక్క
గలువరింపగ మోవి - గంటి జేసితి నమ్మా ! ||ఎవరి||

## 104. శంకరాభరణం - చాపు

ఎవ్వడే ఎవ్వడే ఓ భామ వీ - డెవ్వడే ?
ఎవ్వడే నేను పవ్వళించిన వేళ
పువ్వుబాణ మేసి రవ్వ చేసి పోయె ? ||ఎవ్వడే||

పట్ట పగలు వాడు వచ్చి బలు దిట్ట డయి నా యిల్లు జొచ్చి వా -
డట్టె నన్ను చెట్ట బట్టి కౌగిలించి
గట్టిగా నామోవి గంటుచేసి పోయె ఎవ్వడే

1 సురటి మలారు.

గరిత వానికి నేను సతమా? నన్ను
గద్దించి పలుకు టుచితమా? నా
పురుషు డూర లేని ప్రొద్దు మాపటి వేళ
1 సుద్దుల దేలించి ముద్దు బెట్టుక పోయె ॥ఎవ్వడే॥

వెన్న తిన్న పిన్న తనమా? 2 అల్ల - వ్రేతల గూడిన గుణమా? నన్ను
కొన్న మగని వలె కొంగు బట్టి తీసి
3 చన్ను లొడిసి పట్టి చల మేటి కని పోయె ॥ ఎవ్వడే ॥

పేద సాదల కిది యూరా? - యిందు పిన్న పెద్ద లెవరు లేర? యీ
వీధి వార లెల్ల - వింత చూడనె కాక
దాదు ఫిర్యాదేది ధరణిలో లేదా యె ॥ఎవ్వడే॥

నీలమేఘ శ్యామలాంగుడు మంచి మేలు పీతాంబరధరుడు వాడు
లీలతో పది యారు వేల గోప
స్త్రీల నేలిన మువ్వ గోపాలు డని పోయె ॥ఎవ్వడే॥

## 106. భైరవి - త్రిపుట

ఎవ్వతెరా? నీతో నవ్వినది
నివ్వటిల్లు ప్రేమ నీ పొందు కాసించి
మువ్వగోపాల! నీ మనసు దెలిసె లేరా! ॥ఎవ్వతె॥

కీవితో నీవు రాగ గోవ కడ్డము వచ్చి
బావ! రమ్మని చాల బలిమి చేయుచును
తీవరముగ పైట తీసి గుబ్బలు చూపి
యీవలె నని కౌగి లీయ వచ్చు నటగా! ॥ఎవ్వతె॥

1 సరసాన దేలించి సన్న జేసి పోయెను. 2 గొల్ల - కన్నెల వలపించు.
3 అవ్వకు నను పిలిచి రాపు చేసి పోయె.

సొలపు చూపునట సొక్కిలి తనునట!
కులుకు నట ముద్దు కొసరు నట!
అళుకెందు కిందు మీ యావి లే దనునట!
చెలులు చెప్పగ నీ చిన్నె లన్నియు దెలిసెరా! ॥ఎవ్వ తె॥

మును పెన్న డైన నీ మోమైన తెలియక
చెనకితినో లేక చనవు నను
విను మావ దిన్నట్లు వేదనచే దిరిగేవు
నను గూడి నా ప్రాణనాథ! మువ్వగోపాల ॥ఎవ్వ తె॥

## 107. [1] ఉసేని - ఆది

ఎవ్వతె నిను బోధించెనో?
మువ్వ గోపాల! నాదు ముచ్చట జెల్ల నీయక
ముదుగు నడిపించు మని – మువ్మ్యాటికి చలపట్టి ॥ఎవ్వతె॥

ఇన్నాళ్ళ దాక నిరు చెవి యెరుగ నీక – నన్ను గావలసి నీవు నడిచితివి
మున్నున్న దయ లేక మొగనా లని యెంచక
కన్ను మరుగు గాని చోటు గా జెక్కిలి జీరుమని ॥ఎవ్వతె॥

విరి వాసన గూడిన విరమున నీవు నేను
నరమర లేక యుండే యుందము జూచి
విరస మెందున లేదు వీరి కని దలచి
గురుతుగా నా మోవి గుమ్మెలు బో నొక్కు మని ॥ఎవ్వతె॥

హెచ్చు తమి నీ వద్ద మరింత సేపు నే నుండిన
వచ్చి తడవాయె మాట వచ్చి నందువు
కుచ్చితమున మా మువ్వ గోపాల! నన్ను గూడి
యిచ్చట తెల్లవారు దాక నింటికి పోనియ్య వద్దని ॥ఎవ్వతె॥

1 గోపికా వసంతము.

## 108. కాంభోజి – ఆది

1 ఎవ్వతని చూచి నాడే? యింతిరో! నన్ను
జవ్వని! మా మువ్వ గోపాల – సామి నా మర్మము దెలియక ॥ఎవ్వ॥

మానగ లేని మనసు భ్రమలే – కానగ లేదు నా కపటము చాలే
తానే యింటికి వచ్చి దాగక యుండలే
యేనుగ నెక్కి– దిడ్డి ... (?) దూరగ నేవే ॥ఎవ్వ॥

గదసి దిగులుతో గతి గూడకో (?)
సదమదమై యుండిన సామి యితడేమి
తుద మొదలైన నేమి? దొడ్డ కొంచమైనా నేమి?
చదవక వే యింటి జవ్వాజి మాకేమి? ॥ఎవ్వ॥

పరిపరి వితముల పణతిప్ప నేమందు?
సరసము విరసమైతే సామినేమందు?
మరు కేళి కొత్త లాయె మా మువ్వగోపాలు పొందు
అరుగుమీాది బిరుదైతే అపుడే నే గూడి యుందు ॥ఎవ్వ॥

## 109. భైరవి – త్రిపుట

ఎవ్వరి నంపుదు నేమి సేయుదు నీవే – యిది బుద్ధి యన వమ్మా!
మువ్వ గోపాలుడు మోడి చేసుకొన్నాడు
మొన్నటాల నుండి రాడు నీ తోడు నే ॥నెవ్వరి॥

అతివ చులకనని యందు బోరాదని
యతని బిలువ నన యంటే నా మదిలోని
వెత లెట్లు దీరు నెన్నాళ్ళున్న మితి లేని పోరు నీ కంటె నాకు
హితవరు లెవ్వ రున్నారు? పలు మాటు ॥ఎవ్వరి॥

1 ఎవ్వరని.

మనసు గరగ మంచి మాట లాడి నా మీద
నెనరు బుట్టించేది నీ భారము గాక యే
వనిత కేలా దైవము నన్ను వినవే నీపాలా త్రోసినది
అనుమాన మిక నేలా? యీ వేళ ॥నెవ్వరి॥

అక్కరో! మువ్వగోపాలు డతను కేళి గూడగ
ఎక్కడ మనసని చెక్కిలి నొక్కితే
మక్కువ లేని వాని వలెనె మొక్కసే గాని విడనాడి యీ
దిక్కుకు రాక మాని నిను గాని ॥ఎవ్వరి॥

## 110. ముఖారి — ఝంప

ఎవ్వరి ననగ వని యే మున్న దమ్మలార ?
కొవ్వ నాడ నేలే మువ్వ గోపాలుని – నోము ఫల మిట్లుండగ ॥ఎవ్వరి॥

మంచివారి వలెనే యుండి యీ - మగువ లందరు వాని చే
లాంచలమున కాసించి వానికి బోధించి నా యిల్లు పగ గా
వించుచు నది ద్రోహమని యెంచక తిరిగేది ప్ర
పంచ మనవలె గాక ॥ఎవ్వరి॥

ఎవ్వరెంత చెప్పినా యెంతైన వినక
నవ్వుల కొక నాడైన నాతో నలుగని విభుడు
రవ్వ జేసి యిందు రాడు – రాతి రెల్ల నందుండి
పువ్వు బోణి సేయు - పుణ్య మనవలె గాక ॥ఎవ్వరి॥

తొలుతటి వలె నన్ను తలచి మువ్వగోపాలు
డెలమితోడను రతుల – కలసి యుండగను
చెలియ లోర్వలేక – చే సైగ దానింటికి
బిలువ బోయిన - ప్రియుని నవవలె గాక ॥ఎవ్వరి॥

## 111. భైరవి – ఆది

ఏటి నేస్త మిక – బోటిరో! వినవె
నేటి రేయి మువ్వగోపాలు డా - బోటితో నే గూడి నపుడె ॥ఏటి॥

కాసు వీసము లేటికే – ఘనుని పొందే చాలునని
ఆసచెంది యుంటి గాని – అతివరో! వినవే!
మోసగాడు దానింటిలో – వాసమై యున్నా డిపుడు ॥ఏటి॥

ని న్నెడబాయ నని యెన్నెన్నో బాస లిచ్చి
పన్నీరు గంధము దెచ్చి - పై నిండ నలది
వన్నెలాడి వద్ద జేరి – వలచి యున్నా డిపుడు ॥ఏటి॥

చిన్న నాటి నెనరైన – చిత్తమున నుంచినాడ
మన్నించి యాడిన – మాట మాయ లాయెనే
మున్ను నన్నేలిన శ్రీ – మువ్వగోపాలుని తోను ॥ఏటి॥

## 112. భైరవి - ఆది

ఏటి మమత . యెక్కడి యాస - యెవ్వరి కెవ్వరే?
పాటలగంధి! మువ్వ గో – పాలుని నమ్మ రాదె ॥ఏటి॥

కనుసన్నలో బిలువ లేద . - కరము లెత్తి మ్రొక్కినది లేద?
అనుసరించి వెంట తిరిగి - యాడు కొన్నది లేద?
తనువు పులకించి సొక్కించ లేద – తానె పై కొన్నది లేద ?
తనివినైన పొద్దు బోదు - తరుణీ! నీకు బుద్ధి లేద? ॥ఏటి॥

దక్కితి నంటిన లేద – దండము బెట్టినది లేద?
మక్కువతో బాసలిచ్చి – మాటాడుట లేద?
చెక్కిలి నొక్క లేద – చిత్త మిచ్చి నడువ లేద?
చిక్కంపు సొమ్ములిచ్చి – సింగారించి చూడ లేద? ॥ఏటి॥

కురులు దువ్వి ముడువ లేద - విరిసరులు జుట్ట లేద?
సరిగ రవికె దొడిగి మంచి - చలువ గట్టలేద?
విరిశరుని కేళి గూడి - వేద నారాయణు డనగా
పరువంపు ప్రాయము నాడు - పై కొన్న మువ్వగోపాలుని ॥ఏటి॥

## 113. భైరవి — త్రిపుట

ఏటి మాట లమ్మ! - యీ చెలులతో
పాటలగంధి! మువ్వగో - పాలుడు రాడాయె నయ్యో! ॥ఏటి॥

మించిన చింతతో నుండ నన్ను మాటలా - డించ నెట్టి మనసయ్యెనే
చంచల మాయె నా మదికి - చాలు చాలు నేడు నే
నెంచిన ఎన్నిక లెల్ల నీడేర దాయె నయ్యో! ॥ఏటి॥

మీనన్నేత్రిరో! వినవే నా - మేలొకరి మేలసి మట నంతు
నే నెవ్వరికి పగ - దాననా? నేడు నా
దీనత విభునితో - దెలుప లే రయ్యో! ॥ఏటి॥

చెలిమి నెప్పటి వలెనే మువ్వగోపాలుని - కలికి నా తమి దీరను
కలసి సొంపుతో నుండ - గలిగినో? లేదో? వో
చెలియరో! దైవము - చలము సాధించె నయ్యో! ॥ఏటి॥

## 114. సౌరాష్ట్రము - చాపు

ఏ తీరున రమణిని గెలిచి నీ - వెట్లు రూ పొదువో?
చూతము రారా! మదన! నీ
చేతి బలిమి మా చెలియ బలిమి ॥ఏతీరున॥

రాతిరనే యేనుగ నెక్కి - రాకాచంద్రుడు గొడుగు గాను
లేత తెమ్మెర మొదలైన బలముల - చేత గెలిచెద నంటివా?

పోతుటేనుగు కుంభములే - పాలతిగుబ్బలు మోము చంద్రుడు
నాతి ప్రాణములై చలువ తెమ్మెర
జాతి వారిలో పగలు గలదా ! ॥ఏతీరున॥

జంటవిరి దమ్మి యెద - నంట గుమ్మెద నంటివా ?
దంటవే చెలికేలు దమ్మి - తమ్మి [illegible]క్కలై సుమ్మీ ?
తుంట విల్లొక్కటి నీది - తుసి యసి విండ్లు చెలియ కన్బొమలు
యింట గెలిచి రచ్చ గెలువ వలెనను - నెన్నిక లేక బూనితివి ॥ఏతీరున॥

అంచలు మా చెలిసి జూచి - యడుగు బెట్ట వంచి చూడ
పంచవన్నెల చిలుక - పలుకులే చాన పలుకులు
పంచబాణములు నీదు - పడతిచూపులే తూపు లనగ
నెంచ శక్యము గా దామీద
నేలుకొన్నాడు మువ్వగోపాలుడు ॥ఏతీరున॥

## 115. తోడి – [1] త్రిపుట

ఏమంటినమ్మా ! నా సామిని - యేమంటి నమ్మా
కోమలాంగిరో ! మువ్వ - గోపాల సామి నే ॥నేమంటి॥

వామాక్షి ! నా సరి - వారు నవ్వేరని
వేమారు మాటాడ - వెరచి నే నుండగ
నా మనసింతైన - నాథుడు తెలియక
నా మందయానతో - నాడు కొన్నాడట ! ॥ఏమంటి॥

బలిమి వాని గుట్టు - బయలు దేర నియ్య
నలివేణి తగవుగా - దని నే నుండగ
చెలువుడు నా మేలు - తెలిసి తెలియలేక
కలికితో బలుమారు - గసరు కొన్నారట ! ॥ఏమంటి॥

---

1 ఆట.

ముచ్చట దీర మా - మువ్వగోపాలుడు
పచ్చవిల్తుని కేళి - బరగ నన్ను గూడి
విచ్చలవిడి దాని - యిచ్చకముల కేమో
గచ్చులాడితో నెంతో నొచ్చు కొన్నాడట ॥ఏమంటి॥

## 116. కేదార గౌళ - చాపు

ఏమందు నమ్మా ! యీ వింతనే - నెటుగాన నమా !
భామరో మువ్వగో - పాలు డేలిన భావ
మేమని తెలుపుదు - నే నో చెలియరో ! ॥ఏమందు॥

ప్రేమతో సొక్కి - నా చెక్కిలి - వేమారు నొక్కి
కామించి నను బిగియ - కౌగిలించెనే గాని
మోము మోమున జేర్చి - ముద్దు బెట్టడాయె ॥నేమందు॥

వలపు మితిమీరి నా వద్దికి - వచ్చి నోరూరి
పలుచని కెమ్మోవి సొలసి గ్రోలెనె గాని
కులుకు గుబ్బలపైని గోరు లుంచడాయె ॥నేమందు॥

పరిపరి గతుల నన్ను చాల - పైకొని రతుల
బరికించి మువ్వ గో-పాలు డేలెనె గాని
చిరుదొడలపై దన - చే సోక నీడాయె ॥నేమందు॥

## 117. కల్యాణి – త్రిపుట

ఏమనంటి నమ్మ! వాని - కెంతో కోపమే
కోమలి ! వినవే మువ్వ - గోపాల సామితో ॥ఏమనం॥

ఇంత నాట నుండి విభు - డెలమితో నన్నేలి
యింత కపట మేమొ - యెరగ నైతి నమ్మా !

వంతకారికి వలచి యున్న - వాని చిటుకు మంటే
యింత కంతకు నన్నల-యించ మేర కా దంటి ॥ఏమనం॥

దాని గూడిన చిన్నెలు - తనకే సమ్మత మైతే
కాని యిందుల కే మనగ - కమ్మి కొంటిని
మానక దాని సుద్దులు - మరి మరి యనగాను
మానిపించుటకై వేరే - మాట లాడితి గాని ॥ఏమనం॥

మునుపెంతో మోహమున - మువ్వ గోపాల రా
యని యెనసి లాలించిన - చనవు దీర
వనితా యిప్పుడు నా భాగ్య - వశ మీలా గున్నది
మానక యెవ్వరి నే - మనక యూరకున్నాను ॥ఏమనం॥

## 118. [1] తోడి – ఆది

ఏమని దూరితివే? కోమలి! నీ [2] కోపము - కొల్ల పో వద్దా?
మోము జూడక యిట్లు – మువ్వగోపాలు ॥నేమని॥

పిలువక వచ్చునో – పెద్ద మాటాడునో
చెలిమి కా దనునో – చే కొంచ మెరుగునో?
అలుకచేయ నేర్చునో – అందిందు బోవునో
పలుమా రందరిలో - బహుచుదనము చేసి ॥ఏమని॥

మంచి మాటాడడో – మన్నన చేయడో
వంచన పరుడో – వచ్చి లాలించడో?
ఇంచుక చిత్త మీడో – యెమ్మెల వాడో
అంచయాన! యిటుల ననవచ్చు ననరాదనక నీ ॥వేమని॥

నిను గూడ డాయెనో – నీ యాన మీరెనో
కినిసి రా ననెనో - కేరడము లాడెనో?

---

1 కన్నడ. 2 పాపము.

మనసు రా దగానో నీ - మాట జవదాటెనో
మొనసి కోప మోర్వక - మువ్వగోపాలునీ ॥ఏమని॥

## 119. ఆనంద భైరవి - త్రిపుట

ఏమని తెలుపుదు నేలాగు తాళుదు - నేమి చేతునే? చెలియా!
భామరో! యూరికి - బయలు దేరెడు వేళ
ప్రేమ మీఱ నా సామి - పిలిచి చెప్పిన మాట ॥ఏమని॥

అన్న మిందక - అతివెత నొందకు
కన్నీరు నింపకు - కలువరింపకు మని
ఎన్నెన్నో విధముల - హితవులు దెలుపుచు
కన్నీరు నించుచు - గాంతుడు చెప్పిన మాట ॥ఏమని॥

నిడివి కన్నుల నీరు - నించుచు దల యూచి
తడలేక వేగ - తానే వచ్చెద నని
అడు గడుగునకు సు - రసు రని మదిలోన
గడు మోహమున బ్రాణే - శుడు బలికిన మాట ॥ఏమని॥

ఏనోము నోచితినో? - యెంతని వేడితినో?
తా నేమి వ్రాసెనో? తలమీద విధి యని
పూనిక తోడ మా మువ్వగోపాలుడు
సూనశరుని కేళి - సుఖియింత మనుమాట ॥ఏమని॥

## 120. శ్రీరాగం - ఆది

ఏమమ్మా! యీ వింతలు జూడవే - యిది యేటి వగలే?
కాముని గన్న మువ్వగోపాలరాయడట
యేమో గుసగుసమని - యెచ్చరిక జేసెనే! ॥ఏమమ్మా॥

హద్దు మీరి వా డటు యిటు జూచి - సద్దు సేయక నా వద్దికి వచ్చి
గద్దరించి గుబ్బలపై గోన గోరు లుంచి
ముద్దియ్యవే ! యని మోము మోమున జేర్చెనే ! ॥ఏమమ్మా॥

పై కొంగు బట్టుకొని పరిపరి విధముగ
పలికి నాడే వాడు కులికి కులికి
చెలియరో ! యేమని జెప్పుదు నాతోను
కలకలమని నవ్వి కౌగిలించెనే ! ॥ఏమమ్మా॥

మాటాడవద్దని మరి నన్ను బెదరించి
మదనకేళి ............ చే యుంచి
చేష్ట లేమేమో చేసితే భ్రమసితి
చేరనో ఆవేళ తెలియ దేమారితి ॥ఏమమ్మా॥

## 121. ముఖారి — త్రిపుట

ఏమనే వాన తీరా ? యేమి సేతురా ?
తామస మేల జేసేవు ? - దక్కితి మువ్వగోపాల ! ॥ఏమనే॥

పదము బాడగ వినేవో ! చదరంగమే నాడేవో ?
సదయుడ ! కౌగిలించేవో ! - చక్కెరకెమ్మోవి నొక్కేవో ? ॥ఏమనే॥

తిలకమే తీరుగ దిద్దుదునో - దేవుడ వని మ్రొక్కుదునో ?
పాల యలుకలే సేయుదునో ? చెలిమితో లాలింతునో ? ॥ఏమనే॥

చేరి కూడి యుందునో - చెక్కిలి నొక్కుదునో ?
మారిమితో విడె మిత్తునో ? - గొబ్బున మువ్వగోపాల ! ॥ఏమనే॥

## 122. ముఖారి — ఆది

ఏమిర . వరద నీ - మోము చిన్న బోయినది
నా మనసు నీ మనసు - ప్రేమ నిండి యుండగ ॥ఏమిర॥

ఒడిమీద నుండగా - పడతు లందరు రాగా
వడిగా లేచి పోయినదే - వలపు లేని దాననా ?
ముడిబొమ్మ లేలరా, నా - యెడపకత్తె చే యాకు
మడుపుల నంపించినదే - మమత లేని దాననా ? ||ఏమిర||

తెలియ జూచితె నీకు - దృష్టి తాకీనంట
నెలుపోర జేసినదే - తలపు లేని దానవా ?
నలుగురిలో నీతో నవ్వ రాదనుచు నే
నిలుచేర వచ్చినదే - హితవు లేని దానవా ||ఏమిర||

ఘనుడ ! మువ్వ గోపాలు డను కంచివరద !
నే తనివి దీరక యలిగినదే - నెనరు లేని దానవా ?
వినరా ! నెలమి పైకొని వింత వింతగ రతుల
పెనగి సై మరచినదే - ప్రియము లేని దానవా ||ఏమిర||

123. నవరోజు — ఆది

ఏమి సేతు ? కన్నె ప్రాయము - నెడ జేసె దైవము
ఆమె కొన్న రతిసుఖము - అనుభవించే దెన్నటికో ? ||ఏమి||

నెనరు గల నగు మోము - తనియ జూచెద నంటే
తనమేన సిగ్గు చేత - తల నెత్త నీదు
మనసులో వాసి మీది - మమతైతే యింతిం
తనరాదు వినయిది వాకారు ? మేరగాదు ||ఏమి||

సొగసు జేసుక పోయి - ముద్దు లాడెద నంటే
పగదా మె తల్లి దండ్రులు - బయలు వెళ్ళ నీయరు
యిగురుబోణు లెవరైన - యీ వగలు వింటేను
నగుదురో యసి గుండె - దిగులు మనీని ||ఏమి||

ఎదురు వాకిలి గనుక - యెదు రెదురె చూచుచు
అదె లోకమై నేను - నిదుర బోవకను
సదయ! మువ్వగోపాల! - సామి! నన్నలము కొని
యెద నుంచి నట్లాయె - మదన పరవశమాయె ॥ఏమి॥

## 124. ఆహిరి – చాపు

ఏమి సేతునే? ఓ యమ్మ! నే - నేమి సేతునే?
ఏమి సేతునే? వెన్నెలకాకల - కోర్వ్లేర్తు నమ్మ! నేను ॥ఏమి॥

కలకల రవములు చిలుకల పలుకులు
సొలపులు నా మీద ఝులుఝుల్లు మనెనే!
అళులచే నళుకుచు సొలపుల వలచితి
తెలతెల్ల వారదే చిలుకల కొలికి! ॥ఏమి॥

మింట చందురు నన్నంటి గాయు గాక
యింటి నుంటే రాదు కంటికి నిదుర
తుంట విల్తుడు నన్ను కంటగించి నాడు
వింటివటే! కలకంఠిరో! నేడు ॥ఏమి॥

అందమైన మా మువ్వగోపాలు - డైన రంగేశు
మందలించి వాని - యింటు తోడి తెచ్చి
పొందు సేయగదవే - చందనగంధి! నే ॥నేమి॥

## 125. ఉసేని – [1] ఏక

ఏమి సేతునే? కొమ్మ! నే [2] నెటుల సైతునే?
భామరో! మా మువ్వగో - పాలు డేల రాడే? ఓ యమ్మా! ॥ఏమి॥

---

1 చాపు. 2 నేమిసేతునే.

ఒద్దిక తోడ చెక్కిట గోరు - లుంచ నైతినో?
దిద్ది మదన శాస్త్రమెల్ల - దెలుప నైతినో?
ముద్దు ముద్దుగ నతని కేను - మ్రొక్క నైతినో?
వద్దికి రమ్మని పిలువ నంపితే - గద్దరించెనట గదవే ఓ యమ్మా! ॥ఏమి॥

వంచన లేక సిగను పువ్వు - లుంచ నైతినో?
యించు కించుక సేపు కౌగి - లించ నైతినో?
లంచ మిచ్చి కెమ్మోమ్మ వాసి లా - లించ నైతినో?
కంచు పదను వంటి మనసు - కనుక వా డిందురాడే ఓయమ్మా! ॥ఏమి॥

చెలువుడా! యని చాల భక్తి - సేయ నైతినో?
చెలిమి తోడ మోము మోము - జేర్ప నైతినో?
కలికి! మా మువ్వ గోపాల రమ్మని - కలయ నైతినో?
యలుక చేసి యల్ల దాసి - వలను జిక్కి రాడే! ఓ యమ్మా ॥ఏమి॥

## 126. కేదారగౌళ — త్రిపుట

ఏమి సేతురా? ప్రాణేశ! నే నెటువలె తాళుదుర?
ఏమో గాని నిన్నెడ బాసి నప్పుడే యీ
మేన ప్రాణము లేమిటి కని తోచి ॥ఏమి॥

ఒకమాటు నీ మోవానక యొక వస్తువు జి
హ్వకు చవిగాదు, చే దయ్యీర!
మకురు మనసు నీతో మచ్చికై యున్నట్లు వే
రొక చోటను మోద మంద నయది (?) గాదు ॥ఏమి॥

నీ మాటలు వినవే గాని లేక మ - రేమియు వీనుల కితవు గాదు
నీ ముద్దు మోము జూడనే గాని యితరము కా
మింప నొల్లదు కన్ను లయ్యయ్యో! ॥ఏమి॥

ఎలమి మువ్వ గోపాల! యిపుడు నిన్ను నా - యెదపై
అలముకొన మన సయ్యీర!
చెలరేగి రతుల యెంత - సేపు గూడి యలసిన
తలరించు కోరికల - తనివి దీర దిందు కేనేమి సేతు! ॥ఏమి॥

## 127. కాంభోజి — ఝంప

ఏమి సేయుదు? మోహ - మెటువలె దీరును?
భామినీ మణిసి యె - వ్వరు తోడి తెచ్చేరు! ॥ఏమి॥

వెలయు నీదు ముఖార - విందంబు లిఖియించి
యలరు వాసనలు వ్రా - యగ నేర నైతి
కళలొల్కు నీమోవి - గదసి వ్రాసితి గాని
నెలత తేనియ లుంచ - నే నేర నైతి ॥నేమి॥

కలికి! సొగసైన నీ - కనులు వ్రాసితి గాని
బెళుకు జూపులు వ్రాయ - వితె మెరుగ నైతి
గళము రేఖలు దెలియ - గాను వ్రాసితి గాని
చెలగు కోకిల వంటి - పలుకు వ్రాయగ నైతి ॥నేమి॥

తరుణిరో! నాగబం - ధమురీతి గలయుటలు
గరిమ వ్రాసితి గాని - పరవశము చేత
పరగ మా మువ్వగో - పాల రా రా యని
తిరుగ రతులకు బిలుచు - తెలివి వ్రాయగ నైతి ॥నేమి॥

## 128. సావేరి — రూపకము

ఏమైన నందు బోను వేరొక్క - యింతిని బంపవే!
రామ! నీ వాడిన మాటలకు వాడు - రాడు మనసునొచ్చెను ॥ఏమైన॥

చక్కని వాడని యీవి కాడని - సరసుడని వాని వేగమె
దక్కించుకో వలె నని కొందఱు - చక్కెర బొమ్మలు

చిక్కుల బెట్టి యెన్నెన్నో వగలు - చేసి వాని పొందు గానక
నొక్కతె గాదె యందరు వేసారి - యున్నా రేటి మాటలు ? ||ఏమైన||

విందులు బెట్టి వాని మనసు - విరిచే మని చెలులు కొందరు
మందు లెన్నో ? మాయ లెన్నో ? - మంచి తన మెంతో ?
కందువ తెలిసి కుంటెన గత్తె - లెంద రెంత జేసిన
యిందుముఖి ! నీ మోహ - మింతింతన రాదు ||ఏమైన||

కలసి వానిపై లేని నిందలు - గట్టి యింటికి రా వద్దంటివి
పలుమారు వానితో పోరు వద్దంటే - యలుక చేసితివి
చలపాది నీ కోప మింతకు వచ్చెను - తెలుసుకో నేర వతివి నేడా
చెలికి మువ్వ గోపాలున కెడలు - సేయ నాచేత గాదు ||ఏమైన||

129. సావేరి - త్రిపుట

ఏమో తెలియ దెటువలె నున్నాడో ? - యేమని దెలుపుదు నే ?
భామరో ! నాపైని ప్రేమతో నచ్చటి
సేమము తెలిసి వచ్చే వా రెవ రున్నా ? ||రేమో||

పొలతి ! యూరిదాక - పోయి వచ్చెద నని
పలికి నంత లోపల కన్నీరు నించి
కిలకిల మని నవ్వి తలయూచి యేమేమో
తలచి తప్పక చూచి దయ యుంచు మన సిక ||ఏమో||

చురచుర మని వేడి - చూపు లెగయు చం
దురు కాక మేనెం - తో నొగిలెను గదవే!
మరుని రాయిడి వెం - బడిని చల్లని గాలి
ధరియింప [illegible]యింప - దరమా యెవరి కైన ||ఏమో||

కవ గూడి యెద పైని - గాని [illegible]య్యా పైని
బవళింప నేర్చునా - పడతి మువ్వ గోపాలు
నెవతె యాదరించెనో - యెట్లని యెంచెనో ?
యువిదరో ! యీ రేయి - నొంటి నుండ నాయె ||ఏమో||

## 130. కాంభోజి - త్రిపుట

ఏమో నేర 1 మించుక యెదు రాదు చున్నా-డేమి సేతునే? చెలియా !
భామరో! నా పైని యేమేమో విభునికి
పగవారు బోధించిరో ? యేమి చేసిరో ? ॥ఏమో॥

అలిగి యున్నాడని యలుక దీర్చగ బోతే అలుకలో నలుకాయనే
చెలియరో! నే నపుడు సద్దు సేయక బోతే
చెయి బట్టి నను దీసెనే, ఓ చెలియరో! ॥ఏమో॥

అక్కరో! నే వాని మ్రొక్కి వేడుకో బోతే
మ్రొక్కులో మ్రొక్కాయనే!
చక్కని గాడంట సకియరో! వాడు నా
చక్కదనమె చూపెనే!, ఓ చెలియరో! ॥ఏమో॥

వగకాడు మువ్వ గోపాలుని రతికేళి - సొగసులో సొగ సాయెనే!
మగువరో! నే నపుడు మాటలాడగ బోతే
మొగ మొగమే జూపెనే!, ఓ చెలియరో! ॥ఏమో॥

## 131. పంతువరాళి – ఆది

ఏమో మాయల వల పా లాగున చలము జేసెనే!
మా ముద్దు చెలువ గోపాలు నెడ బాసినది మొదలు ॥ఏమో॥

ఏ రీతి వేగింతు నెవరిని మది దలతు? - నీ రేయి నెట్లోర్తు నీ
విరహమున్న కూరి మింతో వెగటాయె నో
కొమ్మ (నామది తాళదాయె)
నారడికి లోనై చాల - నసురుసు రైతినే! చెలియా! ॥ఏమో॥

---

1. మించుము, మాడుక.

కాంత యీ వింత తమి గాదు - కంటికి నిదుర రా దెన్నటికి
మరపు రా దీ మోహమున - కన్య ప్రాయమున వాడు (?)
కదిసి కౌగిట జేర్చి యున్న దెల్ల
దలచిన నోర్వ నైతినే చెలియా ! ||ఏమో||

చెలియ మా మువ్వగోపాలుడైన
శ్రీ వేంకటేశుని కలసిన వగ లెల్ల - కల లయ్యె నేడు
తలచ నేలె యీ కథలు - తరుణి నాటి వెతలు
నిలిచిన చోటను - నిలువ నైతినే ! చెలియా ! ||ఏమో||

## 132. సావేరి — త్రిపుట

ఏమో యీ వింతలు - యెక్కడిదే నీకు ?
భామా ! మా మువ్వ గోపాలు నిన్ను గూడెనో ? ||ఏమో||

చిక్కు పడిన హారములు - చెదరిన ముంగురులు
కక్కసెమై నీ మోవి చాల - గంటి యున్న దిపుడు
పుక్కిటి విడెమున - బుగులు కొను వాసనలు
నిక్కు చనుదోయిపై - నెలవంక గురుతులు ||ఏమో||

పీడిన క్రొమ్ముడి - వింత వింత యూర్పులు
వాడ బారిన విరులు - వైఖరి యును
నీడ దేరు చెక్కులపై - నెక్కొను గురుతులు
గూడి యలసిన చెమట - కొంగు తడిసి యున్నది ||ఏమో||

సరసు డౌ మువ్వగోపాలు డిందు వచ్చి ?
సరస రతుల గూడి - చౌక మీరినది
మరిగి దా నింటనే - మరిరాక యున్నాడు
అరనిమిషాన తోడి తెమ్మ - న్నందు కింతాయ ! ||ఏమో||

## 133. [1] మోహన - త్రిపుట

ఏమో రాడమ్మా! యిందుండి పోయి - జామాయె నమ్మా!
భామరో! యాదివరాహు డే - పడతిని గూడెనో? ॥ఏమో॥

ఎన్నడైన న న్నెడ బాసి - యీ లాగుందునా?
సన్నుతాంగిరో! నా మాట - జవదాటని విభుడు
మన్ననతో నిపుడే - మగువ వల దగిలెనో? ॥ఏమో॥

నిలువదే నా మనసు వాని జూడక - నిమిష మైన
కలసిన వేళాగుణమో - కమలజు వ్రాత ఫలమో?
కలకంఠి యిదే నిజము - కన్నులాన కల్ల గాదు ॥ఏమో॥

మువ్వగోపాలుడైన - ముద్దు వరాహుడు
పువ్వు బోణి! రతుల - పొలు పొంద నను గూడి
నవ్వులకే యందు జేరి - నన్ను జూడ కున్నాడె! ॥ఏమో॥

## 134. ఉశేని - ?

ఏ రీతి నున్నాడో? యెటుల తాళి నాడో - యెరుగనో యమ్మ!
వారిజాక్షి! ప్రాణవల్లభు నను బాసి
వంత జెంది విరహవేదన చేత ఏరీతి
కల నైన నా మీది కలవరమే! యితర - కామికుల నొల్లడే?
చెలు లోర్వ జాలక చెలి నను దూరితే-చెవి యొగ్గి విన సహించడే!
అలగి యెపుడైనా దెలియక యాడితే - ఆ మాట మది నెంచడే!
నెలకొన్న దయతోను నెనరు నా పై నుంచి
నెమ్మది నుండే సామి యీ వేళ ॥ఏరీతి॥

తమి మీర క్షణమైన తన యెదుట లేకున్న - తత్తరమున నుండునే!
రమణి! నే నంతట రాగాను నవ్వులకు - రావద్దు పొమ్మనునే!

---

1 శహాన - ఆది.

క్రమము దెలిసిన వాడు కౌగిట లీయమై - ఘనముగా లాలించునే!
సమరసముతోను సరసము లాడుచు
సంతోషమున నుండే సామి యీ వేళ ॥ఏరీతి॥

పాటలగంధి నా భావము దెలిసి - పలుమారు తేలించునే!
నీటుగా మా మువ్వగోపాలు డెన్నైన నేర్పులు వచరించునే!
ఘాటమున నన్ను కౌగిట లీయమై - ఘనముగా లాలించునే!
పాటించి రాతిరి పగలు జోడు గూడి
బాళితో నుండే సామి యీ వేళ ॥ఏరీతి॥

## 135. [1] ఆహిరి — చాపు

ఏ రీతి వేగింతునే? ఓ చెలియ! నే - నే రీతి వేగింతునే?
ఏ రీతి వేగింతు - నెటుల నే దాళుదు?
సారెకు బైకొను - సకియ! ని న్నెడ బాసి ॥ఏరీతి॥

సందె ప్రొద్దు కాడ - సమయ మిదే యని
ముందు కౌగిట జేర్చి - మోదముతో
దండన సేయక - దైవాల రాయ నీ
పొందు గోరితి నన్ను పోలతి ని న్నెడ బాసి ॥ఏరీతి॥

ఆసబడిన చెలి - యను గూడక యున్న
దోసమురా యని - దూరుచును
బాస లిచ్చి నన్ను బలిమిని యింటికి
నా సామి రమ్మను ననబోణి నెడబాసి ॥ఏరీతి॥

పలుమారు మువ్వ గో - పాల! రమ్మని వేడి
నలమి కౌగిట మోవాన నిచ్చి
తలిరు విల్తుని కేళి - దమి దీరగా నన్ను
గళలంటి కూడిన - కలికి ని న్నెడబాసి ॥ఏరీతి॥

---

1. గౌళిపంతు.

## 136. శంకరాభరణము — [1] త్రిపుట

ఏల తెల్ల వారెె? నమ్మో! యింత వేగమె
బాలరో! మా మువ్వ గో - పాలునితో మాటాడ గానే ॥ఏల॥

రాక రాక మా యింటికి - రమణుడు వచ్చినంతలో
పోకముడి వీడగాను - పొంగు కొంచును
యేక చిత్తమున శయ్య - నిద్దరము బవ్వళించి
యాకు మడుపు లందిచ్చి న - య్యాటలాడు నంతలోనే ॥ఏల॥

మేను మేను గదని నపుడె - మిక్కిలి బిగ కౌగిళ్ళ
పూని పెనగుచు నిద్దరము - పొంకము మీర
సూనశరుని పాటలు - సొంపు మీర బాడు కొంచు
నాని కౌగిలించు మని - యడిగే టంతలో ॥ఏల॥

సరసుడౌ మా హేమాద్రి - సామి మువ్వగోపాలుడు
కరుణించి సమరతిని - గలయు నంతలో
సురతాన దమి హెచ్చి - చొక్కి వే రేమి తోచక
గురు కుచముల రొమ్ము - గుమ్మి పై కొను నంతలో నే ॥ఏల॥

## 137. తోడి — త్రిపుట

ఏలనే వాడు సామితో మన - కేలనే?
బాలరో! మువ్వ గో - పాలునితో ॥ఏల॥

నన్ను తాంగిరో! వాని - సరసుల లోపల
వన్నె కాడని యెంతో వలచి యుండగ
(కన్న)లతో నాడు కొన్న మాటలు నేడు
విన్నాను నన్నగ - వినతి సేయగ నేలే? ॥ఏల॥

---

1 అది.

కులుకు లాడిని మరు - గూడి యుండగ నిపుడు
పలుకుట మన కది - పలుచ దనము కాద!
వలపున రేయి నన్ను - పిలుపించ నని యల్ల
పొలతుల యెదుట వా - దులు పలికె నట! ॥ఏల॥

చెలిమి మీరె నని - పిలువ నంపిన గాని
వలచిన దాని గూడి రాడాయె - వా డింధు
చెలువుడు యింతలో - చలము సాధించి తే
కలకంఠిరో! వాని — కలువరించ నేలే ॥ఏల॥

138. యదుకుల కాంభోజి - అట

* ఏల మువ్వగోపాల! యీ చల మేల రా?
విరహము నే దాళరా మదనుని కిపుడే
వేళరా! ని న్నెడబాయ జాలరా! ॥ఏల॥

నెనరున నిను ఘన మని నమ్మితి నన్నే మేరా! [మొక్కెర! నీ చను వీరా!
కౌగిలించ వద్దన మేరా కోప మేల - [గక్కున రారా! ॥ఏల॥

అందు నిందు నన్నందగ త్తెను గా-దందురా! ఆ చెలి మాటలు విందురా?
యిప్పుడు నీ మనసందురా యిందుకు నే నే మందురా? ॥ఏల॥

బలు చెలిమిని నిను గలసితి నంటే
పలుకవు మునుపటి వలెనే - యలుకవు
కస్తూరి నా పై జిలుకవు మాటల - కైన నలుకవు ॥ఏల॥

139. కాంభోజి - ఆది

ఏల యలగి నాడమ్మా? యీ యలుక - యెవ్వరు దీర్చే రమ్మా?
జాణరో! మా మువ్వ గో - పాలుడు నా మనసు దెలిసి ॥ఏల॥

---

* ప్రాస?

వేడుకతో నన్ను దన విడిదికి బిలువ సంపితె - వెంబడిరో ! నే రానంటినా?
యాడైన దనతో - మోడి జేసు కొంటినా పలుమారు దా
జూడగా నే వేడగా దా - మోడిగా నింత పరాకా?
ఆడాడ దిరుగుచు మనసీక - యలయించి యింటికి రాక ॥ఏల॥

ఇందు వచ్చిన యెప్పుడైన హితవుగ మాటాడక నే
మందె మేలమున నుంటినా ?
కొందరి వలె - పొందుటకు పైడి దెమ్మంటినా ? దాని బోధన
విందురా ? తా నిందు రాక నె యుందురా నే నెంతో తేరా !
యిందుముఖి ! నాపై నేర - మెంచుట మేర గాదు ॥ఏల॥

బాల్య ప్రాయము నాడే వే - వేల నేరములు
జేసితే లాలించి మన్నించ లేదా ?
చాలా రతి లాహిరిలో నే యిల్లాలైనను నడవదా మువ్వగోపాల !
బాలరా నే దాళరా చల - మేలరా ? అన్నదే తప్పా ?
మేలోర్వని వారిలో న - న్నీలాగున చులకన జేసి ॥ఏల॥

140. తోడి - ఆది

ఏలరా ? చల మేలరా ?
ఏలరా ? మువ్వగోపాల ! - నేమి చేసితి కోప ॥మేల॥

ఇందు రా రా ! నమ్మితిని - గొంతైన సామివి గారా ?
అందు కేదుకు ని - న్నాడ నోరెందు నా కెమ్మో
విందరా యింత చిన్నబో
యుందురా ? మనసు నొచ్చుకొందురా ? చక్కని సామి ! ॥ఏల॥

యంచివాడవు నె నీ - మనసు జూచితి నెంతే
వంచన గాదు నీ పై - పలుచితిరా ! కౌగి
లించరా నే నీ సొమ్మని
యెంచరా ! రతుల నల యించరా ! చక్కని సామి ! ॥ఏల॥

వేడుకై యింతసేపు - వేడుకొందు వనుచు
మోడి చేసితి నింతే - మువ్వ గోపాల! నన్ను
గూడరా! నాతో సరస మాడరా!
నన్ను చల్లగ జూడరా! చక్కని సామి! ॥ఏలరా॥

## 141. నీలాంబరి - త్రిపుట

ఏలర వూరక చలము? మువ్వ గోపాల?
బాలర! నీ పాల కలిగిన దేమి? యీ - వేళ కరుణాలవాల? ॥ఏలర॥

వలచింది ప్రేమచే చాల దాసి - వలె నెందు గాన గోపాల!
మలయజగంధి నీ లీల దలచి - మది నుప్పొంగుచు నేవేళ
నెలత లిటువలె పలుమా రేచ వలెన
నీ కేమైన ఫలమాన గాక మే లౌన. ॥ఏలర॥

కనుల జూడవలె నని తాన అది - కరుగు చున్నది నీ మీా దాన
మన వాలకించు ఓ జాణ దయ - మరువ వద్దని నీతో ననేన?
వనిత బనుపగ వస్తి నిజముగ
వలదు యిక నిటువంటి కోపము వచ్చు పాపము ॥ఏలం॥

చిరుగుబోణితో నిపు డీ వాన మును - జేరి యింపుగా నుండ లేద!
తగవు బెట్టక నే రారాద తి - రుగా కూడి యుండితేను కారాద వృథా
పగలు జేసుక అలిగి వచ్చితే
నగవులకు యెడ మౌను ధరలోన సరివారలోన ॥ఏలర॥

## 142. యదుకుల కాంభోజి - త్రిపుట

ఏలరా? యీ వగలెల్ల నా సామి యిపు - డేలరా? యీ వగలెల్ల
చాలురా! మువ్వ గోపాల! యీ - జాజ మెల్ల ॥ఏలర॥

మనవేమి యున్నది నేడు అల్ల మటు - మాయ లాడిని మరి మరి వేడు
ఘనము గా దిది యెంచి చూడు ముచ్చ
కనికర మెల్లను దెలిసెను నేడు ॥ఏలర॥

చాలు నీ దయ అట్టె యుండు వట్టి - సరసము లాడకు నాతో వేలందు(?)
కాళ్లకు మొక్కుల బందు యింత
కరుణ గల వాడవు మన సందే యుండు ॥ఏలర॥

శయ్యపై సి చేర రాకు నాదు - పయ్యెద తొలగించి పట్టి ముద్దిడకు
కుయ్యాకు మని కూడ రాకు మువ్వ
గోపాల నేడు నీ కింత పరాకు ॥ఏల॥

## 143. నవరోజు - 1.త్రిపుట

ఏల వచ్చితివే ? సామి నెడబాసి - యేలాగు కాళ్లాడెనే? ఓ లలనరో !
బాలరో ! మువ్వగోపాలుడు నిను దలచి
పలువరింపుచు నుండునే - ఓ లలనరో ! ॥ఏల॥

ఉసురని తల యూచునే శయ్యపై నుండి - యులికి దిగ్గున లేచునే !
కసరి దిక్కులు జూచునే కన్నీరు నించి
కన్ను లెఱ్ఱగ జేసునే ! ఓలలనరో ! ॥ఏల॥

తలవాకిటనె చేరునే నీదు కెమ్మోవి - తలచుక నో రూరునే !
వెలది విధిని దూరునే తనలో దాను
వెఱ్ఱి కోరిక గోరునే ! ఓ లలనరో ! ॥ఏల॥

నిను చాల లాలించునే మువ్వగోపాలు - డెనసిన వగ లెంచునే
చనువిచ్చి కరుణించునే యిందరిలో నీ
సాటి లేదని యెంచునే ఓ లలనరో ! ॥ఏల॥

---

1 అట.

## 144. ఘంటారవము – ఆది

ఏల వలచితినో యమ్మా ! – యెట్లా వేగింతునే ? కొమ్మా !
యీ లా గౌట యెరుగ నైతి – మెదుగిరి చెలువ రాయని పై ॥ఏల॥

ఉన్నచోట నుండ నీదు – ఒరుగు పై న న్నొరగ నీదు
1 అన్నాహారము లేదు – ఘనబాలు తేనె చేదు ॥ఏల॥

చలువలైతె సైచ దాయె – జాజు లెంతో మొన లాయె
నిలుపరాని మోహ మాయె – నిట్టూర్పు లగ్గల మాయె ॥ఏల॥

తలపు వాని మీద నాయె – తల వాకిలే యిల్లాయె
వలుమారు గడసిన మువ్వగో – పాలుడౌ చెలువరాయని పై ॥నేల॥

## 145. 2 ఆహిరి – ఆది

ఏలాగున రమ్మందునే ? 3 యో భామ! వాని – నేలాగు రమ్మందునే ?
ఏలాగు నేను రమ్మందు ? నీ – వేలాగు బిల్వ మనేవు ?
పాలుమాలి మువ్వగో – పాలుడీ లీల నుండగ ॥నేలాగున॥

అచ్చట వాడు నదియు – నల్లిబిల్లియై యుండగ
ముచ్చట లాడు చుండగ – ముద్దులు బెట్టు చుండగ
గ్రుచ్చి కౌగిలించు కోగ – కోరికె మనుపు లందియ్యగ
నచ్చిక బుచ్చికలచే – నాపై తానై యుండగ ॥నేలాగున॥

చెలిమి నొకరి కొకరు – దిలకము దిద్దు కోగ
కిలకిల నవ్వు కోగ – గిన్నెర మీటు చుండగ
గులుకుచు నిద్దరును – కొక్కోకము చూచు కోగ
జలువ చప్పరములో – సరసము లాడు చుండగ ॥నేలాగున॥

1 అన్నమాహారము. 2 ఆరభి – ఆది.
3 చే లేచి చే బట్టుకో నైతినే – ఓ చెలియ.

నిదుర కంటికి రాక - నీవు నేను వేగించగ
నదేమో వాడు రాడాయె - నని నీవు దూరు కోగ
మదిరాక్షి మువ్వగోపాలుడు - మాటలోనె యిందువచ్చి
మదనకేళిని గూడి - మనసు లేకుండు జోతె ‖ఏలాగున‖

146. యదుకులకాంభోజి — ఆది

ఏలాగు నే వేగింతునే? ఓ ముద్దుగుమ్మా!
బాలరో! మువ్వగో - పాలు డలగి రా డాయెనే! ‖ఏలాగు‖

చిలుక నంపిన రా డాయనే నాతోనె ముద్దు
చిలుక మాటాడక పోయనే వానికిపుడు
అలగి యుండేది హితవాయనే ఓర్వజాలని
యతివల రవ మాయనే ఓ ముద్దుగుమ్మా! ‖ఏలాగు‖

బలిమి నన్నెడ జేసెనే యందువల్ల నా
చెలియే పుణ్యము చేసెనే మందు బెట్టి
అల వాని నోరు మూసెనే! యంతలో నా మా
టలు గాకుండ చేసెనే ఓ ముద్దుగుమ్మా! ‖ఏలాగు‖

కూరిమి నేరమెంచెనే మువ్వగోపాలుడు
కూడిన దాక నలయించెనే పై పోటి చేసి
ఆ రామ పొందు గావించెనే నన్ను నిప్పు
డంత లోనె మచ్చరించెనే ఓ ముద్దుగుమ్మా! ‖ఏలాగు‖

147. పున్నాగవరాళి — చాపు

ఐతే గాని నిన్నే నమ్మి - యాపె చేసిన భాగ్యము సామి!
సైతురా! యీ నడతలు సామి మువ్వగోపాల! ‖ఐ‖

చెక్కిలి నొక్కిన సొగసు - చేతిలో చేయి వేసిన సరాసు
యెక్కువైన నీ మనసు - యీ మర్మము నాకే తెలుసు ||ఐ||

అక్కరకు రాని ధనము - ఆసబడితే నేమి ఫలము
నొక్కువ నొక్కి సొమ్ము - నొలచు కొంటే నేమి ఘనము ||ఐ||

కులుకు గుబ్బల పోటు - గురిగ వేసిన కీల్జడ వేటు
అలుక వలదు నీ పలుగాటు - అందమాయెను యీ తడబాటు ||ఐ||

## 148. ముఖారి - [1] ఆది

ఐరాదే నేస్తమమ్మలార !
సారసాక్షి ! పోరేది - చాలు నమ్మ చెలులతో ||ఐరాదే||

నామీద నెనరు గల్గి - నావారి వలనుండి
యేమేమో విభునితో - నెగ బోసిరే
ఆమాట నిజము చేసి - యతడిందు రా కున్నాడు
వామాక్షిరో ! మేక - వన్నె పులి వంటి చెలులే ||ఐరాదే||

నుడువ నో రాడ దమ్మ ! నూ గింజయిన నాన నియరు
అడలి నే నొకరితో - నాడుకో రాదె
పడతిరో ! నా మాటలన్ని - పలికేరే విభునితో
ముడుచుక పోయేరు - ముసిముచ్చు లీ చెలులు ||ఐరాదే||

పాయక మువ్వగోపాల - భావ మైన యఖిలాండ
నాయకు డైన వరదుడు - నన్ను గూడి
గాయక మెరుగ డమ్మ - కటకట తెలియదు
కాయజుని తలిరు పదను - కత్తులమ్మ ! యీ చెలులు ||ఐరాదే||

1 త్రిశ్ర లఘువు.

## 149. కేదారగౌళ — త్రిపుట

ఒక్కరైన గాని నా - యక్కర కొదిగెరా ?
మెక్కువైన విరహాగ్నిచే - జిక్కి నపుడు వచ్చి
మక్కువతో మనసిచ్చినా - చక్కని సామి నను గూర్చి ||ఒక్కరైన||

ముదితరో వా డిందు - మోడి చేసి రా కుండగ
అది నా చెలుల తోడి తె - మ్మని వేడితే
యెద గరిగి నా మాట - యించుకైన నెంచ రైరి
మదిరాక్షు లున్నారనే - మాట వాసి యొకటే గాక ||ఒక్కరైన||

ఇంతిరో విభు నెడ బాసి - మెలమి యొక్కింత లేక
యెంతో నా మనసు కరిగి - చింత నొందితి
చెంత జేరి న న్నావేళ - యెంతైన సడ్డ సేయ రైరి
యంతరంగు లున్నారనే - యాడిక లొక్కటే గాక ||ఒక్కరైన||

చానరో ! చక్కని - సామి మువ్వగోపాలుడు
సూనశరుని కేళి గూడి - సొక్కించగా
నా నేర్పుల వాని - దా నిల్లు జేర్చిరి
మీన నేత్రు లున్నారనే - మేలి మొక్కటేగాక ||ఒక్కరైన||

## 150. మోహన — ఆది

ఒక్కసారికే యీ లాగైన - నోహో ! యిదేటి రతిరా ?
మక్కువ దీర్చరా ! మా మువ్వగోపాల !
సొక్కి యున్న నీ సొగ సది యేమిర ! ||ఒక్క||

నెమ్మొగమున నీ బడలిక లేమిర - నీటుకాడ రొమ్మదరే దేమిర ?
కమ్మని నా తెర కందిన దేమిర
కాళ్ళును చేతులు తడబడు టేమిర ! ||ఒక్క||

కన్నుల నిద్దుర గప్పె దేమిర - గళమున జెమటలు గారే దేమిర?
తిన్నని పలుకులు బలుక వదేమిర
తెలిసి తెలియ కున్నా వదేమిర? ||ఒక్క||

ఇనపురి ముద్దుల మువ్వ గోపాల! - యెప్పున నను గలిసితి వీ వేళ
మనమున నిన్నే నమ్మితి జాల
మారుబల్క కున్నా వది యేల? ||ఒక్క||

## 151. మోహన – ఆది

ఒక్క గడియకే యీ లాగైతే యిదేటి ఘనమే?
గ్రక్కున మాటికి అక్కర దీరగ
పక్క బోనేమె ఓ భామామణిరో! ||ఒక్క||

సన్నంపు పలుకులు పలికే వేమే? చన్నులు పయ్యెద గప్పే వేమే?
తిన్నని చూపులు చూప వదేమే?
నన్ను మంచి మాట లాడ వదేమె? ||ఒక్క||

పదములు తడబడి నడిచే దేమే?
పాటి మాట లాడ నో రాడ దేమె?
తను (?) వున చెమటలు జాఱే దేమె?
తరుణిరో! పెదవులు తడిపే దేమే? ||ఒక్క||

మదనుని కేళికి బెదరే వేమె? - మమత దీర ముద్దీయ వదేమే?
చెదరి భయంబున జూ చేవేమే? మడుపు లీయ
చెయ్యాడ దదేమే? ||ఒక్క||

ఉన్న తావునను వుండవదేమే! - కన్నె ప్రాయమున కదిలే దేమే?
వెన్నుడు మువ్వ గోపాలుడు తెలియగ
వెలదీ మనకది భయ మేమే? ||ఒక్క||

## 152. ముఖారి – చాపు

ఒద్ద దరల రైతి రేమే? – ఓ చెలులార!
ప్రొద్దు బోయిన దాక – సుద్దులే తలపెట్టుక ||ఒద్ద||

చిప్పిలు తేనె మోవి యాన నిమ్మని – చేతు లెత్తి మ్రొక్క గాను
వొప్పుగా నా మది యెప్పు డెప్పు డనగా
నప్పుడె నా రవికె ముడి – విప్పగ మీా కెరుక లేక ||ఒద్ద||

అయ్యలు తాళ లేనని – యాము కొన్న ప్రేమ తోడ
సయ్యాన యిక దమి నిలుప లే నన గాను
అయ్యయ్యో! నే కన్ను గీటి – యదర వేసిన దాక ||ఒద్ద||

నగుచు మువ్వగోపాలుడు మీా రంద బోతే – చిగురు విల్తుని కేళి గూడ
మగువరో! యీా చెలులు సైగ మాలిన వా రన గాను
మగవాని మనసు దెలసి – మరి నే బొమ్మన్న దాక ||ఒద్ద||

## 153. కేదారగౌళ – ఆది

కంచి వరదా! నీ వెక్కడ – గలిగితివి
ముంచేవో దరి జేర్చేవో – మోహాంబుధిలో నున్న నన్ను ||కంచి||

ముదముతో వేగమె ముడి – వదలించి రవిక దీసి
కొదమ గుబ్బల రొమ్ము – గుమ్మి గోరాడి
సదమదమైన సుద్ది – సరగ నీతో దెలిపెద నంటె
యిది యేమో మాట కవకాశ – మియ్యదు న న్నింత సేయ ||కంచి||

నొక్కి నోరు నిండ – నూరారు ముద్దు లిడుకొని
చొక్కి పరవశమైన – సుద్దులు నీతో
మక్కువతో దెలిపెద నంటే – మదిలో జాల సంతసమై
మొక్కువైన నాదు మోహ – మినుమడించె నింత సేయ ||కంచి||

నిలిచి నిలిచి కలయుచు - నివ్వెర గందుచు నిన్ను
తలచి తలచి సొలయుచు - దమి నిల్ప లేక
కులుకుచు జెక్కిలి - గొట్టి ముద్దాడుచు
నలరి మువ్వగోపాలుడవై - నన్ను దక్కించు కొన్న ||కంచి||

### 154. కల్యాణి - త్రిపుట

కంచి వరదునితో పొందు - కద్దో? లేదో?
వంచన మువ్వ గోపాలు - వరదుడైన చక్కని ||కంచి||

నీవు దాచక తెల్పవే! - నీలవేణి! అల్లవాని
భావము జూచే పట్ల - పతి మైనట్లు మతి తోచీనే! ||కంచి||

నీవే యాడకు బోదువో? - ఆ విభు డిందు వచ్చునో?
యీ వివరములు నేను - యిన్నాళ్ళుగ నెరుగ నైతి ||కంచి||

నీవు బతిమాలితివో? - నెలతా ఆతడు పై బడెనో?
దేవు నాన నీ వింత దిగులు పడ నేలనే? ||కంచి||

### 155. కళ్యాణి - ఝం

కందువ తెలియక నా పై మేలు వా డను - కొందు రితరు లెల్లను
ఇందుముఖిరో! మువ్వగోపాల నా సామి మా
యింటికి రాగా జూచి ||కందువ||

రచ్చలు జేసు నీ వీధిలో నన్ను - రమణుల గూర్చుకొని
ముచ్చటై నే వద్ద జేరి మాటాడితే - మెండి చేసు కొనును
ముచ్చెకంటు లింద రున్నా రొకతైన - మంచిది గా దనున
వచ్చినందు పల్లె యెవి భాగ్య మటు వలె నున్నది వానికి ||కందువ||

పొలతి యిండ్లెల్ల దిరిగి యీడకు సరి - ప్రొద్దు వేళను జేరును
పిలిచి నప్పుడె తలుపు దెరువ రాదా యని - చెలికత్తెను దూరును
నలిరేగి యించుక నిదుర బోతి నని - నన్ను జూచి కేగును
తలపు నా మీద లేదు గనుక
నేరము వేసి దానింటికి జారును ||కందువ||

మనసు వచ్చి నా నా డీడ నుండిన - మాటాడక నిద్రించును
వనజాక్షి ! ముందుగ సఖులతో నను లేప - వదని బెదరించును
ఘనమైన తమి నే నిలుప లేక పై కొంటె - గ్రక్కున చాలించును
తన కితవు గనుక మువ్వగోపాలుడు - దానింట వసియించును ||కందువ||

## 156. [1] మోహన - చాపు

కలికిరో ! యింకొకసారి యుపరతి - కలియక నే తాళజాలనే !
పలుమారు శ్రీమువ్వగోపాలుని మీద
పదము బాడి పెకాసు (?) గాను ||కలికి||

ముదమున కుచగిరు లల్లాడగ - మోమున ముంగురు లల్లిక లాడ
సుదతిరో నెన్నడు మసియాడ
నీ సొమ్ము లెల్ల నా మెదను కొంగాడ ||కలి||

తాటంకము లిరుగడ గులుక - తళుక్కుమని నా చెక్కిలి బెళుక
బోటిరో ! యిరువురు తా గులుక విరి
బోణిరో ! నా మీద నే యరమర లేక ||కలికి||

అరుదుగ నెరి ముడి సడలించి - అల్లెప్పటి వలె నేను రతి కలసి
యిరువరు తాణన (?) చేయి వేసి
యింపున సతతము మువ్వగోపాలుని తోను ||కలి||

---

1 శ్రీరాగం - ఏకతాళం.

## 157. భైరవి — త్రిపుట

కాని దాని జూచి - కను సైగ సేయ లేదని నీతో బలికె నటే
మానినిరో! నిన్ను మాపటి వేళలో
మాటాడ లేద మా మువ్వగోపాలుడు ॥కాని॥

ఇందు వాడు మీరెంత వేడిన గాని - సంధించి మాటాడుదునా నేడు
మందు ముచ్చుల మారి మమతకు లోనైన నే
డందఱు నవ్వ వలరా విడు విడు ॥కాని॥

ఎంత చెప్పిన వినక యెంతటి నడత లే - యింతు లైన సైరింతురా
చెంత రా నిత్తునా చెలియరో! యిక వాని
అంతరాంతర మెంతునా ఓ చెలియరో! ॥కాని॥

ఎనసిన మువ్వ గోపాలుడు యీడకు రాగ
మనసు కొంకు లేకది మల్లాడిన వింత
నేను విని యుండగా నెలతరో! కొం
చాన పోనిత్తునా దెలిసి బుద్ధి చెప్ప కుందునా? ॥కాని॥

## 158. ముఖారి — చాపు

కావలె నమ్మ! వా నికట్ల - కంబుకంఠి!
యీ వేళ మువ్వ గోపాలుడు నా వద్ద - జేసిన వింతల కెల్ల ॥కావ॥

మందుల మారని మాయ జల్లి - యెందుల జూడ లేని గడుసు
అందు బో వద్దని నే నంటి చే బట్టుక
సందె జాము వేళ బోయి సరిగా దా నిల్లు జొచ్చితే
యిందేల వచ్చితి వంటది - యెన్నైన బాస లిచ్చిన దట! ॥కావ॥

వగవ నేటికి యటువంటి - వానికి తగునె కొమ్మ!
పగలు రేయి మునుపు - వద్ద బాయక దాని తోనే

నగవు లెక్కడ? నయము లెక్కడ? న- న్నాదు కొనే దెక్కడ?
ఘుగుగుబోణి! నా మదిలో - యాసులు దీర నేసె నది ||కావ||

మొన్నటి నేరము లెంచక నేను - మొకల మువ్వగోపాల దేవుని
మన్నిక జేసి నా మదిలో నే బ్రొద్దు బాయక
చెన్నుగ రతుల గలసి మెలసి చిత్తము రాను సేవజేసి
కన్నరో! నేమించు కొన్న దెంచక
గక్కున దా నింటి కేగిన తడువ ||కావ||

## 159. సావేరి – త్రిపుట

కొంచెగత్తెలా? విూరో చెలియరో!
కొంచెగత్తెలా? నా - గుణము తెలియక నన్నుధి
కించి వాదు దాము - కేరి కేరి నవ్వేరు ||కొంచెగత్తెలా||

అలిగి రాదు తోడితె - మ్మని సఖుల నంపితే
చెలువుని తోడి తెచ్చి - తలవాకిట నుంచి
యాలదాసి గూడి రా - నని నంటు నా మది
కలగి కన్నీరు నించ - గా తోడి తెచ్చేరు ||కొంచెగత్తెలా||

పొరుగింట పతి నుంచి - తరుణి! నీ పతి యూరి
కరిగే టప్పుడు దయ - మరువ వద్దని నీతో
నెరిగింపు మని నన - విరహ వేదన చేత
బొరలగ నప్పుడు వి - భుని తోడి తెచ్చేరు ||కొంచెగత్తెలా||

నెలత! మువ్వ గోపాలు - నికి నా సఖి గట్టిన
వలువ గట్టి స్త్రీ వలెనే - యలవరించి యిందు దెచ్చి
అలివేణి పవ్వళించు - మత డిందు రాడని
తొలగి యచ్చట నుండ - గలసి విభుడు నవ్వె ||కొంచెగత్తెలా||

## 160. సౌరాష్ట్రం - అట

కోడి గూసె నయ్యయ్యో ! నా - గుండె ఝల్లు ఝల్లు మనేనే !
చేడెరో ! నా సామి వద్ద చేరి మాటాడే టంతలో ||కోడి||

చెలువుని యెదురేగి చెలగించి తోడి దెచ్చి
[1] గళము పైని గంద మలది కస్తూరి నామమే దిద్ది
కలువలి రేనితో - కలహము ముగియించి
చలువ చప్పరములో మేము - సరస మాడేటంతలో ||కోడి||

విరులు శిఖ నిండ జుట్టి - వింతగా సొమ్ములు బెట్టి
బురుసు రుమాలు జుట్టి - పొందుగా తురాయి చెక్కి
సరసుని మోవి నాచి - సారె సారెకు ముద్దు బెట్టి
గురు కుచములతో [2] రొమ్ము - గుమ్మి పైకొనే టంతలో ||కోడి||

మొక్కి వేడు కొని యెంతో - మోహమున ముద్దుబెట్టి
అక్కరో ! సిగ్గింత లేక - ఆవేళ నీవి వదలించి
మక్కువ మీర మదన - మం........నిల్లు చేర్చి
చక్కని మువ్వగోపాల - సామితో గలసే టంతలో ||కోడి||

## 161. యదుకులకాంభోజి - అట

కోపము రాదా ? - యెవ్వరికైన
బాపురె ! మువ్వ గో - పాలుని చెలికాడు
చే పట్టిన మొదలు - చెవ్వంది లింగ
డాపె యింటిలో ద - న్నాడు కొన్నది వింటే ||కో||

నాటి నాటికి వాడు - నా వద్దికి వచ్చి
మాట లాడక యల్లా - మగువ యింటిలో నె తె

1 కలపము పైని నిండ నలది కస్తూరి నామము పెట్టి.
2 వాని - గుమ్మి పైకొను నంతలో.

వ్రేటు గజ్జెలే తంబూర - మీటి వింత పదాల
ఘాటు జాతు లెల్లా - మేలత యింటిలో నైతే ||కో||

సరసిజాక్షిరో! వాడు - చలువ దుప్పటి తోడ
వరసకు వాడింది - వచ్చి యందు బోతె
బురుసు రుమాలె - బోడి తలకు బాందు మల్లెల
విరుల సరాలె యిదిగాక - సరిగ దుప్పటి వల్లె వాటుతో బోతే ||కో||

చెలువుడు చక్కని చెవ్వంది లింగడు
అలుక జేసి మూగవాసి - వలెను నాతో
గలసి యిప్పుడల్ల - కలికి యింటికి బోతె
గళరవములె పావురంపు పలు - కులె యదియును గాక
అలివేణి! దాని కళుకు వాడె యుంటే ||కో||

162. భైరవి — త్రిపుట

కోపము సేయ వచ్చున ? - నాపై సింత
రేపగలు నీవు లేమ బోధన విని
బాపురే మువ్వగోపాల ! నా సామి ! ||కోప||

అలదాని కెమ్మోవి - ఆసిన పలుకాటు చే
అలరు నా జిగి మోవి - నాన వద్దంటినా
తిలక మొదిగినది - దిద్దుకొమ్మని చాల
పిలువు టద్దము దెచ్చి - పిలిపి నందుకు నాపై ||కోప||

నెలవంక లందందు - సొగడిన మేనుతో
యెలమి నను కౌగిట - నలమ వద్దంటినా ?
చలువ పన్నీటిచే - కలయ మర్దించిన
కలపము మై పిండ - నలది నందుకు నాపై ||కోప||

ఏమగువనో జేరి - యెనసి వచ్చితి వని
కాముకేళిని గూడి - కలయువద్దంటినా ?
నీ మనసు దెలిసి నే - నే బలిమి జేసి
పామి రమ్మని రతి - సలిపి నందుకు నాపై ॥కోప॥

## 163. ఘంటారవము — త్రిపుట

కోమలిరో ! వలచి నందుకు - గోపాలు డనరా ! నన్ను
ఏమే మని పేరున బిలుతురో తెలియదు
సీమలో జను లంద రయ్యయ్యో ! ॥కోమలి॥

ఆము కొన్న తమి నిలుపలేనప్పుడు - ఆసల బెట్టితివి
కాము తూపుల మనసు గరిగి మతిమాలిన - కరుణ జూడ వైతివి
రామరో ! యిక దాళ రా దేలు కొమ్మంటే - రమ్యము గా దంటివి
సోమవదన ! రేపు మా పంట కడకు
జాజమే చేసితి వయ్యయ్యో ! ॥కోమలి॥

చెలిమికై నే నెంత చుట్టుక తిరిగిన - చింతల బెట్టితివి
నెలతరో ! అందుకు కొలకుల వడియు - నీరు దుడువ వైతివి
లలన నే వెన్నెల కాక కుడుకగా చ - ల్లని మాట లాడ వైతివి
చలపాదివై పగ సాధించి - జాలి మాలి బెట్టితి వయ్యయ్యో! ॥కోమలి॥

పలుకరించి మా ముప్వగో - పాల రమ్మని బత్తి సేయ వైతివి
నలినాక్షి ! నన్ను గూడి నా డిచ్చిన - నమ్మికే మరచితివి
చెలియరో ! నీ వద్ద జాము నిలుచుండినా - చేర దీయ వైతివి
కలికిరో ! నా వంటి వాని మే లెన్నక
గర్వాన నుంటి వయ్యయ్యో ? ॥కోమలి॥

## 164. మోహన — ఝంప

గడియ గడియకు మనవి - గలదటవె కొమ్మా!
పడతిరో! నా మనో - భావ మెఱిగిన దొరకు ||గడియ||

కలనైన గలువరిం - తల నైన దన నామ
ములె గాని వే రొకటి - తలచ దని తెలిసి
కల గాలమును నన్ను - గారవించిన విభుడు
తలిరుబోణిరో! తానే - దయ జూడవలె గాక ||గడియ||

ఎడబాసి నన్నాత - డెన్న డున్నది లేదు
పడుచు దనమున దన - పాదములె గతి యనుచు
పడతిరో! నొక పట్టు - బట్ట రాదు పట్టిన
విడువ రా దది మంచి - బిరుదు గలిగిన దొరకు ||గడియ||

ఆట పాటలను మరి - యన్నిటను నెరజాణ
మేటి యౌ తన కొకరు - సాటి లే రనుచు
మాటి మాటికి నన్ను - మరు కేళిలో బెనగి
బాటించు మువ్వ గో - పాలునకు సిక మీద ||గడియ||

## 165. ధన్యాసి — ఆది

చక్కని దయ గలదా యిది నీ - జాగా చెవంది లింగా!
యిక్కడికి వచ్చిన దేమో - హెచ్చు కంచి వరద! ||చక్క||

చెలికాడ నిను చూడ వచ్చితి చెవందిలింగా!
తెలిసె మా యింటికి రా నిదేమో కంచి వరద! ||చక్క||

ఇందున్నావని యీడ వచ్చితి చెవంది లింగ!
అందు కేమి యెవ రిల్లిది యవ్వుర కంచి వరద! ||చక్క||

కానీ వెనుక దాక్షిణించే గాని చెవంది లింగ !
యూసికతో మన మేక మై యుందాము కంచి వరద ! ॥చక్క॥

ఎవ్వడో యీ పడకింటిలో నవ్వేది చెవందిలింగ !
మువ్వ గోపాలుడు గాక మరెవ్వరు కంచి వరద ! ॥చక్క॥

## 166. సౌరాష్ట్రము - చాపు

చక్కనయ్య ! యేమి యుప - చారము లే సేయింతును
సిక్కముగ శ్రీకర ! దోషా హారతుల - నిప్పింతునో ? ॥చక్క॥

మల్లెపూల పాన్పు పైసి - చల్లసి మొల్ల లే పరతునో ?
చల్లని వాసన గాలికి - చామరా లే వేయింతునో ! ॥చక్క॥

మంచిగంధం బలది నే ఆకు - మడుపు లందిత్తునో ?
అంచిత మైన మోవి నొక్కితే -నందు కే రవలు చెక్కింతునో ॥చక్క॥

చక్కని మా యినపురసామి ! మువ్వగోపాల ! యిం
కొక్కసారి నేనే యోల లాడింతునో ! ॥చక్క॥

## 167. యదుకులకాంభోజి _ ఆది

చలమేల జేసేవురా ! - చక్కని సామి !
చలమేల జేసేవురా ! నీ చక్కెర మోవాన నిచ్చి
జలజాక్ష ! నన్నాదుకోరా ! - చక్కని సామి ! ॥చలమేల॥

చెలిమి చేసి చిన్ననాడె చేపట్టి నీ కౌగిటిలో
నలవా టేల చేసితివిరా ? చక్కని సామి
తెలియనైతి నింతైన నీ తియ్య బెల్లి మాట లెల్ల
చెలువుడా ! నిజ మని యుంటిరా, చక్కని సామి ! ॥చలమేల॥

అలుక చేసి రాసి వాడ వలయించి వెతలు బెట్టె
కలలో నేల వచ్చేవురా ! చక్కని సామి !
నిలుపరాని తమి చేత నే నీ తీరున నుండగ
బలుకవయ్యో పగదానవా ? చక్కని సామి ! ॥చలమేల॥

ముద్దు మువ్వ గోపాల ! నా వద్ద జేరి రతి కేళిని
దిద్దు కొన్న సామివి గాదా చక్కని సామి !
వద్దుర బంగారువంటి వల పారడి బెట్టేవు
పొద్దుబోయె దాళజాలరా, చక్కని సామి ! ॥చలమేల॥

## 168. మధ్యమావతి - ఆది

చల్లనాయె నా మనసు - చల్లనాయె నేడు
చల్లనాయె ప్రాణేశ - సామి ! మువ్వ గోపాల ! ॥చల్ల॥

వదికి రా వేమోయి - వాడిన మొగ మేడ దోయి ?
నిద్దుర కన్ను రెప్పలను - నిండి యున్నదోయి !
నిద్దంపు జెక్కిలి నొక్కి - ముద్దిడు కొన్న దెవతోయి ?
దిదిన కస్తూరి బొట్టు చెదరె - తెలిసె నింక తెల్పు మోయి ! ॥చల॥

.... .... .... .... ....

.... .... .... ..

యురమున గుబ్బలపోటు - లున్నముద్ర లేడవోయి ?
మరు గేల చేసేవు - మగువ పేరు తెలుప వోయి ! ॥చల్ల॥

పలుచని గంధము మేన - పణ తెవ్వతె నలచె నోయి !
చలువ పన్నీటి వా - సన లేదనోయి ?
వలచి యున్న వాని వలె కలసి యున్న వాడోయి !
పలుమారు మువ్వ గోపాల ! నీ - వగలు దెలిసె నోయి ! ॥చల్ల॥

## 169. 1 ధన్యాసి — త్రిపుట

చల్లనాయ లేరా! నా మనసెంతో — చల్లనాయ లేరా!
చల్లనాయ లేరా! నా — సామి మువ్వగోపాల! ||చల్లనాయ||

చెలరేగి యదినీవు — చేపట్టు పట్టుక
కిలకిల నగుచు వె — న్నెలలో రాగా
అలివేణి వేరొక తె — యాకు మడుపు లందియ్య
బలు మొనల నందుకొని — పడతి కియ్యగ జూచి ||చల నాయ||

జోడు గూడి యది నీవు — సొగసు పాటలు పాడుకొని
వేడుక మీరగ నీ — వీధికే రాగా
తోడి చెలి వచ్చి నా — తో విన్నవింపగ
మేడ మీదనుండి మీ — మేలిమి చూచి చూచి ||చల్లనాయ||

ముదమున నది నీవు — ముచ్చట లాడు చుండగ
నది యేమో పదిరి సి — న్ననగ విని
గదిమి నిరాకరించి — కాదని యిందు వచ్చి
కదసి నన్నేలిన — ఘనుడవు మువ్వగోపాల! ||చల్లనాయ||

## 170. 2 తోడి - ఆది

చాల యిందుకే నా మనసు — జాలి బొందెరా!
తాళగలవా! కంచి వర — దా! నే నిన్ను నెడ బాయు ||చాల||

ఇంతంత నా మోవి తేనె — లిచ్చి నోరు దడవగ
నింతలో సొమ్మసిల్లే — వింక యేలాగో
కంతుజనక నేనిచ్చిన — కౌగిలి వదలీ నని
యింతగా కన్నీరు నించే — వింక యేలాగో? ||చాల||

1 ఘంట — ఆట. 2 సౌరాష్ట్ర; — ఆది; లలితపంచమం — ఆది; వసంత భైరవి.

మొదట మడుపు నొక్కి - మోవి చే నందీయ వని
ఇదిగో విడె మొల్ల కున్నా - వింక నేలాగో ?
సదయుడ పడకింటిలో - జవ్వాజి దెచ్చునంతలో
ఎదురెదురే జూచే - వింక నేలాగో : ॥చాల॥

చేరి మరు కేళి సిన్నంత -సేపు గూడిన గాని
ఏరా! తనివి దీర దందు - వింక నేలాగో ?
ఔరా ! మువ్వగోపాలు - డైన కంచి వరదరాజ ?
ఈ రాతిరే పైన మైతే - యింక నేలాగో ? ॥చాల॥

## 171. కాంభోజి – రూపకము

చాలు చాలు నీవల్ల నేరమా
తేలించి మా మువ్వగోపాలు నింటికి
తెచ్చిన నన్నన వలెనుగాక ॥చాలు॥

అలివేణి ! నీ విభుడు నీవు నిక నెన్నడు
నలగి యుండరో యొకరి కొకరు
పిలువ మని నన్ను వేడుకొని - ప్రియము చెప్పరో
చులకగా జూచెదవు నన్ను తేరి - చూడవు మంచి మాటైన నాడవు
తెలిసె దెలిసె నేడు నీ యక్కర - దీరె గనుక నింక నే నేటికి ॥చాలు॥

ఆ సామి నిన్ను జేర నపుడె - నాతిరో ! నీవే నని యంటివి
వేసారక దిన దినము కాళ్ళ - వేళ్ళ బెనగితివి
యేసామ్మ్ గోరిన నిచ్చెద నంటివి - యేబుద్ధి చెప్పిన వినే నంటివి
వాసిగ నేగు గడిచితే బుట్టి
వాసికె బొమ్మన్నమాట నిజమాయ ॥చాలు॥

కోమలిరో దాని గూడిన మువ్వ - గోపాలుని దెచ్చి నిన్ను గూర్చితి
నామేలు తెలియ నేర వైతి - వపుడె మరచితివి
నే మాట వాసికి బెనగితి నింతే - నిన్నుంచి నాకు రాదగిన దేమి
కామిని యీ కలికాలమున కుప-కారము కలదా యొవరికైన ॥జాలు॥

## 172. ముఖారి — ఆది

చాలు చాలు యీ చిన్నెలతో నాదు - సరసకు జేరకుర !
చాలు యీ చిన్నెలు - సాగదు నా వద్ద మువ్వగో
పాల ! భామ వద్దికే పోర ! ॥చాలు॥

కన్నెల పీడముతో - కాటుక మోవితో
వెన్నుని కీల్జడ - వేటు తోను
కన్నియ సంపుల - గాజుల నొక్కుల తోను
వన్నెకాడ నుదుటను - నున్న లత్తుక తోను ॥చాలు॥

నిదుర మబ్బు తోను - నిండు బడలిక తోను
ముద్దియ కలసిన - ముదము తోను
నిద్దంపు చెక్కిళ్ళ - నెలవంకల తోను
వద్దురా వద్దులు - వగకాడ నాతోను ॥చాలు॥

అలదాని కుచముల - నలదిన జవ్వాజి
కల యురస్థలమును - గంటి నన్నంట రాకు
బలిమి జేసే దేల - బాల మువ్వ గోపాల !
అలనాడె గూడిన - చెలిమి పదివేలు ॥చాలు॥

## 173. ముఖారి — చాపు

చిత్తము వేరైన నందుకే - చింత జేసేను
క్రొత్త లాయ నానాటికి నీ - గుణము 1 కంచి వరద ! ॥చిత్తము॥

ఏ నాటి కైన నీ కేమో - విచ్చితి వని కోపమా ?
యీనీసి ! చప్పరించీని! - యపహరించీనా ?
నే నెంతో విన్నవించిన - నీవు వినవు వినకున్న
మాను మందు వల్ల నా - మనసు నొవ్వగ లేదురా ॥చిత్తము॥

1 లు కరివరద.

ఎలమి నెవతె కైన కౌగి - లిచ్చితే రోసమా ?
అలమీని ! గుబ్బల గుమ్మీని ! - అమ్మ కొనీనా ?
తెలియ బల్కినను నమ్మ - తించేది లేదు లేకున్న
పలుమారు సందుకు నే -నలగి యుండ లేదురా ! ॥చిత్తము॥

అక్కట మువ్వగోపాలుడ - వై దానిల్లు జేరితే
మొక్కీని ! కలసీని ! - మూల దాచీనా ?
చక్కన గా దంటే మాట - లెక్క సేయ వెందుకు నీ
యిక్కువ దెలిసెను, గనుక - యీరసించ లేదురా ! ॥చిత్తము॥

## 174. కల్యాణి - త్రిపుట

చిన్నదాన నే నే మెఱుగ సిగ్గయ్యీ నమ్మా !
కన్నె లెల్ల కంచివరదుని కౌగిట నుండు మనేరు ॥చిన్న॥

పద్దికి బొమ్మని చాల - సుద్దులు చెప్పేరు
ముద్దుబెట్ట బొమ్మనేరు - ముదముతో లాలించు మనే ॥చిన్న॥

మదనశాస్త్రము నేను - జదివిన దాన గాను
సదయుడని వానితోను - సరసము లాడు మనేరు ॥చిన్న॥

మల్లెపూల పాన్పు పైని - మనసు నెమ్మదితోను
ఉల్లము రంజిల్ల జేసి - ఒమ్మికతో నన్నుండ మనేరు ॥చిన్న॥

పల్లవాధరి ! వినవే ! - వనితు లందఱు నన్ను
వల్లభుడా మువ్వగో - పాలుసితో గూడు మనేరు ॥చిన్న॥

## 175. ఆనందభైరవి - ?

చూడని గూడని సందలు - జోడించి రమ్మా !
ఆడు కొనని వా రున్నారా - హరిపై నాపై యేమో జనులు ॥చూడ॥

నిక్కముగ నతని మోము - నిలిచి చూచి నాన?
అక్కర దీర గాగిలించి యున్నాన?
చక్కెరమోవి యాని నేను - నొక్కి చవి చూచినాన?
అక్కరో! నే నతని లాటి - చక్కని వా డన్నందుక ||చూడని||

చేడెరో! యతనికి నేను - యీడౌదు ననుచు మదిలో
వేడుకై యెవరితో నైన - ఆడు కొన్నాన?
పోడిమిగా నతని పదము - పాడి విని ముద మంది నాన?
గూడ పంత ముంటే తమ - కోరిక లాడించె నేమో ||చూడని||

సన్నుతాంగి! మువ్వపురి - సామి నాదు మనసు దెలిసి
మన్నించి మరుకేళి నన్ను - మరపి యున్నాడ
కన్నరో! మమ్మనిన వారి - తన్ను గొడిచి నట్టై తేను
చెన్నుగా మా దేవునికి - జేసినే పూలంగి సేవ ||చూడని||

## 176. ఉసేని - చాపు

చెల్లబో యెంత వేగమే - తెల్ల వారెరా!
ఉల్లములో జాల వింతై - యున్నది మువ్వ గోపాల! ||చెల్లబో||

ఇద్దర మీా వరదాక - నెడ బాసిన వెత దీర!
కొద్దిగా నింత సేపైన - సుద్దు లాడు కొంటిమో?
సిద్దర మైన తమి దీర - నెలత రా రమ్మని నీవు
ముద్దు బెట్టిన నీ మోవి - మోవి పై నున్న దింతలోనే ||చెలబో||

చెలువుడ! నీవు నేను - వలరాజు చే జిక్కిన
యలుక దీర మోవి తేనె - లాను కొంట యుంటిమో?
తలిరాకు బోణి! రమ్మని - దయ తోడ నీ విచ్చి నట్టి
వలపుల బిగి కౌగిలి - వదల లే దింత లోనే ||చెల్లబో||

కళలంటి నే బలికిన - పలుకులు విని ముద్దు
చిలుక పలికె నందు కింత - నీవు నవ్వు కొంటివా?
కలికిరో! రమ్మని నన్ను - కడు వేడ్క మువ్వ గోపాల
కలసి యుపరతి నేనె - గమకించే టంత లోనే ||చెల్లబో||

## 177. శంకరాభరణము — ఆది

చెల్లబో పాలగిరి - చెన్నుడే వీడు కొమ్మా!
ఎల్ల లోకము లిత - డేలు ననగా వినవా ||చెల్లబో||

పరిగే వాని చేతి పైడి - పట్టిన దానవా యింటి
గురుతు చెప్ప వద్దా యెంత - సరసు రాలవె కొమ్మా!
గురిగాడు గనుక నీ - గ్గున నెవ్వరి నడుగక
వెర చీ సందు కా సందుకు - తిరుగగా దోడి తెచ్చితివి ||చెల్లబో||

వచ్చిన దాక తల - వాకిట నీ వైనాను
నెచ్చెలు వైన నుండితే - నేర మటవె కొమ్మా!
యిచ్చిన పైడి చేతికి - వచ్చినదే చాలు నటవే
హెచ్చు కొద్దు లెరుగ వలదా - యెవరంట యున్నావే ||చెల్లబో||

బాలరో మువ్వ గో - పాలు డైన చక్కని
పాలగిరి చెన్నుడు నీ - పాల గల్గె కొమ్మా!
[1] ఏల రేపు వచ్చె నంటే - యింతైన సమ్మ తించక
యేల రా వద్దంటివే ని - న్నేమందు నే చెలియ! ||చెల్లబో||

## 178. బిలహరి - ఆది

చేత కాసు [2] లేదె కాని - చే సైగలే
యీ తరి మువ్వగోపాలు - డింతిరో! పట్టె యమ్మేలే! ||చేత||

---

1 యేలి. 2 లేదుగా.

గీరు నామము బెట్టి - గిలుకు పావాలు మెట్టి
యోర చూపు జూచుచు నే - నున్న తావున
జేర వచ్చిన లోన - చిరునవ్వు నవ్వు కొంటి
పారి పారి యిందరిలో - పె బడ వచ్చీని ! ॥చేత॥

పిల్లగ్రోవి చేత బట్టి - బిగియు దట్టియు గట్టి
వల్లెవాటు వేసి యిందు - వచ్చి మెల్లనే
మొల్ల సుగంధు లందరము - ముచ్చట లాడు చుండ
గుల్లకాడై మన యింటి - గురుతు లడుగ వచ్చీని ! ॥చేత॥

చిటికెన కొన గోరు - చిమ్ము కొంచు పలు మారు
చిటి పాటి పదములు - చేరి పాడుచు
నటు నిటు వచ్చి కళ - లంటి నయము చేసి
యటమటించి మువ్వగోపాలు - మీద చే వేసెనే ! ॥చేత॥

## 179. బిలహరి - చాపు

చేపట్లు కా వచ్చునా ? మీలో మీకు - చేపట్లు కా వచ్చునా ?
యే పట్ల కైనను నెంచ దగును.మిమ్ము
యీా పట్లలో మీా కింత తాళిమి లేక ॥చేపట్లు॥

కోప మెవరి కైన రాదా తిరిగి - కూడి యుండే వారు లేదా !
మాపు వచ్చేద నంటె - మంచి దనగ రాదా !
రాపటె వానితో - నీ పాటు వినరాదా ! ॥చేపట్లు॥

అలగి యీావలి కైన పోక లోకు - లాడు కొందు రసి లేక
పలుక కుండ లేక - పదరి తింతియు గాక
కలికిరో ! తొల్లిటి - ఘనత యెంచు కోక ॥చేపట్లు॥

కాముడు సేసిన సేతో లేక - కమలజు వ్రాసిన వ్రాతో
ప్రేమ గూడిన వాని - చే మించే దేమి జాతో
భామరో మువ్వగో - పాలునితో నిట్లు ॥చేపట్లు॥

## 180. తోడి - రూపకం

తగదు పో పొమ్మన నా - తరమా? ఓ యమ్మ!
సొగసైన వాని మోము - సుదతిరో చూచి నపుడె ||తగదు||

వడిగ వా డిందు వచ్చి - - వద్ద జేరి ముద్దు బెట్టి
తడవాయె విడె మిమ్మని - తా సారెకు ననువేడగ ||తగదు||

సరసము లాడుచు నాదు - చక్కని చెక్కుల నిముగుచు
గురుకుచముల గోరు లుంచి - కొమ్మా! నీ పుణ్య మనగ ||తగదు||

మనసిజు కేళిని నన్ను మువ్వ గోపాల సామి
మును గలసిన చందాన - ముదిత న న్నేలు మనిన ||తగదు||

## 181. మోహన - త్రిపుట

తగిలితి విక నిన్ను దరల నీయ నోయి!
వగకాడా! మా మువ్వ - గోపాలా! నా సామి! ||తగిలితి||

గందము చాటున - ఘనమైన జడ వేటు
కంది యున్న సొగసు - కనుగొంటి నోయి!
సందిట నున్న యీ - చందురు పిల్లలు
నందమాయ నోయి - యందు కేమోయి! ||తగిలి||

తావి మించిన నీ - మోవిపై పలుకెంపు
దేవు నాన నిను జూడ - దృష్టయ్యానోయి!
దేవర చిత్తము - తెలియ దానినా నీ
ఏవేళ కైన నా - యిల్లు జేరితి వోయి! ||తగిలి||

కళలంటి వేమాగు - ఘనుడ మువ్వ గోపాల
కలసితి వందుకు - గాదన నోయి!
చెలిని నేట నుండి - దలచ నంట నాతో
పలికితే గాని యీ - పనికొల్ల నోయి! ||తగిలి||

## 182. ముఖారి — ఆది

తన చిత్తము వచ్చి నటుల - దయసేయ మనవే
వనజాక్షిరో మా మువ్వగో - పాలుడైన నా సామిని ||తనచిత్త||

చెలిని వేడు కున్నాడట - చెయ్యెత్తి మ్రొక్కినాడట
అలవేణితో న స్నేమేమో - అనుకున్నాడట
నలినాక్షికి గుడి వాకిట - నమ్మిక లిచ్చి నాడట
జలజగంధి విభుడెందైనా లె - స్సై యుండితే చాలునె ||తనచిత్త||

తొడరి యీ దిక్కు జూచితె - దోషము వచ్చు ననెనట
పడతి వద్ద మీసము దువ్వి - వదరు కొనె నట
తడయక నా పేరు జెప్పి - పుడకి ద్రుంచి వైచె నట
అడుగులో వేయి గుణము లయితె - అతని దిద్ద నెవరితరమె ||తనచిత్త||

మోహనాంగుడు నన్ను దొలుత - మోస పోయి కూడె నట
ఆ హరి సాక్షిగ యిక న - న్నంటు కోడట
సాహసు రాలనని నిండు - సభలో నాడు కొన్నాడట
స్నేహము నాటి యుండితె - చెలువునికె దయ వచ్చీన! ||తనచిత్త||

## 183. కన్నడ - త్రిపుట

తన యాస వలెనే యుండ - దా నా యాస
తన కేమి తెలివి లేదా ? చానరో మువ్వగోపాలుడు
శానా చదివిన సరసజ్ఞుడే ఓ చెలియ! ||తన||

ఇంటికి వచ్చి శయ్యపై న - న్నంటక దయ జూడక యుండ
పంటికొద్ది మోవి గంటి జేసితి నని
కంటగించి చూచి కనులెఱ్ఱ జేసెనే! ||తన||

ముద్దు బెట్టక యుండగా వాసిపై - మోహ మగ్గలమై నేను
వద్ద కూర్చుండి తిలకము దిద్దితేను
గద్దించినాడు గదవే! ఓ యమ్మ! ||తన||

మనసు నిలుప లేక నాపై - కొని గతి గూడు వేళ
తనువు మఱచి నేను తాళు తాళు మనిన
విని మోడిగా జూచెనే! ఓ చెలియరో! ||తన||

## 184. 1 ఘంటారవము - రూపకము

తరుణిరో! నే నాదాక జీవము బట్టుక - తాళి యుండే నమ్మా!
వరదుడు రాక యుండి నంతట
వలరాయు డున్నాడు నే నున్నాను ||తరు||

ఎన్ని నోములు నోచిన ఫల - మియ్యక పోయెనా?
ఫున్న మొక్కు ప్రొద్దు లూగకే - పొల్లు బోవునా?
తిన్నగా నీ వంటి పుణ్యవతుల - దీవెన వ్యర్థ మయ్యీనా?
నన్ను దెలిచి యే దేవు డైనను - గరుణ జూడక పోయీనా? ||తరు||

చానరో! నా గ్రహచార మిక నైన - చక్కన గా కుండునా?
దీనత జూచి యే చెలి యైన - దిక్కు గాక పోయీనా?
వానిపై నున్న నా విశ్వాస మైన - వన్నె సేయక పోయీనా?
పూని నేను ముందు జేసి నట్టి దాన - పుణ్య మైన లేక పోయీనా. ||తరు||

కాముని తో గూడి నా యాపద లేమైన - కాపురము జేసీనా?
పాముల లాడు కొందుల దైవము - పగవారిని గూడీనా?
రామరో! మువ్వగోపాలు డింటి నేడు - రాక మానీనా?
ప్రేమతో నన్నేలిన దేవుడు - తామస మొనరించీనా? ||తరు||

## 185. ఘంటారవము - ఆది

తరుణిరో! పుణ్య పాపము - 2 తన చేతిది
పరమాత్ము డౌ మువ్వగో - పాలుతో విన్న వించవె ||తరు||

---

1 సైంధవి. 2 తనచేతిని; తనచేతిసొ.

చేర దీసినా మంచిదే - చేపట్ట కున్నా మంచిదే
ఆరుదూరు చేసి న - న్నలయించినా మంచిదే
గారవించినా మంచిదె - కౌగిలించినా మంచిదే
యే రీతి విన్న వించినా - యిచ్చ కమైతో చీని ||తరు||

మనసు విరిచే చెలుల చాడి - మాటలు విన్నా మంచిదె
నెనరు దాన నని యాదరిం - చినను మంచిదె
చనువు మాట లింక - చన దనిన మంచిదె
తనకైన యీ మేను - తా నేమైన సేయు నీవె ||తరు||

చెలులతో నను రవ్వ - చేసినా మంచిదె
చెలిమితో నెప్పటి వలె - జేరినా మంచిదె
వెలదిరో ! నా పై మనసు - విరుచు కొన్నా మంచిదె
పలుకు లేల మా మువ్వగో - పాలుతో విన్న వించవె ! ||తరు||

## 186. కాంభోజి - త్రిపుట

తరుణిరో ! నా ప్రాణేశుని - గాచు కొందునా ?
సరసిజాక్షు లెల్ల గూడి - సామి వెంట దిరి గేరే ! ||తరు||

శృంగార వనములో చెలువుడు నేను
రంగు మీరగ చదరంగ మాడగను
అంగనరో ! యుల యలివేణులు కొందఱు
సంగతి గా కనుసైగ జేసేరే ! ||తరు||

విడిదికి వాడు రాగ - వెలదు లందఱు జూచి
వడిగ రమ్మని చాల - వగల దేలించి
విడెము లం దిచ్చుచు - వెర పింతైన లేక
పడకకు రమ్మని - బలిమి జేసేరే ! ||తరు||

మక్కువ తోడుత – మా మువ్వగోపాలు
డక్కరో! నను గూడి – యతిశయముగను
పక్కలో నున్న వాని – పడతులు తమ తము
యక్కర దీర్ప మని – యాన బెట్టిరే! ॥తరు॥

## 187. కల్యాణి – ఝంప

తరుణులార! విభు నెందు – దాచు కొందు నమ్మా!
వరదు నెందు దిరుగ లాడ – వద్దని మ్రొక్కిన వినడు ॥తరుణు॥

అబ్బురముగ వాడు వచ్చె – యుబ్బు తెలిసి వంటు వేసి
యుబ్బ ననుచు పిలువ – నంపె నట యొక తె
నిబ్బరమున వాడు రాగ – సిలువు మని పైట దీసి
గుబ్బలు జూపి మోహింప – గులికె నట యొక తె ॥తరుణు॥

చక్కవ తమితో గమ్మో – విమ్మనుచు నోరూరి
యొక్కెడను చెయ్యెత్తి – మ్రొక్కెనట యొక తె
చక్కరతో వాడిందు రాగ – నడ్డగించి కౌగిలిమ్మని
పెక్కువిధముల నొక్కు – పెట్టె నట యొక తె ॥తరుణు॥

అంచితముగ మువ్వగోపాలు – డైన కంచివరద! న
న్నుంచు కొమ్మని చాల – నుడివె నట యొక తె
పంచశరుని కేళి గూడి – భామ! నాతో మాటలాడ
పొంగనాలు పిసి మదిలోన – పొంగె నట యొక తె ॥తరుణు॥

## 188. మధ్యమావతి – త్రిపుట

తెలిసెనో తెలియదో – తరుణి
[illegible]

కుందరదన మొన - గోరికి మదు పోసంగ
యింద మనుచు దాన - యియ్యవచ్చి లే దంటే
నందుకు నే జిన్న - నై యున్నానని నవ్వి
మురదా మదుపు తోనే - ముద్దోసంగిన సుద్ది ||తలచునో||

ఇంతి నీ దయ లే - దింక నేను రాను నా
యంతరంగము నొచ్చె - నన విని దయ వచ్చి
అంతలో గాగిట - నలమి నమ్మిక లిచ్చి
సంతస మొనరించి - చింత తీర్చిన సొగసు ||తలచునో||

ఆలించి నా మాట - లాలించి మున్న గో
పాల రమ్మని రతి - దేలించి మన సిచ్చి
లోలాక్షి నా మోవి - లోవలించుక గంటు
గీలించి చెలరేగి - కోరి నవ్విన హాయలు ||తలచునో||

## 189. మధ్యమావతి - త్రిపుట

తలిరుబోణి! వారు 1 పెద్ద లైనారు
తాళు కొన్నదే దోసమా? యెక్కడి జోలి
వలచేది యొకరి కోసమా? ఓర్వలేని-చెలులంటే రోసమా? ||తలిరు||

నిను నిందించి నారంట నీవేల అలగి వున్నావు? - నీవివేక మి తామెగా
వనజాక్షుల నోటి వెక్కసపు మాటల
వాని మొక్క బోయినా యెక్కడి జోలే? ||తలిరు||

వారు సేయు మనగానే ముందు చెలిమి చేసినావో
వారికి చింతన సేతురా?
ఊరికే నిన్ను జూచి యుసురనే దోసకారులు
ఒకరి మేలు సైతుర యెక్కడిజోలే? ||తలిరు||

1 పెద్దలున్నారు.

నిమ్మ ముట్టడి మువ్వగోపాలుడు
నీతో నైన కూడుండనే [1] చెల్ల యిది వాజాల నైనదే చాలదా ?
(?) అమ్మమ్మా ! యిది యేమి ఎదిగే తిరిగే
ఐయ్యయ్యో యెవరైనా దేశరాజుల యెక్కడి జోలే! ॥తలిరు॥

## 190. ఆహిరి - అట

తాళ జాలనే ఓ చెలియ ! నే - తాళ జాలనే !
బాలరో ! మువ్వగో - పాలుడ నే గాన ॥తాళ॥

నేర మెంచకుమీ ! యందరి లోన సారెకు యెంచకుమీ యీవేళ నన్ను
నీరసించకుమీ కౌగిట నన్ను - వేరు సేయకుమీ ........(?)
వారిజాక్షిరో ! నీ పై వలచి యున్న నన్ను
మేరగా దలయించ మెలత ! నిన్ను బాసి ॥తాళ॥

వదికి రావే వేడుక మీర - ముద్దు బెట్టవే కౌగిట నుండి
సుద్దు లాడవే ముద్దు గుమ్మ నీ - మోవి తేనే లీయవే
ప్రొద్దు బోయె చల మేటికే........ (?) జాగు సేయకే ॥తాళ॥

భామ లెందైన నెంతైన మది - ప్రేమ లేకున్న యేమిర యిట్ల
రాను ! యిక నైన భామరో మువ్వగోపాల - రమ్మని నన్ను
కాముకేళి గూడి - కలసి యేలు మీ వేళ ॥తాళ॥

## 191. సావేరి - ఆది

తాళి మొకరి కన్నా వద్దా - ఓ చెలియరో !
లోలాక్షి ! మువ్వగో - పాలునికి నీకు మాటలైతే ॥తాళి॥

వా డలుగ నీ వలుగ వశమె మీకై తిరుగు
లాడి చాలు నన్నట్లున్నది యెవరు మెత్తురే

1 (చెల్లదా జాల మైనదే చాలదా) ?

గుత్తకాని వలె నిత్యసత్యము నచ్చేవు
అత్త కంటె మోసము అంగడి బెట్టకుము
చిత్తాన నెన రుంటే చేరి యుండగ వచ్చు
వత్తురు యెవరైనా వడిగా గూడర సామి ! ||తిన్నగ||

## 193. రాగము ? తాళము ?

తెలియ నైతి నమ్మా ఓ యమ్మ ! నే
కలికిరో ! యిటువంటి కపటజ్ఞుడని నాదు
కలనైనా గాని యెంచక నే నుంటినే ||తెలి||

చనువిచ్చి మాటాడునే యెప్పుడు నన్ను - సఖియ రమ్మని పిలుచునే
అనుదినము నన్ను నిమిష మెడ బాయనని నమ్మిక లిచ్చునే
వనజాక్షిరో ! యిటువంటి గుణము
వాని మనసు విరిచి యే మగువ బోధించెనో ! ||తెలి||

పిలువ నంపిన రాడు యిప్పుడు నాదు - ప్రియము మాటలు వినడు
చల మొకింతయు మానడు యిప్పుడు నాపై - చాడి మాటలు విన్నాడు
తెలియని నావైతే తెలియ దెలుప వచ్చుగా
వలె నని యుంటే వాని వగలునే ||తెలి||

బలిమిని నను గూడు మా మువ్వగో - పాలుడను వాడు
చెలిగుబ్బోణిరో ! మాదు దాని జేరి - తలచక యున్నాడు
అలనాటి కూటమి యన్ని మరచి
చెలువ యింటిలోనే నెలకొని యున్నాడు ||తెలి||

## 194. కల్యాణి — చాపు

తెలియ వచ్చెను రా ! నీ వగ లెల్ల - దృష్టి దాకెను రా !
వెలయు మువ్వగోపాల ! దానింట నుండి
విచ్చేయు హాయలు చూచితే యిపుడు ||తెలి||

చక్కెరకెమ్మోవి పచ్చి నీ పలు కెంపు-సామి నీ కన్నుల నిద్దుర మంపు
చెక్కుటద్దములపై గ్రొన్నెల గుంపు
దక్కెన నలినాక్షి ! దాని పై సొంపు ||తెలి||

కులుకు సిబ్బెపు గబ్బి గుబ్బల పోటు - గుత్తపు వన్నెల 1 కీలు జడ వేటు
లల దాని పసుపు దుప్పటి వల్లె వాటు
చెలువు నడల మించిన తడ బాటు ||తెలి||

సందిటి బంగారు గాజుల పద్దు - సకియ దిద్దిన నుదుటి తిలకము ముద్దు
అందగాడ ! మువ్వగోపాల ! యీ ప్రొద్దు
యిందు వచ్చి న న్నేలిన పద్దు ||తెలి||

## 195. 2 పున్నాగవరాళి — త్రిపుట

తెలివి గాను కరి సామ్మా? యెందుకే విభుని - తిరుగ బొమ్మంటి నమ్మా!
చలమున ననవిలుతు జేసిన
యలరు ములుకుల కళిక యలసితి ||తెలివి||

చేడెరో! యే మందునే? నిన్నటి రేయి - కేరేడది యేమొ కా
నీడు చల్లని వా డటంచును - జూడ జూడగ వేడి మాయెను ||తెలివి||

బాయ రాని ప్రేమతో బాల ! మువ్వ గో - పాలుడు నను గూడగా
కాయజుని 3 రప మాయ బరవశే - మాయ నుపరతి సేయ నైతి ||తెలివి||

మై చల్లగా జేసెడి కమ్మని ముద్దు - మలయ మారుత మిప్పుడు
చిచ్చి నంతట జూచితే సెగ - గాచి నటు వలె దోచుచున్నది ||తెలివి||

## 196. మధ్యమావతి — ఆది

తెలిసి తెలియ లేక - పలికేరు చెలులు
కలిసి యున్న నా సామిపై - గాక సేయ వశమా ? ||తెలిసి||

---

1 కీల్జడ. 2 ఘంట - అట. 3 రసమాయా — పర (?)

చలపెట్టి తమబు - ద్ధులు విన లేదని
యలగి రేమి సేతు - నలివ లెల్ల
చెలువుని ముద్దు మా - టలు నా వీనులు నిండి
తొలుకు చున్నది తమ మా - టలకు నో టున్నదా ? ||తె||

కొనగంట దము గను - గొన దింతైనా గాని
నెనరు లేసి దాయ నంచు - నిందించేరు
ఘనమైన సామి రూపు - కనులు నిండి యుండగ
కనకాంగి! యితరులు - గాన వత్తు రటవే! ||తె||

నా పాల గల మువ్వగో - పాల సామితో
కోపించు కొమ్మని - కొమ్మ లనేరు
ఏ ప్రొద్దు నా సామి - యెద నిండి యుండగ
బావ మింతె గాని - కోపమున కిమ్మున్నదో ||తె||

## 197. ఉసేని - ఆది

తెలిసె నీ నెనరు లేసి జాడలు - తేట తెల్లమి గను
వలదు నిలుపు యీ మాటల కేమి-వచ్చె మువ్వగోపాల! సామి ||తెలి||

మనసు కలిగితే దిన మొక్క- సారి - మా యింటికి రావా ? యెంతో
చనువు మీర లాలించి ముద్దిడి - సరస మెంచు కోవా ?
తనివి దీర మో విచ్చి కర్పూర - తావి మడుపు లీవా ? యీ
తనువు నీ దని నమ్మిక జేసిన - తచ్చన లె కాని కొంచ కాదవా? ||తెలి||

ఊరిదాక పోయి వచ్చే నని నీ - వూరకె యనలేదా ? అయి
దారు దినము లిందుడి మో మొక్క - సారి జూప రాదా ?
వారిజాక్షికి హితవైతే నేమి - పేరు దలచ నీదా ? క
న్నీరు నించి దయ మరువకు మన్నది
నీతో నె గాదా ? మరియాదా ? ||తెలి||

కూడి యుండలేదా ? మన మిరువురు - కూరిమి తోడను యిపు
డాడ కాడ యేమేమో దలచుక - అంతరంగముగను
జోడు ఛాయ లేనని బతి మాలిన - వేష నల దనేవు నా
యీడు వారు కెక సక్కేము లాడుట
యింత చేసి నాడవు మంచివాడవు ||నెర||

## 198. కల్యాణి - ఝంప

తెల్ల వారినది - తెలియ లే దకట
కల్ల గా దిది యెంతో (?) వింతలై యున్నది ||తెల్ల||

మొలక నవ్వుల ముద్దు - మోము గను గొన గానె
వలపు రెట్టించి కడు - వడిసి కౌగిటను
అలమి కమ్మని మోవి - యాని తని వారగ, నే
చెలగి మోమున జేర్చి ముద్దాడుచు నుండ ||తెల్ల||

ఎలమి నెద నెదను గదియించి - యొకరి కొకరు
తలచి నటువలె నెల్ల - తమి దేచు కొనుచు
కలసి మనసు కరగి - కాతరింపుచు మిగుల
సొలసి సరిమోహమున - సొక్కి పరవశ మొంద ||తెల్ల||

ఇది వఱకు నెడ బాసి - యిరువురము నుది నున్న
కొదవ లన్నియు దీర - గూడి యిద్దరము
సదయ మువ్వగోపాల ! - సామి ! బడలితి ననుచు
కదిసి పై కొని వగల - కులికి కళ లంట గను ||తెల్ల||

## 199. భైరవి - రూపకం [1] (?)

తెల్లవారు టెరుగ నైతి నమ్మ ! యేమందు నా
తెలివి కెంత మోసమాయె నమ్మా !

---

1 (?) యతి ప్రాసలు, అన్వయము.

చెలిమి బలిమి నైనా గాని అలసి పో నీయకున్న
చెలువుని కడ నుండగ నయ్యయ్యో ! ॥తెల్ల॥

విరుల దండ కొప్పున ముడిచి నా మోము మీద
చిలుకు చెమట దుప్పటిచే దుడిచి, నే
రవికముడి సరసముతో గొబ్బున విడిచి
విరుల మరుల పొరలి కెరలి కెరలి నేరగ నైత
దురంతర వచ సించిన జాణు డయ్యయ్యో

అలరు మోవి నా మోవి పై నుంచి
కొన గోరుల మలుకు గుబ్బలపై నాటించి
యెన్ని విధముల వలల నామది భ్రమియించి
అలసి సొలసి కలసి మెలసి పలసి తెలియ నైతిరా ! యను
పిలిచి పిలిచి వేడుకొందు నయ్యయ్యో ! ॥తెల్ల॥

చెక్కిలి నొక్కి ముద్దు బెట్టి - చేర దీసి కలికి ఆత్మను నను బలికి
బలయు మువ్వగోపాలు డక్కరో నను జోడు గూడి
సొక్కి దక్కి మొక్కి లెక్కి మిక్కితే - నా మక్కువతో నైనా
యెక్కడి వలపు వచ్చు నయ్యయ్యో ! ॥తెల్ల॥

200. బిలహరి — రూపకం (1)

తొయ్యలి ! నా విభు డెవతె నైన - దోడి తె మ్మనునా ?
వెయ్యైన మువ్వ గోపాల రాయ డీ - వెలదులకు చిక్కిన ॥తొయ్యలి

కొలువున నన్ను యప్పు డొక్కతె
గుబ్బల కొసరా పయ్యెద తొలగించి
యెలమి తన దేవుని క - న్నుల జూడనీ రా దేమె యెంచి
వెలదులు సముఖాన నున్న వారిసె - విరగ నొత్తి ముందరికి
పిలిచి తళుకు జూపుల జూచితే తను - పలువర మెంచక ॥తొయ్యలి॥

---

(1) భావము.

శివితో చెలువ రాయడవై యున్న - ఆ వేళ దెలిసి ముందర నిలిచి
సేవకు వచ్చిరి చెయ్యెత్తి మ్రొక్కి - చిత్తాన భయము లేక
మోవిపై దంతము లుంచిన వారి
ముక్కున వేలుంచి బొమలు నిగుడించి
కావరమున నడవంచు కోగ తన - క్రమము విచారించక ॥తొయ్యాలి॥

మంచి వారి వలెనే తమ మాయలకు లో నౌ నంట కొంకగ
చంచలాక్షులు గుంపులు గూడుక ............... ....
పంచబాణుని కేళి నన్ను మువ్వగో - పాలుని గూడి యుండితే
మంచకు బెట్టిన వగ లింతే తమ - మనసు మర్మ మెంచక ॥తొయ్యాలి॥

## 201. ¹ అఠాణా - త్రిపుట

² దక్కితి నంటే దయ సేయవు
మొక్కలింపు మేల - మువ్వగోపాల! ॥దక్కితి॥

ఎవ్వతె బోధన విన్నావు - యెంతో మ్రొక్కిన గైకోవు
నవ్వక యూరక కున్నావు - నన్ను రట్టు చేసేవు ॥దక్కితి॥

అంటి నా చేబట్ట రాదో - అవురా నీ మనసు రాదో?
యింటికి వచ్చేవో లేదో - యిక నీ కోపము పోదో? ॥దక్కితి॥

మును పన్నేలినావు - మువ్వగోపాల! నీవు
నినకేటికి దాచేవు - నిరాకరించ జూచేవు ॥దక్కితి॥

## 202. మధ్యమావతి - అట చాపు

దాని నన్ను సాటి సేయ - తగునా యేమోయి జాణ!
కానిపోని మాటల చేత ను-కనికర మందు టె అంద మయ్యీనా? ॥దాని॥

---

1 తోడి - ఆది. 2 దక్కితి నంట నను దయ జూడవు.

అందమైన వీణ చేత బూని - అనురాగములే మీటి
పొందు గాను పదకవిత్వముల - పలుక నేర్చునా ?
మందయాన చేతి మం దిపుడు - మధురము లిచ్చెనో నీకు
సుందరవదనపై మరు లుంటే-చందురుతో సాటి తార లయ్యీన? ||దాని||

కమ్మని కస్తూరి తిలకము దిద్ది - కలపము మై నలదునా ?
గుమ్మ రొమ్మున గుబ్బ లదిమి - కెమ్మోవి తేనె లిచ్చునా
సమ్మతము నీ పక్క లోన - సరసము లాడ నేర్చున
కొమ్మపై నీకు మరులైతే - కోవిలకు సరి కాకయ్యీన ? ||దాని||

కామశాస్త్రములే చదివి - కళలంటను నేర్చునా ?
నీ మది రంజిల్ల జేసి - సిన్నెల నేర్చునా ?
ఆమగువపై మోహమున - ఆసలుంటే నేమాయె
మా ముద్దుమువ్వ గోపాల ! సామి ! - నీ సాటి యెవ రయ్యేరు? ||దాని||

## 203. కాపి - చాపు

దినము 1 లిటువలె వచ్చెను - దేవు డోర్వ జాల డాయె
మునుపటి దయ లెందుబోయె - మువ్వగోపాల ! నాసామి ! ||దినము||

ఏరా నీ వంతట రాగానె - యెదురుకొని నా సామి రమ్మని
బారసాచి కౌగిలించిన - భామ నే గాన
ఔరా నీ రదము చేత - నలమి నా మోవి పానక మాని
పారవశ్య మొంది నట్టి - పతి నీవు గావా నా సామి ! ||దినము||

పడతులు నే నారతు లెత్తి నీ - పాదములు కన్నీట కడిగి
యాదుగులను మడుగు లొత్తిన - యతివ నే గాన
కడువడి నా పై బవ్వళించి - గళమున నీ ముద్దు మోము
విడువజాలక యుండిన నాటి - విభుడు నీవు గావా నా సామి! ||దినము||

1 లెటువలె.

చిన్ననాడే నను జేర రమ్మని - సిగ్గున నుండగ నా చెయ్యెత్తి నీ
కన్నుల నొత్తుక చాల లాలించిన - ఘనుడు నీవు గావా ?
నన్ను గూడి మువ్వ గోపాల ! యే - కన్నెలతో పొందు సేయవద్దని
మున్ను నీ చేత నమ్మిక దీసిన - ముదిత ! నే గానా నా సామి! ॥దిన॥

## 204. భైరవి - ఆది

దూర మెంచక యిటుల సామిపై - దూరు లేల బలికేరే ?
తూరు మూరు మాట లేల నాడేరే ?
తరుణు లార ! తాళరె యిక చాలును ॥దూర॥

ఎన్న దగిన చెలుల తోడ జెలిమిగ - నెన్నడైన బలికీనా ?
కన్నె లెంద రెన్ని వగలు చేసిన - కన్ను లెత్తి చూచీనా?
వన్నె మీర నెవరేమి పలికిన - విన్న విననిరీతి నుండు సామి !
చెన్నుమీర నా చెలిని గూడె నని - చిన్నమాటలేల నాడేరే ॥దూర॥

వారి యిండ్ల కెల్ల నా సామి - వలసి పోయినాడా ?
కోరి కోరి ఖేదనము లొసంగి - వారి వేడు కొన్నాడా ?
వారిజాక్షి తా వద్దికి రమ్మని - వలసి సొలసి చొక్కితి నని పిలువగ
చేరబోయి దాసి చూచి నే నని
మీరి భ్రమసి కూడె నేమొ తెలియదు ॥దూర॥

కంతుజనకు మువ్వ గోపాలు డే - కాంతమునను మును నన్నుగూడి
కంతు కేళి లోపల బిగి కౌగిట - గళ లంటి మెలగుచును
వింత వింత వగ గుల్కు సామి యే - యింతికైన దక్కునా యూరకె
రంతు లేల జేసేరే మిక్కిలి
రమణులార ! వాని మనసు దెలియక ॥దూర॥

## 205. ముఖారి – చాపు

నన్ను నేవా ? – నన్ను నేవా ?
నన్ను నేవా ? యింక నీవు – చిన్నదానవ ! ఓ యమ్మా !
నిన్ను వాసి కూర్చినదే – నే రామా ! లెస్స బాగాయ ॥నన్ను నేవా॥

సతిపతులు మీ రిద్దరు – సరసము లాడెడు వేళ
సతడు ని న్నేమన్న గాని – యాతని యనవలె గాక ॥నన్ను నేవా॥

పాయరాని మోహమున – పైటకొంగు బట్టితేను
నాయకుడ నీ కిది – న్యాయము గాదన వలె గాక ॥నన్ను నేవా॥

ప్రేమ మువ్వ గోపాలుడు – కాము కేళి గూడేవేళ
సామజయానరో ! నీకు – చక్కిలి గిలిగింత లైతే ॥నన్ను నేవా॥

## 206. [1] అఠాణ – త్రిపుట

నన్ను నీవు దలచేది – న్యాయము గాదు
నిన్ను నేను వలచేది – నీతి గాదు మువ్వ గోపాల ! ॥నన్ను నీవు॥

ఏ ప్రొద్దు నా కౌగిటిలో – నెనయు చున్నవాడవు
రాపు చేసి యోలాగైన – రాని పకమాయె
కోపమైతే ఘనమాయె – క్షణమొతో చక్కనాయె
యీ ప్రొద్దు చాలించు కొంటె – యింతకన్న సుఖము లేదు ॥నన్ను నీవు॥

నే విన్నవించిన మాట – నీకు సమ్మతి గాదు
నీ వెంత బాస చేసిన – నే నమ్మ జాల
యీ వగ లిట్లుండగ – నింపు సొంపులు బుట్టునా
దేవుని మనసున మ్రొక్కి – తే కనుల దీవించి నట్లు ॥నన్ను నీవు॥

1 మధ్యమావతి – ఆట

నేను నీవు మువ్వగోపాల ! – నేడు గూడి యుంటేను
యానాటి వలె నేమైన - నందమయ్యీనా ?
నీ నా మనసు నొచ్చితె – నెనరు లేదు చాలించు
పూని చెలు లందరు గుం - పులు గూడి నవ్వేరు ॥నన్ను నీవు॥

## 207. పంతువరాళి - త్రిపుట

నన్నేటికి బొమ్మనేరే ? – వాని వద్దికి
మిన్నక వాని వద్దికి - మీరే పోరే చెలులార ! ॥నన్నేటికి॥

పడతి ! నే నందు బోను – పలుమారు దన నోటి
మదుపందు నయము చేసి చేపట్టి నన్ను
పడకింటికి రమ్మనెనే నే రానంటె
కడు వెరపించి హా మ్మనెనే అమ్మ ! నే వెరతు ॥నన్నే॥

మచ్చకంటి యిపుడిపుడు వచ్చిన లేత చన్నులను
నొచ్చ ననగా బట్టినే ! వద్దంటే వినక
మచ్చరాన గోరు బెట్టెనె వచ్చెద నంటె
ముచ్చ వగల దోవ గట్టెనే అమ్మ ! నే వెరతు ॥నన్నే॥

నెలత నమ్మిక లిచ్చి యల మువ్వగోపాలుడు
చెలిమితో నను దీసెనే ! కుయ్యకు మని
బలిమి నోరు మూసెనే పరవశనై
తెలియ నైతి నేమేమో జేసెనే అమ్మ ! నే వెరతు ॥నన్నేటికి॥

## 208. [1] పంతువరాళి – ఆది

నన్నే పెండ్లాడు సుమీ ! – నా యాన మువ్వ గోపాలా !
అన్నన మా వారు వరా - లడుగ కుండ జేసే గాని ॥నన్నే॥

---

1 నాద నామక్రియ,

చన్నులు రాక మునుపే - సరసము లాడుచు నీవు
యెన్నరాని మోహమున నా - కిచ్చిన బాసలు దలచి ॥నన్నే॥

ఎంతెంతో నను లాలించి - యింటికి దోడుక పోయి
వింత సేయక నా మోవి - విందార గించిన సొగసున ॥నన్నే॥

తెలియనైతి చిన్ననాడే - తేలించి మువ్వ గోపాల !
అలరువిల్తుని కేళి న - న్నలవాటు చేసిన సామి ! ॥నన్నే॥

## 209. సైంధవి - ఆది

నా కోపమే నన్నింత జేసె నమ్మా !
రాకేందుముఖి నా వద్ది - రమణు లతనిపై చాడి పలుకగ ॥నాకోప॥

నేనే పోయి పిలువ వలెనో - నెలత నంపుదునో ?
పూని వాని చెలుల తోనే - పొసగ దెలుపుదునో ?
వాని మనసు నా మనసు దెలిసిన - వనిత ! నీవే తెలిపేవో ?
యీ నేరములు గాచి యిప్పు - డింటికి రమ్మనవే ! ॥నాకోప॥

వాడి వేడి శరముల - వంటి నా చురుకు మాటలకు
వాడుగాగ దాళుకొని - వచ్చె నా విడిదికి
యేడాయె నొక్క నిమిష - మెవ్వరితో మంద లింతు
పోడిమి చెడి యిట్లు నా - బుద్ధికి యింత మోసమై ॥నాకోప॥

చెలువ మువ్వ గోపాలుడైన - శ్రీవేంకటేశుడు నన్ను
వలరాజు కేళి నేలిన - వగలెల్ల నిపుడు
తలచి నామేను గరగెను - దైవము పగ సాధించెను
నిలుపరాని మోహ మాయ - నీవైన దోడితేవే ! ॥నాకోప॥

## 210. సౌరాష్ట్రము - ఆది

నా దోవకు రాకు - నాతో నవ్వకు మువ్వ గోపాల !
కాదన గతమ (?) రా - గము నిలుప నసేవు ॥నాదోవ॥

విద్దెలు నేర్చిన దని - వినయ పరురాలని
దిద్దుకో దగినదని - తెలియ నేరవా ? వోరి !
వద్ద నుండె నొక మాట - వాకిట నొకమాట
సుద్దులేల ? నీ గుణము - జూచినది కాదా ? ||నాదో వ||

మెత్తని మనసుదని - మేలు నిలిపేదాన నని
యుత్తమురాలని దయ - యుంచ నేర్తువా ? వోరి !
చిత్తము నొప్పించేవు - సిగ్గింతైన దక్క నీయవు
హత్తి దాని వద్ద న - న్నాడు కొనేవు ||నాదో వ||

కొసరి నే వేడుకోగా - నిసుమంత సేపు నన్ను
కుసుమశరుని కేళి - గూడి యలసితి నంటివి
రసికత గనవచ్చె - రాతిరి నా మనసు నొచ్చె
ముసి ముసి నవ్వు లేల - మువ్వగోపాల ! ||నాదో వ||

## 211. కాంభోజి - త్రిపుట

నా పైని కోప మేమే ? - నా సామికి
బాపురే మువ్వగోపాలు - పంతము సాగించె నేడు ||నాపైని||

పలుచని మోవిపై పలుకెంపు వరుసలు - పణతినే జూడ నంటిన
అలచెక్కు ముద్దు పెట్టి అది గంటు చేసిన గురు
తులు చూడ నంటిన
చెలువరో యీ వేళ చెలువుని నోడనే
చెనకి నే నే మంటిన ఓ హోవె ! ||నాపైని||

మోమున చిరు చెమటలు గారేటి సొంపులు
ముదితరో చూడ నంటిన
(?) రొమ్మున గుబ్బలు పోత్తై యున్నది చూచి నే రచ్చలు చేసితిన
ప్రేమమాట నాతో నాడగ యీ
రేయిపిలిచిన పలుక కున్నాడే ఓ హోవె ! ||నాపైని||

సరసుడైనట్టి మా మువ్వగోపాలుని (?) మేనెల్ల పసు పంటిన
మరుకేళిలో దాని గూడి అలసి - నాడసి నేనేమి దూరితిన
సరసిజాక్షి తన నడతలు తెలియదా
చలమేమి పో పోవె! బాగాయె! ॥నా పని॥

## 212. సౌరాష్ట్ర — ఆది

నా వల్ల దుడుకు లె - న్నటి కైనను గలవా?
మోవనాడు కలిగిన - మువ్వ గోపాల! దేవా! ॥నావల్ల॥

ఏరా! నీ కౌగిలే నా - కిర వసి యుండలేదా?
రారా నిను దైవము - మారుగ జూడ లేదో?
కూరిమి గొసర లేదో - కొమ్మని విడె మియ్య లేదో?
దారి తప్పి నడవగ - దాళ నైతి గాక ॥నావల్ల॥

అనువైన నా మేను నీ - కమ్మి కొన్నదాన గాదో?
తనివి దీరక నేను - తమి నుండగ లేదో?
మనసు లొక్కటి గాదో? మాట నిలుప లేక నీవు
నను మీరి నేడు వేరే - నడుచు కొన్నదిగాని ॥నావల్ల॥

కూడి యున్న దినములు - గూడి యుండగ లేదో?
వేడుక చెల్లింప లేదో? వేడు కొన లేదో?
ఊడిగంపు పడుచునై - యున్న దానను గాదో?
పాడి దప్పి మా మువ్వ గో - పాల? యింత వచ్చెగా? ॥నావల్ల॥

## 213. తోడి — త్రిపుట

నిదుర వచ్చునా? కంటికి - చక్కని సామి!
కదసి మన మీ లాగు - గలసి మెలసి యుండగా ॥నిదుర॥

ఓ విధాత నా గుబ్బలు



గమ్మని వాసించు - గళమున వదనాబ్జ ముంచి
కమ్మకొని కౌగిట - గదియ రాదీసు కొసి
నెమ్మి తోడ కటి మీద - నీ పాదము లుంచగ
ఒమ్మన నా గుబ్బలు నీ - రొమ్మున నుంచు కొన్న గాని ॥నిదుర॥

చక్కెరవలె నున్నది - చల్లనై యున్నది
యక్కర దీర దెంతో - యాన నిమ్మని మోవి
యెక్కువ దిది నా సా - మ్మెవరి కీయ వద్దసి
నొక్కి తేనె మోవి - నోర నుంచు కొన్న గాని ॥నిదుర॥

అలసిన గాని మొదటి - నిలువరము దప్పనీక
తలపున మితి లేని - 1 తమి గలుగ జేసి
కలికి మువ్వ గోపాలు డైన - కంచి వరదుడని
కలసి నా యురముపై - గ్రక్కున బవ్వళించక ॥నిదుర॥

## 214. పున్నాగవరాళి — త్రిపుట

నిన్ను జూడ గలిగె - నే యిన్నాళ్లకు
నిన్ను జూచి నాలుగైదు - నెలలాయె మువ్వ గోపాల! ॥నిన్ను॥

నిన్న రేయి కలలో నా - కన్నుల గట్టినట్లుండ
వెన్నుడా దిగ్గున లేచి - వెదకి కానక
కన్నీరుచే పైట దడిసి - కరగి చింత నొందితి
నన్ను దలచితో లేదో - నా నోము ఫలము ॥నిన్ను॥

విడె మని యన్న మని - వేడుకని నిదుర యని
యెడ బాసినది మొద - లేమియు లేదుగా!
యడవిలో బ్రొద్దు గూక - యంధకార మైన వానలో
తడసి దోవ గానసి - దాని వలె యున్న తనకు ॥నిన్ను॥

1 వలపు

కన్న వారాడు కొనేది - కన్నెలు నవ్వుకొనేది
విన్నావో వినలేదో? - వినరా! యీ వింత
నిన్ను గూడినదే మొదలు - నీ తోడిదే లోకమై
యున్నా నింతే వేరే మనసై - యుంటినా మువ్వగోపాల! ॥నిన్ను॥

## 215. కాంభోజి — ఆది

నిన్ను నీవే నొచ్చు కొనేవు - నీ మనసున గరగేవు
సన్నుతాంగ మువ్వ గోపాలుని - చాల యూరుడూరు చేసి ॥నిన్ను॥

తాళిమి గలిగిన వాడని - దండింప మనసు రాదని
మేలుదాచి నే తాళ లేనని - యేల మనసు నొప్పించితి నని ॥నిన్ను॥

నిన్నుజూచి యుప్పొంగు నని - నీ పతని జీవన మని
కన్నె నీ వింత కోపగించితే - కన్నుల నీరు నించుగా యని ॥నిన్ను॥

మక్కువ నమ్మిన వా డని - మా మువ్వగోపాలు డని
లక్కవంటి మనసు రాయై - లాలించ నైతిగా యని ॥నిన్ను॥

## 216. కళ్యాణి — చాపు

నిన్ను మరతునే? ఓ చెలియ!
నన్ను నీ సొమ్ము జేసి వేంకట - నాథ! రా రా! యనిన జాణవు ॥నిన్ను॥

పొలతి, నీ గుణ మరయ వలసి - యలుక దెచ్చుక కన్నెఱ్ఱ జేసుక
పలుకక యూరకుండి అప్పుడే - పణతి జేరి -
కిల కిల నవ్వుచు సారెకు చక్కిలి - గింత లిడుచు నన్ను
తలిరు గుబ్బల రొమ్మున గుమ్మ - దక్కించు కొన్న చలపాదివి ॥నిన్ను॥

మొదలు తరితీపు తెచ్చుక మాట - నిదుర దెచ్చుక పవ్వళించితే
ఆది తెలిసి నీవు నా కెమ్మో - వాన వచ్చితివి

పెదవులు రెండు గట్టిగా బట్టి - వదన మిట్టట్టు దిప్పనీ గను
అదిమి గదిమి అలమి మోవి యానన
గదలించి వేసిన హాంతకారివి ॥నిన్ను॥

వెలయు మువ్వగోపాలుడైన - వెంకటేశ గోపభామల
అలయక పదునారు వేల గూడితి
వయిన కా నిమ్మని కలయు వేళ యేమో కొన్ని
కతల చేత జాగు చేసియు సొలయక రతులగూడి
చూడరా! నా మార్గ మనిన జాణవు ॥నిన్ను॥

## 217. కల్యాణి - చాపు

నిలువున నిలివెడు ధనము బోసినను - నీ పొందు సేయ జాల
చలమేల ? మువ్వ గో - పాల ! యీ వగలేల ? ॥నిలువున॥

మాటల దేలించి - మర్మము భేదించి
తాటోటు వగలను - తరుణుల వంచించి
కూటమి సాక్కించి - కూర్చి గుంపులు జేసి
తోట కూర దొంగ వలె - దొలగి పొయ్యే వాడవు ॥నిలువున॥

తియ్య బెల్లి వగల - దేలించి సోలించి
చెయ్యని పను లెల్ల - జేసి భ్రమయించి
శయ్యపై బవ్వళించి - సద్దు సేయక లేచి
తొయ్యలిపై దుమ్ము - దులిపి పోయే వాడవు ॥నిలువున॥

అక్కరకాడవై - యందందే ప్రేరేచి
చక్కెర లూరించి - చాలా మన్నించి
మొక్క బరచి చెలుల - మోహాంబుధిలో ముంచి
చుక్క బొడువ లేచి - జుసిగి పొయ్యే వాడవు. ॥నిలువున॥

## 218. నవరోజు - త్రిపుట

నీకన్నా నా మొగుడే మేలు - నీ పాద మాన
ఏకాంతమున నీ మాటలు విని
యేమో యిపుడు మోము జూడ గలిగెద ||నీకన్నా||

మోహా మేచాయ యెట్ల దాతు - మోహ మెవరి పాలు సేతు
సాహసము యీ వేళ - చాలు చాలు పో పోర! ||నీకన్నా||

బూరుగ మాను కాసించి పొంచిన (?) చిలుక చంద మాయె
నీ రూపురేఖలు చూచి - నీకే వలచి వచ్చితి సుమీ ||నీకన్నా||

నిద్దుర కాచిన దెల్ల - నీళ్ల లోని హోమ మాయె
పొద్దు బోయె నింటికి - పోవలెను మువ్వ గోపాల! ||నీకన్నా||

## 219. భైరవి - ఆది

నీ కూతురి నడతలు నీకె సరి - లోకు లెవరు మెచ్చ రమ్మా!
యిక్కడికి తెల్లవారె గద - యికను మువ్వగోపాలు డనదట ||నీకూ||

నిదుర బోతే లేవ మనసు బెట్టదు - నుదుట నెన్నడు బొట్టు పెట్టదు
అదియు గాక తమలపాకు ము
ట్టద యేడాదికి కొప్పు విడిచి కట్టదు ||నీకూ||

వీణ చేత నొకనాడు ముట్టదు - వింత జూచినా నవ్వు బుట్టదు
రాణి వాసములు అడుగులు బెట్టదు
రామ! రామ! సాగ సనేది బుట్టదు ||నీకూ||

నేను గూడితే తనకు కూడదు - నెవరు గూర్చి పలు కాడదు
పూని వట్టి మంకు గుణము విడువదు
బుద్ధి జెప్పినా యెవరిని జూడదు ||నీకూ||

## 220. ఆహిరి - రూపకం

నీకె దయ రావలె గాక - లేక ది క్కెవ్వరు
పాకశాసన వినుత! మా మువ్వగో
పాలరాయ! నీ మనసు కరిగి ॥నీకె॥

క్రొన్నన వంటి మేను చిక్కిన - సన్న వలువలు గట్టక యున్న
యెన్ని దినము లన్నము మానిన - నేలాగు నుండిన
చెన్నైన కురులు చిక్కు బడిన - చిన్ని నా చక్కని మోము వాడిన
నన్ని యిదేటి కనుచు వచ్చినా - కన్నీరు దుడిచే కన్నెలున్నారా ॥నీకె॥

విరహవేదన చేత సొక్కిన - వెతల జెందిన పాప జాతి
మరుని మూక చుట్టు ముట్టిన - మనసు నొచ్చిన
నిరతము నే నసు రుసు రనిన - నిట్టూర్పులచే నొగిలి యుండిన
నరసి యేడవకు మనుచు వచ్చి న
న్నాదరించే యువిద లున్నారా? ॥నీకె॥

నేరక నడిచిన నేర్చి నడిచిన - నే నెటువంటి దాన నైన
సారెకు నిన్నెంత దూరు కొనిన - చలము చేసిన
చేర రమ్మని కోపగించక - చిత్తము రంజిల్ల జేసి చాల
కూరిమితో మువ్వగోపాల! - గూడితి వెప్పటి కీ లాగె ॥నీకె॥

## 221. బిలహరి - [1] త్రిపుట

నీకేల భ్రమ దీరదే? కంచివరదు డా - నెలతపై మేలు వాడే
రాక యిందరిలో ని - రాకరించి యుండగ ॥నీకేల॥

పిలువ నంపెద నని - దలపేలె వాడు దాని
సొలపు చూపులకే - చొక్కి యుండగ
నెలత వాని పాలికి - నే నున్నానట వమ్మ!
కలి బోసిన నుట్టి వం - కలు జూచే వయ్యయ్యో! ॥నీకేల॥

---

1 అది.

ఆటపాటలును స - య్యాట లవి కొన్నాళ్ళు
బూటకములు చేసి - పాటించెరు
నేటికి నీ వేలె - నే నేలె ? వాని కా
బోటి గలిగి యుండగ - నేటి మాటలే చెలియా ! ॥నీ కేల॥

పని లేదు మున్న గో - పాలుడా వరమని
చనువు నిక్క మటవె - చంచల చిత్తుడు
ననుగూడి నాతో నా - డిన మాటలు నిలిపెనా
వనజాక్షి ! పైని క్రొత్త - వలపది రెణ్ణాళ్ళు ॥నీ కేల॥

222. కల్యాణి - చాపు

నీ పొందు సేయక మూన మువ్వ - గోపాల ! నీ పాద మాన
నా పొందు నీ వెడ బాయకురా ! చాల -
నమ్మితిరా ! నిన్ను నా ప్రాణనాథ ! ॥నీపొందు॥

ఎవ్వరాడిన నాడని మగ - డేమి చేసిన జేయనీ !
నవ్వే వా రెల్ల నవ్వనీ, యత్త
నన్ను దూరితె దూరనీ ! సామి ॥నీపొందు॥

కన్న వారు గవ్వసేయనీ నా - కాపుర మేమైన గానీ
అన్నదమ్ము లెడ బాయనీ చాల
ఆరు దూరైతే కానీ నాసామి ! ॥నీపొందు॥

నీవు చే గూడగ జూడనీ మామ - నేరము లెంచిన నెంచనీ !
బావ చాల రట్టు చేయనీ చుట్ట
పక్కాలు తిట్టిన దిట్టనీ ! సామి ! ॥నీపొందు॥

223. సావేరి - ఆది

నీమేలు మరతు నటే ! యో ముద్దు గుమ్మ !
కామిని తిరువళ్ళూరి వీరరాఘవుల పొందు
గలిగె నెన్నటికైన నో చెలియా ! ॥నీ మేలు॥

ఇంతి నీ వంటి సఖిని - నెన్ని జన్మముల కైన
సంతరించు కో గలనా - సగము దేహ మిచ్చిన
యెంతైన నీ ఋణము దీరునా - మదిలోని వేదన
నెంతట నైన చల్లారునా - నీవు రాకున్న
కాంతుడు నను జేరునా - యెన్నటి కైన ॥నీ మేలు॥

మనసు చీకటి గమ్మి - మాటాడ చెలులు లేక
ఘనమైన విరహాగ్ని - గాగే టప్పుడు వచ్చి
నను జేర దీసితివి - తను మధ్య ప్రాణే
శుని దార బోసితివి - నను జెప్పిన
వనజాక్షుల నోరు మూసితివి - యెన్నటి కైన ॥నీ మేలు॥

బాలరో! మువ్వగో - పాలుడౌ వీరరాఘువున
కీ లాగున నున్న సుద్ది - హితవుగ విన్నవించి
వాలాయమిందు రప్పించితివి - తేరి చూడని
వాలుగంటుల మెప్పించితివి - నను గూడిన
వానిచే బాస లిప్పించితివి - యెన్నటి కైన. ॥నీ మేలు॥

## 224. భైరవి - ఆది

నీలవేణి! వానికి నీ వేల - బాల బుద్ధివై పదరుట మేల?
యేలనె వేడు కొనేది చాల కొదువే -
వానిపై బాళి చాలు పదవే! ॥నీలవేణి॥

వినవే ఘన మెరుగవా వెట్టిదాన - వనితకైన మగవాని కైన
నెనరు బోతే నా తరువాత
నెనయ రోతే గుట్టుతో నుంటే రీతే ॥నీలవేణి॥

చెలియరో మునుపటి వలెనే వాడా - తలపు గలిగితే తానే రాడా
పిలువరాదే మనము వానికి నీపై
వలపు లేదే వానికి నీకు తొలుత వాదే ॥నీలవేణి॥

బలిమిని మువ్వ గోపాలుని గూడి - యెలనాగరో! యిక నేటికి మోడి
తెలుసు కొమ్మ నీలో నీవే వానితో
చలము వలదే కొమ్మ! వాడు రెండు దలచె నమ్మా! ॥నీలవేణి॥

## 225. భైరవి - అది

నీవే వచ్చితివి - నేను వచ్చి నట్లు
భావము దెలిసి మువ్వ గో - పాల నేడు మా యింటికి ॥నీవే॥

దినము లెల్ల నూరక పోయె నిన్ను - గనుగొంటి నేటికి లెస్సాయె
మనసెంత జేసెర విటరాయ యింక
నిను నే నెంతని మెత్తు నెనరున నమ్మ నాయ ॥నీవే॥

వెలదులు మెచ్చ కోగా గందు నీ - వితె మెల్లను వీనుల విందు
చెలుల కలికి యూరకుందు నోరి
బలిమి పై కొందునో యని పదరి దమితో నుందు ॥నీవే॥

కూడితి నా ముచ్చట దీర మువ్వ - గోపాల చాల హొయలు మీర
నేడు నా కోరిక లీడేర యింక
వీడ నాడకు నా మది వేదన చల్లార ॥నీవే॥

## 226. సవరోజు - 1 త్రిపుట

నెంజి లెటు వలె - దీరు నమ్మ!
కంజాక్షి! వినవమ్మ! కంచి 2 వరదు నెడ బాసి ॥నెంజి॥

వనబోణి నెనరున - నా తలోదరము పై
తన వదన ముంచి మోదము మీరగ
కను రెప్పల చేత నా - చను మొన లప్పళించి -
తనువు పులకరించి నా - తమి రేచే సామి బాసి ॥నెంజి॥

1. అట. 2. వరదుని బాసి.

భామ! నను తన తొడలపై - బవ్వళించుమని
మోము మోమున జేర్చి - మోహము మీర
నా మోవి తా నాన - తన మోవి నే నాన
ప్రేమతో నుపమ గ - ల్పించిన సామి బాసి ॥నెంజి॥

పరమాత్ముడౌ మువ్వ గో - పాలుడైన వరదుడు
సరసరతుల మడి - జల్ల జేయుచు
నిరుపమ కరుణ చే - నిదుర బట్టిన దాక
సురటిచే విసరిన - శోభనాకారుని బాసి ॥నెంజి॥

## 227. తోడి - ఆది

నెలత! అతడు అలిగే దెల్ల - నెనరు గా దటవే?
వెల వెల బో నేల మోము - చెలువుని తోడి తెచ్చెదనె ॥నెలత॥

కాటుక కన్నుల నీరు - ఘనమైన నీలముల వలెనె
పైట దడిసి రవిక దూసి గు - బ్బల పై నిండెనె
యేటికె యీ వట్టి వెతలు? - యిందువదన! 1 వెరువ నేలే
నేటి మాపటి వేళ - నీ విభుని నిను గూర్చెదనె ॥నెలత॥

వాని ప్రేమ తెలియకనె - వలపు నీవు నిలుప లేక
మేనెంతో 2 కరిగె గాక - మెఘువ దెలియక
ఓనాతిరో 3 నన్ను వినా - నూరడించే చెలు లున్నారా?
నే నీ దాన నై నందుకు - నీ వోరుల వేడ దగునా? ॥నెలత॥

వనిత మువ్వ గోపాలుడౌ - వరదుడు నిను గూడిన వెనక
4 వెనక కను లెత్తి యే చెలి - నైన జూచునా?
మనసు గట్టి చేసుకోవే! - మగువరో! నా మాట నమ్మవే!
కినుక వలదే తాళు కోవే! - వనబోణి! గెలుపున నుండవె ॥నెలత॥

1 వెరువకువే. 2 కరిగి యున్న - దానవేలనే?. 3 ని న్నెవరైన. 4 కను మిక నే చెలి నైనను — కనువిప్పి జూచునా.

## 228. సారంగ – త్రిపుట

నేటిదే కలయికరా ! చక్కని సామి ! - (నేటిదే)
కోటి సేయురా మువ్వ – గోపాల ! యీ వగ ॥నేటిదే॥

ఎనసిన బడలికలు దీర మన – మిద్దర మాను కొంట
మనసులు చల్లనై – మమతలు కొన సాగి
యినుమడించిన మోహ – మిపుడు నా సామి ! ॥నేటిదే॥

ఉల్లము లొకటియై - యింతింత యన రాని
ఉల్లాసములు మీఱగ – అల్లిక కౌగిళ్ళ
అల్లిబిల్లి సుద్దుల - కొల్లడింతుర (సొచ్చి?) గులికేర నా సామి! ॥నేటిదే॥

ఎలమి నెడ బాయమని నమ్మిక - యిద్దర మిచ్చు కొంటి
పొలయలుక యిప్పుడే – పొందు టంత లోనే
సొలుపు మీర యింపు - సొంపున మువ్వ గోపాల సామి ! ॥నేటిదే॥

## 229. పంతువరాళి – త్రిపుట

నేను మంచిదాన గనుక – యీ తప్పు గాచితి గాని
మానునా మరి ... కతె - మా మువ్వగోపాల ? ॥నేను॥

వెంట వెంట దిరుగుచు – వినయము లాడుచు
నింటికి రమ్మంటె రాక – యేల యేచేవు ?
ఒంటి నా చై జిక్కితి – వింటిలో ని న్నడ్డగించు
కొంటేను విడిపించు – కొని పోవ దిక్కు గలరా ? ॥నేను॥

చెట్ట బట్టి ప్రియము – జెప్పి పాను పెక్క నుంటె
ఒట్టు పెట్టు కొన్నా నని – యూర కుండెదవు
పట్టు పడితివి నాచే – పడకింటిలో నిన్ను
కట్టి వేసు కొంటె నిన్ను – (?) విడిపించు దిక్కు గలరా ? ॥నేను॥

పందె మాడుచు వచ్చి - పడకింటిలో జొచ్చి
యందగాడ! మా మువ్వగోపాల! - యనిన
మందె మేలమా నీకు - మాటి మాటికి నాతో
కందర్పుని చేతి చిలుక - కదసి సన్ను
పట్టుకొని నిన్ను గూడి - ప్రౌఢి కెక్కితే దిక్కు గలరా? ॥నేను॥

230. కాంభోజి - [1] త్రిపుట

నో రెత్త నైతి నమ్మా! - ఓ చెలియ! నే
వీరు వా రందరు - వింటే సిగ్గయ్యీనని ॥నోరెత్త॥

కలికిరో మోవిపై కాటుక నిగ్గులతోను
చెలువు డింటికి వచ్చెనే! అందుకు లో లో
పల నె నొచ్చుకొని పలికినందుకు విభు
డులికి రంతులు జేసెనే! ఆ సుద్దులు
చెలు లడిగి తేను నవ్వుల కని వారితో
మలయుజ గంధిరో మరుగు జేసితి నింతే ॥నోరెత్త॥

అదరు బెదరు లేక నుదుటి లత్తుక తోను
గదసి గాగి లిమ్మనినె అందుకు నేను
అదరి వచ్చిన కోప మడచుక మెల్లనే
అది మేర కా దంటినే అందుకు వాడు
అదలించితే నాకు యిది యే మానో యని
యరటాకు సామెత యట్లు వానితో నే ॥నోరెత్త॥

వినవమ్మ గళముపై పీడెంపు రసముతో
నను కెమ్మో విమ్మనెనే అందుకు నేను
ఎనయు వచ్చిన వాని మనసు నొప్పించుట
ఘనము గా దని యుంటినే అంతలో వాడు

1 అట - అది.

మునుపటి వలె నన్ను తనియ కలసి తేను
మువ్వ గోపాలుని మోమోటము చేత ॥నో॥

## 231. కేదారగౌళ – త్రిపుట

పక్కలో కోపాన పవ్వళించిన వాని – చక్క బెట్టుకో వశమా?
మిక్కిలి విరహాన చిక్కి నేనంతలో
మిగుల కౌగిలించితినే సామిని చెలియ ॥పక్క॥

ఒక్క శయ్య పైని ఒదిగి యున్న వితము – చక్కగా జూచి మదిని
సొక్కిన నా చూపు అతని చూపు – ఒక్క చోట నుండి నాను (?)
.... .... .... .... .... .... .... .... ॥పక్క॥

దక్క దక్క నల్లు దాగి యున్న విభు మేను – తడవను తల పోయుచు
పుక్కిటి విడె మీయగా నిట్టు కొన కొన (?)
పుక్కిలి చూచు కొనెనే సామి ఓ చెలియ! ॥పక్క॥

రాతి గుండె గనుక నిదుర మబ్బున నేనే – రమణుని పై కొంటినే
కాతరమున వాని కళ లంటి నే నతని
కౌగిలి చేర్కొంటినే ఓ చెలియ! ॥పక్క॥

## 232. 1 ఆహిరి – చాపు

పచ్చి మొదలి దానర!
పచ్చి మొదలి దాన పావడు నిలువడు
వచ్చి గూడుటకు వేళ గాదు
వచ్చె తాళవోయి వదలను నీ పొందు
మచ్చిక నొయ్యారి మా మువ్వగోపాల! ॥పచ్చి॥

1. ధన్యాసి.

మిసమిస లాడేటి నొసటి సొంపు జూచి
కొసరి పైకొనేవు కొల్లలుగా
కసరితే నొకవింత గారాబు జేసేవు
రసికుడ యీ వేళ రారాదు పో పోరా! ॥పచ్చి॥

పట్టకురా రొమ్ము పాలిండ్లు జేతుల
యెట్టు లోర్తును పరులే మందురు
పట్టి బోతే మొర బెట్టును పసిబిడ్డ
అట్టె మనసు బిగ బట్టుకో రెన్నాళ్లు ॥పచ్చి॥

కారము దిన్నాను కరకర లాడీని - యీ రేయి శ్రీరంగేశుడ
మారు కేళి గూడ మా మువ్వగోపాల
ఆరడి బెట్టకు మోరి నా సామి ॥పచ్చి॥

## 233. ముఖారి - ఆది

పదరి వానిచే పైడి - బట్టు కొనకుడి
కొదవలయ్యీని మువ్వ - గోపాలు డలగి వచ్చెను ॥పదరి॥

విరిబోణి మీరు మేము - వింత వారము గాము
పొరి చూపటే కంచము - పొత్తు వారము
అరమరిక లేని చుట్ట - లగు మీకు మాకు
విరస మయ్యీ ననుచు - నెరుక చేసెద మీకు ॥పదరి॥

చెలిమి నా యిరుగు పొరుగు - చెలుల బిలుతు నని
తొలుత నా మొద్ద మీసము - దువ్వ కొన్నాడు
వెలది యా రోసాన వాడు - వేయూరు లీయ జూచెనే!
చెలగి యందు కాసించి - చేరి వాని చేత మీరు ॥పదరి॥

ఎప్పటి వలెనే వా - డిందు వచ్చి నన్నేలితే
నప్పుడు చెప్పేను గాని - యా సుద్దులెల్ల
కప్పుర గంధిరో వాని - కసరి వేసారు కోక
మొప్పె తనమున - మువ్వ గోపాలు డలగి వచ్చెను ||పదరి||

## 234. మోహన – ఆది

పరదేశమున జేసిన - పనులిందు జెప్ప రాకురే!
తరుణులార! యిదెక్కడి జోలి
తాళగదరె! మీ పుణ్య మయ్యీని! ||పర||

దాని యింటికి పోయి వలచి – ధనము లిచ్చి వేడు కొన్నాడా?
వాని చక్కదనమె చూచి – వలచి పైకొని బతిమాలి
గాన విద్యా ప్రౌఢిమచే – కరగించినట్లు గాబోలు
మానిని మగవాడు గనుక - మనసు నిలుప లేడాయె ||పర||

పూచిన తంగేడు వలెనె – భూషణ భూషితురాలై
చూచి మరుడంపిన మోహినీ – సుదతి వలెనె వచ్చినిలిచి
యో చక్కని ముద్దు సామి – నింటినుండ మేర గాదని
లేచి వచ్చి మాయింటి లో బవ – ళించ మనె గాబోలు ||పర||

ఎన్నగ మధురాపు - రీశుడైన మువ్వగోపాలుడు
నన్ను మరుకేళిలో గూడిన - నాటి నుండి యన్య మెరుగడు
చిన్నెలవాడు గాడమ్మ - చెలియరో గాంభీర్యశాలి
కన్నెరో నేదగ్గఱ లేని – కాంతాళాన నైనట్లు గాబోలు ||పర||

## 235. [1] కళ్యాణి – ఝంప

పలుకరించిన నీవు పలుకకపొయ్యేవు – పణతి నీ గర్వ మేమొ?
తలచితే వెయ్యాఱు తరుణుల చేకొన్న
కలికి గోపాలుడనవలెనటే నా పేరు ||పలు||

---
1 ముఖారి – ఆది.

తీయని కెమ్మోవి - తేనె లానుచును
సైయాటమున ప్రొద్దు జరుప నొప్పేవా ?
పయ్యెద తొలగించి పాలిండ్లపై నొక్క-
చేయైన వేయ నొప్పేవ ? ||పలు||

మోము మోమున జేర్చి ముద్దులు బెట్టుకొని
వేమారు నన్ను నవ్వించ నొప్పేవ ?
భామరో ! యిటువంటి పలుకులు పలుకుచు
ప్రేమతో రాకున్న పిలువ నంపేవ ? ||పలు||

ఎక్కువ మోహమున యెనసి గూడి నన్ను
గ్రక్కున కళలంటి కౌగిలించేవ ?
మక్కువతో మువ్వ గోపాల ! రమ్మని
యొక్క సారైన గూడి యుండ నొప్పేవ ? ||పలు||

## 236. [1] కాంభోజి — త్రిపుట

పలుకు లేటికి దయలు - బట్ట బయలాయెన్
యెలనాగ యవకాశ - మేమున్న దయ్యయ్యో ! ||పలుకు||

నెట్టుకొన్నట్టి మమత - నిలుపలేక మోవిమ్మంటె
పట్టి తోసి మనసు - గట్టి చేసుకొంటివి
చుట్టము లేని వారు - సుదతి యెవ్వరినో
పట్టుకొని పాకులాడి - నట్టాయె నా వలపు ||పలుకు||

[2] సతముగా నీ పాదములె - గతియని నమ్మి యుంటి
యితరునిగా జూచితి - వేమి సేతు సుదతి
సతుల నమ్మ పాప జాతి మగవారికి
గతులు లేదను మాట - కలికిరో నిజమాయె ||పలుకు

1 గౌళపంతు - ఝంప. 2 హితముగా.

మొగమాట మేలనే - మువ్వ గోపాలుడ గాన
అగడైతి నిన్ను గూడి - యందరిలోన
మగువ వాక్కున నొకటి - మది నొకటి యెంచుకొని
తెగనాడితివి మున్ను - దెలియ లేనైతి నీ తోడ ॥పలుకు॥

## 237. కేదారగౌళ — ఆది

పిలువ నంపె నన్నీ వేళ - ప్రేమ మీరగా నిపుడు
చెలియ మువ్వ గోపాలుడు - చిత్తము రంజిల్ల నేడు ॥పిలువ॥

విరిబోణి రో రమ్మని - విరుల జడను జుట్టి
పరువ మయిన నాటికి - పైడి యిదే ననుచు
మరువకుమీ మాట - మనకిద్దరికీ పూట
చెరుకు విల్లుడే సాక్షి - చెలియనిన నాసామి ॥పిలువ॥

ఏమ్మ్రొ కాదు నేను - నెనసిన చిన్ననాడే
సమ్మతిగా నొక చోట - జదువు చుండగ
పమ్మిన వేడుకతో - భామ నీవు ప్రౌఢైతే
కమ్మ విల్తుని కేళి - గలసే మన్నది నిజమై ॥పిలువ॥

ఎలమావి తోటలో - నింపొంద నొకనాడు
యెలమి గౌరిపూజ — సలుపు చుండగా
అల మువ్వ గోపాలు - డగు వేంకటేశుడు
కలువల శయ్యాపై - గలసే మన్నది నిజమై ॥పిలువ॥

## 238. కాంభోజి — ఝంప

పుట్టు భోగీంద్రు డలుకల కోర్వజాలడో! - పొలతిరో! బిరాన రావే!
నెట్టుకొని పలుమారు - నే నె మ్రొక్కెదనె ॥పుట్టు॥

చలమేల మొగ్గ మట్టెల పోట్ల గంట్లచే
అల రమణు మేను పులి పులి యైనది
కలికి నీ చనుదోయి గజనిమ్మ పండ్ల, కా
కలగాని మాయదా గాయంపు నొప్పి ॥పుట్టు॥

పమ్మి పుప్పొడి నెరసు బడి యెఱ్ఱనైన కను
దమ్ములకు నీరార గమ్మెనిపుడు
కొమ్మ పయ్యెద కొంగు కోకావినొత్తవే
తెమ్మబడి కన్నుగవ తేట యౌగాని ॥పుట్టు॥

పెలుచు రే యెండ వడపెట్లు పడి నాయకుడు
తలకొనెడు వెతలచే దప్పి దీర
అల మువ్వ గోపాలు నలమి కౌగిట జేర్చి
పొలుపు కెమ్మోవి కప్పుర విడెమీయవే ! ॥పుట్టు॥

## 239. ఆనందభైరవి - ఆది

పూచిన తలిరు వలెనే సుకుమారు డితడని - చూచి మెల్లనే యేలవే
ఏచకనే వాని యిపుడైన నీతోను
దాచక తెలిపి నానే తరుణిరో ! యీవేళ ॥పూచి॥

చక్కగా కెమ్మోవి చప్పరింతువు గాని నొక్క బోయేవు సుమీ !
చెక్కుటద్దములపై ముద్దు లుంతువుగాని - చెనక బోయేవు సుమీ !
చక్కని రొమ్మున రొమ్ము జేర్తువుగాని - చనుల గ్రుమ్మేవు సుమీ !
యెక్కువ ప్రౌఢ గనుక చెప్ప తగినదేమి
యిప్పుడే తెలుసుకోవె ఓ లలనరో నీవు ॥పూచి॥

ఎలమితో రతిరహస్యములు నింతువుగాని - హెచ్చు పల్కేవు సుమీ!
అలగి వాడే మనిన తాళు కొందువుగాని - అలుక జేసేవు సుమీ !
వలపు పెన్నెరి దువ్వి విరులు ముడుతువు గాని - పట్టి దీసేవు సుమీ !

తలిరు విల్తుని శాస్త్ర మెంత దెలిసిన దైన
తగు దాన వైనా గాసి లలనరో! యీవేళ ॥పూచి॥

కోరిన సరసము మువ్వ గోపాలుని నే మైనా - గోర జేరేవు సుమీ!
గారవమున జిత్త మెఱిగి నడుతువుగాసి - గాసి జేసేవు సుమీ!
సార సంగ్రాహివై తగుదానవై - సరసజ్ఞ రాలవైన గాని
సారెకు నారీతి నీవె యోమువు గాసి
సరసరతులను వలదు సుమీ! ॥పూచి॥

## 240. కేదారగౌళ - [1] త్రిపుట

ప్రేమ కేశవరాయ - బెదరింపుల కే మాయ
ఆమె పొందే సతమాయ - అవురా! జాణరాయ! ॥ప్రే॥

సిదుర కన్నుల మంపు - పెదవుల కాటుక నింపు
పదముల కుంకుమ కెంపు - ఫాలమున లత్తుక సొంపు ॥ప్రే॥

మంచిది యందుల కేమాయ - మగవారి మాటలే మాయ
పంచి వేసినది లెస్సాయ - బొంకు లేలరా? విటరాయ! ॥ప్రే॥

మైలతో న న్నంటరాకు - మారుసి దురాయి నీకు
మాలిమి సేయ రా బోకు - మాకు సైచదీ దిమ్మాకు ॥ప్రే॥

మాలిమి శ్రీ నాగశైల - మల్లికార్జున! మువ్వ గోపాల!
యేలితివి న న్నీవేళ - (?) మోదమలర శ్రీ లోల! ॥ప్రే॥

## 241. [2] వరాళి - చాపు

ప్రొద్దు బోదు నిదురరాదు - పొలతి నెడబాసినది మొదలు
తద్దయు నీ పాపజాతి - దైవము పగ సాధించెనమ్మ! ॥ప్రొ॥

---

1 అటతాళచాపు. 2 శోకవరాళి.

అనలు కొనలు బారినట్లు - మనసు మనసు నెనసి చాల
పెనలు గొన్న చెలి మన్ననలు - వినము నుతిసేయక ||ప్రా||

అరువు మురువు గలిగిన చి - త్తరవు వెరవు ప్రతిమ వలెను
ఉరవిరవై యున్న చెలిని - మరువ వెరవు గొనకట ||ప్రా||

మువ్వ గోపాల రమ్మని ముద్దుబెట్టి కూడగాను
ముదువ వెరవు గాన నకట
పూవు బోణి మోవి తేనె - భుజియించిన చవిదలచి ||ప్రా||

## 242. [1] కేదారగౌళ - ఆది

పోయి రమ్మనే ముద్దు గుమ్మ [2]
నేయము గాదు వద్దంటే - నిలిచేది మేరగాదు ||పోయి||
ఏల కన్నీరు నించేవే - యేమిటి కానబెట్టేవే ?
యేల వేడుకొనేవే - యీ ప్రొద్దు మంచిదినము ||పోయి||

తరుణిరో వానితో నేల - తరుచు మాట లాడేవే ?
తరువాత నడిచే సుద్ది - తానే విన బోయ్యాని ||పోయి||

కలసినదే కల్లలాయ- కలలో నీ నుద్దులాయ
పలుకు లేల మా మువ్వ గో - పాలుని మహరాజు వలెనే ||పోయి||

## 243. (?) ఖండె - ఆది

ఫలమింక యేమి కద్దు ? - భామరో ? చాలు
..............మువ్వ గోపాలు పొందువద్దు
చెనకి వానితో నే కూడి - జేసితి నెనరు
చనవుల నిచ్చోట యింతి - చలమెట్లా యీడేరు
వనజాక్షి వాని కోసరమై - దిన దిన మీ పోరు
కని విన్న వారేమైనా - కాదనపోరూ ||ఫల||

---

1 రేగుప్తి; అఠాణా. 2 నాసామిని.

వామాక్షిరో వాడీడకు - వచ్చే మనసు లేదు
రామా వాడిందు రాదలచితే - రానిచ్చేది గాదు
యేమో నాటికాయా పాయా - యింక పనిలేదు
భామా ! నామనసు వాని - పై నాటివుండ పోదు ॥ఫల॥

ఎంతో లాలించి కూడినా - హితవు మాట సున్న
రంతు సేయక నా మనసు - రాయి చేసు కొన్న
యంతరంగము చేయించి - యాలసితినే మున్న
వింతలు మువ్వ గోపాలుని - వితము లన్ని విన్న ॥ఫల॥

244. సావేరి - చాపు

బాగాయ నీ వగలెల్ల మా - బాగాయ !
బాగాయ మువ్వ గో - పాల నీ వగలెల్ల మా ॥బాగాయ॥

నీకు నే మడుపు లిచ్చేది నీవా - నెలత చేతి కందిచ్చేది
లోకు లందరు నవ్వేది యది
గాక మరేమో అగడము చేసేదెల్ల మా ॥బాగాయ॥

నిన్ను నే గాగిలించేది నీవా - నీరజాక్షిని దలచేది
నన్ను నీ వాడుకునేది అల్ల
ననబోణి యింటను నవ్వుకొనేదెల్ల మా ॥బాగాయ॥

కూడి నే నిను లాలించేది మువ్వ - గోపాల! నీవల గేది
చాడి మాటలు వినేది నన్ను
చౌకచేసి యల్ల సఖిని మెచ్చేదెల్ల మా ॥బాగాయ॥

245 కల్యాణి - చాపు

* మంచి దానవే చెలియ ! - మాటలకును
పంచనకల సఖి యని - వార్త చెప్పకో వస్తి ॥మంచి॥

* యతి - ప్రాస (?)

చెలియ ! నీ నెమ్మోము - చంద్రు డందురు గాని
చంద్రుడై తే చంద్రకళ గావా
సరసుడవు నీవు నేను సరసము లాడంగ
కళ వేళన కళ వచ్చు చంద్ర కళ గానా ? ॥మంచి॥

కమ్మని నీ ముంగురులు - తుమ్మెద లందురు గాని - యేవే
తుమ్మెదలై తే నెగరవా కామాంధకారమున
గతులు రేయి పగలు తామసపు రతివేళ తానెగసి యాడున్ ॥మంచి॥

సఖియ నీ చన్నవలు - సంగటి కొండలందురు గాని
కొండలై తే కోట తలుపులే వేయిక నేమిసేయుదును
మువ్వ గోపాల! యిదిగో పాలిండ్లపై
తర్కించవ రవికముడి తలుపు గాద ॥మంచి॥

## 246. భైరవి - త్రిపుట

మంచి వెన్నెల యిపుడు - మగువ మనకు
పంచ బాణుని కేళి - బాగుగా గూడుండ ॥మంచి॥

బిగువు కౌగిటలోన - పిలికి పిట్టల రీతి
బిగి మీర పెనగుచును - చిగురు మోవాని
సొగసుగా నీమేను - జుమ్మనగ జేసెదను
అగడు సేయక నన్ను - ఆ పనికి లెమ్మనుమీ ! ॥మంచి॥

సన్న జాజులు నీదు - జడనిండ జుట్టెదను
పన్నీరు గంధంబు - బాగుగా నలది
చెన్ను మీరగ గూడి - చికిలిగా తమిరేచి
నిన్ను మది కరగింతు - నిండు పున్నమ నేడు ॥మంచి॥

పలుమారు మువ్వ గో - పాల రమ్మని పిలిచి
మొలక నవ్వుల తోను - ముద్దు బెట్టు నిను
నెలకొని సమరతుల - నేర్పుతో నేలెదను
ఝోలనాగ మోహ తమ - మెల్ల దీరను నేడు ॥మంచి॥



'మగువ తన కేళికా - మందిరము వెడలెన్'

## 247. సావేరి - ఆది

మగవాని కట్టు బెట్ట - మనతరము గాదే!
మగువ మువ్వ గోపాలుని - మనసు తెలియని దానవా ? ॥మగవాని॥

మాటికి నీవే మన్నాను - మర్మము మది నుంచునా ?
బోటి నిన్ను జూడక యె - చ్చోట నైన నుండునా ?
పోటి చేసి వానిపైని - పొగిమాపుల కేమేమో
యేటికీ సేత - లింకనైన చాలు చాలు ॥మగవాని॥

నిన్న రాతిరి వానితో - నీ వాడిన మాటలు వింటే
వన్నెలాడిరో తాళ - వశమా యెవరికైన
అన్నిట నెరజాణ గాగ - నతడు తాళెను గనుక
యెన్నటికీ మాట - లెత్తవద్దూరకే చాలు ॥మగవాని॥

భామరో! మువ్వ గోపాలుడే - పడతి కైన జిక్కేవాడా ?
వేమరు నీ మదిలోన - వెత నొంద నేటికే
ఆముకొన్న ప్రేమచే - నతడు నీ వెప్పటి వలెనే
కాముకేళిని గూడి - కలసి మెలసి యుండరే! ॥మగవాని॥

## 248. మోహన - ఝంప

మగువ తన కేళికా - మందిరము వెడలెన్
వగకాడ! మా కంచి - వరద! తెల్లవారె ననుచు ॥మగువ॥

విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను
కడుచిక్కు బడిపెనగు - కంట సరితోను
నిడుద కన్నుల దేరు - నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున - దడబడెడు నడతోను ॥మగువ॥

సొగసింపొగయని వలపు – సొలపు జూపుల తోను
వగ వగల ఘనసార – వాసనల తోను
జిగి మించు కెమ్మోవి – చిగురు కెంపుల తోను
సగము కుచముల విదియ – చందురుల తోను ||మగువ||

తరితీపు సేయు సమ – సురతి బడలిక తోను
జరుత పావడ చెరగు – జార్చైట తోను
యిరు గడలకై దండ – లిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వ గో – పాల తెల్లవారె ననుచు ||మగువ||

## 249. బేగడ – త్రిపుట

మగువ యింత దుడుకు తగునే వానికి నేను – మగనాల గా దటవే!
నగధరుడౌ మువ్వ గోపాలునికి మేర
నగవు లౌనని దలచి మొగమాట మాడినను ||మగువ||

రమ్మని నా మనవి – కొమ్మని నే నీదు
సొమ్మనుచు వచ్చి – క్రొమ్ముడిలో మంచి
కమ్మని వాసన – గ్రమ్మ విరులు దురిమి
నెమ్మితో దుత ముద్దు – లిమ్మని పిలిచెనే ||మ||

పట్టు పటాని పూల – పావడ సరిగల
బుట్టాల రవశెల్లా – గట్టగా వచ్చి చే
బట్టి పెంజరించి – దిట్టముగా నాదు
గుట్టు జూపు మనుచు – మట్టు మీరి నవ్వెనే ||మ||

ఒంటిగా నే పడక – టింట నుండగ వచ్చి
జంట కుచముల గోరు – లంట నాటి ముసి
పంట మోవి నొక్కి – దంట వగల కళ
లంటి రతుల సొక్కించి – వెంట వెంట దిరిగెను ||మ

## 250. శంకరాభరణము - త్రిపుట

మనవి సేయుగ నేలే? - మగువా! క్రొత్తలా నేడు?
తెను తానే మదిలోనే - దయసేయ వలెగాక ||మనవి||

కలికి కల్పతరువని - వెలసిన నప్పుడే
దలచిన కోరిక స - ఫలమౌను గాని ||మనవి||

కరుణ సాగరుడని - బిరుదు గల్గి నప్పుడే
వరమోహ రత్నముల్ - మరియు నొసగును గాని ||మనవి||

కన్నె నామ నో భావ - మన్నియు దెలిసిన
వెన్నుని కిక మీరు - మన్నింప వలెగాని ||మనవి||

అతిశయముగ ప్రాణ - పతి మువ్వ గోపాలు
డితవుతో నను గూడి - సతము రక్షించు గాని ||మనవి||

## 251. శ్రీరాగం - త్రిపుట

మనసు నిన్నెడ బాయదు ప్రాణేశ!
మనసు నిన్నెడ బాసి క్షణమైన నోర్వదు
మన వాలకించు శ్రీ మువ్వగోపాల! సామి! నా ||మనసు||

మేటి పై జాణి కొంగు జారగ దీసి - గోట గుబ్బల జెనకి
నీటైన బింబోష్ఠము పానము చేసిన-నేటి చిన్నెలనే దలచిమెచ్చి ||మనసు||

కస్తూరి మైనలది - కడు వేడ్క- లలర
నిస్తుగ వీణ మీటి - విస్తారముగా రత్న సరములు నా కొసగి
1 కన్ను పరచి నన్ను కౌగిలించి నందుకు ||మనసు||

1 కుసరించిననాటి - కోలది దలచిన

కేళికా నిలయమున సొంపుగా రతి
కేళి గూడిన సొగసు
మేలిమి తోడను మువ్వ గోపాల సామి
యేలిన నీ వగలు నే నేలాగు మరతును ॥మనసు॥

## 252. గౌళిపంతు - ఆది

మరచి నాడట ! యేమే ? - మగువ హో !
అరమర గలవాసి - అడుగ రాదటె యిప్పుడు ॥మరచి॥

నీళ్ళకు నే బోయినదే గురుతు - నీరటిరేవునను నిలిచినదే గురుతు
గొళ్ళెము మీటినదే గురుతు
గులుకు గుబ్బలు జూపుమని తాగులికినదే గురుతు ॥మరచి॥

వెలది వేడు కొన్నదే గురుతు
వేడుకతో జేతి మడుపు విసరినదే గురుతు
తలయూచి నవ్వినదే గురుతు
బాళి తాళజాల లేనని తా నసినదే గురుతు ॥మరచి॥

పలుగాట్లు మోవిపై నుంచినదే గురుతు
అలుముక మువ్వ గోపాలు డన్నదే గురుతు
చలువదుప్పటి ముసుకే గురుతు
సందుకొని మరుకేళి సలిపినదే గురుతు ॥మరచి॥

## 253. బిలహరి - త్రిపుట

మఱచితివా ? నన్ను - మగువా !
గురు తెరుగవా మువ్వ - గోపాలుడను గానా ! ॥మరచితివా॥

సుదతి యెన్నడు నన్ను - జూడనట్లనేవు
నిదురకు నే గాదా - [1] నేవేళ మిచ్చినది
కొదమ గుబ్బల మీద - క్రొన్నెల లేమాయనో ॥మరచితివా॥

సన్నుతాంగిరో! యెన్ని - జాణతనములు జేసేవు నీ
కన్నెరికము నకు - కంట నరువిచ్చినది
మొన్నగాదటవే నీ - మోవి గంటు చేసినది ॥మరచితివా॥

పాటలాధరి మువ్వ గో - పాల రమ్మని మంచి
తేట ముత్తైపు పేరు - తీసుక గూడిన
నాటి బడలికింకా - నేటికి దీరదు ॥మరచితివా॥

## 254. తోడి – త్రిపుట

మరచె నేమో చెలియ - మాయలో తగిలి
పరమాత్మ మువ్వ గో - పాలు డిందు రాడాయె ॥మరచె॥

మొలక ప్రాయమున - మోహాను నను గూడి
చిలుక తాళిచ్చినది - చిత్తాన లేద
కలికి చిలుకల కొలికి - పలుకు లేలే యనుచు
కులుకు గుబ్బలపైని - క్రొన్నెల లుంచినది ॥మరచె॥

అలగి నే నొక వేళ - అవలిమోమై నప్పుడే
చెలియరో కౌగిటను - జేర్చుకొని చాల
పలుమారు తమి హెచ్చి - బాలరో! రమ్మని
తలిరుమోవిపైని - పలు మొన లుంచినది ॥మరచె॥

నెలత మే మిద్దరము - శయ్యపై పవ్వళించి
వలరాజు మీదను - పదము పాడు కొనుచు
సలలితముగ మదన - సామ్రాజ్య మేలించి
కలసి నను నుపరతుల - కరుణించినదే యిపుడు ॥మరచె॥

1 నివాళి యిచ్చినది.

## 255. నీలాంబరి - [1] త్రిపుట

మాటలచేత దీరునా ? - బోటి
యేటి మువ్వ గోపాలు డేకళి - నోటి

గ్రక్కున రమ్మని విభుని - గదిమి, అంతట
చిక్కించు కొని గోట - జిదిమి, నాదు
అక్కర దీర గుబ్బల రొ - మ్మదిమి, నాని
దక్కి వెనగవలెనని - తమక మున్నది మదిని

పట్టరాని మోహమని - బలికి, అంత నా
గుట్టు విడిచి మీదబడి పై - కురికి

.... .... ....

మెట్టు తాళగ వచ్చునే - యిపుడు నా వంటి చెలికి

బాలరో మువ్వ గో - పాలు డిపుడు నా
లీలలు మది దెలిసె గా - బోలు నన్ను రతి
కేళి దేలించె నాలుగు - జాలు వినవే, ఓ
వాలుగంటిరో కడలి - బోలునా [2] మేలును

## 256. భైరవి - త్రిపుట

మానినిరో ! చేర రమ్మని పిలువని - మాలిమేటి మాలిమే ?
పూని దాని ప్రాయ మనుభవింపగ లేని
పురుషుడేటి పురుషుడే ఓ చెలియా ! ||మానిని||

వెన్నెలు బైట సంగీతము విననట్టి - వేడుకేటి వేడుకే ?
చిన్నెలు మెరయించి చిరునవ్వు నవ్వని - చిత్తమేటి చిత్తమే ?

1 ఝంప 2 (మాలిమి ?)

సన్నుతాంగిరో ! కనుసైగ సేయని యట్టి - సరసమేటి సరసమే ?
పన్నుగ దాని వర్ణింపలేనట్టి
పదము లేటి పదములే ఓ చెలియా ! ॥మానిని॥

విరిపాన్పుపై సోలి వేగింపలేనట్టి - విరహమేటి విరహమే ?
తరితీపుతో జాల తమకమెచ్చని యట్టి - తనువు లేటి తనువులే ?
కరికుంభముల సాటికుచముపై లేని - కరము లేటి కరములే ?
విరిగొన్న విధమున నధరమానని యట్టి
పెదవు లేటి పెదవులే ? ఓ చెలియా ! ॥మానిని॥

నీవే నా ప్రాణ నాయకి యని యెంచని - నెనరు లేటి నెనరులే ?
చప్పరీతి బంధము విధము దెలియనట్టి - చదువు లేటి చదువులే ?
కవులకు బహుమాన మియ్యగ లేనట్టి - కలుము లేటి కలుములే ?
అవునని మువ్వ గోపాలుడు మెచ్చని
1 యందమేటి యందమే ? ఓ చెలియా ॥మానిని॥

## 257. భైరవి - 2 త్రిపుట

ముందటి వలె నాపై నెనరున్నదా ? నా సామి !
ముచ్చట లిక నేలరా ?
ఎందుకు మొగ మిచ్చకపు మాట లాడేవు
ఏరా మువ్వ గోపాల - మేరగాదురా ! నా సామి ! ॥ముందటి॥

పిలువనంపిన రావు - పిలిచిన పైకోవు
పలుమారు వేడిన - పలుకవు
వలపు నిలుప లేక - చెలువుడవని 3 నిన్నే
తలచి తలచి చాలా - తల్లడిల్లులే కాని ॥ముందటి॥

చిన్ననాటనుండి - చేరిన దెంచక
నన్ను చౌకజేసేది - న్యాయమా ?

1 యంగ మేటి యంగమే. 2 అట. 3 నిన్ను.

వన్నెకాడ నీదు - వంచెన లెరుగనా
నిన్నన బనిలేదు - నే జేసిన పూజకు ॥ముందటి॥

కలువల రేడంచు - కంచి వరదా నిన్నా
లలన యింతదూరము - రానిచ్చేనా ?
అలరు విల్తుని కేళి - నలము కొనుచు నన్ను
కలిసిన పాపానికి - కన్నుల జూడ వచ్చితివో ? ॥ముందటి॥

## 258. ఉసేని – త్రిపుట

ముచ్చట దీరదు – మువ్వగోపాల !
గ్రుచ్చి యక్కున జేర్చు – కొనక రేయును బగలు ॥ము॥

మచ్చ కంటి యని మోవి తేనె - యిచ్చలుగా దయజేసిన
మెచ్చి దేవర చిత్తమిచ్చి లాలింపుచు
హెచ్చౌ యుపచారము లెన్నైన జేసిన ॥ము॥

చక్కెర బొమ్మ రమ్మని న న్నాదరించి – మిక్కిలి దయతోడను
దక్కితినీకు దయవాడవనుకొని
పుక్కిటి విడె మిచ్చి చెక్కిలి నొక్కిన ॥ము॥

సరస సల్లాపముల గళలంటి - యురముపై నుంచుకొని
కరుణించి చౌశీతిరతుల నన్నేలిన
మెరసి మువ్వగోపాల మేను నీ సొమ్మనిన ॥ము॥

## 259. యదుకులకాంభోజి - ఆది

ముద్దుబెట్ట [1] లేవురా ! నా సామి !
ముద్దుబెట్టలేవుగా మోము మోమున జేర్చి
అద్దిరో మువ్వగోపాల ! వద్దకి వచ్చేను గాని ॥ము॥

1 లేవుగా.

ఉత్తరము సేయక - తని నిలుప జాలను
గుత్తంపు గుబ్బలను - గుమ్మి కౌగిలించే గాని ||ము||

కంటకము సేయకె - జంట నన్ను బాయకు
అంటిన మోహాన మోవి - జుంటి తేనె లిచ్చేగాని ||ము||

వచ్చి వలపించుచు - గుచ్చి కౌగిలించుచు
మెచ్చగ మువ్వ గోపాల - మచ్చికతో గూడే గాని ||ము||

## 260. కాంభోజి – ఆది

ముద్దులేని వానితోను - ముచ్చట లేలే
నిద్దుర లేవ రాకవే - నే వచ్చే దాన గాను ||ము||

చెలియ వాని గుణము - తెలియ గాదెవ్వరికి
పిలువ నంప వానిపయి - యలిగి యుండె (టి) నా
వలపు నిలుపెక్కడ - చెలియ! జేసియున్నాడు
కలకాలము నీవు నా తో - కనికరము సేయవచ్చేవు ||ము||

ఆము కొన్న ప్రేమ వాడు - ఆకడ జారుకొన్నాడు
నా మీద దయ వాడంటే - నవ్వరా చెలులు
యేమో నాటి చెలిమి - యీ వగల గలుగదె
రామ రామ నాతో యింతగా వ్రోల (?) సేయ వచ్చునే ||ము||

సద్దు సేతురా నీవంటి - సరసు రాలపు
వద్దు మీరి నా యింటనే - వద్ద నొకతె నుంచుకొని

పద్దు లేని మువ్వ గో - పాలునితో పలుకులేలనే ||ము||

## 261. శంకరాభరణము - [1] త్రిపుట

మువ్వ గోపాలా - ముచ్చట [2] లేలా
నా విధి గాని ని - న్నన బని లేదు ॥మువ్వ॥

కడనుండి మాటాడే - గాని యూరక యుండు
తడవాయ వచ్చి యెక్కడికి పోవలెనో ?
విడనాడితి వింతే - విడెమైన నోల్లవు -
జడియకు వీాయాపె - సఖులిందు లేరు ॥మువ్వ॥

మిగుల నెరతు వల్ల - వగమాయలాడికి
నగవు లేటికిరా ? ప - న్నగ రాజ శయనా !
తెగువతో నైన రా - తిరికింటు రాలేవో
పగటి నోటి మాటలకే - పగలాయ గదరా ! ॥మువ్వ॥

ఈవే మెచ్చగ గూడి - యీా జగ మెరుగగ
సేవ జేసినది నీ - చిత్తాన లేదా ?
నా వంటి దాన నె - న్నవు మువ్వ గోపాల
ఆ వనితకు పతమయ్యేవా ? నీవు ॥మువ్వ॥

## 262. [3] కాంభోజి - త్రిపుట

మేరకాదు రమ్మ [4] నవే ! - నా సామిని
మోరతోపు సేయక మువ్వ గోపాల సామిని ॥మేర॥

అలిగే వారలు లేరో - అంతలోనే సమ్మతించి
కలిసే వారు లేరో - కలికిరో యిపుడు
చలపట్టి యిందురాడు చాల మ్రొక్కిన వినడు
వలరాజు బారికోర్వ - వశము గాదో యమ్మా ! ॥మేర॥

---

1 అట. 2 లేలర. 3 శహాన. 4 నమా.

నెనరున నే నొక్కటంటే - నెలత 1 యదే నేరము చేసి
యనరాని మాటలాడి - యలయించెనే !
వనిత మోహాంబుధిలో - మునిగి యట్లోర్చ్వ దాన
తన వంటి సామి కిది - తగవు కాదనే కొమ్మా ! ॥మేర॥

మమతతో చిన్ననాడే - మచ్చిక చేసి నన్ను
సమరతుల నేలినట్టి - చనవుగ నను
గమకించి మోవిపంట - గంటి జేసితినని
రమణి మువ్వ గోపాలుడు - రాక పరాకు జేసెనే ! ॥మేర॥

## 263. సైంధవి — * అట

మేలు మేలురా 2 నిన్ను - మెచ్చ వచ్చురా !
చాలు చాలు నీతో పొందు - సామి మువ్వ గోపాల ॥మేలు॥

ముదితకై తె ముత్యాల సరమా ? య
ల్లది నాకన్న మీా సరమా ? నీవు
పదరి దానికియ్య తరమా భళిభళిరా మేలు (కామి) తరమా ? ॥మేలు॥

అలదానికి జీనా సరిపెనలా - జోరా పొలతితో నే సరిపనులా ! యా
వెలదికి పారిజాతము ననలా వేమా రవ్వరికి లేని మన్ననలా ॥మేలు॥

అతివకు వేయి వరాలా అల్లదియే మోహపు జవరాలా ! బాసి
రతులచే రమియించ చెయిసరాలా -
రమణికి బిరుదు నాగసరాలా ? ॥మేలు॥

## 264. కల్యాణి — ఆది

మేలు వాడనె నిను బాసి - తాళ జాలనే !
మేలుకో మువ్వ గో - పాలు డను గాన ॥మేలు॥

---

1 యందె నెపము చేసి. 2 మరేమి నిన్ను * ఆది.

వద్ద జేరి హాయిలు ముద్దు ముద్దుగ నీ తో
సుద్దు లాడక నెట్లు - ప్రొద్దు బోవునే ॥మేలు॥

మదుపు సగము కోరికి - మమతతో నీ పియ్యాక
పడతిరో కన్నులాన - విడె మింపుగాదే ॥మేలు॥

మునుపటి వలెనె - మువ్వగోపాల రమ్మని
దిన దినము గూడక - తపివి దీరునా ॥మేలు॥

## 265. సావేరి - [1] త్రిపుట

మోసబుచ్చి రమ్మ మగవాని యాడదంట - ముదిత లందరు గూడుక
చేసిన సేతకు మనసు కరగి నేను
చీకాకు పడి యుంటినే ఓ చెలియరో ! ॥మోస॥

అత్త మామ కూతురనగ మ్రొక్కితే పెండ్లి - యానని దీవించెనే !
చిత్తము వచ్చిన మగని దెచ్చెద గాని - సిగ్గేల లెమ్మనెనే !
గుత్తంపు గుబ్బలు వట్టువ తొనసి - కొనగోర నొక్కి జీరెనే !
పొత్తుకు రమ్మని చేపట్టి ననుదీసి
బువ్వము దినిపించెనే ఓ చెలియరో ! ॥మోస॥

రామరో ! రమణు డూర లేడు - రమ్మన్న పడుకొంటినే
భామరో ! ప్రొద్దు బోదు మోవిపంటి - పానము సేతా మనెనే !
కోమలి యిద్దఱ మాడవారైతిమి - కోరిక దీరదనెనే
యేమరి నే నిదుర బోవగ జూచి
యే మేమో సేయ జూచెనే ఓ చెలియరో ! ॥మోస॥

నిదుర కంటికి రాదు మగ పనులు సేతామా - నెలత యిద్దర మనెనే !
ముదితరో అంతలో నాడ దనుచు వాని - మొనసినే పైకొంటినే !

---

1 అట.

వదలకుండగ బిగి కౌగిట లీయమై - వంచన తనమునను
కదసి మా మువ్వగోపాలుడు తానని
కళలంటి నను గూడెనే ఓ చెలియరో! ॥మోస॥

## 266. బిలహరి - ?

మోస బోదునా వానికి నేడు - మోస బోదునా?
మోస బోదునా నేటి మువ్వ గోపాలుడు
ఆసలాడి నన్నలయించ జూచెనే! ॥మోస॥

కోరిక మీరవాని వేడుక కొంకక - గోరువంక దెమ్మన్న నేగి
కూరిమి నాచెలి గోరువంక తెచ్చి
సారెకు చెక్కిలి చూపెను నాడు నే బాలగాన ॥మోస॥

పలుమారు నా చేతి యుంగరాని కొక్క బలుకెంపు వేడిన దే బోయి
అలదాని పలుకెంపు అతివ తెచ్చినని
పిలిచి తన మోవి జూపెను నాడు చిన్నదాన! ॥మోస॥

విరిబోణి! ఆసతో సరిపెనలు వెలది యిపుడె దెచ్చెనని
సరసుడౌ మువ్వ గోపాలుడు సమరతి యేలి యిదె
సరిపెనలని నవ్వెను, నే కోదమ గాన ॥మోస॥

## 267. కాంభోజి - ఆది

మోస మాయెనే నా బుద్ధికి మోస మాయెనే
మోస మాయె నేమి సేతు - మువ్వ గోపాలుడు నేడు
మ్రొక్కి వేడిన రాడే ఓ చెలియా! ॥మోస॥

అందరికి చల్లనైన చందమామ నా పాలిటి
కసల మాయె నయ్యో చెలియ!
ముందు నే నెవ్వరి పొందెడ బాపితినో
అందుకు నే నీలాగైతినో, ఓ చెలియ! ॥మోస॥

వలవల నా కన్నీరు వెల్లువలాయ నేటికే
వెలది మోము జూచితినో చెలియ !
అలసి మువ్వగోపాలుడు అనిశము
ననుగూడి యలసటలను బెట్టునో చెలియా!
చిలుక పగసాధించెనే దీని బెంచిన
చేతు లెట్టువంటివో చెలియా ? ॥మోస॥

యే ప్రొద్దు ప్రాణ విభుల నెడబాయని యింతు
లెన్ని నోములు నోచిరో చెలియ !
దాపున గూడున్న విభుని దవ్వుల బెట్టు చెలులు
నా పాల గలిగిరో, ఓ చెలియా ! ॥మోస॥

## 268. ఘంటారవము - అది

మొక్కెను 1 జాగు సేయకువే, మా
చక్కని మువ్వ గోపాలుని తోడితేవే !
యెక్కువైన ప్రాణ సఖి నీవే యని నమ్మితి
2 నింత యుపకారము సేయవే ? ॥మొ॥

కాయజు బారికి తాళ జాల నీవు నన్ను - కాచి రక్షింప నిదియే వేళ
ఓయమ్మ పోరి చూపులే మేలా యీ సమయాన
నోదవని చెలికత్తె లేలా ? ॥మొ॥

వేడుకొన్న నా పై దయలేదా, అయ్యో నా పాలి
విధి నా మనవి విన్నవించ 3 దా నీ
ఆడ బుట్టువు బుట్టలేదా విరహ వేదన
యతివ నా వలె నీకు గాదా ? ॥మొ॥

1 జాగుసేయక లేవే. 2 నింత. 3 నీదా.

ముదితరో నే నున్న తెరగు, విన్నవించితే
మువ్వ గోపాలుని మనసు కరగు
మొదలు న న్నేలిన మోహ మెరుగు మాట లేటికి
మువ్వాటికి జొచ్చితి నీ మరుగు ॥ మొ॥

## 269 తోడి - ఆది

మ్రొక్కెర చలమేల : - మువ్వ గోపాల !
అక్కరతో నీ కౌగిట - నలము కోర ! యీవేళ ॥ మ్రొక్కెర॥

అరుదు గాదా ? నీ మేలు - అలిగేది యీపాటి చాలు
సరసమాయె నెమ్మేలు - చాడి వింటివి గాబోలు ॥ మ్రొక్కెర॥

మారు డేసె పూవు దూపు - మనవా యింతైన రాపు
కోరి యున్నాను నీ ప్రాపు - కోపమైతే యెంత సేపు ॥ మ్రొక్కెర॥

నన్ను నేలితివి చాలా - ననవిల్తు కేళిదేల
మొన్నటి చల మిక నేల - మువ్వ గోపాల యీవేళ ॥ మ్రొక్కెర॥

## 270. కేదార - 1 త్రిపుట

రమ్మనవే ! సముఖాన — రాయభారము లేలే ?
కమ్మ విల్తుని గన్న చ - క్కని మువ్వ గోపాలుని ॥ రమ్మనవే॥

సొగసు జేసుక వచ్చి - సుదతు లందరు చూడ
వగలు చేసి తల - వాకిట నిలిచి
తెగనాడే విధమేమో - దినదినము క్రొత్తలాయె
యిగురు బోణిరో ! వచ్చి - యెంత సేపాయెనో ॥ రమ్మనవే॥

ఇరవంద నిన్న మా - యింటివరకు వచ్చి
తిరుగ వేంచేసె నట - సరి ప్రొద్దువేళ

1 ఆది.

విరిబోణు లెవ్వరో - వేళ గాదనిరట
తరుణిరో! మే మెంత - దొరలమా? బాగాయ! ||రమ్మనవే||

రాముఁడో! తానెన్నఁడు - రాలేదో! పోలేదో!
కాము కేళిని! సన్ను - గలయ లేదో!
యేమే నే నందాక - యెదురుగా రావలెనో!
మా మువ్వ గోపాలుఁడు - మనసు శోధించె నేమో? ||రమ్మనవే||

## 271. ఆహిరి - ఝంప

రామ రామ ప్రాణసఖి నెడబాసి - రాముఁడెటువలె దాళెనో? ముందు
తామరసాక్షిని దలంచితే నా గుండె
తల్లడం బందె నే మందు నయ్యయ్యో! ||రామ||

కలికి చిలుక పలుకు లీలాగున నతనికి - కర్ణశూలములై యుండ లేదో
నెలరాయ డతని పాలిటికి నీలాగున - నిప్పుల కుప్పయై యుండ లేదో?
తెలియకను రాతిరి పగలు నీ తీరునను
దిగులు మదిలో దోచదాయ నేమో?
చెలియ నెడబాసి నప్పటి నుండి నా మనసు
చిందర వందరై యున్న దయ్యయ్యో! ||రామ||

మరుడు పగవాడగుచు నీలాగు నాడల్ల
మనుజేశు నలయించ డాయె నేమో?
కెరలి యీ గండకోయిల నాద మీలాగు
ఖేదమై యతని బాధించ లేదో?
విరివిగా నాతని కాహార నిద్రాదులును
విరసంబు గాక నింపాయ నేమో?
విరిబోణి 1 నెడ బాసి నది మొదలు నే నిట్లు
వెడవిల్తు బారి పాలైతి నయ్యయ్యో! ||రామ||

1 నే చే బాసినది.

వేమారు నా వలెను దన సతికి నాతడును
వేడగను నమ్మికలు నియ్యలేదో?
కామినీమణి వద్ద లేనప్పు డతనికి
కనుగవల నీరిట్లు గ్రమ్మలేదో?
తామసపు ప్రేమ చేత నతడు నా వలెగాక
ధైర్యంబు దెచ్చుకొని యుండెనేమో?
కామించి నను మువ్వ గోపాల రమ్మనుచు
కలసిన చెలి కనుల గప్పె నయ్యయ్యో? ॥రామ॥

## 272. శంకరాభరణం - చాపు

రాయబార మంపినాడేమొ - రానురాను నేను రాను
మాయదారి మువ్వ గోపాలుని - మాట నమ్మరా దన్నిటికి ॥రాయ॥
గడియ కొకరితో సరసము - గడుసు వగలైతే చాలా ఘనము
నడక చూచితే వేరే వితము-నాలుకపై యుండు నమ్మితము ॥రాయ॥
చిత్త మొకరి మీద నుండు - చిరునవ్వు నవ్వుచు నుండు
బత్తి గలిగినట్లు యుండు - ప్రాణ మేలాగున నుండు ॥రాయ॥
తొలుత గూడిన కూటమే చాలు - దోస మేచని దేటి మేలు
చలపాది మువ్వ గోపాలుని-సరసమే చాలు చాలు పదివేలు ॥రాయ॥

## 273. పంతువరాళి - త్రిపుట

రార! మాయింటికి రాతిరి నిన్ను మా రామ ర మ్మన్నదిర!
రార మా రమామణి నీకు రాయబార మంపినది
తేర నినుగోరి మరులూరి యున్నదిర ॥రార॥

తళుకు చూపులు గల మొలకరా! యది నీకు
తగి యున్నది మరుని చిలుకరా!
చెలువుడ నీ పీవల పలుకురా! మా
కలికి నీ పై మరు లులుకురా! యీ వేళ ||రార||

మంద గమనను పేరు జెందెర ఆ నెలత
యందము జూచి పై కొందు రారా!
చందము గాదికె సుందరాకార మా
సుందరాంగి నీ కెదురు చూచు చున్నదిరా! ||రార||

బాల పాన్పున విరులు పరచి యున్నదిరా!
శ్రీలోలా! నీ కే పూలమాల గొన్నదిరా!
వాలు గంటితో చలమేలరా? మువ్వ గోపాల!
యేలరా? తడవేల చేసెదవురా! ||రార||

## 274. కేదారగౌళ - ఆది

రార రార 1 యింక - రాపు జేయక
కోరి యున్నాను మువ్వ - గోపాల! నీకు మ్రొక్కెను ||రార||

తేరి జూచి మాటాడితే - తేనెలు జిందునటర
కూరిమి గోరంత లేక - కోపగించేవు
చేరి నే నెంత వేడిన - చిత్తమేల కరగదు
సారసాక్ష! యిదేటి చలము - చాలు చాలు యీ వేళ ||రార||
ఎందాక నన్నే చేవురా - యెంత సేపని తాళుదురా?
మంద బుద్ధివై నేడు నా - మాట వినవు
చిందర వందర లయి మనసు - జెప్పినటు చేయదు
నందగించి కౌగిట - నలము కొందువు గాని ||రార||

1 యింత.

పంచబాణుని కేళిని లా - లించి నన్నేలి తిపుడు
మంచి వేళ గాగా నేమో - మక్కువ మీర
వంచనతో నీ మనసు - మళ్ళించు కొని యింతలోనే
మించి నాపై లేని నేర - మెంచక మువ్వగోపాల! ॥రార॥

275. కళ్యాణి - ఆది

రా రా! సామి రా రా!
రా రా! నా వలపు - వారక మించె నా సామి! ॥రారా॥

ఎంత సేపని తాళు దానరా మోహ - మింతన రాదు నీ యానరా!
చెంత జేరి కెమ్మోవి యానరా నన్ను
చింతల బెట్టేది మానరా నా సామి! ॥రా రా॥

ఏరా నీకు పగ దాయనా చూచి - యేలే టంత పాటి లేదాయనా!
చేరి నీ పదసేవ జేయనా యిపుడు
చిన్ననాటి కూటమి పోయనా సామి! ॥రారా॥

కూడితి విక దయ వుంచరా మువ్వ - గోపాల నా మోహ మెంచరా!
వేడు కయ్యాని కౌగిలించరా నన్ను
వింత సేయక గారవించరా నా సామి! ॥రారా॥

276. కల్యాణి - ఆది

రా రా! నా సామి రా రా!
రార! రాపేల జేసేవు - రార! నా సామి! ॥రారా॥

ముందు నను గూడి నీ - విందు రా కిపుడు వచ్చి
సుందరాంగ! నన్నేచు - టందమా? యిందరిలో ॥రారా॥

ఎంతసేపని తాళు దానరా - యింత పరాకు జేసితే
సుంతైన దయ జూడవా - సుదతి బోధన గాబోలు ॥రారా॥

వంత మేల నాతో - కంతు కేళి గూడరా
వంతల బెట్టకిక ము - వ్వ గోపాల సామి ! ॥రారా॥

## 277 సావేరి - త్రిపుట

రా లేదు పొమ్మనవే ! ఓ చెలియ యీా
వేళ తిరువళ్ళూరి - వీర రాఘవునితో ॥రా లేదు॥

పదములకే మ్రొక్కితి - భావము దెలుసు కొమ్మంటె
నెదుటనే నిలిచిన - నేల దయ రాదంటి
కదసి నే నిక నీకు - కైదండ లిచ్చేనంటి
మదిరాక్షీ ! అందరిలో - మనసు విడ నాడెనే ॥రా లే॥

చేరి నే నిక నీకు - సేవ చేసెద నంటి
నీరజాక్షుల నంపక - నేనే వచ్చితి నంటి
వారి వీరి వలె నాతో - వాదులు సేయకు మంటి
ఊరక నేరమేల చేదివ్వ లెడనీవు (?) వృథా లె రేయి పగలు ॥రా లే॥

కోరిక దీర్చేటి మువ్వ - గోపాలుడనుకొంటి
వీరరాఘవ ! నీకు - వింతదాన గానంటి
వారిజాక్షి ! యుపరతుల - వాని గూడెదనంటి
యీా సరస మేల వద్దంటి - యెన్ని నేర్చుకొన్నానే ॥రా వే॥

## 278. ఆనందభైరవి - త్రిపుట

రేపు వత్తువు గాని పోర ! నేటికి తాళి - రేపువత్తువు గాని పోరా !
రేపువత్తువుగాని గోపాలనాసామి - రాపు చేయుట మేలా ? ॥రేపు॥

రాతిరి పగ లొక్కటీరు నిను - రమ్మంటె మాయింటి వారు
మాతులు బ్రదిక్పేరు - మొన్న వచ్చితివని
వాంతెర తడవాయె - వద్దు నేటికి తాళి ॥రేపు॥

మరు నాడె నన్ను గూడితివి - మరు కేళి కలసి నను మెచ్చితివి
మరియాద కలిగిన దొరబిడ్డ నీ వైతే
తెరచి చూడర తలుపు తెల్లవారెను తూర్పు ॥రేపు॥

రాపుసేయక నాతో పోర! నన్నే - రతినేలిన మువ్వగోపాల?
కోపగించ పొయ్యేవూ - కొసి వాయిసి నన్ను (?)
తాప మణగ లేదా - దయతో గలసి పోరా! ॥రేపు॥

## 279. సావేరి - [1] త్రిపుట

లేమరో! మా మువ్వ గోపాలు డెందైన - లెస్సయుండితే చాలునే!
వేమారు దూరేది తగవా? భావిలో నీరు
వెల్లువ బొయ్యీనటవే? యెంతటి దిటవే ॥లేమరో॥

నా పుణ్యము చక్కనైనా నాటిదినము లెల్ల - నన్ను చేపట్ట లేదా?
యీపట్ల విడనాడె వెన్నెల చీకటి
యెవరికైన లేదా? వానితో వాదా ॥లేమరో॥

పలుమారు నా వెత జూచి నొచ్చిన నోట - బలుక బొయ్యేరు సుమ్మీ!
అలగి వీరా చేతనే నాడించినట్టైతే
నతని మనసు నొచ్చునే యేమి వచ్చునే ॥లేమరో॥

కన్నెరో నను గూడి కౌగిట లీయమైె - యున్న మువ్వ గోపాలుడు
వెన్నవంటి మనసు రాయి చేసుకొన్నాడు
విడనాడి యిందు రాడు మోము జూడడు ॥లేమరో॥

## 280. [2] కేదారగౌళ — ఆది

లేమరో! యూరకే పవ్వ - ళించి యుంటివే
మా మువ్వ గోపాలుని కే [3] - నీమాటి బోధించెనే
ఆమాటేమియు లేక - అతడా కడ నే నీ కడ ॥లేమరో॥

1 అట. 2 యమునల కాంభోజి. 3 తోయే.

వడి వడి కోపముతోను - వచ్చి ముసుకు బెట్టుకొని
పడకింటిలో మాటాడక - పవ్వళించెనే!
విడమియ్య నే బోదుగదా - విదలించి వేసె, నందుకు
నుదుర నోరాడక యిది నా - నోము ఫల మనుకొని ॥లేమరో॥

మెదలితే శయ్యపై తనమేను - నా మే నంటునని
ముదిగి తా మంచముకోటి - యొర జేరెనే!
కదిసి నా కౌగిటలోనే - నదముక మోవానబోతే
ఉదిరి లేచి పొయ్యానని - పదరేది మేర గాదని ॥లేమరో॥

అలగి యున్న విభుడెప్పటి - యలవాటున నాయందు దిరిగి
కలికి! సిదుర పరాకేమో - కౌగిలించెనే!
సలలితముగ నే నవ్వుడు - సందు కొని మువ్వపురి
నిలయునితో గలసి - నేను నతడు నవ్వుకొని ॥లేమరో॥

281. ముఖారి - చాపు

వచ్చిన నేమి రాకున్న నేమి - వనితరో! నీవద్దికి
ముచ్చట దీర మా మువ్వ గోపాల! రా రాయని
మోవి యాన నిచ్చేవో చెలియ! ॥వచ్చిన॥

చేర దీసేవో యిందు రమ్మని - చెక్కు నొక్కేవో?
వారిజాక్షి! నీపై - వలచిన వాడని
గారవించేవో? రమ్మని నన్ను - కరుణ జూచేవో?
నేరము లెంచేవు - నెనరు లేని చోట ॥వచ్చిన॥

ఛిత్త మిచ్చేవో? దేవుడని - సేవ చేసేవో?
పుత్తడి బొమ్మ! నీ - పొందు గోరిన నన్ను
పొత్తు జేరేవో మరునివేతి - పోరు దీర్చేవో?
మత్తురాలవు నీ - మాట నమ్మి యిందు ॥వచ్చిన॥

మనవి వినేవా? బాగాలిచ్చి - మరుపాసం గేవా?
మునుపటి వలె న - న్ననసి నోరునిండ
ముద్దు పెట్టేవా నా మదిలోని — మోహా మెంచేవా?
నను మువ్వ గోపాల! - యని లాలించేవా! ॥వచ్చిన

## 282. ఆనందభైరవి — ఆది

వచ్చేనని రాక పోయెనే ఓ యమ్మ! నాపై
వానికింత దయ లేక పోయెనే!
విచ్చల విడిగా నేడు మువ్వ గోపాలుడు
మచ్చిక తోడను మాటలాడి యిపుడు ॥వ॥

ఇంత ప్రొద్దు వాడు రాక - యెదురెదురు చూచి యిట్లు
చింతింప వలసె నేటికి - చిక్కితి మున్మాటికి
సుంత సేపు నా వద్ద - సొంపుతో నుండక పోతే
కంతు తాపమెట్లు దీరునే - కలికి తెచ్చే వారెవ్వరే? ॥వ॥

పలుక నేలే నేను వాని - పక్క జేరి నిమిషమైన
పలుక నీయవు దాపురము గా - భామ వాడు వచ్చిన
చెలువుని జూచి మోహించి - చేకొన దేవతే యున్నదో?
తలచి తలచి విరహమున - తల్లడిల్లు చుండ నాయెనే ॥వ॥

వామాక్షి సత్యపురి - వాసుదేవు డలనాడు
నా మనసుదెలిసి గూడి - నమ్మిక లిచ్చెనే!
ప్రేమలన్ని మరచెనో - ప్రొద్దు బోయె నిందు రాడు
యేమి నేరము లెంచెనో - యిక నేమి సేయుదు వాడు ॥వ॥

## 283. పంతువరాళి — ఝంప

వచ్చే మనసో? రాని మనసో? - వనిత నీవే దెలుసు కోవే?
అచ్చట కంచి వరదు - డాడిన మాట లివిగో ॥వచ్చే॥

మొదటనే బిలిచితే - ముదిత ! నీ వెవ్వరనెను
కదసిన దాన నంటె - కన్నీరు నించెను
ముదమున నీ వంపిన - ముద్దు టుంగర మొసగితే
సదయుడందుకు వద్ది - సకియ కేల నుంచెను ॥వచ్చె॥

తొలుతటి మమతలు - చెలిమి లాలన వగలు
వలపులు వక్కణ జాబు - వ్రాసినదని
పలుకరించి వాని - పాదముల చెంత నుంచగ
నలివేణి ! తా చదువుక - నసురుసు రనే ॥వచ్చె॥

ముద్దు మువ్వ గోపాలుడు మన - మిద్దరిసి భ్రమయించి
యుద్దమరేయి నన్ను - సద్దు సేయక నేలి
దిద్దిన సైగనే - దెలియ జేసి నంతలో
ముద్దియ దయ మఱువకు మని - ముమ్మాటి కను మనెను ॥వచ్చె॥

## 284 కాంభోజి - [1] త్రిపుట

వదరక పో పోవే వాడేల వచ్చీని - వద్దు రా నద్దనవే !
అది యొక్క యుగము వేరే జన్మ మిపుడు
అతడెవ్వరో నే నెవ్వరో [2] ఓ చెలియా ! ॥వదరక॥

నిచ్చ నిచ్చలు నేడే వచ్చీని రేపైన - వచ్చీ ననుచు మదిలో
నిచ్చగా బలువేడి నిట్టూర్పుల చేత - సింతిరో పెదవు లెండి
హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రులు
యెన్నెన్నో గడపితి నిక నేటి మాటలే ? ॥వదరక॥

వలపు కాడిదే కదా వచ్చుననుచు దెరు - వులు జూచి వేసారితి
నెలలెంచి యలసితి నిలుపరాని ప్రేమ - నెమ్మది నడచుకొంటి
కలకంఠ [3] శుక నాదములు వించు మధు మాస
ములు గడిపి తీ వట్టి ముచ్చట లికనేలే ॥వదరక॥

---

1 అట. 2 తో. 3 ఖక.

భామరో! శకునము లడిగితి మువ్వ గో - పాలుడు వచ్చు ననుచు
కామించి నాథుల గలయు చెలుల జూచి - కరిగి చింత నొందితి
రామ! రామ! యీ మేనితో నిక నాని
మోము జూడవలెనా మొదటి పొందే చాలు ||వదర||

285. ముఖారి - అట

వద్దె తల్లి తిరమె?
పొద్దు బోయిన దాక - సుద్దులె తలబెట్టుక ||వద్దె||

చిప్పిలు మోవి తేనె నాన నిమ్మని - చేతులెత్తి మ్రొక్కగాను
నొప్పగా మరుకేళి - కెప్పు డెప్పు డనగా
నప్పుడె నా రవిక ముడి - విప్పగాను దెలియ లేక ||వద్దె||

అయ్యాలు తాళవేని నీ కౌగిట జేర్చి - అనుకొమ్మని అడగ గాను
నియ్యానని యిక తమి - నిలపలే ననగాను
అయ్యయో! నే కనుగీట - యదర వేసిన దాక ||వద్దె||

నగుచు మువ్వ గోపాలుడు మీ రందుబోతె - చిగురు విలుకేళి గూడి
మగువరో! యీ చెలులు - సాగ మాలిన వారనగా
మగువా! నీ మనసు జెలసి - మరి నే పొమ్మన్న దాక ||వద్దె||

286. ఘంటారవము — ఆది

వన్నె కాడిందు రాగానే - వద్ద నేరమ్మా!
కన్నీరు చెలులకు - పానకము కాబోలు ||వన్నె||

అందముతో మంచి మాట - లాడుచు నుంటె
నందరు నా వంటి వార - లని యుంటినమ్మా!

ఇందుముఖ ప్రాణేశు - నెడలు జేసిన [1] దనుక
కందువతో నిందుకే - కంకణము గట్టిరే ॥వన్నె॥

నెనరుతో నాయింట - నే యున్నాడని సారెకు
మనసు విరుగ వలెనని - మంచలింతురే
వనిత వారి మాటలు - వినవైతి నమ్మ జెల్ల
కినిసి కలవి లేనివి యే - మని బోధించిరో ? ॥వన్నె॥

పలుమారు మువ్వ గో - పాలుని నేను
కలసి తన జీవము - వలె నుంటి నమ్మా !
మెలత లందరికి నా - మేలు, కనులకు వెగటై
చలపట్టి వారేమి - సాధించు కొనిరో ? ॥వన్నె॥

## 287. మధ్యమావతి - చాపు

వలచిన వాడనే నీ మీద చాల
కులుకు లాడి ! మువ్వ - గోపాలుడనె భామ ! ॥వల॥

నినుబాసి కంటికి నిద్దుర రాదు - నిమిషమైన గాని ప్రొద్దు బోదు
యెనసిన మరుబారి కోర్వగ రాదు
యిక నా తమి నిలుప వశము గాదు ॥వల॥

బాళి నెంతో తరుణి యీవేళ
తాళ లేను నాపై దయ దాచిన మేల ?
చాల నన్ను కరుణించి లీల నేలుకొమ్మంటె నీ జాగు లేల ? ॥వల॥

పట్ల [2] దయలేక యిటువలె నీవు - పాపజాతి మరుని పాలు జేసేవు
కోపగించి నెనరు గొసరిన రావు
కొమ్మ మువ్వగోపాలుడని కౌగి లీవు ॥వల॥

1 దాక. 2 తెలియలేక.

## 288. పున్నాగవరాళి - త్రిపుట

వలపనే దెటువంటి - వస్తువో తెలియదే
తలిరుబోణి! మువ్వ గోపాలుని
తచ్చనలకే లోనైతినే
తాళజాల నేమి సేతునె? అమ్మయ్యా! ॥వలపనే॥

కన్న విన్న మేలు గా - దున్న చోట నుండనీయ
దన్నము హితవు గా - దదేమో ప్రొద్దు పోదు
కన్నెరో! వలపు నన్నింతగా జేసెనో? లేదో?
కట కట తాళ నా వశమ. అమ్మయ్యా! ॥వలపనే॥

రేయు పగలు నిద్దుర లేక - రెట్టించి వానిపై ప్రేమ
ఓ యమ్మ! మించెనె తమి - యోర్వ నా వశమా?
మాయగాడు మువ్వగోపాలుని - మచ్చికలకే లోనైతి నేన
గాయకము తెలియ నైతిని అమ్మయ్యా! ॥వలపనే॥
కలలో మెలకువను వాని - కలువరమే గాని
చెలులతో మాటాడనా - చిత్తము రాదె
అలవాటు లేని మోహము గాకనె
అయ్యయ్యో!, యేమి సేతునే? అమ్మయ్యా! ॥వలపనే॥

## 289. [1] పంతువరాళి - చాపు

వలపు దాచ నేరనే యో భామ! - వారి వీరి వలెనే
తలపు తన మీది బాస లిచ్చి చాల
[2] తరితీపు చేసినాడే ఓ భామ ॥వలపు॥

ఇదిగో వాడు వాకిట వచ్చెనని వింటే - ఎదురుగనే బోదునే!
పదరక చేలాగొసగి తోడి తెచ్చి - పానుపుపై నుంతునే!

---

1 ఘంట - ఆట. 2 తర్ఫీదు.

ముదమున వాని రొమ్మున గుబ్బ లానించి – ముద్దు బెట్టు కుందునే!
అదనుగ నుతిచేసి బాగా లిదిగో యని
యాకు మడుపు లిత్తునే! ఓ భామ! ॥వలపు॥

తిలకము యందము మీర నా కొనగోట – దిద్ది వేడుక జూతునే!
బలిమి సుగంధము పన్నీట మర్దించి – బాగుగ నలదుదునే!
సొలపున వానిపై పదము బాడి వీణ – సొలపుగ మీటుదునే!
పలుమారు నా మీద దయ యుంచుమని వాని
పాదము లొత్తుదునే! ఓ భామ! ॥వలపు॥

మోసబుచ్చి నన్ను మువ్వ గోపాలుడు – మోము జూపకున్నాడే!
వాసి దానని తెలిసి తెలియలేక – యాస లూరగ జేసెనే!
రోసము నిలువ బెట్టుల తాళుదునా – దోసకారిని గూడెనే!
మీసము గల మగవాని వలెనే వచ్చి
మీసరమున నేలెనే! ఓభామ! ॥వలపు॥

290. భైరవి - త్రిపుట

వలపు నిలుప నాదు వశము గాదే మిసెతు – వనితరో! యీ వేళ
ఓలతిరో మా మువ్వ గోపాల రాయడు – వలము చేసినాడు ॥వలపు॥

చలువ గంధము విరుల సరము లేలే సొమ్ము లేలే?
సొలపైన మా సొగసు జూచే వా రెవ్వరే?
చెలియరో! నే డది చెప్ప సక్కెము గాదు
వలపైన యీ పాపము వద్దే పగవారికైన ॥వలపు॥

చిలుక తేజీపై నెక్కి, చెలరేగి యెదురెక్కి
విలుగుణ ధ్వని చేసి విరిశరము బూని
కులుకు గుబ్బల నడుమ గురిజూచు చున్నాడే
అలరు విల్తుని బారి నార్చే వారెవ్వరిక ॥వలపు॥

సరసుడు రాడాయె సర్రిపొద్దు వేళాయె
విరహము మెండాయె వెన్నెల కాకాయె
మరుని కేళిలో నన్ను మువ్వ గోపాలుడు
సరసముతో పెనగి చౌక చేసి నాడిక ॥వలపు॥

## 291. పున్నాగవరాళి - ఆది

వా డిచ్చిన సొమ్ము లేల 1 వద్దంటి
నేడు యీ మాటలు వింటే - సిను నవ్వరా చెలులు ॥వాడిచ్చిన॥

హితవు గూర్చి నీతో - యింత కోపము వద్దని
బతిమాలే సఖులు నీ- పాటి గారా
అతివ వాని చేతు - లంటిన నీ గుబ్బలు
న్నతములై నీ రొమ్మున ను - న్నది యిందు కేలాగే ॥వాడిచ్చిన॥

నవనీతము వంటి మ - నసు రాయి జేసుక
యెవరు దెల్పిన కన్ను - లెఱ్ఱ జేసేవు
అవునె యిన్నాళ్ళు వా - డానిన కొమ్మోవి
కువలయాక్షి యుంచేది - కొడువ గాదటవే ॥వాడిచ్చిన॥

కోరి నిన్నేలిన మువ్వ - గోపాలు డిందు వచ్చి
నేరములు గాచి మ — న్నించు మనిన
అరుదూరు జేసేవు - అతడు సంతరించగా
మీరి యున్నట్టి దా - మేనేమి చేసేవే? ॥వాడిచ్చిన॥

## 292. ఉసేని - త్రిపుట

వానికి నే నేల వలచితి నిటువంటి - వాడని తెలియకను
నే నెప్పు డూరిలేని ఆనన్నై నందుకు
పూని యెవ్వరికైన దూరుకొన నేలే? ॥వానికి

1 వద్దంటివి.

అలరు శయ్యపై వె - న్నెల బైట నుండగ
చెలినెట్ల సైగ చే - సితివిరా! యంటె
అలివేణి! యిట్లందు - వనిగదా యూరకే
నలదాని రమ్మంటి - నని బొంకు లాడెనే! ॥వానికి॥

నెనరుతో నా యొద్ద - నే యుండి దాని ర
మ్మనని ముద్దు లిడుకొంటి - వని నే నడిగితె
నిను జూచి చూచినా - కను లిరులు గ్రమ్మె యా
వనిత నీ వని యుంటి - నని బొంకెనమ్మా! ॥వానికి॥

కూరిమి మా మువ్వ - గోపాల! నే జూడ
సారసాక్షిని యెట్లు - జేరితివంటె
వారిజముఖి యీ లాగు - జేరితినని తనివి
దీర సారెకు రతుల - దేలించె నమ్మా? ॥వానికి॥

## 593. ఆనందభైరవి - (?)

వింటివా? అలదాని మాట - వింతలయ్యీనె!
అంటె అనవలె తానే - ఆడదైతే యిట్లాడునా ॥వింటివా॥

చల్లని మనసు దానవై - వల్లభుని యెన్నిట మెప్పించి
ఉల్లము రంజిల్ల మోహా - ముప్ప తిల్లగా
యల్లపుడు తన కౌగిటిలో - అల్లాడ సియ్యగా జేర్చి
అల్లి బిల్లిగా నుంచకనే - అతనెట్లా వెళ్ళ నిచ్చెనే! ॥వింటివా॥

సకల కలా వల్లభుని - సమ్మతించే (?) సఖులెవ్వరే
వక నాతిని గాన నిపుడు - వనిత యీ చాన
అకట అతని సొమ్మంటె - అందరు నవ్వరా ఓ చెలియ!
ఎకసక్కె మాడితేను - యెక్కువ దనేరాభువిలో ॥వింటివా॥

చెలియా ! మువ్వ గోపాలుని - కలయకుండే చెలులెవ్వరే ?
యిలలో వలరాజు బుట్టుక - యీపె కోసమా
నెలత లందరికి యిటుల - వలపించు కొన్నాడటవే ?
తెలియ నౌనా దాని మాయ - తెలియదు పో పొమ్మనవే ॥వింటివా॥

294. యదుకులకాంభోజి - త్రిపుట

విందు బూచితిరిగినే - తిల్లగో విందుడిందు వచ్చెనేమో
యిందువదన ! యింటి - ముందర నెంత వింతగ ॥విందు॥

కులుకుచును పాల - కుడిగి తిరిగినే
కల కల మనుచు పైడి - గంట పలికినే
మొల నున్న నెరికోక - ముడి యిప్పుడు వదలినే
యిలలోన నీ శకున - మెవరి కయ్యా నమ్మా ! ॥విందు॥

జక్కన [1] గుబ్బలు - చాల యుప్పొంగినే !
చక్కెర వంటి కెమ్మోవి - సారె కదరినే !
మక్కువ సందటి దండలు - మాటి మాటికి బిగిసినే
పక్కన తోరణ గాళి - పలుమారు బలికినే ! ॥విందు॥

తలచి నట్ల నేడు - దైవము తోడయ్యానే !
కలికిరో ! యిది క్షేమ - కారి యయ్యానే !
యెలమి నీ వామభుజ - మిప్పుడి దిగో యదరినే !
పలుమారు మువ్వ గో - పాలుడు నిను గూడినే ! ॥విందు॥

295. ముఖారి - ఆది

విడు విడు మమ్మ ! యిదేటి సుద్ది ?
పడతింటికి పోలేదని - బాస చేయించు కోవలె ॥విడు॥

---

1 జక్కవ (?)

కద్దు కద్దనిపించే దాక - కట్టినదే దానికోక
సుద్దులు బల్కి యిందాక - సుదతింటికి వచ్చే రాక ॥విడు॥

ఎదిరించితే కాదనేరు - ఏటికే, యీ యారుదూరు
వదిలేది కాదు నా తీరు - అదిగోనె చెక్కిట గోరు ॥విడు॥

మును నన్నేలినట్టి మేటి - మువ్వ గోపాలు డెప్పాటి
దినదినము నాతో సాటి - వనితలలో నేటి పోటి ॥విడు॥

## 296. కాంభోజి - [1] త్రిపుట

విన వైతివి గదా
[2] వినిన మా వారు కా - దనరా మువ్వ గోపాల! ॥విన॥

చిన్ననాటి నేస్తము - చెరిచితివి గదా!
మన్నించు మని బతి - మాలితివి గదా!
పన్నగ శయన! నన్ను - బలిమి బట్టితివి గదా!
తిన్నగా నే నెంతో - తెలియ జెప్పిన గాని ॥విన॥

తరుణులు విశ్వాస ఘా - తకు లనేవు గదా!
సారది వ్రతము చెడిన - సుఖము లేదాయె గదా!
యెరిగితే యిలుచేర - నీయరు గదా!
యరగడియ మాత్రాన - కపుడె వద్దన్న గాని ॥విన॥

అలుక దీరి యాపె నీవు - గలుసుకొంటిరి గదా!
కలకాల మీా కిద్దరికి - గాని దైతిగదా!
చలపట్టి నీవు నన్ను - చౌక చేసితివి గదా!
పలుచనాయె గదా! నా - బ్రతుకు మువ్వ గోపాల ॥విన॥

---

1 ఝంప. 2 వినినీమారు నను.

## 297. బేగడ - త్రిపుట

వెతకి తేరా పోయి - వేరు వెల్లంకి
హితవైన చెలులిక - నెవరు వద్దను లేరు ॥వెతకి॥

ఒట్టు పెట్టిన గాని - యోరి వినవైతివి
తిట్టిన తిట్లెల్ల - దీవెన లంటివి
పట్టుకొంటివిరా నన్ను - బలిమి గూడితివి
ముట్టు నెల దప్పెను - మొగవా డూరను లేడు ॥వెతకి॥

సంద కోడి గట్టి తిని - ని న్నన బని లేదు
యింద నీ యదు కూ - డిక నేమిసేతు
మందు మాకు లడిగి రారా ! - మంత్రసానుల వద్ద
కుందరదనలు గూడి - గుస గుస లాడక మునుపే ॥వెతకి॥

ఊరికి పోయిన మగడు - ఉట్టి పడ్డట్టు వచ్చి
యీ రేయి నను గూడె - నిక దూరు బాసె
కోరిన కోరిక లెల్ల - గొనసాగె మువ్వ గోపాల !
నీ రూపమున నేను - నీకే గందు మగవాని ॥వెతకి॥

## 298. [1] కాంభోజి - త్రిపుట

వేడుకతో నడుచుకొన్న - విట రాయడే
[2] ఏడు మూడు తరాల నుండి - యెందునా గాని యెవతె
కూడుకొని మువ్వ గోపాలుడు - కృప గల్గి నా విభుడు ॥వేడు॥

మధుర తిరుమ లేంద్రుడు - మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండు మని - యెన్నిన యుమ్మనెనే

---

1 దేవగాంధారి - ఆది.  2 ఏడుమూడు తరములుగా నిందున్న కాణాచట గూడుకొని మా మువ్వ గోపాలుడౌ విభుడు.

యిదిగో రెండు వేల పదము - లిపు డెంచు కొమ్మనిన
చదురు మీాద నే నున్న సామికి - సంతోస మింతింత గాదె ॥వేడు॥

* ఆళి మీార తంజాపురి నెలకొన్న విజయ రాఘవుని
వెలయ మనుజుల వెంబడి - వేగమె పొడగాంచి
చెలువ చప్పరమున నుండగ - చక్కగ వేయి పదముల
వలుకరించు కొగాను బహుమాన మిచ్చె నావేళ ॥వేడు॥

బలవంతుడై 1 గోలకొండ - పాదుషా బహుమాన మిచ్చె
తులసి మూర్తితో వాదు దలచె నావేళ
వెలయ మువ్వ గోపాలుడు - వెయ్యి న్నెనూరు పదములు
నలు 2 వది దినముల లోన - నన్ను గలసి వినుపించెనే ! ॥వేడు॥

## 299. మోహన - త్రిపుట

వేళ గాదుర! గడియ - తాళుర సామి !
చాలు చాలు పది - వేల కైన సిది ॥వేళ॥

వూరక నాపైని నేర మెంచక - పోగుచు మా బావగా రున్నారోయి!
కూరిమి నా తోడి కోడలి పడకింట
చేరిక యందుండ మేరగాదోయి ! ॥వేళ॥

ఒద్దికతో మనమిద్దరము కూడి - సుద్దు లాడుట కిది ప్రొద్దు కాదోయి!
పద్దు మీారగ నా పగవారి వద్దనే యీా
సుద్ది విన్నంత కొద్ది కాదోయి ! ॥వేళ॥

సిరతము శ్రీ వేదపురి నిలయు డైన
మురళి గానలోల మువ్వ గోపాల !
యరవిరుల పాన్పుపైని మరు కేళి నన్ను గూడి
తిరుగ పొరుగింట తరుగు (?) కాదోయి ! ॥వేళ॥

. 1 డా. 2 పై. * అనుకుదీరి తంజావూరి - ఆచ్యుత విజయరాఘవుడు.

## 300. ఆనంద భైరవి — ఆది

శ్రీపతి సుతు బారికి నే – నోప లేక నిను వేడితే
గోపాలా? మువ్వగోపాలా! ||శ్రీపతి||

ఏ పొద్దు దానింటిలోనే – కాపై యుండి నీ సరస స
ల్లాపాలా? మువ్వ గోపాలా! ||శ్రీపతి||

పైపూత మాటల నేర్పు – జూపు దాని రతిపై నింత
తీపేలా? మువ్వ గోపాల! ||శ్రీపతి||

చూపుల నవ్వుల దేరి – చూడని నాతో లేని క
లాపాలా? మువ్వగోపాలా! ||శ్రీపతి||

నా పొందెల్ల దాని కబ్బె – యే పొందు లేక యును రనుటే
నా పాలా? మువ్వ గోపాలా! ||శ్రీపతి||

## 301. సౌరాష్ట్రము — ఆది

సమర్తాడి నెలపూట లాయెరా! – చాల తామస మేలరా?
సమయమురా! మువ్వ గోపాల!
సామి యేమో యని యుండేవు ||సమ||

అడు గడుగుకు నిన్ను గనుగొన వలెనని – వడిగా కన్నులు బారీరా!
నడి వీధిలో నిను జూచిన నావల – యడు గుంచ మది దోచదురా!
విడెమియ్యగ నీచే సోకిన నా – యొడలెల్ల జల్లు జల్లనురా!
కడు వేడుకతో బలు – క వలసి ముచ్చటైతిరా! ||సమ||

గుబ్బలు వట్రులై క్రిక్కిరిసెరా – కొనగోరు లుంచి మనసిరా!
గొబ్బున నిను గౌగిలించ వలెనని – కోరిక లెన్నో యున్నవిరా!
నిబ్బరమగు నీ మోవి నేనెలకు – నిను జూడ నో రూరెనురా!
దబ్బర లాడ నేనను రా అల – ....దమి దడిసె గదరా! ||సమ

సిన్నటి నుంచి విరహము మించి - నిదుర కంటికి రాదురా!
అన్నము నోటి కింపు గాదుర - ఆ పసిపై భ్రమ జెందెనురా!
కన్నె ప్రాయమున నొక [1] నాడేమో
గలిసితి వపు డేమి తెలియదురా!
ని న్నెడబాసి యన్నియు రోసి - నిముసము ప్రొద్దు పోదురా! ॥పమ॥

302. [2] బేగడ - త్రిపుట

సరసము [3] గాదిక సకియా!
సరసము గాదిక సకియరో కరిగిరి
వరదుడు నా గుణ మెరుగక నడిచెను ॥సర॥

పదరి వా డిందు వచ్చి - పడకిల్లు సొచ్చితె
నిదుర లేప వద్దని - నెలత! నీ వనుమీ!
కదసి మెల్లన నిచ్చ - కములకు వాడు నా
పదము లొత్త వచ్చితె - బట్ట నీయకుమీ! ॥సర॥

అతివ! వినవే! నాలు - గైదు దినముల దాక
బతిమాలించక గాని - భయము రాదమ్మ!
అతి తమి గౌగిట - నదముకొని కెమ్మోవి
యత డాన వచ్చితే - అంట వద్దనుమీ! ॥సర॥

పరగ మా మువ్వ గో - పాలు డైన కంచి
వరదుడు నను గూడి - వదలక నుండి
మరియే యెన్నిక లేక - గరివించి పొగుగింట
హరిణాక్షి నడిగించె - నని వింటినమ్మ ॥సర॥

303. తోడి - ఆది

సరసిజాక్షి! నీ జన్మము - సఫల మాయెను
పరమాత్మ డైన మువ్వ గో - పాలుని హస్తము సోకి నంతనే ॥సర॥

1 నాడె నను. 2 మంగళకౌశిక - ఆది. 3 గాదిది.

నమ్మిక లిచ్చి నీవు న న్నెంత కైనను - అమ్మ కొమ్మనగ
సమ్మతిగ ముద్దు ముద్దుగ నిన్ను - రొమ్మున నుంచగ
నెమ్మితో రాతిరి పగలు వాడు - నీ వద్ద యుండగ
కొమ్మరో! కోపము వచ్చి నంతనె
కొట్ట రాదటవే! ఓ చెలియరో! ॥సర॥

నలినాక్షి! నీ వెంత కసరు కొన్న - నవ్వు చేసుకోగా
చెలువముగా నీకు దగిన సొమ్ములు - సింగారించగా
వెలది! నీ కురులు దువ్వి - విరులు దురుమగా
అలుకి వచ్చిన చేత ని - న్నదలించ రా దటవే ఓచెలియరో! ॥సర॥

సారెకు నీకు దృష్టి దాకీ నని - చాటున నుంచగ
చేరి మువ్వగోపాలుడు నీకు - సేవసేయగా
కోరిన యపుడె నిన్ను గూడి - కూరిమి కొసరగ
శ్రీరామ! రామ! నిన్ను వాడు - చెనక రాదటవే ఓచెలియరో! ॥సర॥

### 304. ముఖారి — ఆది

సామికి సరి యెవ్వరే? నా చక్కని
భామరో! తిరువళ్ళూరి వీర రాఘవ ॥సామి॥

నెలతరో! యెప్పుడైన నేనే చెక్కిలి నొక్కి
కలగి యెరుక లేక యే - చెలియ జేరె నంటె
తెలుసుకో మ్మను గాని - యలగి మారు బలుకక
చలియించని సిందు కుండ - వలె నుండు నమ్మ! ॥సామి॥

కదసి నేనే వాసి మోవి - గంటి చేసి మరపున
పదరి యీలాగున నే - పడతి యుంచె నందునె
అదరీన కోపగించీన - అలసీన సొలసీన
మదిరాక్షి! నా చిత్తము స - మ్మతి బరుచు నమ్మ ॥సామి॥

భామరో! మా మువ్వగో - పాలు డౌ వీర రాఘవుడు
కాము కేళి హాయిలుగ - గలసి యుండగ
యే మగువ వద్ద నైన - యీలా గుందువో యంటె
యీమా టెట్లంటి వని - యెంతో యుస్సురనె నమ్మ! ॥సామి॥

## 305. [1] సావేరి — త్రిపుట

సామిగా! రారా యంటే [2] కో - పమా?
ఏమి నేర మమ్మా! మువ్వగోపాలుని ముచ్చట దీర ॥సామి॥

నీ మాటలు నమ్మ రాదు - నీకే కోపమైన గాని
కోమలి! నాడే గంటి నీ గుణము లెల్లను - సీమలో మగవారివలె
నే మైన నేరము చేసితే - నేమి జేతువో
తెలియ దిక నైన చలము మాని ॥సామి॥

నీవే యతనిని విడనాడి నీకే కోప మైనా గాని
యీవేళ యిద్దరి వాదుల నెవరు దీర్చేరు?
నా వంటి [3] సకియ లేకున్న మీ వేడుకలు చెల్లునా?
ఆయా వింతల కేమి కొదవ లేదు - వగలు చేయుక ॥సామి॥

వేడుకతో నొక నాడైన వి - భుడు నీవు ముదము మీర
జోడు గూడి యున్న - సొగసు జూచెద నంటేను
నేడు గలిగె భాగ్యము - నెలతరో! మీ యలుక దీర
పాడి పంతముల మాని - పతియైన మువ్వగోపాలుని ॥సామి॥

## 306. నీలాంబరి — త్రిపుట

సామిని దయ యుంచు మనవే! నా చక్కని - సామిని
భామరో! మువ్వగోపాలుని
ప్రేమ నిజమని యెంచినా గదవే తడ వేల పదవే! ॥సామిని॥

1 గోపికావసంతం - ఆది. 2 దోసమటే నీకు. 3 సఖి వేరులేకున్న.

నెలతరో! నను విడనాడి యూరు - నెల లాయె నల దాని గూడి
పలుమారు నా వన్నెలాడి చాడి
పలుకులు విని నాతో మోడి నీతు రా
యిలను బూరుగు ఫలము పొంచిన
చిలుక సామిత సేయ వద్దనవే! నొక మాట కనవే! ॥సామిని॥

పగదాయె పూ వింటివాడు నాపై - మిగుల పంతమె కోరినాడు
తెగువ జేసుకో వశమా నేడు నా మదికి - దిగులాయె గదవే! నీతోడు
వగతురా పగ వారిలో నను
అగడు జేసిన నెవరి నేమందు నెటు తాళు కొందు ॥సామిని॥

ఆస లూరగ 1 మువ్వపురిని న న్నేలిన - వాసుదేవుని పొందె కోరి
భాసురాంగిరో వలపు మీరి యతని - కోసరమై చెలులు వేసారి
వాసి వాడని రతుల నెనసి నను
మోస బుచ్చుట న్యాయ మటవమ్మా! ఓముద్దు గుమ్మా! ॥సామిని॥

## 307. 2 ఆనందభైరవి - ఆది

హితవు గా దేమో నీ కెన్నడైన మా యింటికి
బతిమాలిన రావు గోపాల!
సత మైతి వని యీడు సరసిజాక్షుల లోన
ప్రతి లేదని యుంటి గోపాల! ॥హితవు॥

నీ వెట్ల జాణవైతివో? నీపై మరలు కొన్న దాని
భావము దెలియ లేవు గోపాల!
నా వెంటబడి నట్లు నీ వెంటబడ కున్న
భావజుని కేమాయ, గోపాల! ॥హితవు॥

ఏపట్ల దయ జూడవు నీ వెవ్వ రనేవే ఏమి
పాపము జేసితినో గోపాల!

---

1 మువ్వపురి నిలయు వాసుదేవుని?. 2 ఆగభి.

యీా పుట్టువు బుట్టించి యింత న న్నలయించు
పాపపు విధి నేమందును, గోపాల !

కలసి నిన్ను చౌశీతి గతుల దేలించినను
భళి యన నో రాడదా.? గోపాల ?
వలచి నావలె నున్న వనిత లెందరో నీకు
బలవంతమా ? మువ్వగోపాల ! ॥హితవు॥

## 308. భైరవి – ఝంప

అపరూపదర్శనం – బాయె గదా నేడు
కృపగలద మా మువ్వ – గోపాల ! సామి ! ॥అ॥

ఎన్నాళ్ళ కెన్నాళ్ళ కీ వీధిలో నిన్ను
కనుల పండుగ గాను – కనుగొంటి నేడు
ఉన్నదా ! నా మీాద - ఉల్లమున దయ నీకు
ఉన్నాను నీ దయ – బన్నగ శయనా ! ॥అ॥

త్రోవ దప్పి వచ్చితివో తోయజాక్షికి నీకు
ఈ వేళ కలహంబు ఏమైన కలదా ?
నీవేల బొంకెదవు నెనరు గలిగిన చోట నె
యివేల నేరములు – రావా నా సామి ? ॥అ॥

సందేహ మేల ఇక శయనించి సమరతులు
జెంది న న్నుపరతులు సేయ మనకు
మొందైన నీకు ఆ నందమయ్యే చోట
కందర్ప జనక చ క్కని మువ్వ గోపాల ! ॥అ॥

## 309. కాంభోజి – ఆది

ఇంత లేదని యెంచకురా !
కంతుని గన్న చక్కని - కరిగిరి వరద నా సామి

నిను బాసి తాళలేను – నీసొమ్ము జేసితి నా మేను
తనివి దీర్చక పోసీను – తమి నిల్ప లేను
నను విడనాడెద నను వగ మాను
నణచను మోహము నామదిలోను
దనరగ నీవు నా దైవము గాను
మనసున నెంచితి మక్కువ తోను ॥ఇంత॥

ఇక్కడ నుండ మనసాయ యేమో – యేమో తెలియదు నీ మాయ
సొక్కుపొడి చల్లినట్లాయ – సుగుణ్లో (?) నిధేయ
అక్కట నీవు న న్నరమర శాయ – జిక్కితి మదనుని చే విటరాయ
మొక్కిన దివ్వపు మోవి చాయ
చక్కనిసామిగా చాల నిను బాయ ॥ఇంత॥

తెలిసి మువ్వగోపాల దేవుడ వైన నన్నీవేళ
కలసి యేచేది మేల కంటి నీ లీల
సొలపున నను దయ జూడ వదేల – చెలిమితో యేచేవో చాల
కలిగితివి కరివరద నా పాల – కలవని నమ్మితి కరుణాలోల ! ॥ఇంత॥

## 310. తోడి – ఝంప

ఇందుకే పగ జేసెనా కమలజుడు – యిక నైన లెస్స ! వాసునె
అందుకందుకు చెలులు నమరికతో నున్నారు
చందమామను చల్లనుండె నా దైవమా ! ॥ఇందు॥

బలిమితో నేనుంటి నా భాగ్యములు – తెలియ లేక సొమ్మంటి నా
కలకంఠిరో వినవె కంటి కలలో దాని
చెలువు డేల చేర కున్నాడో దైవమా ! ॥ఇందు॥

పగవారితో గూడె నా సామి మనసు – పాలుబోయి నీళ్ళాయెనా
చిగురుబోణిరో ! వినవె చిన్న నాడిచ్చిన బాస
పగలెల్ల వాదాయె నా దైవమా ! ॥ఇందు॥

మ్రొక్కుమంటే మ్రొక్కనైతినా? నే నిటుల
మోము చిన్న చేసు కొంటినా?
చక్కెర కెమ్మోవిచ్చి చాల దయతో రాగ
దక్కనీ మువ్వగోపాలుడు నేడు ॥ఇందు॥

## 311. సురటి - త్రిపుట

ఇందెందు వచ్చితివిరా! అలనాని ఇల్లు
ఈ వీధిగాదు పో పోరా!
మందరగిరి ధరుడైన మా మువ్వగోపాల!
కుందరదన మది గోరి ఇందువచ్చితివా? ॥ఇం॥

పొరపైన వెన్నెలలో - ఇల్లు దెలియక నీవు
మచ్చకంటిని దగిలి మై - మరచినావో?
మచ్చిక తోడుత నీ - మనసు చల్లగ జేసి
గ్రుచ్చి కౌగిలించిన - కోమలి నే గాను ॥ఇం॥

నడిరేయి జాము వేళ - నాతి నీవును గూడి
నడచు కొన్న చిన్నెలు తెలిసెరా! జాణ!
వడివడిగా వీధిలో - వచ్చి నాదు రవిక
ముడి విడువ వచ్చేవు - ముచ్చువాని వలె నీవు ॥ఇం॥

మదనలాహిరి మించి - మద మెత్తి జూచెదవు
వదలకున్న విదేల? - వద్దు పో పోరా!
మదన కేళి గూడి - మమత రెట్టించెదవు
ఉదయ మాయెను లేర - యువిదలందరు జూచెద ॥ఇం॥

## 312. కాంభోజి - త్రిపుట

ఎన్నటికో నా కొమ్మను జూచేది
ఎన్నటికో నా మనసు చల్లనయ్యేది?

వన్నెలాడి బన్న సరులు నా యురముపై
యూగాడగా నే నుపరతి గలసేది ॥ఎన్నటి॥

మేటి చందురు కావిపావడపై పసిడి
పట్టు చేలము చాల పను మీర గట్టి
కోటివేలకు కొన్న తాటంకముల నొప్పు
కోమలి. చెక్కిళ్లు కొసరి ముద్దాడేది ॥ఎన్నటి॥

మోము మోమున జేర్చి మోము తేనియ బీల్చి
వేమారు నా మనసు నొకటిగా జేర్చి
కామశాస్త్రము చదివి కథలు జెప్పుచు నేను
కామినిని నెమ్మదిని కలసి కౌగిట జేర్చేది ॥ఎన్నటి॥

జోడు గూడి తోడి రాగము బాడుచు
మేడపై నుండి మేల్మేల నుచు
వేడుకతో దాని విడువక నెప్పుడు
తోడ బంగారు తూగు టుయ్యాల లూగేది ॥ఎన్నటి॥

చెలియరో ! మా మువ్వగోపాలరాయడు
నెలమి. యేలగా నేడి పలువరించిన
చెలియ లందరు గూడి నళినాక్షి నెత జూచి
నేడు (?) రేపని రాక రేదు రెదురు జూచేది ॥ఎన్నటి॥

## 313. కల్యాణి – త్రిపుట

ఏలా దయనేలరా – నే నీకు బగదాననా ?
చాలా వలచినానురా ! గో – పాలా ! ॥ఏలా॥

తరి తీపేల జేసేవు (?) తగవా యింటికి రావు
కరుణతో నను జూడవు గోపాలా ! ॥ఏలా॥

చనువీయవు నామీద నీ కింత - చలమేలరా ?
నను వంటిది నీకు వింత గోపాలా ? ||ఎలా||

శ్రీనిధి మువ్వగోపాల - చెలులలో నను జాల
లాలిం (?) చి యేలితి వీలీల - గోపాలా ! ||ఎలా||

## 314. కాంభోజి - ఆది

పదవే వాని చెలిమి - బలవంతము గదవే !
సదయుడైన మా మువ్వగోపాలుని
చనువందరికి దొరకునా ?, దొరకదే ! ||పద||

ఆట ప్రాయము నాటి మక్కువ - అది మరవక యుండేది ఎక్కువ
నేటికి విడనాడేది వెక్కువ - నెలతరో వినవే యెవ్వరికి తక్కువ ||పద||

అన్యభామలను వలె నను జూడడే - అలగినను నాతో బదులాడడె
నన్ను బాసి ఏ నెలతను గూడడె
నాపై నెనరెన్నటికిని మరువడె ||పద||

అంతరంగ మెరిగిన రతిలోలుడె - ఆడిన మాట తప్పని గుణశీలుడె
కంతుకేళి నను గూడు దయాళుడె
ఘనుడైన మహారాజ గోపాలుడె ||పద||

## 315. కాంభోజి - ఝంప

విడిచి పోలేక నడ - వడి గొన్న సరులతో
గడిదేరి మువ్వగోపాల - కాంతుడ యని ||వి||

ముడిగొన్న చనుగవలె జీరు కొప్పునను
సడలి యాడెడి విరుల చేరు నుదిటి పై
పడిన కస్తూరి చెమట జారు కన్నులను

యెడవాలు పైట కడుతోడల జీరెడు దీరు
పొడ గట్టి నట్లున్నదో చెలియ! ॥పి॥

అదనైన మోవిపై కొదమ కెంపుల తోను
పదరి నవ్వితె తేనె లొలుకు ముంగురులు
చెదరి బొమలను సొలపు గులుకు నెడ నెడను
పొదలు నడుమున ముద్దుగులుకు పెదవులను
అదరి పలికిన పలుకు నేడు నా
మది నిలిచినట్లున్నదో చెలియ! ॥పి॥

ఎడలేసి పిరుదులను తడబాటు నడుగులను
నడిరేయి నా కడకు వచ్చి కూర్చుండి
జెమడిగి మడుపు లందించి రవికె ముడి
విడిచి నప్పుడె తమక మెచ్చి కూటముల
యెడబాయ కెద నున్నదో చెలియ! ॥పి॥

# క్షేత్రయ్య పదములు

## విజయరాఘవముద్ర

### 1. కాంభోజి - త్రిపుట

ఇంతనా పొరుగింటనే చోటులేనట్లు - ఇంతనా పొరుగింటనే
ఇంతి విజయ రాఘ - వేంద్రుని వేడుకతన ||ఇం||

ప్రొద్దు బోదు గాబోలు నన్ను దాని
వద్ద నున్న సుద్దులే, అందుచేత
నిద్దుర పట్టక నే నుంటే దానికి
ముద్దు మీద ముద్దులే, అది
కద్దో లేదో మా కలికి నడిగెద నని
సద్దు వినలేక సఖియ యింట నుండితి ||ఇం||

వారిజముఖి ననవలె నంట
కరడంపు నవ్వులె దానింట, క
ర్పూరి కుంకుమ కస్తూరి గాక మితి
మేరలేని పువ్వులె, ఆయి
(విరి) వాసన లిందు వచ్చితె ఓర్వ జాలక యు
విద నింట. నుండితి ||ఇం||

భావజు కేళి యీ పడతి గూడే వేళ
పావురంపు పలుకు లే
ఆవేళ నిభుడు నన్ను నమ్మి కిమ్మనె
ఆపె కెంత కులుకు లే
నా వద్దికి రాడో నాతో మాటాడడో
నా విజయ రాఘవు చెలిమి కూడియుండేది ॥ఇం॥

## 2. భైరవి - [1] త్రిపుట

ఇటువంటి వాడు రానేలే?, యీ లాగై తే
యేటి వేడుక తనమే ?
విటరాయ డచ్యుత - విజయ రాఘవు డెంతో
వెరచు నమ్మా ! దానికి, ఓ చెలియా ! ॥ఇటువంటి॥

అలివేణి రాగా జూచి చిలుక
యయ్యొ వచ్చి నాడంటె నందు
కలికీని నాయిల్లు యీ యింతి పోరుగని
చిలుకను దండింతునా ?
యిలలోన యిటువంటి మగవారి వరస
లెందైన గనుగొంటిరా? ఓ చెలియా ! ॥ఇటువంటి॥

ఈ రాతిరి మా యింటికి పావురము
హెచ్చు తమి గలిగిన దీ
సారి నా యుపరతి, సల్పితే పలుక
కూరకుండు నటవె ?
యీ రతి కూజిత మాపె వినే నంట
యెళ్లికి నే నేమి సేతునే, ఓ చెలియా ! ॥ఇటువంటి॥

1 అట.

కలికిరో ! విజయ రాఘవుడు తాను నేను
గంతు కేళి గూడగ
పలుమారు గిలుకల కోళ్ళ పట్టె మంచము
ఘులు ఘులు మంటేను
మెలతరో ! యా సద్దు నాపె వినే నంటే
మెల్లనే నను కూడెనే, ఓ చెలియా ! ॥ఇటువంటి॥

3. కాంభోజి - ఆది

గిలిగింత లయ్యీ్యర! నాసామి చ - క్కిలి గింత లయ్యీ్యర!
గిలిగింత లయ్యీ్యర! - కలికి విజయరాఘవ
మొలక చన్ను నీ వంటి - మొనను నొక్కకు మల్లె ॥గిలి॥
కురులు కూడని చిరుత పరువాన నమ్మ! నీ
పరులు మరులు జేసి - నన్నల యించుచు
విరజాజి శయ్యపై - మరుని మంత్రములచే
బరిపరి వగవింత - పలుకు నా చెవిసోకె ! ॥గిలి॥
ప్ర పలువ నేరని లేత - పయసున నన్ను నీ
పలుకులనే సొక్కి - జల్లి కళ రేచుచు
మొలనూలు దూసి పోక - ముడిలోపల చెయివేసి
చెలగి గిలిగింత సేయ - కయ్యలు మొక్కి ॥గిలి॥
అక్కర తెలియని - యరవిరి ప్రాయాన
దక్కిన(ధయ)వానివలె - దప్పు(ముక్కులు)మొక్కుచు
బక్కలోనే పవళించి - బాస లెన్నైన జేసి
యక్కున జేర్చి....యందు నొక్కేవు ॥గిలి॥
లాలాయాణ

4. కాంభోజి - ఆది

గజరాజ గమన ! యీ - కపటము నేనేమి యెరుగ
విజయ రాఘవేంద్రుని - వితమేలాగే ? ॥గజ॥

జీని గజనిమ్మ పండ్లు - చిలుక ముక్కు నొక్కులచే
కానుక 1 జేసినందుకు - కారణ మేమే ?
కానుక గాదే నీ గుబ్బ - లూని పట్టి చందమామ
కూనల నుంచే నంటే - గురుతు లీలాగే ॥గజ॥

కొండొక్క చవి చూచి పంట కొరికిన తీయ మామిడి
పండు కానుక జేసెనంట భావ మదేమే
పండు కానుక గాదె నీ కండ చక్కెరమోవి
పంట గంటి జేసినంట పలికినలాగే ॥గజ॥

వీరాధి వీరు డచ్యుత విజయరాఘవుడు గంట
భారి మొలనూలంపించిన భావ మదేమే?
భారి మొలనూలు గాదె నీ భావజు సామ్రాజ్య మేలుకొన్న
........ ....దొర....యింతే ॥గజ॥

## 5. సింధు పదం (?) వి

2 తప్పించు కుంటె నేమాయనె - తరుణి వాడు
ఎప్పుడైన ఒకసారి - ఇందు రాక పొయ్యేన ॥త॥

ఈ రేయి నన్ను గూడితే - ఇన్నూరు ఘట్లిచ్చేనని
సారె సారెకు వేడెనే ఓయమ్మ! వాడు
బేరా జబ్బు మాట (?) లాడెనె అయితే నేమాయె
(?) బేర జబ్బు చేసు కుంటె జడకొద్ది వేయనా
నారీమణిరో! విజయరాఘవ నాయని సానీగ (?) చేత ॥త॥

1 లందుకు పంపిన.

2 తప్పించు కుంతె నే మాయ-తరుణి మువ్వగోపాలుడు (?)

## 6. [1] సైంధవి — [2] చాపు

దొంతర పిడెముతో నా - చెంత రాకుర నీకు నాయాన
యింతకు నే దాళగలనా - యేర! విజయరాఘవ జాణ! ॥దొంతర॥

జగ్గు నలుక మైబుకా తావి - చప్పరించిన నీదు కెమ్మోవి
నిగ్గు నుదుటి లత్తుక తీవి - నీటుతోడను
దగ్గర నిలువకు పదరా - దాని కేను తాళగదరా!
యెగ్గు చేసి నా యెదురా - యీ లాగున నీవె బొంకుదురా? ॥దొంతర॥

నిబ్బరపు గబ్బి గుబ్బల పోటు - చెమ్మి రేగిన కీల్జడ వేటు
మబ్బు మీరిన నిద్దురపాటు - మరపు తోడను
దబ్బర లాడేవు చాల - దానిదే గదర యీశాల
గబ్బి తనము నీ కేల - కలికితో మాటాడు మీవేళ ॥దొంతర॥

చక్కని విజయరాఘవ - సామిగా నన్నేలినావా?
తక్కులాడి యింటికి పోవా - మక్కువతోడను
మొక్కడిపి వాడిన విరులు - చిక్కువడ్డవి నీ కంటసరులు
నిక్కము దానిపై మరులు - నీవు దానింటికే తరలు ॥దొంతర॥

## 7. కాంభోజి - అట

బాల ప్రాడెండేండ్ల గోల సుమ్మి ఇక
తాళదు గాసికి దయ లూరను
లాలించుమి ముద్దరాలది గాయకు
రాలు గాదు విజయ రాఘవ సామి! ॥బాల॥

కోమర ఘరుని చేతి కూన సుమ్మీ నీకు
సమరిన చిత్రంపు టతివ సుమీ!

1 పున్నాగవరాళి. 2 ఏకతాళము; అట.

సమరతి ఉపరతి చౌశీతి బంధముల
క్రమము నేర్పెదవో గాక కొసరేవో గసక ॥బాల॥

తోయ్యాలి బంగారు తునక సుమీ!
మరుని కయ్యాన కలికిని కసరకుమీ!
తియ్యని మోవిచ్చి దిద్దు కొంమువు గాని
శయ్యపట్ల రవ్వచేయకుమీ! ఓజాణ! ॥బాల॥

తరుణులలో మేలు తరమునుమీ నిన్ను
మరుకేళి మెప్పించు మగువ సుమీ!
యరయ విజయ రాఘవ మెట్టిదొరకైన
దొరకెనా అలమించు దొరకె నీకె ఓ జాణ! ॥బాల॥

## 8. సైంధవి - ఆది

మేరగాదుర! నీ విడిదిక - పోర ముక్కొర! ॥మేర॥

మంటమారి మామకు న - న్నంటే మిగులరోసము
ఒంటి వెడలనీడు భావ - వింటే చాల మోసము
వెంట వెంట తిరిగేవు - విభు డింటనే వాసము
కంటకుడు నా మరది - కంటేను ప్రయాసము ॥మేర॥

సుదతి యైన మాయ యత్త యీ - సుద్ది నాడే విన్నది
వదిన నమ్మ జాలదు తల - వాకిటనే యున్నది
పదర వల దీ ప్రొద్దు నీ - పద్దు చెల్లు చున్నది
అదిగో యీ వీధి కొనను - ఆరునూ రౌచున్నది ॥మేర॥

పల్లకీ దొర లై తేనే నా - పైటలో చెయి వేతుర!
యిల్లా లనక కలసి మెలసి - యింతగాసి సేతుర!
యిల్లు వెళ్ళనీదు వాంతి - యింత రట్టు సేతుర!
తెలవారెను విజయ రాఘవ! - ధీర! యేమి సేతుర? ॥మేర॥

## 9. సైంధవి – ఆది

విడు విడు నన్నంట రాకురా, ఓరోరి జాణ !
విడు విడు నన్నంట రాకు వెరతు ముమ్మాటికి నేను
విడిదికి మళ్ళిపోరా విజయ రాఘవ ! జాణ ! ॥విడు॥

యీ పొద్దు చిత్తము వచ్చెనా ఆజవరాలు - యిల్లు వెడలి రా నిచ్చెనా?
(?) పో పోరా దానికైతే నే పాళరాజు యిచ్చెనా
ఆ పెద్ద ముత్యాల సరులు దానింటికైతే
(?) దీపాళి పండగ చీరెలు యికమెచ్చ వద్ద
ఓ పట్టభద్రాంగి మేరలు ఓరోరి జాణ ! ॥విడు॥

చక్కనయ్య నీకె చెల్లునా యీ లాగైతే – సవతి నీకె సొక్కజల్లెనా ?
దక్కితి సొక్కితివి దక్కేవురా దానికైతే
ముక్కెరకు మురుగు ముత్యము ఆరాణికైతే
(?) ఒక్కొక్క వరాని బత్యము అమ్మ నే జెల్ల
మెక్కడివి నీకు సత్యము ఓరోరి జాణ ! ॥విడు॥

కోడెకాడ! యిందు వత్తురా యీలాగైతే–కొమ్మకు యిదెల్ల హత్తురా!
ఆడకె మళ్ళి పోరా ఆ మోహపు రాణికైతే
కిడంపు వజ్రాల కమ్మలు ఆ రాణికైతే
జోడించిన వుంగరమ్ములు నాతోనైతే జాడిగా నె
యిచ్చకములు ఒరోరి జాణ ! ॥విడు॥

## 10. కాంభోజి - అట

సామాన్యము గాదె! వాని పొందు – సామాన్యముగాదె!
ఏమని నేరని భామలు వాని కాసించి రేమందు
విజయ రాఘవుడే సామి సుమ్మి
భూమి యందు వాని గుణము లెన్న జనులకు
వీనులవిందు ఓ చెలియరో! ॥సా॥

పాయపు హెొంతకారి కావలె వాని పదపద్య రచన
సేయ నుత్తర మీయవలె వాని ముద్దు కవిత తా
వ్రాయ చదువ నేరవలె ఆ వగల యందు
గాయకురాలు గావలె ఓచెలియరో! ||సా||

ఆటకు మేటిగావలె తంబుర
గోట మీట రాగ మనవలె వానిపై సొగసు
పాటలు వినుపించవలె
వాని మనసు దెలిసి మాటలాడనేరవలె, ఓ చెలియరో ! ||సా||

కప్పుర బాగా లీయవలె వా తెరకు తేనె
చిప్పిల్ల సగమాకీయవలె, తమిహెచ్చే వేళ
తప్పక మోవి నొక్కవలె విజయరాఘవుని
అప్పుడె పైకొని కూడవలె ఓ చెలియరో ! ||సా||

## 11. కాంభోజి - త్రిపుట

సుదిన మాయనే ! యీ ప్రొద్దు - సుదిన మాయనే !
మదనావతారుని సేవ - మనకు గలిగనే! ||సుదిన||

ప్రొద్దున నిలువుటద్దము పొడగన్న ఫలము - యీ
ముద్దు మోము జూడగలిగె ముద్దుల గుమ్మ ||సుదిన||

పొద్దు పూర్ణకుంభ మెదురైన ఫలము యీ
భూపాలకుంజరుని నే పొడ గంటి నమ్మ! ||సుదిన||

ద్విజరాజుల సేవించిన - దివ్య శకునము యీ
విజయ రాఘవశౌరిని - విడిదిలో గంటినమ్మ! ||సుదిన||

## 12. సావేరి - త్రిపుట

హితవైనచోటనే హిత 1 చింత లేకనే
2 యుంపారు నటరా? నీకు
వితరణ శూర మా విజయ రాఘవధీర!
విందువా? నామాటలు ఓరోరి జాణ ! ||హిత||

ముచ్చటైనే నొక్క ముద్దు బెట్టెద నంటే
మోమెత్ర జేసితివి
పచ్చితేరగ నాతి పలు కెంపు లుంచితే
బాగాయ నని యుంటివి, ఓరోరిజాణ ! ||హిత||

ఇందునే చేబట్టి యింటికి రమ్మంటే
యెంతైన గసరితివి
సందిటిపై గోరులు సఖియ యుంచితే
సంతోషపడి యుంటివి ఓరోరి జాణ ! ||హిత||

ఇనుమంత సేపు నన్నేలి విజయ రాఘవ
యింటికి బొమ్మంటివి
రసికుడా దానింట రాతిరి నాలుగు జాములు
రమ్యముతో నుంటివి ఒరోరి జాణ ! ||హిత||

1 చింతెగాక. 2 నీ కింపౌదునటర నేను.

# క్షేత్రయ్య పదములు

## తుపాకుల వేంకటకృష్ణముద్ర

### 1. నాదనామక్రియ - ఆది

ఏమనెనే సుద్దు లే - మే? బంగారు బొమ్మ !
ఏమనెనే మరుగేల దాచకే
రామ తుపాకుల రాయుడు నీతో ||నేమనెనే||

మానిని ! ముందుగా నా - మాట నీ వెత్తితివో
తానె పల్కరించెనో - దయ నాపయి గలిగి
కానుక తనచేత - బూనెనో యందిమ్మని
యాన తిచ్చెనో నామీ - దాన యో చెలియ ! ||ఏమనెనే||

వనితరో! వాడీడకు - వచ్చెననెనో లేక
నను తోడి తెమ్మనెనో - నా ప్రాణ విభుడు
నెనరుతో మాటాడెనో - నేర మెంచెనో లేక
వినుపింపు వాని మాట - విన ముచ్చటయ్యీని ఏమనెనే||

వేడుక తుపాకుల - వేంకట కృష్ణుడు
గూడే వేళలోనె - నోడితి నంట
నేడా సుద్దు లేమైనా - నీతో మందలించెనో
మోడిగా నున్నాడో - ముదితరో! వినవే ||ఏమనెనే||

## 2. కల్యాణి - ఝంప

ఓయమ్మ! వీరెంత - యోర్వ జాల రమ్మ!
సోయగమున మువ్వగోపాల - కృష్ణుడు నేను గూడి యుంటే ॥ఓయమ్మ॥

పంటి కొద్ది నా మోవి - పై విభుడు నొక్కిన
గంట జూచి నవ్వే - నా కలికి
జంట బాయక నాతో ము - చ్చట లాడ వద్దని
కొంటె తనమున గసరు - కొనియె నా మగువ ॥ఓయమ్మ॥

బత్తి వాని మోవి నామోవి పై నుంచగా జూచి
దత్తి గాదనియె నా తరుణి
హత్తిమోవితో మదుపు లందీయ వెరగంది
యిత్తరి యివిగాక దయలని యె నాయింతి ॥ఓయమ్మ॥

వన్నె మీర విభుడు నా వద్దికి రాగా నె ప్రమొక్కితే
యెన్ని నేర్చె ననియె నా భామ
నన్ను గూడి మువ్వగోపాల కృష్ణ నరనాథు డాదరించితే
తన్ను దిట్టుకొనియె నా తామరస నేత్రి ॥ఓయమ్మ॥

## 3. గౌరి - ఆది

నేరమా? కొమ్మా! వాడెందుకే
చేర రాడమ్మా!
వారిజ ముఖియిటు వలె ననుభవముల
ధారుణీ పతి దలచిన యప్పుడే ॥నేర॥

మాలిమి యను తన లాలనచే రతి
వేళలో నడిచిన వింతలు తలచక
నాలో నేనే నవ్వుచు నుండగ
వేళ దెలిపి విన్న వించనైతి నకట ॥నేర॥

చెలువున దా నా చనుమొన లంటుచు
గిలిగింతలమై పులకించినవగ
దలచుక సిగ్గున దలవంచుక తా
బిలిచి యడిగితే పలుక నైతివట ॥నేర॥

మనసు కరుగ నా మర్మము లంటుచు
పెనగొని తమకంబు నను గలయగ
గినిసి తుపాకుల కృష్ణునితో నే
దనివి తీరలే దని పలికితి వట ॥నేర॥

# శృంగార రసమంజరి

అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నా యొనర్పం బూనిన శృంగార రసమంజరి యను లక్షణ గ్రంథమునందు శృంగారరస సాధారణ లగుట తొలుత నాయికా లక్షణము లుదహరించితి. అందు నాయికలు.

స్వీయ :- స్వీయ యనునది పరిణీతయై పతియందు మాత్రంబు ప్రీతిగల పతివ్రత.

స్వీయా లక్షణము:- పతిశుశ్రూషయు, శీల సంరక్షణంబును, ఆర్జవంబును, క్షమయును స్వభావంబుగా గల సాధ్వి.

పరకీయ :- పరిణీత యయ్యును పరపురుషుని మనంబున గోరి నది. గూఢ చేష్ట ప్రధానము.

సామాన్య:- సర్వజన సాధారణయగు వేశ్య. ధనప్రధానముగా సకల పురుషుల యందున్ను అభిలాష గలది.

స్వీయ :- ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని. ముగ్ధ, అంకురిత యౌవన యగు కాంత. లజ్జా ప్రధానం.

ముగ్ధలో:- అజ్ఞాత యౌవన, యౌవన ప్రారంభం తాను తెలుసుకొనక యుండుట.

జ్ఞాతయౌవన :- యౌవన ప్రారంభము తాను తెలుసుకొనుట.

నవోఢ:- సఖీ వచన క్రమంబున లజ్జా భయ పరాధీన రతి యగు నది. నూతన వివాహ మగుట.

నవోఢచేష్టలు :- [1] సిగ్గుచేత మనోహరయును, కోపంబు నెడ మృదుత్వంబును, నవభూషణముల యెడ నిచ్ఛయుం గలిగియుండు.

---

[1] "క్రియా హ్రియా మనోహరా కోపేపి మార్దవం" అని మూలము. చే మనోహరమైన సురత క్రియ కలది. కోపమున్నను మృదుత్వము కలది యని యర్థము.

విస్రబ్ధ నవోఢ:- పై చిహ్నములు [1] వినయముతోఁ గూడియుండు.

మధ్య :- లజ్జయును, మన్మథోత్సాహంబును సమానముగా గలయది. [2] ఉపలాల నాతిశయంబున అతి విస్రబ్ధ నవోఢ యగు. ప్రియుండు నేరంబు చేసిన యెడ ధైర్యంబు గల యపుడు వక్రోక్తియు ధైర్యంబు లేనియెడ పరుష వాక్యంబులుం గలిగి యుండు.

ప్రౌఢ:- ప్రగల్భ. పతియందు మాత్రంబు [3] కేళి కోవిద యగు నది. కామప్రధానం. అవస్థలు, రతిప్రీతి, సురతానంద మోహము, రత్యానంద మగ్నురాలై యుండుట.

ప్రగల్భలో - ధీర, వ్యంగ్యంబుగా కోప ప్రకాశంబు సేయునది. ధైర్య ప్రధానం.

అధీర - వ్యంగ్య రహితంబుగా పరుష వచనంబులు పలుకునది అధైర్య ప్రధానం.

ధీరాధీర - వ్యంగ్యా వ్యంగ్యంబుగా కోప ప్రకాశంబు సేయు నది. ధైర్యా ధైర్య ప్రధానం.

మధ్యధీర - [4] కోప వచనంబు వ్యంగ్యంబుగా నుండు.

మధ్యాధీర - పరుష వాక్యంబులు.

మధ్యధీరాధీర - [5] వచన రుదితంబులు.

---

1 "సేవ సప్రశ్రయా విస్రబ్ధనవోఢా" ముగ్ధయే బెదరు తీరి విశ్వాసము కలిగి వ్యవహరించునేని విస్రబ్ధనవోఢ. ప్రశ్రయము - విశ్వాసము.

2 "అతి ప్రశ్రయాత్ అతి విస్రబ్ధనవోఢా" మధ్యయే అతివిశ్వాసముచే అతి విస్రబ్ధనవోఢ.

3 "కేళి కలా కలాప కోవిదా" సురత క్రీడా సమూహమున నేర్పు కలది.

4 "కోపస్య గిః వ్యంజకా" మధ్య ధీర వాక్కు - కోపమును సూచించును.

5 "వచన రుదితే కోప ప్రకాశకే" వచన దుఃఖములు కోపమును ప్రకాశింపజేయును.

ప్రౌఢ ధీర - [1] రతి సంభ్రమ మెంచక యుండుటయు.

ప్రౌఢాధీర - తర్జన తాడనంబుల కోప ప్రకాశంబును.

ప్రౌఢ ధీరాధీర - సురతములో ఉదాసీనము, తర్జన తాడనంబులు వీటిచేత కోప ప్రకాశంబును గలిగియుండు.

[2] ఇట్టి ధీరాది భేదంబులు స్వీయ యందు కోప నియతమ్మై యుండు గాని పరకీయా [3] సామాన్యలయందు నియతంబు గాదు.

ధీరాదులలో జ్యేష్ఠ - పరిణీతయై పతి యెడ నధిక స్నేహంబు గలది.

కనిష్ఠ - స్వల్ప స్నేహంబు గలది.

ముగ్ధ; మధ్య ధీరా జ్యేష్ఠ, కనిష్ఠ; మధ్యాధీరా జ్యేష్ఠ, కనిష్ఠ; మధ్య ధీరాధీర జ్యేష్ఠ, కనిష్ఠ; ప్రౌఢ ధీరా జ్యేష్ఠ, కనిష్ఠ; ప్రౌఢాధీరా జ్యేష్ఠ, కనిష్ఠ; ప్రౌఢ ధీరా ధీర జ్యేష్ఠ, కనిష్ఠ - ఇవి త్రయోదశ భేదంబులు గల స్వీయా లక్షణంబులు.

పరకీయ - పరపురుషుని యందు గల యనురాగంబు ప్రకాశింప నీయ కుండునది.

1 "ప్రౌఢాయాస్తు ధీరాయా రతౌ ఔదాసీన్యం కోపస్య ప్రకాశకం" ప్రౌఢ ధీరయొక్క సురతము నందలి యుదాసీనత కోపమును సూచించును.

2 ఏతే ధీరాది భేదాః స్వీయాయా ఏవ. న పరకీయాయాః. ఇతి ఆజ్ఞా మాత్రం. ధీరత్వ మధీరత్వం హి మాన నియతం. పరకీయాయాశ్చ మానశ్చేత్ తస్యా అపి ఆవశ్యకత్వాత్. మానశ్చ న పరకీయాయా ఇతి వక్తు మశక్యత్వాత్" ఈ ధీరాది భేదములు స్వీయకే కాని పరకీయ కుండవనుట కేవల మాజ్ఞ. (యుక్తము కాదు.) ధీరత్వ మధీరత్వమును కోప నియతములు. కోపమున్న ధీరత్వ ముండును. కోపము లేకున్న అధీరత్వ ముండును. పరకీయకును కోప ముండునేని యీ యుభయ మావశ్యకము. పరకీయకు కోప ముండదని చెప్పుట శక్యము గునేమి? అని మూల భావము.

3 సామాన్య విషయము మూలమున లేదు. అయినను సామాన్య కూడ సంగ్రహీత కావచ్చు నని యీ వచనము.

పరకీయలో - పరోఢ - 1 పరునకు వివాహము చేయబడినది. చేష్టలు గూఢంబులై యుండు.

కన్య - తండ్రి యధీనముగా పెండ్లికాక యుండుట వ్యాజము చేత తనకు యిష్టమైన పురుషుణ్ణి చూచుట. చేష్టలు గూఢంబులై యుండు. ముగ్ధవలెనే కన్యకు లజ్జా ప్రధానం

పరోఢలో అవాంతర భేదములు

1. గుప్త యను పరకీయలో మూడు భేదములు. గోప్యముగా నుండుట లక్షణము

వృత్త సురత గోపన - నడచిన సురతమును గోప్యపఱచుట.
వర్తిష్యమాణ సురతగోపన - నడవపొయ్యే రతిని గోప్యపఱచుట.
వృత్తవర్తిష్యమాణ సురత గోపన - నడచినదాన్ని, నడవపోయే దాన్ని గోప్యపరచుట.

2. విదగ్ధలో :- వాగ్విదగ్ధ - తన యభిప్రాయమును మాటలవల్ల సూచనగా తెల్పడము.

క్రియావిదగ్ధ :- తన యభిప్రాయము కార్యమువల్ల తెలియ జేయడము.

3. లక్షిత :- తన చర్యలు పరులు యెఱిగి యుండుట. (లక్షించునది)

4. కులట:- బహు పురుషాపేక్ష గలది. * కులటా శబ్దమునకు విగ్రహము:- కులాత్కులం గచ్ఛతీతివా కులటా- తన కులమును వదలి అన్యకులమును జేరినది. కులాన్యవతీతివా కులటా - విట పురుషులను సంతోషపెట్టునది. కులేష్వటతీతివా కులటా - విట పురుషులలో సంచరించుట.

1 పరేణ ఊఢా పరోఢా; అని వ్యుత్పత్తి. జారునిచేన్న నన్యునిచే పెండ్లాడబడినది అనియుక్తము.

* ఇది అప్పకవీయము నుండి గ్రహింపబడినది. రసమంజరిలో లేదు.

5. **అనుశయాన** - త్రివిధము. 1

(i) మొదటి సంకేతస్థలము దప్పినందుచేతనైన, మరియొక సంకేత స్థలమునకు తాను జేరక మునుపే పతి చేరె నేమో యని యైనా శంకించునది.

(ii) సంకేత స్థానమందు కార్యము లభింపక పోవుట వల్ల నను తాపము గలది.

(iii) సంకేత స్థలమే లభించకుండునది. తాను నిశ్చయించిన సంకేతస్థలమునకు రాక యన్యులవల్ల నిశ్చయింపబడ్డ సంకేతస్థలమునకు పురుషుడు పోవుట హేతువులవల్ల తెలిసి అను తపించునది.

6. **ముదిత** - ఇష్టప్రాప్తి చేత సంతసిల్లునది గావున ముదిత ఇది మూడు విధములు. 2

(i) 3 సాహసిక - పురుషుడు, అత్త, మామ, మొదలైన వారు లేకయుండు సమయమును గూర్చి సాహసించి చెప్పునది.

1 అనుశయాన భేదత్రయము మూలమున నిట్లున్నది. "వర్తమానస్థాన విఘటనేన, భావిస్థానాభావ శంకయా, స్వానధిష్ఠిత సంకేతస్థలం ప్రతి భర్తుర్గమనానుమానేన చ అనుశయానా త్రివిధా"

i తత్కాల సంకేతనమునకు భంగము కలుగుటచే తపించునది.

ii భవిష్యత్కాలమున సంకేత స్థానము దొరకదను భయముచే తపించునది.

iii తాను చేరని సంకేతస్థలమునకు ప్రియుడు వెళ్ళియుండునన్న ఊహచే తపించునది.

2 ముదిత మూడు విధములని యిచట కలదు. కాని యిది మూలమున లేదు. గుప్తాది నాయికల వలె "పతివంచిక, సాహసిక" యనువారును లెక్క పెట్టదగిన వారని వ్యాఖ్యాతల సూచన. అట్లే "ప్రతిభాచతుర, అపలాపచతుర" కావచ్చును. మూలమున "ముదితా ప్రభృతి" యని ప్రభృతి (మున్నగు) పదమున్నదిగదా!.

3 ఈ సాహసికా లక్షణము మూలములోని ముదితాలక్ష్యము ననుసరించినది కావలయును.

(ii) ప్రతిభాచతుర – సమయోచితంబుగా మాట పొర్లింపున నమరబల్కునది.

(iii) అపలాపచతుర – అపలాపించి (మాట తప్పించి) నోదనంబున ప్రియుండు వేడుకొన జేయునది.

సామాన్య - ద్రవ్య ప్రధాన మాత్రంబుగా సకల పురుషులయందున్ను అభిలాష గలయది.

సామాన్యలో - 1 ఆగంతుక సామాన్య – సామాన్య యందు నంతర్భావమై యుండునది.

పరికారాంతరమున నాయికా భేదములు.

1. ఉత్తమ – ప్రియుండహితంబు సేసినప్పటికిన్ని తాను హితంబు చేసేది. చేష్టలున్ను ఉత్తమము గానే యుండునది.

మధ్య – ప్రియుండు హితాహితంబు సేయగా తానున్ను హితాహిత చేష్టలు చేయునది.

2 అధమ – హితము చేయు ప్రియుని యందు అహితముగా నెంచునది. కోపించునది.

ఈ నాయికలకు రతిసమయంబున 3 తృప్త– రతితృప్తి, అతృప్త– రతి తృప్తి లేమి, తృప్తా తృప్త – తృప్తి వహించిన్ని ఆశచేత అతృప్తురాలై యున్నట్టు వుండుట.

1 ఆగంతుక సామాన్య మూల సమ్మతము కాదు. సామాన్యయందు నాలంకారికులు భేదప్రభేదము లంగీకరింపలేదు. అభ్యాగత యువాంధనుని చూచి యొక సామాన్య ఏమేమో చేష్ట లొనరించినదని మూలమున నుదాహరణ మున్నది. అందలి నాయిక యభ్యాగత (ఆగంతుక) సామాన్యయందుమో?

2 అధమ యనిమిత్తకోప. చండి. అధమచేష్ట.

3. తృప్తాది భేదములు కామతంత్ర ప్రసిద్ధములు. మూలమున లేవు.

ఈ తృప్తాది భేదంబులు రతి సమయంబుల గాక నితర సమయంబుల నెన్నదగదు.

2. దివ్య 1 - అదివ్య - దివ్యాదివ్య.

3. అన్యా సంభోగదుఃఖిత-పురుషుడు పరస్త్రీ సంభోగము చేయుటవల్ల తాను దుఃఖించునది.

1. వక్రోక్తి గర్వితలో:

(i) ప్రేమగర్విత - పురుషుడు తనయందు ప్రేమ కలిగి యుండుట వల్ల గర్వించునది.

(ii) సౌందర్య గర్విత - తాను సౌందర్యవతి యని గర్వించునది.

2. మానవతిలో:

(i) లఘుమాన - 2 నాయకుని తప్పిదమునకు కలిగిన అలుకయు, కోపంబును సులభముగా పోగొట్టబడునది. అన్యస్త్రీ దర్శనంబునబుట్టినది. సంతోషంబున పరిహారంబగు.

(ii) మధ్యమాన - కొంత ప్రయాసంబున పరిహారంబగు మానంబు కలది (గడుసుగా బొంకుట, ఒట్టు పెట్టుకొనుట) ఇంకొక స్త్రీ పేరుతో పిలుచుట చేత బుట్టినది. 3 వివాదంబును. ఆనలు పెట్టుట వలనను పరిహారంబగు.

---

1 రసమంజరిలో నీ భేదములు లేవు. భోజదేవాదు లంగీకరింతురు. రసమంజరిలో రెండవ ప్రకరణమున దివ్యాది భేదములు సూచితములు కాని యవి తత్కర్తకభీష్టములు కావు.

2 మూలమున నిట్లున్నది. తన ప్రియుడు తన విషయమున నొనర్చిన తప్పిదమును సూచించు తనచేష్ట మానము. (అలుక) నాయకుని స్వల్పయత్నమున బోవునది లఘుమానము. నాయకు డన్యస్త్రీలను చూచుట మొదలగు వాని వలన గలిగిన లఘుమానము "వేఱు విషయములందు కుతూహలము పుట్టించుటచేత దీర్ప శక్యమగునది" యని.

3 అన్యథావాద శపథాన్యపదేశా మధ్యమః" బొంకుట ఒట్టు పెట్టుకొనుట మున్నగు వానిచే దీర్ప శక్యమగునది మధ్యమ మానము. అని మూలము.

(iii) గురుమాన - అత్యంత ప్రయాసంబున పరిహారంబగు మానంబు కలది అన్యా సంభోగ చిహ్నాలు చూడగా బుట్టినది. పాద ప్రణామంబులును, దివ్యాంబరాభరణము లిచ్చుట చేతను పరిహారంబగు.

(iv) రసాభాసంబు - 1 అసాధ్యంబగు మానంబు. ఏకశయ్యానోన్య వియోగం. ప్రేమాధిక్యము.

ఈ ౧౬ నాయికలకున్ను, (స్వీయలు ౧౩, పరకీయలు ౨, సామాన్య ౧) ఒక్కొక్కరి యవస్థా విశేషంబులు.

అష్టవిధ నాయికా నిరూపణము. 2

1. స్వాధీన పతిక - ఎల్లప్పుడున్ను తన యింగిత మెరింగి తనయాజ్ఞకు లోనుగా నడిచే పతి గలది. స్వాధీన పతికాచేష్టలు - దీనికి వన విహారాదులున్ను, మదన మహోత్సవములున్ను, మదాహంకార ములున్ను మనోరథా వాప్తులున్ను గలిగియుండు -

♦ "పరుడు కైవస మైన వనిత"

ముగ్ధా స్వాధీన పతిక, మధ్యా స్వాధీన పతిక, ప్రౌఢాస్వాధీన పతిక, పరకీయా స్వాధిన పతిక, సామాన్యా స్వాధీన పతిక.

స్వాధీన పతిక:—

* "గుణైర్యస్యాః ప్రియోవశ్య స్సేయం స్వాధీనభర్తృకా."

పురుషుణ్ణి గుణంచేత వశం చేసుకున్నది.

---

1 మానము త్రివిధమె. లఘువు, మధ్యమము, గురువు అని. అసాధ్య మానము చతుర్థ మానముగా పరిగణనీయము కాదు. "అసాధ్యస్తు రసాభాస ఏవ" అని మూలము. సాధ్యమానములు మూడు. అసాధ్యము రసాభాసమగుట మానమె కాదగదు.

2 మూలక్రమము వేరుగా నున్నను దాని నతిక్రమించి లోకప్రసిద్ధమయిన క్రమమిచట స్వీకృతము కావచ్చును. నరభూపాలీయములోని క్రమమిట్లే యున్నది.

♦ నరస భూపాలీయమునుండి.

* రసమంజరిలోనిది కాదు.

2. వాసక సజ్జిక :-

* "భూషితాత్మ గృహా భర్తు రాగమే వాసక సజ్జికా"

తాను పడకయిల్లు శృంగారించి యెదురు చూచేది. అప్పుడు ప్రియుడు రాగలడని సురత సామగ్రి సన్నాహంబుచేసి తాను అలంకరించుకొని యెదురు చూచునది. వాసక సజ్జిక చేష్టలు - మనోరథంబును, సఖీ పరిహాసంబును, దూతిక ప్రశ్నయును, భోగ్యవస్తు సంపాదనంబును మార్గ విలోకనంబును మొదలుగా గలవి స్వాభావికంబులు.

♦ "ప్రియాగమన వేళ గృహముఁ దనువు సవరించునింతి"

ముగ్ధా వాసకసజ్జిక, మధ్యా వాసకసజ్జిక, ప్రౌఢా వాసక సజ్జిక పరకీయా వాసకసజ్జిక, సామాన్యా వాసకసజ్జిక.

3. విరహోత్కంఠిత:-

* "విరహోత్కంఠితా ఖిన్నా భర్తుశ్చిర విలంబనాత్"

పెనిమిటి వచ్చుటకు విలంబనమైనందుకు విరహపడేది. సంకేత స్థలానకు నాయకుండు యింకా రాడాయెనని విరహంబుచేత చింతించునది.

♦ "పతిరాక తడవుండ నుత్కంఠఁదాల్చు నింతి. విరహోత్క"

విరహోత్కంఠిత చేష్టలు - అరతియున్ను, సంతాప, జృంభణమున్ను, అప్రీతి, జ్వరము, అవ్వలింత, శరీరము విరుచుకొనుటయున్ను, కంపమున్ను - తన 1 దుఃఖము చెలులతో చెప్పుకొన గలది.

---

* రసమంజరిలోనిది కాదు.

♦ నరస భూపాలీయము నుండి.

1 "రుదితం స్వావస్థా కథనాదయః" అని మూలము. దుఃఖపడుట, తన యవస్థను జెప్పుకొనుట మొదలగునవి అని భావము.

ముగ్ధా విరహోత్కంఠిత, మధ్యా విరహోత్కంఠిత, ప్రౌఢా విరహోత్కంఠిత, పరకీయా విరహోత్కంఠిత, సామాన్యా విరహోత్కంఠిత.

4. విప్రలబ్ధ - * "విప్రలబ్ధాతు కాంతేన సంకేతస్థల వంచితా"

పెనిమిటి చేత సంకేత స్థలమందు వంచింప బడ్డది. సంకేత స్థలంబున పతిగానక వంచింపబడి వ్యాకుల హృదయ యైనది.

♦ "సంకేతమరసి నాథుండు లేమి వెసనార్త యగు కాంత విప్రలబ్ధ"

విప్రలబ్ధ చేష్టలు - 1 అత్యంత వేదన, నిట్టూర్పులున్ను, సఖీజనుల దూరుకొను నదిన్ని, విరహము జెందునదిన్ని, కన్నీరు నించునది గాను నుండును. ముగ్ధా విప్రలబ్ధ, మధ్యా విప్రలబ్ధ, ప్రౌఢా విప్రలబ్ధ, పరకీయా విప్రలబ్ధ, సామాన్యా విప్రలబ్ధ.

5. ఖండిత - * "ఖండితా కుపితా భర్తు రన్యా సంభోగ లక్షణైః"

అన్యస్త్రీ సంభోగ లక్షణముల చేత కోపించేది. అన్యా సంభోగ చిహ్నితుండై 2 ప్రాతఃకాలమందువచ్చిన పతింజూచి కోపించునది.

♦ "విభుం డన్య సతిం జెంది వేకువ రాం గుందు నబల"

ఖండిత చేష్టలు - అస్ఫుటా లాపములున్ను, చింతా సంతాప నిశ్వాసములున్ను, నిర్వేరగంది యూరకుండుటయు, కన్నీరు నింపుటయు గల్గునట్టిది.

* రసమంజరిలోనిది కాదు.

♦ నరస భూపాలీయమునుండి.

1 "నిర్వేద నిశ్వాస సఖీజనోపాలంభ చింతాశ్రుపాత మూర్ఛాదయః" అని మూలము. నిర్వేదము, నిశ్వాసము, సఖీనింద, చింత, కన్నీరు, మూర్ఛ మొదలగునవి యీమె చేష్టలు. నిర్వేదము తన్నుతాను నిందించుకొనుట. అత్యంత వేదనము గాదు.

2 ప్రాతఃకాలమే యని నియమము లేదు. ఇతర సమయములు కూడ గ్రాహ్యములు. "ప్రాతరిత్యుపలక్షణం" అని మూలము.

ముగ్ధా ఖండిత - [1] తన పురుషునియందు పరస్త్రీ గమన చిహ్నము లుండునది చూచి యివి యేమని యడుగ ఉద్యుక్త రాలవుట. (సులువుగా సమాధానమును పొందుట.)

మధ్యా ఖండిత - సదరు చిహ్నములు చూచి కన్నీరు విడిచి [2] నిట్టూర్పు విడిచి ఆ విషయ మేమని యడుగక యుండునది.

ప్రౌఢా ఖండిత - సదరు చిహ్నముజూచి తనలో తాను దుఃఖించి స్తబ్ధమై యుండునది. వ్యంగ్యముగా సాధనాంతరముచేత ఆచిహ్నములను భర్తకు జూపునది.

పరకీయా ఖండిత-సదరు చిహ్నముజూచి కన్నీరుతో తన చెలియకు కనుసంజ్ఞ చేసి కార్యము నెఱుక చేయునది. ఇతరులకు తెలియు నేమోయని చేష్ట చేతనే గాని మాటతో వ్యక్తము చేయనిది.

సామాన్యా ఖండిత - సదరు చిహ్నమునుజూచి తాను సహించనని కంఠోక్తిగా జెప్పి అపరాధము చెల్లించమని యడుగునది.

6. కలహాంతరిత:-

* "కలహాంతరితా కోపాత్ కాంతంత్యక్త్వానుతాపినీ"

కోపమువల్ల పెనిమిటిని విడిచి తాపము చెందినది. పతిని దృణీకరించి యవమానము చేసి వెళ్ళగొట్టిన తర్వాత పశ్చాత్తప్తురాలై వ్యధపడునది.

---

1 ముగ్ధ, మధ్య, ప్రౌఢ, పరకీయ, సామాన్య అను నీ యైదుగురకు స్వాధీనపతి కాది భేదము రసమంజరిలో నంగీకృతము. వీరిచేష్ట లంతట నుదాహరణములచే పరిగ్రాహ్యములుగ సూచితములె కాని స్పష్టముగా నిరూపితములు కావు. అనువాదకుడు నిదేరీతి ననుసరించెను. కాని ఖండితా విషయమున నయిదుగురకు చేష్ట లిచట నున్నవి. ఇవి మూలములోని యుదాహరణ పద్యభావానుసారమున నున్నవని పరిగ్రాహ్యము.

2 "నిట్టూర్పు విడిచి" మూలలక్ష్యోక్త విరుద్ధము. "దీర్ఘం న నిశ్వసితి" అని మూలము. "మెల్లగా నిట్టూర్పు విడిచి" యుంట కొంత యుక్తము. అసలు నిట్టూర్చుట ముఖ్యము కాదు. దీర్ఘనిశ్వాసము లేకపోవుటయే ముఖ్యము.

* రసమంజరిలోనిది కాదు.

♦ "అల్క నభిప్రుఁ దెగడి యనుశయముఁ జెందు సతి"

కలహాంతరిత చేష్టలు - భ్రమయున్ను, పరితాపమున్ను, నిట్టూర్పులున్ను, సమ్మోహ (మూర్ఛ) వేదనా ప్రలాపములున్ను-

ముగ్ధా కలహాంతరిత, మధ్యా కలహాంతరిత, ప్రౌఢా కలహాంతరిత, పరకీయా కలహాంతరిత, సామాన్యా కలహాంతరిత.

7. ప్రోషిత పతిక:-

*"యాదినా(?) దూరగే కాంతే సాస్యాత్ ప్రోషిత భర్తృకా"

పెనిమిటి యూరికి పోయినందున దీనురాలైనది. పతి దేశాంతరము పోయి యుండగా వ్యాకుల పడే నాయిక.

♦ "నిజేశుడు విదేశ గతుడైనఁ గృశతఁ దాల్చునతివ'

ప్రోషిత పతిక చేష్టలు - * దశావస్థలు అనగా

1 "దృఙ్మనస్సంగ సంకల్ప జాగరాః కృశతా రతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగ దశా దశ"

* "చూచుట, వలచుట, గోరుట.
గాచుట, గృశమౌట, రుచులఁగావనమి, సిగ్గుం
దోచుట, విభ్రమము, మూర్ఛా
ప్రాచుర్యము, తురిత మనఁగఁ బదియు నవస్థల్"

ముగ్ధా ప్రోషిత పతిక - 2 పురుషుడు దేశాంతరమునకు పోయి నందువల్ల కలిగిన వ్యసనమును బయలు పరచక యంతరంగమున నే చెందియుండుట.

---

♦ నరస భూపాలీయము నుండి. * రసమంజరిలోనిది కాదు.

1 మూలములో దశావస్థలు: అభిలాష, చింత, స్మృతి, గుణకీర్తన, ఉద్వేగ, ప్రలాప, ఉన్మాద, వ్యాధి, జడతా, నిధనములు. ఇందలి నిరూపణము గ్రంథాంతరానుసారి.

2 ఈవిశేషములు మూలములో లేవు. అయినను మూలములోని లక్ష్యముల నుండి సముద్ధృతములు.

మధ్యా ప్రోషిత పతిక - సదరు వ్యసనమును చెలికత్తెకు ప్రకారాంతరముగా దెలియ జేయుట.

ప్రౌఢా ప్రోషితపతిక - సదరు వ్యసనమును దనకు గల్గినట్లు పరులకు స్పష్టముగా విరహ చిహ్నముల చేత దెలియు చున్నను చాలా చెప్పక యుండుట.

పరకీయా ప్రోషిత పతిక - సదరు వ్యసనమును స్నేహితులకు బయలు పఱచి బంధు జనులకు దెలియక యుండునటుల నటించునది.

సామాన్యా ప్రోషిత పతిక - సదరు వ్యసనమును దనకు లేక యుండినను ద్రవ్యాపేక్షచేత లేని వ్యసనమును నున్నట్టు పరులకు నగపరచునట్టి చిహ్నములు ఉపాధులచేత దెచ్చుకొనునది.

8. అభిసారిక :-

* "కాంతార్థినాతు యా యాతి సంకేతం సాభిసారికా"

సంకేత స్థలమును గూర్చి పెనిమిటిని వెతుక్కొని పోయేది. తాను నాయకుని గూర్చి యభిసరించేదైనా. నాయకుని నభిసరింప జేయునదైనా - ♦ "కాంతాభి సరణశీల"

అభిసారిక చేష్టలు - సమయోచితమైన వేషము వేయునదిన్ని, భూషణములు ధరించునదిన్ని, శంకయును, అతిప్రజ్ఞ, నైపుణ్యము, బుద్ధి కుశలతయు, కపటమును, సాహసమును. ఈ లక్షణములు, పరకీయాభిసారికలకు మాత్రమే చెందును. స్వీయాభిసారికకు, ఇతరులకు కానరాకుండుటకు వేషము వేయదుగాన, ఈలక్షణములు చెందవు. ముగ్ధాభిసారిక, మధ్యాభిసారిక, ప్రౌఢాభిసారిక, పరకీయాభి సారిక, జ్యోత్స్నాభిసారిక, తమిస్రాభిసారిక, దివసాభిసారిక, సామాన్యాభిసారిక, అని భేదములు.

---

* రసమంజరి లోనిది కాదు

♦ నరస భూపాలీయము నుండి

9. * ప్రవత్స్యత్పతిక – ఆక్షణమందు ప్రియుడు దేశాంతరగమన నిశ్చితుండై యుండగ ఈ తొమ్మిదో నాయిక యితర నాయికలందు అంతర్భావము గాదు. ఎట్లన; పతిసన్నిధి నుండుటను ప్రోషిత పతిక, విప్రలబ్ధ, విరహోత్కంఠితల యందు నంతర్భావంబు గాదయ్యె. ప్రియుని యొక్క కలహము లేనందున కలహాంతరిత కాదు. 1 అన్యోపభోగ చిహ్నాలు గని కోపించ లేదు గనుక ఖండిత యందు నంతర్భావంబు గాదయ్యె. గృహ సజ్జాకారణము లేనందున వాసక సజ్జిక యందు నంతర్భావంబు గాదయ్యె. ఉత్తర క్షణమందు కూడిక యుండదు గనుక స్వాధీనపతిక కాదు. అభిసారిక లక్షణము లేనే లేదు. ఇట్లు అష్టవిధ నాయికలయందు నంతర్భావము లేనందు వలన అంగీకరింపవలసె. ఈనాయిక లక్షణము పతి ఆక్షణమందు పెనము బోవ నిశ్చితుండుగా గలది.

ప్రవత్స్యత్పతికా చేష్టలు – కాకువచనమున్ను, కాతర ప్రేక్షణమున్ను, (బెదురు చూపులు)

గమన విఘ్నోప దర్శనము (విఘ్నముల కెదురుచూచుట)న్ను, సిర్వేద, సంతాప, సమ్మోహ, నిశ్వాస, బాష్పంబులు, చేష్టలు. ముగ్ధా ప్రవత్స్య త్పతిక, మధ్యా ప్రవత్స్య త్పతిక, ప్రౌఢా ప్రవత్స్య త్పతిక, పరకీయా ప్రవత్స్య త్పతిక, సామాన్యా ప్రవత్స్య త్పతిక.

10. ♦ సమాగచ్ఛ త్పతిక – పతి దేశాంతరమున నుండి యిప్పుడు రాగా జూచినది. పదియవ నాయిక యని తెల్పంబడు. నవ విధ నాయికా

1. "పత్యురనవమాని తత్వాత్" అని మూలము. పతి నవమానించ లేదు గనుక, అనియు నుండవలెను.

* 9 వ భేదమున రసమంజరి కారుని మతాను సారము ప్రాచీన మత ప్రకారము ఎనమండుగురే.

♦ రసమంజరిలో లేదు. ప్రాచీన మతము కాదు

లక్షణంబుల యందున్ను అంతర్భావంబు గాదు గావున, సమ్మోదానందాశ్రు విరహోపశాంతులు గలిగినందు వల్ల నంగీకరించవలెను.

సమాగచ్ఛత్పతిక చేష్టలు - పతిఆక్షణమే దేశాంతరమునమండి రాగా జూచినది. సాధ్వస సమ్మోదమున్ను, హఠాత్పులకలున్ను, అద్భుతాలోకమున్ను ప్రాగ్విరహోప శాంతిన్ని, సత్వరోత్సాహ భూషణమున్ను, ముఖ వికాస హర్షాశ్రు సిద్ధ మనోరథాదులున్ను నివ్వెర పాటున్ను గలది.

ముగ్ధా సమాగచ్ఛత్పతిక, మధ్యా సమాగచ్ఛత్పతిక, ప్రౌఢా సమాగచ్ఛత్పతిక, పరకీయా సమాగచ్ఛత్పతిక, సామాన్యా సమాగచ్ఛత్పతిక.

**సఖీ నిరూపణము :-**

సఖి-విశ్వాసముగల్గి యూరటగా పార్శ్వమందు సంచరించునది. సఖిచర్యలు - అలంకరించేదిన్ని, ఉపాలంభన శిక్షా పరిహాసాదులు. అలంకరించు లక్షణం, ఉపాలంభన లక్షణం, శిక్షా లక్షణం. పరిహాస లక్షణం,

**పరిహాస లక్షణం త్రివిధము :-**

(i) సఖి నాయికను పరిహాసము చేయుట,

(ii) సఖి పరిహాసము చేసేటట్టు, ప్రియుడు నాయికను పరిహాసము చేసే లక్షణం.

(iii) ప్రియురాలు ప్రియుని పరిహాసము చేయుట.

దూతిక - దౌత్య వ్యాపార పారంగత దూతిక - సంఘటన చేయునదిన్ని, విరహంబు దెలిపే దిన్ని దీని యుద్యోగములు. సంఘటనా లక్షణం విరహం దెలిపే లక్షణం.

నాయక నిరూపణము:-

1. పతి 2. ఉపపతి 3. వైశికుడు అని నాయకులు త్రివిధము.

1. పతి - విధ్యుక్త ప్రకారంబుల బాణి గ్రహణంబు సేయునతడు.

(i) అనుకూలుడు - సర్వకాలంబును పరాంగనా పరాఙ్ముఖుండై దృఢాను రక్తుండగువాడు.

♦ "ఒక్క కాంతనే వలచి గుణాభిరాముడగు వాఁడు"

(ii) దక్షిణ నాయకుడు - సకల నాయికల యందున్ను సమమైన సహజాను రాగం గలవాడు.

♦ "బహుప్రియాసదృశ శీలుఁడు"

(iii) ధృష్టనాయకుడు - నిశ్శంకగా నేరముచేసి యుండిన్ని నాయిక యెంత పరిహసించినా గాని పోక మరిన్నీ ప్రశ్రయము (వినయము) చూపువాడు.

♦ "సాపరాధుఁడై యలుగని వాఁడు"

(iv) శఠుడు - కాంతల యందు కపటంబు సేయ సమర్థుడగు నాయకుండు.

♦ "ప్రియాశయమాత్ర నివేద్య విప్రియుండు"

2. ఉపపతి - ఆచార హాని హేతువగు వాడు, వీని యందున్ను అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠత్వభేదంబులు నాల్గువిధంబులై యుండు. అందు శఠత్వము నియతమై యుండు.

3. వైశికుండు - బహుళ వేశ్యోప భోగ రసికు డనంబరగు.

ఉత్తమ వైశికుండు - ప్రియకు నెంత కోపమైనను మరిన్ని యుపచార పరాయణుం డగువాడు.

♦ నరస భూపాలీయము నుండి.

మధ్యమ వైశికుండు – ప్రియకు కోపము వచ్చిన సమయమున నెవ్వడు కోపాను రాగంబులు ప్రకటింపక చేష్ట చేత మనోభావంబు గ్రహింప వలెనని యూరకుండువాడు.

వైశికాధమ నాయకుడు – భయంబును, కృపయును, లజ్జయు, కోపంబును లేక క్రీడలయందు కృత్యాకృత్యంబు విచారంబు లేనివాడు.

శఠుని యందంతర్భావము పొందువారు (i) మాని (ii) చతురుడు. వాక్చేష్టల[1] వ్యంగ్యముగా గలవాడు.

వచనవ్యంగ్య సమాగముడు, చేష్టావ్యంగ్య సమాగముడు.

పత్యాదుల భేదాంతరములు :–

ప్రియను విడిచి దేశాంతరము పోయినవారు మూడు విధములు. ప్రోషిత పతి, ప్రోషిత ఉపపతి, ప్రోషిత వైశికుడు.

నాయకాభాసుడు :–

అనభిజ్ఞుండగు నాయకుడు ఎంత సూచన చేసినను భావ మెఱుగ లేనివాడు.

నాయికలకు చెప్పిన భేదములు నాయకులకు గలవని యెంచ బనిలేదు. నాయికలకు అవస్థా భేదంబులు కలిగె. నాయకులకు స్వభావంబుననే అనుకూల, దక్షిణ, ధృష్ట, శఠత్వ భేదంబులు గలిగినవి. అవస్థా భేదంబుల విప్రలబ్ధ ఖండితాది భేదంబులు అంగీకరించి నప్పటికిన్ని సంకేత స్థలమునకు రాకుండుట, ధూర్తత్వము, అన్య సంభోగ చిహ్నములు మొదలగు గుణములు నాయికలకు చెప్పుట సంప్రదాయము కాదు. వ్యత్యాసంబైన రసాభాసం బగునట్లు యెఱుంగవలయు.

1 "వాక్చేష్టా వ్యంగ్య సమాగమః" వాక్యముచే చేష్టలచే సమాగమాభిలాష సూచించువాడని యుక్తము.

నర్మ సచివుడు – క్రీడాసఖుడు – నాల్గు భేదంబులు.

1. పీఠ మర్దకుండు – కుపిత స్త్రీ ప్రసాదకుండు.

♦ "నాయకోల్లసనముకన్న కొంత గుణలక్షణ హీనుడు."

2. విటుండు - కామ కళా కోవిదు డగువాడు.

3. చేటకుడు – సంధానమునందు చతురుడు.

♦ "అసదృశ బాలికా సంఘటనాది రహస్య విదుండు."

4. విదూషకుండు – అంగంబులు వికారంబులుగా జేసికొని పరిహాసంబు సేయునతండు. ♦ "అజస్ర హాస్య రసహేతువు వాఁడు."

† ( సాత్త్విక భావములు. ౮. )

శృంగార రస నిరూపణము :-

(శృంగారమునకు) రతిస్థాయి భావము. శృంగార రసము రెండు విధములు. సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము. విప్రలంభములో దశావస్థలు గలిగె. వీటియందు -

1. అభిలాష – సంగమేచ్ఛ.

2. చింత – సందర్శన సంతోషముల యొక్క ప్రకారములు చింతించేది.

3. స్మృతి – ప్రియాసంబంధమైన చేష్టాదుల జ్ఞాపకము.

4. గుణకీర్తన – విరహవేళ కాంతా సంబంధస్తుతి సేయుట.

5. ఉద్వేగము – కామక్లేశముచేత సకల భోగములున్ను హేయముగా నెంచునది.

♦ నరస భూపాలీయము నుండి.

† ఇందు పేర్కొన బడలేదు. రసమంజరిలో ఇట్లు:– 1. చెమట, 2. మ్రాను పాటు, 3. గగుర్పాటు, 4. గద్గద స్వరము, 5. కంపము, 6. వైవర్ణ్యము, 7. కన్నీరు, 8. ఱిచ్చపాటు ఇంద్రియ వ్యాపారము లేకుండుట – ప్రళయము.

6. ప్రలాపము – ప్రియను గూర్చిన కల్పిత వ్యవహారము.

7. ఉన్మాదము – ఔత్సుక్య సంతాపముల వలన కలిగిన మనోవిపర్యాసము. ఎడబాటు వలన కలిగిన జ్వరము చేత వచ్చినది. కాయికోన్మాదము. వాచికోన్మాదము, అని రెండు భేదములు.

8. వ్యాధి – మదన బాధచే కలిగిన జ్వర కార్శ్యాది దోషము.

9. జడత విరహ వేదనా వికారమాత్రముచేత తెలిసికోదగిన జీవముగల యవస్థ.

(i) స్వప్నదర్శన, (ii) చిత్రదర్శన, (iii) సాక్షాద్దర్శనము లని విప్రలంభావస్థలో మూడు దర్శనములు.

* 10 నిధనము – మరణావస్థ అమంగళమని చెప్పలేదు.

# శృంగారరసమంజరి

## ( క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములు - సమన్వయము )

శృంగారరస సాధారణ లగుట తొలుత నాయికా లక్షణంబు లుదహరించితి. అందు నాయికలు - స్వీయయు - పరకీయయు - సామాన్యయు నన త్రివిధ భేదంబు లగు. అందు స్వీయ యనునది, పరిణీతయై పతియందు మాత్రంబు ప్రీతిగల పతివ్రత స్వీయ యనంబరగు. అందు పతి శుశ్రూషయు, శీల సంరక్షణంబును ఆర్జవంబును, క్షమయును యీ నాల్గు గుణంబులు స్వభావంబులుగా గల సాధ్వి స్వీయ యనం బరగు. ఇట్టి స్వీయయు, ముగ్ధయు, మధ్యయు, ప్రౌఢయు నన త్రివిధంబులగు. అంకు రిత యౌవన యగు కాంత ముగ్ధ యనంబరగు. అట్టి ముగ్ధయు అజ్ఞాత యౌవనయు, జ్ఞాత యౌవనయు నన ద్వివిధంబులగు అందు సఖీ వచన క్రమంబున లజ్జా భయ పరా ధీనరతి యగునది నవోఢ యనంబరగు. అట్టి నవోఢ చేష్టలు - సిగ్గుచేత మనోహర యును కోపంబు నెడ మృదుత్వంబును నవభూషణంబుల యెడ నిచ్ఛయుం గలిగి యుండు.

న వో ఢా ల క్ష్య ము.

చ. కరమున గట్టినం గుసుమ కల్పిత తల్పమునందుఁ జేర్చినం
దరముగఁ గౌగిలించినను దత్తరమందును బైలుదేరగా
నిరవుకొనంగఁ బాదరస మెవ్వడు చేతను నిల్పు వానికిం
బరమగుగా నవోఢ నెడఁ దార్పగఁ జెందులు ద్రొక్కుచుండెగన్.

(రసమంజరిలోని లక్ష్య శ్లోకమున కనువాదము)

1. స్వీయ - ముగ్ధ, అందు నవోఢ, ఎట్లనిన — తొలినాడు శయ్యా గృహ మందు నాయకుడు బలాత్కారము చేసివందువల్లనున్ను మర్నాడు శయ్యకు బోనోప నని సఖీ జనులతో తెలియజేసుకొని వందువల్లనున్ను యీ నాయిక నవోఢ యని సిద్ధాంతీకారముగా వ్రాయబడెను. ఇందు కుదాహరణము " క్షేత్రయ్య పదములు. "

నన్నేటికి బొమ్మనేరే వాని వద్దికి. 207

ప్ర వి స్ర బ్ధ న వో ఢా ల క్ష్య ము

చ. కరమున నూరువుల్ బెనిచి కమ్మక నీవియుఁ బట్టి యన్యమా
కరమున గుబ్బలం బొదివి కాంత నిమీలిత లోచనాంతయై
వరుని సమీప భాగమున పై ఖరిగాగ నవోఢ డిందుచున్
నిరుపమ లీల మీఱ శయనీయమునం బవళించు వేగమున్.

• ఇట్టి అంకెలు క్షేత్రయ్య పదసంఖ్యలను సూచించును.

2. స్వీయ – ముగ్ధ, అందు విస్రబ్ధ నవోఢ, ఎట్లనిన – సఖీజనుల వాక్యము నంగీకరించినందువల్ల నున్ను, నాయకుని అనుభవము తెలుసుకొని నందువల్ల నున్ను– విస్రబ్ధనవోఢ.

చిన్నదాన నేనే మెలుగ సిగ్గయ్యీ నమ్మ – 174.

లజ్జయును, మన్మథోత్సాహంబును సమానంబుగా గలది మధ్యయనంబరగు. అట్టి మధ్య ఉపలాల నాతిశయంబున – అతి విస్రబ్ధనవోఢయగు. అట్టి మధ్యను ప్రియుడు నేరంబు చేసిన యెడ ధైర్యంబు గలయపుడు వక్రోక్తియు, ధైర్యంబు లేని యెడ పరుష వాక్యంబులు గలిగి యుండు.

మ ధ్యా ల క్ష్య ము.

ఉ॥ నిద్దురఁబోయినట్టి విభుని నెమ్మొగముం గనఁగూడ దక్కటా
నిద్దురఁబోవకున్న పతినెమ్మి కరగ్రహణ మ్మొనర్పగా
నిద్దురఁబోవరాదు మఱి నిద్దురఁబోవక యుండరాదనిన్
ముద్దియ చింతసేయుచును ముద్దులు గుల్కఁగఁజేరె శయ్యకున్.

3. స్వీయ – అందు మధ్య, ఎట్లనిన – సంకేతస్థలంబున నాయకుడు శయనించి యుండగ రాత్రి నడచిన వర్తమానములు మర్నాడు తన చెలికత్తెతో దెలియజేసి నందువల్ల – మధ్య.

నిదురవచ్చునా కంటికి – ఆ వేళలో – ♦ (?)

4. స్వీయ – ప్రౌఢ – సురతప్రియ – ఎట్లనిన – ఈ నాయికయందు నాయకుడు సేనాదినములుగా రాక నేయుండి వచ్చినవాడు గనుక నున్ను, నాయిక మూడు జాములవరకు మాటలచేత ప్రొద్దుగడిపినందువల్ల నున్ను, నాలుగో జామున నాయకుని గూడేటంతలో కోడికూసినందువల్ల వ్యాకులపడినందు చేతనున్ను సురతప్రియ.

ఎంతో మనసున నెంచి కొన్నందుకు నంతలో కోడి కూసె నేసామి
(క్షేత్రయ్య పదము కాదు)

నాయకుడు సేనాదినములు రాక నేయుండి వచ్చినందు చేతనున్ను – సతిపతు లిద్దరున్ను సేనాసేపు మాటలాడుచుండి నందువల్లనున్ను వీరిమాటలు విని చిలుక పలికి నందుకు వీరలు ఆశ్చర్యపడినందువల్ల నున్ను – ఉత్తమాటలచేత ప్రొద్దుపోయె నని యీ నాయిక వ్యాకుల పడినందువల్ల నున్ను సురతప్రియ.

చెల్లబో యెంత వేగమే తెల్లవారెర 176

♦ ఈ పదము దొరకలేదు.

ఏల తెల్లవారె నయ్యో యింత వేగమే 136

5. స్వీయ - ప్రౌఢ - సురతానంద మోహిత - ఈ నాయిక క్రీడా సమయమున మైమరచి నందువల్లనున్ను, మూర్ఛచెంది తెలివి తప్పినందువల్ల నున్ను - సురతానంద మోహిత.

తెల్లవారినది తెలియలే దకట - 198.

తెల్లవారు టెరుగనైతి నమ్మ - యేమందునా - 199.

6. స్వీయ - మధ్యధీర - ఎట్లనిన; నాయకుడు అన్యకాంతను సంసర్గం చేసి వచ్చినందు వల్లనున్ను శరీరం చమర్చినందు వల్లనున్ను - పూల సురటిచేత గాలివేసే నని నాయకునితో నాయిక తెలియజేసి నందువల్లనున్ను - మధ్య ధీర.

చక్కనయ్య యేమి యుప - చారములే సేయింతును - 166.

7. స్వీయ - మధ్యాధీర - నాయకుని అన్యాసంభోగ చిహ్నాలు కనుల జూచి నాయకుని పరిహాసము చేసేది గనుకనున్ను - ధైర్యం లేకనే పరుష వాక్యంబులు పలికినందు చేతనున్ను - మధ్య అధీర.

నాపేను నీమే ననుచును బలికిన - ( శెట్టి పుణ్యము పదము ).

8. స్వీయ - మధ్యాధీర -

ఎంత వింతరా చక్కని సామి - 85.

9. స్వీయ, మధ్యధీరాధీర ఎట్లనిన - తన నాయకుడు అన్యకాంతాసక్తుడై వచ్చినది చూచి మిక్కిలి తన మనస్సున నుండే టటువంటి దుఃఖం దెలిసీ తెలియనట్టుగా నాయకునితో దెలియజేసు కొనేది గనుక - మధ్య ధీరాధీర.

నన్ను నవలె గాని నిన్నన పనియేమి (పదం దొరకలేదు.)

10. స్వీయ - ప్రౌఢధీర - ఎట్లనిన - నాయకుడు తనకు స్వాధీనం లేదనే టటువంటి యెన్నిక చేత నాయిక శయ్యాగృహమందు వచ్చి నాయకుని పలుకరించక అత్యంత కోపముతో నుండే టటువంటి వర్తమానం నాయకునికి తెలిసి నాయికను నాయకుడు అడిగేదాని వల్లనున్ను స్వీయ ప్రౌఢధీర -

తలచినపుడే లేని దానవు (వరాహుని పదము)

వలచినవాడనే నీ మీద - 287.

నాయిక మిక్కిలి కోపముతో నుండుటచేత నాయకుడు మంచి మాటల చెప్పి వేడుకొనే దానివల్లనున్ను ప్రౌఢధీర.

11. స్వీయ - ప్రౌఢాధీర, నాయకుండు తనయందు నత్యంత ప్రేమతోఁ గూడి యుండి మళ్ళీ అన్యకాంతా సక్తుడై నందుచేత ఆ వర్తమానం తెలిసినందు చేతనున్ను నాయకుని ప్రత్యక్షముగా కోపము సేయకుండా అడిగే టందువల్ల ప్రౌఢాధీర.

చిత్తము వేరైనందుకు చింత చేసేను 173.

12. స్వీయ - ప్రౌఢ, ధీరాధీర నాయకుడు అన్యకాంతా సక్తుడై, నగలు, రొక్కము, పుష్పహారములు మొదలగునవి యిచ్చిన వర్తమానములు నాయికకు తెలిసి ధైర్యాధైర్యముల వల్ల నాయకుని అడుగునది గనుక స్వీయ ధీరాధీర.

మేలు మేలురా నిన్ను మెచ్చు వచ్చురా 263.

13. స్వీయ మధ్యధీర. జ్యేష్ఠ కనిష్ఠ - నాయకుడు కపటముచేత వేశ్యా నాయికను తన శయ్యపైని బెట్టి పడుకోబెట్టినందు వల్లనున్ను, నిద్దుర మబ్బుచేత తన నాయకుని అధరపానము చేసినట్టు వచ్చిన నాయికను అధరాన్ని పానము చేసినందు వల్లనున్ను ఆలింగనము చేసినందువల్ల తనయొక్క రొమ్ము నాయిక రొమ్ము జేరి క్రిక్కిరిసి నందువల్లనున్ను, తత్క్షణమే మనసుకు అనుమానము గలిగి ఆ సమయమందు తన నాయకునితో నైన వచ్చిన నాయికతో నైన కలహించక అవలిమొగమై నందుచేత మధ్య ధీర, జ్యేష్ఠ కనిష్ఠ.

ఇద్దరి సందున బవ్వళించి యున్న 61.

14. స్వీయ - మధ్యాధీర జ్యేష్ఠ కనిష్ఠ - తన శయ్యా గృహమందు నాయకుడు వేశ్యా నాయికయందు సరసము లాడుచుండేది తాను జూచినది గనుకనున్ను, ఆ వర్తమానముల తనకు ఆప్తమైన సఖితో తెలియ జేసుకోనేది గనుకనున్ను.

ఎవతె తాళునమ్మ యీ నడతలు 103.

15. స్వీయ - మధ్యధీరాధీర - జ్యేష్ఠ కనిష్ఠ - ఈ నాయిక తన సంకేత స్థలంబున వేశ్యా నాయికతో సరసము లాడుచు నుండేది, తాను జూచి నాయకునితో ప్రత్యక్షముగా అడిగినందు వల్ల మధ్య ధీరాధీర జ్యేష్ఠ కనిష్ఠ

బాగాయె నీ వగలెల్ల 244.

16. స్వీయ - ప్రౌఢధీరా జ్యేష్ఠ కనిష్ఠ - సతి పతు లిరువురున్ను ఒక్క శయ్యపై నుండగా [illegible] నాయికయందు నాయకుడు కపటముచేత నిద్రితగా సరసము లాడుచుండగా నాయికకు [illegible]సి కోపించునది

ఇన్నాళ్ళవలె గాదమ్మ ముద్దుగోపాలు. 63.

17. స్వీయ ప్రౌఢాధీర - జ్యేష్ఠ కనిష్ఠ - తన నాయకుడు వేరొక నాయికతో తన కేళికామందిరమందు సరసము లాడుచుండగ తాను జూచినది గనుక నున్ను నాయిక ఆ వర్తమానములను గురించి అలిగియుండగ సమాధానము చేసిన సఖితో తెలియజేసి క్రోశించునది.

ముద్దులేని వానితోను ముచ్చట లేలే 260.

18. స్వీయ - ప్రౌఢ ధీరాధీర - జ్యేష్ఠ కనిష్ఠ - నాయకుడు నాయికను వంచించి పక్షపాతములు చేసినందువల్లనున్ను, నాయకునితో ప్రత్యక్షముగా నడుగునది.

ఇటువంటి వాడనుచు నిప్పుడు తెలిసెనుర 59.

సతిపతు లిరువురున్ను యొక్క శయ్య యందుండగ నాయకుడు వేరే యొక నాయికతో సైగలచేత రమ్మని సరసము లాడినందువల్లనున్ను, తనయెదురుగా, వచ్చిన నాయికను కలసి నందువల్లనున్ను ప్రౌఢ ధీర జ్యేష్ఠ కనిష్ఠ యనిన్ని

వానికి నే నేల వలచితి నిటువంటి 292.

19. పరకీయ పరోఢ గుప్త వృత్త సురతగోపన - ఉపపతి యందు రూపు మాపులో ప్రత్యక్షముగా తనవర్తమానముల తెలియజేసుకొనునదిన్ని పెద్ద పిన్నల లక్ష్యముసేయక యుండి నందు నున్ను ప్రేమ యుంచి యుండే కార్యముల ఉపపతితో తెలియజేసినందుచేత

నీ పొందు సేయక మాన 222.

20. పరకీయ - పరోఢ - వర్తిష్యమాణ సురతగోపన. పతి యూరిలో లేనందువల్లనున్ను, యిది గర్భమైన చేత యితరులు తెలిసేరని ఉపపతియందు గర్భము విచ్ఛిన్నము చేయవలెనని తెలియజేయునది.

ఇతకి తేరా పోయి వేరు వెల్లంకి 297.

21. పరకీయ - పరోఢ - వృత్త వర్తిష్యమాణ సురతగోపన - తొలుత నాయకుడు యీ నాయికను అంగీకరించవలెనని, దౌత్యము నడిచినందువల్ల నున్ను దౌత్యములచేత సఖ్యం లేకపోయినందున మళ్ళీ స్త్రీ వేషం వేసుకొని కపటము చేత నాయికను రమించినందువల్ల నున్ను మర్నాడు తనకు ఆప్తమైన సఖితో చెప్పుకొనునది.

మోసబుచ్చిరమ్మ మగవాని అడగంట 265.

నాయకుడు బలాత్కారము చేసినందువల్లనున్ను ఆవర్తమానములు తన కాప్తమైన చెలికత్తెతో చెప్పుకొనునది.

ఎవ్వడే లలన పి డెవ్వడే 104.

22. పరకీయ—పరోఢ—వాగ్విదగ్ధ - యీనాయిక నాయకుని(డు)? తీవ్రము గా రమ్మనగా పోతి ననిన్ని, తనకు మిక్కిలి మోహమనిన్ని, నాయకుని లీలావినోద ములు దలచి సంతోష మొందునదిన్ని, గా నుండుటవల్లనున్ను, నాయకునితో తక్షణము రమించ వలెనని యెన్నిక గలిగినందుచేత నున్ను వాగ్విదగ్ధ.

పాటలచేత దీరునా బోటి 255.

23. పరకీయ - లక్షిత — పరోఢ - ఎట్లనిన - సంకేత స్థలమునకు తాను పోయె టందుకు ఆడ్డపడిన చేతనున్ను, కోపించిన పతిని సమాధానము చేయుట వల్లనున్ను, అత్తవారింటికి తమయింటివారు పంపుతారని నాయకునితో తెలియ జేసినందువల్లనున్ను మిక్కిలి ప్రేమచేత సతిపతు లిరువురున్ను వ్యాకులం చెందుట వల్లనున్ను లక్షిత.

అత్తవారింటికి నంపేరు మావారు (క్షేత్రయ్య పదము కాదు)

రమింప వచ్చిన నాయకుని సమయ భేదమువల్ల గూడేటందుకు లేనందున ఉపపతిని సముదాయించినందు నున్ను, బావగారు తనయందు మిక్కిలి విరోధ ముంచినందు వల్లనున్ను, తన శయ్యా గృహానికి తోడికోడలు మొక్క పతితో సమీపమందుండెడి చేతనున్ను, మిక్కిలి తాపనముచేత గూడదని నాయకుని సము దాయించుటవల్ల, లక్షిత.

వేళ గాదుర గడియ తాళర సామి 299.

24. పరకీయ - పరోఢ — ముదిత — తన గృహకృత్యమెల్ల ఉపపతితో తెలియ జేసినందుననున్ను, అత్తగారు, బావగారు, మొదలయిన వారలు సమీపమందున్నారనే భీతిచేతనున్ను, నాయకుని తీవ్రముగా గలసి పంపించేదిన్ని, ప్రతిదినము నాయకుని రమ్మని చెప్పుట చేతనున్ను ముదిత.

అన్నగ మాటలాడర మువ్వగోపాల 192.

25. పరకీయ - పరోఢ - ప్రతిభాచతుర - ఉపపతితో సంబంధ పడిన వర్త మానము చెప్పమున్ను మళ్లీ తెలియనట్టే మాట పొర్లించి ఆసురపలికేదిన్ని, తన యభీష్ట ప్రకారం జరిగితే ప్రార్థన చెల్లింతు పెదదానని వేడుకొనేదిన్ని.

చూడని గూడని నిందలు జోడించి రమ్మ 175.

26. పరకీయ - కన్య, సంకేత స్థలంబున నుపపతితో తన వర్తమానము తెలియ జేసుకొనేది, తన్ను వివాహము జేసికొమ్మని ఉపపతితో తెలియ జేసికొనునది, కన్య.

నన్నే పెండ్లాడుసుమీ 208.

పితృాద్యధీన గావున గూఢ చేష్టలచేత నాయకుని ప్రేమకు వేడుకునేటందు వల్ల నున్ను, అతి బాల్యములో నుండేటప్పడే నాయకుని రమించి యుండుట వల్ల

నున్ను, ప్రోష్యపతికైయైన తర్వాత నాయకుని గలయు వలయునని నృపపతితో తెలియ జేసేది గనక కన్య.

సమర్తాడి పదిపూటలాయెరా 301.

27. సామాన్య — నాయకుడు సొగసు జేసికొని వచ్చినందువల్లనున్ను, సఖీ జనులు నాయకునితో యిది సమయము గాదని చెప్పినందువల్లనున్ను, ఆవర్తమానము నాయికకు దెలిసి నాయకుని సముదాయించేది గనుకనున్ను, సామాన్య.

రమ్మనవే సముఖాన రాయబారము లేలే 270.

28. ఆగంతుక సామాన్య — సామాన్యలవలెనే ద్రవ్యాపేక్ష గలిగి నందువల్లనున్ను, నాయకుని మనోభావములు విచారణ చేసినది గనుకనున్ను ఆనాయకునితో తాను రమించ వలెనని యెన్నిక గలిగి నందువల్లనున్ను.

ఎటువంటివాడే వాడు ఓ యమ్మ వాడు 96

29. స్వీయ ప్రౌఢ ఉత్తమ — పతి నాయికయందు ప్రేమ లేకనే యుండి తాను నాయకునికి బలవంతముగా ఉపచారములు చేయుటవల్లనున్ను, నాయకుని బలవంతముగాగలసి, నాయకునికి సంతోషంకలిగేటట్టు తానే రమించినందువల్లనున్ను.

ఇటువంటి నా వలపు యేమి గాబోయె నమ్మ 56.

30. పరకీయ ఉత్తమ — ఈ నాయిక నాయకునికి ఉపచారము సేయగా నాయకుడు ప్రతి ఉపచారము చేయనందువల్లనున్ను నాయకుడు యీ నాయికకు స్వాధీనం లేనందున ఆవర్తమానముల సఖీజనులతో చెప్పుకుంటున్నది.

మాటలాడి మనసు మర్మము తెలియనివాడు (క్షేత్రయ్య పదము కాదు)

31. సామాన్య ఉత్తమ — నాయిక నాయకునికి మిక్కిలిన్ని వుపచారములు చేయుటవల్లనున్ను, అదిగాక నాయిక యెంత ఉపచారము చేసినప్పటికిన్ని నేర నాయికయందు నాయకుడు పోవుచున్నాడని సఖితో జెప్పుకొనేది.

వలపు దాచనేరనే ఓభామ 289.

32. స్వీయ ప్రౌఢ మధ్యమ — ఈ నాయిక నాయకుని మనోభావము తెలిసి ప్రత్యక్షముగా పూర్వము నడచిన వర్తమానముల గురించి నాయకునితో తెలియజేసి మళ్ళీ సముదాయించేది గనుక.

ఎందుకు వచ్చెనో కోప మెవరేమన్నారు 89.

33. పరకీయ ప్రౌఢ మధ్యమ — నాయిక తనవల్ల నేరమేమియు లేనిసి నాయకునితో తెలియజేసేదిన్ని, నాయకుని వల్ల నెపము కలిగినట్లుగా నున్ను, తన

శరీరం నాయకునికి (అప్పనకము) జేసియుండేటట్టుగానున్ను, మిక్కిలి యిరువురున్ను గూడియుండునట్లు నాయకునితో సమాధానముగా ప్రియవచనము చెప్పేది గనుక.

నావల్ల దుడుకు లెన్నటికైన గలదా 212.

34. సామాన్య మధ్యమ — యీనాయిక పూర్వమందు వుభయత్ర మిక్కిలిన్ని ప్రేమతో నుండిన వర్తమానములు నాయకునితో దెలియ జేయుటవల్లనున్ను, నాయకుడు వేళొక తావుకు పోకనే నాయకునివద్ద ప్రమాణము తీసినందువల్లనున్ను, యీ నాయికి నాయకునికి మిక్కిలి వుపచారములు చేసినది గనుక.

దినము లిటువలె వచ్చె దేవు డోర్వజాలడాయె 203.

35. స్వీయ ప్రౌఢ ధీర అధమ — యీ నాయిక నాయకునితో కలహించేటందువల్లనున్ను, నాయకుడు హితము సేయగనే తాను అహితంబుజేసి, కోపించేటందువల్లనున్ను, రూపవతి కాదనిన్ని, సరసములకు లోబడక నుండేటందువల్లనున్ను.

ఎందుకు యీ మాటలేల 88.

36. స్వీయ మధ్య ధీర అధమ - యీ నాయిక నాయకుడు అన్య కాంతా సక్తుడై యుండే వర్తమానము తెలిసి, కోపించేది కనుకనున్ను, నాయకుని సరసత్వముల అంగీకరించకనే నిరాకరించే దానివల్ల.

ఏలరా యీపగలెల్ల, నాసామి 142.

37. పరకీయ పరోఢ అధమ — పూర్వం నాయకుడు అత్యంత ప్రీతితోడ యీ నాయికను రమించి పిమ్మట వేళొక నాయికతో సంబంధము గలిగి, మళ్లీ యేమి నెపంచేతనో ఆ నాయిక నెడబాసి తమవద్ద నాయకుడు వచ్చినందునున్ను, యిదిగాక తమకు సమయము వచ్చినప్పుడు దూతికను పంపించగా రానందువల్లనున్ను, తాను వేడినప్పుడు నాయకుడు మాటాడ లేనందువల్ల నున్ను, విరహము చేత మిక్కిలి తత్తర పడుచూ నుండగ ఆవేళలో నాయకుడు రాలేదనే యెన్నికచేతనున్ను, హితము చేసే నాయకునికి అహితంబుచేసి కోపించునది.

ముందటివలె నాపై నెనరున్నదా సామి 257.

38. సామాన్య అధమ — నాయకుడు అన్య కాంతల యింటికి పోయినందు చేతనున్ను సరసము లాడినందువల్లనున్ను పరిమళ మలదు కొన్నందు వల్లనున్ను మళ్ళీ నాయకుడు యీ నాయిక వద్దకు వచ్చినందువల్లనున్ను, నాయకుడు హితంబు సేయక అహితంబుచేసి నిరాకరించినందువల్ల.

ఎందుకు బొంకేవు రా లేదని నాతో (పదము దొరకలేదు)

నాయకుడు నాయికను కపటముచేత చేసిన మోసము దలమకి రాలేదని నిరాకరించినందువల్లనున్ను, దౌత్యము వచ్చినవారి వాక్యముల అంగీకరించకనే నిరాకరించినది.

రాయబార మంపినాడేమొ రాను రాను నేను రాను 272

చెయ్యి యెత్తి మొక్కి భావము తెలిసికొమ్మని నందువల్లనున్ను, వాని మనసు రాయిజేసికొన్నాడనిన్ని, సేవజేసి దూతికను బంపగానే తానే వేడుకున్నట్టుగానున్ను, అందుకు నాయకుడు వాసులు జేసినట్టుగానున్ను, వృథా నెపమందు కొని నాయికను అలక్ష్యముగ నెంచిన వర్తమానములు సఖితో జెప్పుకొనునది. సామాన్య అధమ.

రాలేదు పొమ్మనవే ఓచెలియ యీవేళ. 277.

నాయకుడు నాయికవద్ద మిక్కిలి ప్రియవచనము చెప్పి ద్రవ్యమిచ్చి నందువల్లనున్ను. ఆ ద్రవ్యాన్ని అంగీకారం చేయకుండా నిరాకరించి నందున సామాన్య అధమ.

నిలువున నిలిపెదు ధవము బోసినగాని 217.

39. స్వీయ తృప్త — నాయకుడు యీ నాయికకు పరవశ మిచ్చినందుచేత నున్ను, వీరలకు తొలుతగలిగిన అలుకలు దీరి మిక్కిలి సంతోషముగా నాయికను గూడి రమించి నందున స్వీయ - తృప్త

నేటిదే కలయికరా చక్కనిసామి 228

40. పరకీయ — తృప్త — సతిపతు లిరువురున్ను శయ్యయందు రమించగా నొక్కతేపనే తృప్తవహించినది గావున.

ఇప్పటికీలాగున నున్నాను 67

41. పరకీయ పరోఢ తృప్త — రతియందు ఒకతేపనే తృప్తి వహించినది గావున రతియందు నడచిన చిహ్నెలు నాయకునితో జెప్పుదునే దానికి తోచక తరువాత తెలియజేసుకొనునది.

కంచి వరదా నీ చెక్కుమ మలిగితిని 153

రతియందు ఒకతేపనే రమించినందున, తృప్తి వహించినందు నున్ను, నాయుడు సంతోషము కలిగి నందుచేతనున్ను

నీవే వచ్చితివి నేను వచ్చినట్ల 225

42. సామాన్య - తృప్త - నాయకుడు నాయికకు ఆభరణముల చేతనున్ను వస్త్రముల చేత నున్ను నాయికకు సంతోషము చేసినందున నాయిక నాయకుని రమించి తృప్తిచెందించినందు చేతను.

మనసు నిన్నెడ బాయదు ప్రాణేశ 251

43. స్వీయ ప్రౌఢ అతృప్త - నాయకుడు సార్వకాలమున్ను తనవద్ద నుండలేదనే దుఃఖము చేతనున్ను తనపలుకులను నాయకుడు లక్ష్యము సేయక యుండినందువల్లనున్ను యిదిగాక రతియందు తృప్తిలేకనే అతృప్తురాలగుట.

నన్ను నీవు దలచేది న్యాయము గదు 206.

నాయకుడు నాయికను రమించినందున తృప్తి లేనందుచేత నాయకుని కలహించేటందువల్ల నాయకునిమీద అసూయ కలిగినందు వలనను.

నాదోవరాకు నాతో నవ్వకు 210.

44. పరకీయ అతృప్త. ఈ నాయిక రతియందు ప్రేమచేత నాయకుడు ముద్దు బెట్టేదానికి అంగీకరించక యుండినందున.

ముద్దు బెట్టలేవురా నాసామి 159.

45. పరకీయ పరోఢ అతృప్త - రతియందు తృప్తిలేనందువల్ల నాయకుని కలహించి నందువల్లనున్ను అనేక నిష్ఠూర వాక్యము చెప్పినందున.

నీకన్నా నా మొగుడే మేలు నీ పాదమాన 218.

46. సామాన్య అతృప్త - రతియందు నాయకునివద్ద మిక్కిలి అనేక విధమైన బంధ విశేషముల చేత పెనగ వలెనని యెంచినందున నాయకుడు వేగముగా రతి చాలించినందున,

ఒక్కసారికే యీలాగైన 150.

రతియందు తృప్తిలేక యుండినందువల్లనున్ను వేఱొక నాయిక యందు ప్రీతిగలిగి యున్నాడనిన్ని చిలుక పావురములు సప్తమాసము వీట్లచేత నాయకుడు మరింత వేగము చేసి రమించి నందువల్లనున్ను.

ఇటువంటివాడు రానేలే యీలాగైతే యేటి వేడుక తనమే. 2,207

యీ నాయిక నాయకుని ముద్దుబెట్టితే నాయకుడు అంగీకరించక నిరాకరించి నందు వల్లనున్ను చేబట్టి యింటికి రమ్మని పిలిచితే రానందు చేతను, రతియందు తామస రతిసేయక తీవ్రముగ కలిసి పంపించినందున,

హితవైన చోటనే హితవింతలేక నే 12, 214.

47. సామాన్య తృప్తాతృప్త. తృప్తి వహించిన్ని ఆసచేత అతృప్తరాలగుట-
కలికిరో యింకొక సారి వుపరతి కలియక నే తాళజాలనే 156.

48. స్వీయ ప్రౌఢ దివ్య:-
అనుకోపని యేమున్నది అక్కరలేనందుకు 13.

నాయకుడు అన్య కాంతా సక్తుడై తిరిగి వర్తమానములు సఖులచేత వినబడినది గనుక నున్ను వార్లకు నాయకుని గురించి వ్యత్యాసమైన వాక్యములు పలుకగా సుగుణవచనములు పలుకుచున్నది గనుక

ఎవతె గూడితే నేమి యిది నాతో నవకురే 102

49. పరకీయ - దివ్య. తోలుత నాయకునికి పూలహారములు జుట్టినందున నున్ను నాయకుని చెక్కిట గోరులుంచినదిన్ని, మదన శాస్త్రము దెలిసినందున నున్ను, లాలించినందున నున్ను నాయకుడు దయాళుడు కాదనిన్ని మిక్కిలి భక్తి చేసినందున నున్ను, నాయకుని కలిసినందుననున్ను, దుర్గుణములుగా నెంచిసఖితో చెప్పుకొనునది.

ఏమి సేతునే కొమ్మా నే 125.

50. సామాన్య - దివ్య: పూర్వము నాయిక నాయకుడు యిరువురున్ను మిక్కిలి సయ్యోద్దిగా నుండి మర్ల విరోధము కలిగినందున సఖితో పూర్వస్థితిని అనుసరించి నాయిక తెలియజేసినది.

ఏల యడిగినాడమ్మ యీ యలుక 139.

నాయికా నాయకు లిరువురున్ను మిక్కిలి మమతతో నుండినందున నున్ను నాయకుడు నాయిక అభీష్ట ప్రకారము వేడుకలు జరిగి నందున నున్ను యిప్పుడు ప్రీతి లేనందున నాయకుడు యెడబాసియుండు వర్తమానములు సఖితో సుగుణ వాక్యముగా దెలియ జేసేది.

ఏటి మమత యెక్కడి యాస 112.

51. స్వీయ అదివ్య - యీ నాయిక పూర్వము అత్యంత ప్రేమతో నాయకుని యందుండినందున నున్ను నాయకుడు తత్కాలానికి యెడబాసి నందుననున్ను.

అక్కరో నను బాసి నందుకు 2.

52. పరకీయ - అదివ్య - మునుపు సతిపతు లిరువురున్ను మిక్కిలి ప్రేమతో నుండి తర్వాత నాయకుడు పక్కలో సంచరించే వివరం తెలుసుకొని నాయకుని యందు ప్రీతి తక్కువైనందున

ఏమనంటినమ్మ వాని కింతో కోపమే 117.

53. సామాన్య, అదివ్య - నాయకుడు నాయికవద్ద అత్యంత ప్రీతితో నుండి రాకనే యుండి నందువల్లనున్న నాయకుడు పంపిన జవాజిని అంగీకరించనందున.

ఎవ్వతని చూచినాడే యింతిరో నన్ను 108.

54. స్వీయ - ప్రౌఢ - దివ్యాదివ్య యీ నాయిక నాయకునియందు అత్యంత ప్రీతితో నుండి సద్యః నాయకుడు తన్ను మాని అన్య కాంతా సక్తుడుగా నుండేటట్లుగా నాయిక నాయకుని యందుండే నెపం చెలియతో చెప్పుకొనునది.

ఏమరిరో మాం ముప్పై గోపాలుండెంతైన 279.

55. పరకీయ - ప్రౌఢ - దివ్యాదివ్య నాయకుడు తనయందున తెలియడి రాకనే యుండిన దుఃఖంచేత నాయకుని యందు నెపం కలుగజేసి చెలులతో తెలియ జేసుకొనేది.

ఏమంటినమ్మా నా సామిని 115.

56. సామాన్య - దివ్యాదివ్య నాయికా నాయకు లిరువురున్ను అత్యంత ప్రీతితోనుండి మర్ల యిద్దరికిన్ని కలత కలిగి నాయకుడు యీ నాయికను మానే కొరకు తమ పొరుగింటిదానికి నైత్యం నిడిచినందువల్ల నాయికను తెలిసి కోప వశనముగా సఖితో తెలియజేసుకొన్నది.

సరసము గాదిక సఖియ 302.

57. స్వీయా అన్య సంభోగ దుఃఖిత. యీ నాయిక తన పొరుగింట్లో నుండే నాయకుని పిలువనంపగా యీ చిన్నదే తన నాయకునితో రమించి వచ్చిన చిహ్నములను జూచి నాయిక కోపించి అడుగునది.

ఏమో యీ వింతలు నీకు కూడిదే నీవు 132.

తనకు ఆప్తముగా నుండే చెలి తన నాయకునితో సంతరించిన గురుతులు జూచికోపించునది గనుక నున్ను, దినాల వెంబడిగా నడిచే పనులు తనకు తెలియక నుండి యిప్పుడే సంజ్ఞ చేత తెలిసినట్లుగా చెప్పుకొనునది.

ఇన్నాళ్ళు తెలియగనైతి యీ చెలిమి 64.

58. పరకీయ ప్రౌఢ అన్యాసంభోగ దుఃఖిత - నాయికకు ఆప్తముగానుండు సఖి తననాయకుని రమించిన సంగతి తెలిసి కపటముచేత నైచ్యముగా అడుగుచున్నది.

కంచి వరదునితో పొందు కద్దోలేదో 154.

59. సామాన్య అన్యాసంభోగ దుఃఖిత - తనకు ఆప్తముగా నుండే దూతి తన నాయకుని కలసిన చిహ్నములు జూచి కోపించేది గనుక నున్ను, తమయింటిలోన

నుండే చిలుక పలుకనందున నున్ను మూతి ముద్దుపెట్టుకొని వెలిని పలుకాకు జూపుకొన్నందునన్నున్ను, నాయకుని పీతాంబరమెత్తి మూతి వాసన జూచినందునున్ను నాయిక తెరచాటున పొంచి యుండి దూతిని చూచినది గనుకనున్ను.

ఇంత మేలుదాననా ఓ చెలియా 38.

ఈ నాయిక తన నాయకుని పిలుచుక రమ్మని దూతికను పంపింపగా ఆ దూతిక తన నాయకునితో రమించి వచ్చిన చిహ్నములు చూచి కోపించి అడిగేది గనుకనున్ను, నాయకుడు ద్రవ్యమిచ్చి కూడుటవల్ల ద్రవ్యాపేక్ష వల్లనే కూడుట వల్లనున్ను, వాని వగను తెలియకనే రమించినందువల్ల అగునది.

మేలాగు సేతుర 73.

60. స్వీయ ప్రేమగర్వితా — నాయకుడు తనయందు అత్యంత ప్రీతితో నుండి, అన్యకాంతలతో నుండి, అన్యకాంతలతో రమించు వర్తమానములు సఖీజనులవల్ల తెలిసికొని, నాయకుడు వచ్చిన తర్వాత ఖండించ వలెనని పొంచి యుండి నాయకుని చూడగానే ప్రతివచనం లేక వూరకుండినందున.

ఇందుకు నే నేమి సేతునే 47.

61. స్వీయా — ప్రౌఢ — ప్రేమగర్వితా,

అనుకూలు డైనట్టి మగవాడు గలిగితే 12.

నాయకుడు దేశాంతరమునకు బోయియుండగా అన్యకాంతలయందు నాయకుడు రమించిన వర్తమానము సఖీజనులవల్ల వినబడి, ఆది తనకు నిశ్చయము లేనట్లుగానే నాయకుని సమీపమందుంచుకొని సఖులతో వర్తమానములు కపటంచేత పరిహాసముగా తెలియజేసేది.

పరదేశమున జేసిన పనులిందు 234

62. పరకీయా — ప్రేమగర్వితా

సగుణిరో నా ప్రాణేశుని దాచుకొందునా 186.

తరుణిలార విభు నెందు దాచుకొందునమ్మ 187.

63. సామాన్య — ప్రేమగర్వితా

ఓయమ్మ వీరెంత చౌర్యజాలరమ్మ 2, 216 పుట

గారవించక యిటుల సామిపై 204.

64. స్వీయా — సౌందర్య గర్వితా.

తొయ్యలి నా విభుడవత్తైన తోడి తెమ్మనునా 200.

65. పరకీయా – సౌందర్య గర్విత

తెలియ నైతినమ్మా ఓయమ్మ నే 193.

66. సామాన్య – సౌందర్య గర్విత

గడియ గడియకు మనసు గలదటవే కొమ్మా 164.

మనవి సేయగ నేలే మగువా కొత్తగా నేడు 250.

ఇంత మోహమేమిర 39.

దాని నన్ను సాటిసేయ తగునా యేమాయె నాకు 203.

ఎంత లేదు నాతో నీడు సేతురా 84.

67. స్వీయ – లఘుమాన

చల్లనాయెను లేర నా మనసింతో 168.

68. పరకీయా – లఘుమాన

ఎవ్వతెరా నీతో నవ్వినది 106.

69. సామాన్య – లఘుమాన

ఆడుగరమ్మా అతనిపై యీరాక 9.

కానివాని జూచి కన్నైగ సేయుతేనని 157.

70. స్వీయ – మధ్యమాన

ఇక్కడ లేదే మనసు యింతిలో వానికి 53.

71. పరకీయ – మధ్యమాన

తన్ను బోటి చెలునైతే నోర్చుకో సఖరి 75.

72. సామాన్య – మధ్యమాన

ఎవరివల్ల మడుకు మాయిద్దరిలో, 103. (పుట 70)

73. స్వీయ – ప్రౌఢ – గురుమాన

నోరత్త నైతినమ్మ ఓ చెలియనే 230.

నాపైని కోపమేమే నాసామికి 211.

74. పరకీయ – ప్రౌఢ – గురుమాన

ఇటువంటి వాడని నే చెలియనైతిని యింతిరో బాగాయెనే, 58.

75. సామాన్య – గురుమాన

విడువిడువమ్మా యిదేటి సంద్ది 295.

76. స్వీయ – ఏకశయ్యాన్యోన్య సంయోగ వియోగం.

తేమరో యూరక పవ్వళించి యుంటినే 280

77. పరకీయ – ఏకశయ్యానోన్య వియోగ సంయోగం.

పక్కలో కోపాన పవ్వళించినవాని చక్కబెట్టుకో వశమా 231.

78. స్వీయ – ప్రేమాధిక్యము (ప్రేమగర్విత?)

ఇద్దరి వలెనే గూడి యెవరున్నారు చెల్వరె 60.

79. పరకీయ – ప్రేమాధిక్యము

ఎందుదాచు కొందునిన్ను నేమిసేతు 90.

ఏమిసేతురా ప్రాణేశ నేనెటువలె తాళుదుర, 127

ఎంతలేదని యెంచకుర, 83.

80. సామాన్య – ప్రేమాధిక్యము

నా మనసు వంటిదే నీ మనసైతే (క్షేత్రయ్యపదము గాదు)

81. స్వీయ – ముగ్ధ – స్వాధీన పతిక

ఇన్నాళ్ళు మల్లాడిన చిలుకకోనవా 65.

82. స్వీయ – మధ్య – స్వాధీనపతిక

ఆమ్మా యిటువంటివాని కేమి సేయుదునే 18.

పచ్చియొడలు చూడర 232.

83. ప్రౌఢ – స్వాధీన పతిక

తెలిసి తెలియలేక పలికేరు చెలులు 196.

84. పరకీయ – స్వాధీనపతిక

అక్కరో యోర్వనివారు సరసుడు గాడసి 5.

85. సామాన్య – స్వాధీన పతిక

సామికి సరియెవ్వరె నాచక్కని 304.

వేడుకతో నడుమకొన్న విటుడాయడే 298.

86. స్వీయ – మధ్య – వాసక సజ్జిక

అవునమ్మా మీకేమి అందరు బోధించేరు 27.

87. స్వీయ – ప్రగల్భ – వాసక సజ్జిక

ఇంత ప్రౌఢ్వాయ యిక వాడేమి 37.

88. పరకీయ – పరోఢ – వాసక సజ్జిక

వచ్చేనని రాకపోయెనే ఓయమ్మ నాసామి, 282.

89. స్వీయ – ముగ్ధ – విరహోత్కంఠిత

97. స్వీయ – మధ్య – విప్రలబ్ధ
ఐరాణె నేస్త మమ్మలార 148.
98. స్వీయ – ప్రౌఢ – విప్రలబ్ధ
ఈ మేను జీవునకు యింత ప్రియా 69.
ఎవ్వరి ననగ పని యే మున్న దమ్మలార 110.
99. పరకీయ – విప్రలబ్ధ
ఎక్కడి నేస్తము లెక్కడి నెనరులు 92.
100. సామాన్య విప్రలబ్ధ
ఒక్కరైన గాని నా యక్కర కొదిగేరా 149.
ఎన్నోకాడిందు రాగానె వచ్చేనేరమ్మ 286.
101. స్వీయ – ముగ్ధ – ఖండిత
ప్రేమకేశవరాయ బెదరింపుల కే నాయ 240.
ఏతే గాని నిన్నె నమ్మి యూపె చేసిన భాగ్యము గాదు 147.
102. స్వీయ – మధ్య – ఖండిత
తగిలితి విక నిన్ను తరలనీయ నోయి 181.
103. స్వీయ – ప్రౌఢ – ఖండిత
కోపము సేయవచ్చున నాపై నింత 162.
104. పరకీయ – ఖండిత
తెలియ వచ్చెనురా నీ వగ లెల్ల 194.
నక్కెర మోవినొక్క సొక్కించిన దాన (క్షేత్రయ్యపదము గాదు)
105. సామాన్య – ఖండిత
వల్లనాయె నా మనసు వల్లనాయె నేడు 168.
అందగా డవచ్చు నువ్వు లేర ఆదివరాహ 1.
చాలు చాలు ఈ చిన్నెలతో నాకు పరసము జేరకుర 172.
106. స్వీయ – ముగ్ధ – కలహాంతరిత
అదె బుట్టువు బొట్టు నన్నలయింతురు 28.
నేరమా కొమ్మా వాడెందుకే చేర రాడమ్మ 3, 216 పుట
ఎంతమాట లాడెనమ్మ యింతిరో నాభిమాన మమ్మ 81.
107. స్వీయ – మధ్య – కలహాంతరిత
ఆక్కరలేని కాపుర మాయె 6

115. పరకీయ – కన్య – ప్రోషితపతిక

ఎన్ని దలచు కొందునమ్మ యెట్లు 100.

ఇంతలోనే అల్లవాని నన్ను 41.

116. సామాన్య – ప్రోషితపతిక

ఇటువంటి మోహసాగరమున ఓకొమ్మ 56.

117. స్వీయ – మధ్య – అభిసారిక

ఒక్క గడియకే యీలాగైతే యిదేటి ఘనమే 151.

118. స్వీయ – ప్రౌఢాభిసారిక

ఎన్నటికని నే మెత్తు యెంతని వినుతింతు 99.

119. పరకీయ – పరోఢ – అభిసారిక

అట్లై యుండేవు సుమీ 7.

ఇచ్చోటను చాల ప్రొద్దుండెను చెల్లదు యింటికి పోవలెర 55

120. జ్యోత్స్నాభిసారిక

ఎంత చెలిమి చేసితివే యింతలో నీవు 79.

121. సామాన్యాభిసారిక

మగువ తన కేళికా మందిరము వెడలెను 248.

పిలువ నంపె నాసామి యీ వేళ 237.

రేపు వత్తువు గాని పోర నేటికి తాళి 278.

122. స్వీయ – మధ్య – ప్రవత్స్యత్పతిక

పోయి రమ్మనే ముద్దుగుమ్మ 242.

123. స్వీయ - ప్రగల్భ – ప్రవత్స్యత్పతిక

చాల యిందుకే నా మనసు జాలి బొందెరా 170

124. పరకీయ – పరోఢ – ప్రవత్స్యత్పతిక

రేపు పయనము పోయి రావోయి (క్షేత్రయ్యపదము కాదు)

125. సామాన్య – ప్రవత్స్యత్పతిక

ఊరికిపోక నే డిందుండేది మేర 77.

126. స్వీయ - మధ్య - సమాగచ్ఛత్పతిక

నిన్ను జూడగలిగెనే యిన్నాళ్ళకు 241.

127. స్వీయ – సఖీనుపాలంభన

మగవాని కట్టుబెట్టు మన తరముగాదు 247.

సామిగా రారా యంటే కోపమా 305.
తలిరుబోణి వారు పెద్ద లైనారు 189.
128. పరకీయ సఖీ వుపాలంభన
చెలత అతడు అలిగే డెల్లా చెనరు 227.
అది నోముఫలమే ఓ చెలియ 11.
129. సామాన్య – సఖీవుపాలంభన
ఏల వచ్చితివే సామి నెడబాసి 143.
చెల్లబో పాలగిరి చెన్నుడే 177.
పూచిన తలిరు వలెనే సుకుమారు డితడని 239.
తాలిమి గలిగిన వాడనినీవు దండించితే లోకులేమందురే(క్షేత్రయ్యపదము కాదు)
నీలవేణి వానికి నీవేల 224.
130. స్వీయా – సఖీ – శిక్షాలక్షణం
అలగితి వెందుకు అల మువ్వగోపాలునితో 22.
వాడిచ్చిన సొమ్ములేల వద్దంటివి 291.
తాళి మొక్కరికైన వద్ద 191.
ఎంతరాతి మనసుదానవే – యెలనాగ నీవు 82.
131. పరకీయ – సఖీ శిక్షాలక్షణం
సరసిజాక్షి నీజన్మము 303.
నన్నునేవా నన్నునేవా 205.
ఏమని మారితివే కోమలి 118.
132. సామాన్య - సఖీ - శిక్షాలక్షణం
చేపట్టు కావచ్చునా మీలోమీకు 179.
133. స్వీయ – సఖీ – ప్రౌఢ పరిహాసలక్షణం
అలుక దీరెనా నేడైన మీకు 25.
134. పరకీయా – కన్య – సఖీ – పరిహాస లక్షణం
ఏమి కులికి నమ్మ యీ పడుచు (క్షేత్రయ్య పదము కాదు)
135. సామాన్య – సఖీ – పరిహాస లక్షణం
ఎన్ని పోకిళ్ళు బోయ్యేవే యింతిరో నీవు 101.
136. పతి – పరిహాసము
ఇక నిన్ను నమ్మరాదే 50.

# శోధిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 14 | సామిని | సామి |
| 12 | 5 | వేనెత్తి | లేనైతి |
| ,, | 13 | యిరువరి | యిరువురి |
| 19 | 1 | మరునిద | మరుని |
| ,, | 2 | ర్శనమున | దర్శనమున |
| ,, | 20 | డెనని | డెనసి |
| 20 | 18 | ..........(?) | తాళరాదు గదమ్మ తరుణి నా |
| ,, | | (125 పుటలో ఉండవలసినది) | సామినిబాసి |
| ,, | 24 | "రతి...చేత నే" | పాఠాంతరము |
| | | | రతికేళి గూడు టెపుడో - గత |
| | | | మింటివలెనె(?) |
| 30 | 2 | మేటికి | మేటి |
| ,, | 10 | నసెను | దనెను |
| ,, | 24 | గోపాలల్ల | మువ్వగోపాలల్ల |
| 45 | 20 | దీఅన | దీఙని |
| 48 | 18 | లేకున్నాను | లేకున్నావు |
| ,, | 26 | దిరుగవిది | దిరుగనిది |
| 53 | 19 | నీదిగులు | యీ దిగులు |
| 56 | 9 | పోనీకు | పోనీను |
| 63 | 20 | కేళిని కలయుచు | కేళిని |
| ,, | 21 | వగవగలె | కలయుచు వగవగల |
| 68 | 5 | రేచీ? | రేచీన? |
| 70 | 1 | 103 | 104 |
| ,, | 16 | 104 | 105 |
| 73 | 6 | నేవే | నేలే |
| 78 | 6 | నమా! | నమ్మా! |
| 89 | 16 | ఏకీతి | ‖ఏకీతి‖ |
| 92 | 10 | ఏల | ఏర |
| ,, | 15 | మాటలు విందురా | మాటలు |
| ,, | 16 | యిప్పుడు | విందురా యిప్పుడు |
| 94 | 3 | మాడరా! | మాడరా! ననుచల్లగ |
| ,, | 4 | నను చల్లగ జూడరా! | జూడరా! |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 96 | F. n. | ఆరభి – ఆది | ఆరభి |
| ,, | ,, | సైతినే – ఓచెలియ | సైతినే, ఓ. చెలియ |
| 104 | 7 | వలరా | వలదా |
| 112 | F. n. | ఆది | ఆది |
| 113 | 1 | వని | నని |
| 114 | 6 | వెన్నని | వెన్నన |
| 119 | 8 | మువ్వగోపాల | మా మువ్వగోపాల |
| 124 | 17 | మితాయెగా | మింతాయెగా |
| 129 | 9 | మువ్వగో – పాల | మువ్వ – గోపాల |
| 135 | 4 | నేరామా | నేరమా |
| ,, | 20 | సాంపులు | సొంపులు |
| 139 | 19 | గో – పాల? | గో – పాల! |
| ,, | 22 | యుండగా | యుండక |
| 142 | 5 | గూడితి | గూడితి వయిన కానిమ్మని |
| ,, | 6 | వయిన...కొన్ని | కలయువేళ యేమో కొన్ని కతల చేత జాగుచేసియ |
| ,, | 7 | కతల...గూడి | సొలయక...గూడి |
| 143 | 13 | మువ్వగోపాలు | వేణుగోపాలు |
| 158 | 6 | సకట | నకట |
| ,, | 15 | ముద్దులాయ | సుద్దులాయ |
| ,, | 19 | పొందువద్దు | పొందువద్దు ...॥ఫల॥ |
| 159 | 23 | పంచన | వంచన |
| 160 | 15 | ఇలికి | ఇకిలి |
| 162 | 3 | చిరుగు | చిగురు |
| 166 | 7 | వెనగవలె | పెనగవలె |
| ,, | 20 | వెన్నెలు | వెన్నెల |
| 171 | 6 | చనువుగ నను | చనువునను |
| 173 | .14 | దెచ్చెనని | దెచ్చెదనని |
| 174 | 20 | నీ | నీవు |
| 176 | 19 | గండకోయిల | గండుకోయిల |
| 182 | 9 | యువ్న | యున్న |
| 187 | 12 | నేనె | నే |
| 188 | 15 | గాదెమిసెతు | గా దేమిసేతు |
| 189 | 14 | కొమ్మోవి | కెమ్మోవి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 190 | 20 | సమ్మతించే | సమ్మతించని |
| ,, | ,, | కలా | కళా |
| 193 | 21 | ఎన్నిన | ఎన్నిక |
| 194 | 2 | నున్న | యున్న |
| 195 | 13 | నెల | పది |
| 197 | 15 | చక్కని | చక్కనిసామికి |
| 199 | F. n. | వానుదేవుని? | వాసుదేవుని |
| 203 | 1 | వన్నలాడి | వన్నెలాడి |
| ,, | 4 | పనుమీర | ప (ని?) మీర |
| ,, | 16 | రాడడి | రాడని |
| ,, | 22 | (?) | ? |
| 204 | 4 | వీలీల – గోపాల | వీ – లీలగోపాల |
| ,, | 7 | మువ్వగోపాలుని | (రాజగోపాలుని?) |
| 205 | 1 | కడుతోడల | కడతోడల |
| 206 | 4 | ఇంతనా...ఇంతనా | ఇంత నా ఇంత నా |
| ,, | 5 | ఇం | మిం |
| ,, | 16 | ఓర్వజాలకయు | (తీసివేయవలయును) |
| ,, | 17 | | ఓర్వజాలక యువిదయింటి నుండి (అని యుండవలెను) |
| 207 | 3 | నిభుడు నన్ను | ననుపీడని |
| ,, | 8 | యింటికి | యింటి |
| 208 | 8 | లయ్యార | లయ్యీర |
| ,, | 10 | చన్నన | చున్నలు |
| ,, | 10 | మల్లె | మెల్ల |
| ,, | 16 | సొక్క | సొక్కవాడి |
| ,, | 18 | మ్రొక్క | మ్రొక్కను |
| 209 | 11 | మేలు కొన్న | మెల్ల |
| ,, | 12 | | తోరణము గట్టికొన్న దొరత మింతే అని యుండవలెను. |
| 210 | 7 | చెమ్మ్ర | చిమ్మ్ర |
| 211 | 3 | సుమీ | సుమీ మరుని |
| ,, | 4 | మరుని కయ్యాన | కయ్యాన |
| ,, | 6 | చేయకుమీ | సేయకుమీ |
| 213 | 1 | హాంతకారి | హొంతకారి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 214 | 16 | నె | నే |
| 215 | 16 | వేళలో నె | వేళలో నే |
| 217 | 8 | వట | నట |
| 226 | F. n. | నరభూపా | నరసభూపా |
| 230 | 15 | గ్పళవమాట | గృళవమాట |
| ” | ” | రుచులగావనమి | రుచులగానమి |
| 242 | 12 | ప్రౌఢ ధీర | ప్రౌఢధీరాధీర |
| 244 | 17 | చేయవందు | చేయనందు |
| 246 | 5 | వెలిసికొమ్మని | దెలిసికొమ్మని |
| ” | ” | వద్ట | వద్ద |
| 247 | 1 | నాయకుడు, నాయిక | నాయకుడు |
| ” | 25 | 2, 207 | 2, (207 పుట) |
| ” | 29 | 12, 214 | 12, (214 పుట) |
| 278 | 18 | యడిగి | యలిగి |